మహర్షి వేదవ్యాస ప్రణీతమైన

# శ్రీగణేశ పురాణం

## ఉపాసనా ఖండము

### రెండవ భాగము

డా॥ వేదవ్యాస I.A.S. Ph.D.

ప్రచురణ :

UNIVERSITY OF VEDIC SCIENCES
HYDERABAD - 500 033.

# విషయసూచి

# శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య శ్రీమత్ శ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ స్వామివారు శారదా పీఠముశృంగేరీ.

# గణేశపురాణము

వ్యాసమహర్షి విరచితమైన గణేశ పురాణము సకలాంతరాయ కృంతనుడగు విఘ్నేశ్వరుని లీలావిభూతి ప్రతిపాదకమై యున్నది. భగవంతునియందు చిత్తైకాగ్రము సంభవించుటకు ఆ భగవంతుని మహిమను తెలిసికొనుట అత్యావశ్యకమైయున్నది.

అమూల్యమైన వస్తువు మన దగ్గరనే యున్ననూ దాని వెల తెలియనప్పుడు దానివైపుమనస్సు ప్రసరించదను విషయము అందరి అనుభవములో నున్నదే. అట్లే భగవంతుడు అపారమహిమాశాలియై

యున్ననూ ఆ మహిమ తెలియనివారికి భగవద్భక్తి పుట్టుట కష్టమే. కావుననే భగవన్మాహత్మ్య ప్రతిపాదకములగు పురాణములను సర్వజ్ఞుడగు వ్యాస మహర్షి రచించెను.

సచ్చిదానంద స్వరూపుడునూ, నిర్గుణ నిరాకారుడును అగు పరమాత్మ సాధకానుగ్రహార్థము శివవిష్ణ్వాది రూపములను ధరించియున్నాడు. అట్టి ఉపాస్యమూర్తులందు గణపతియొకటి. ఆ గణపతి సకల కార్యారంభమునందును నిర్విఘ్న సమాప్తికై ఇంద్రాదులచేతగూడా పూజింపబడువాడు కావున గణపత్యారాధన మిగుల శ్రేయఃప్రదము.

అనేకకథా సముల్లసితమైన **గణేశ పురాణమును** తెలుగున కనువదించి మూలముతోపాటు అనువాదమును ప్రకటించుట ముదావహముగా నున్నది. **"భారతీయాధ్యాత్మిక విద్యా ధర్మసంస్థ"** ఈ ప్రకటన కార్యమును చేపట్టినదని తెలిసి సంతసించుచున్నాము.

ఈ గ్రంథము సర్వత్ర బహుశ్రుతమగుగాక యని ఆశీర్వదించు చున్నాము.

24-10-1980

శృంగేరి-శంకర పీఠము శ్రీశ్రీశ్రీ అభినవవిద్యాతీర్థస్వామి

# ముందుమాట :-

ఈ "గణేశ పురాణము" వేదవ్యాస ప్రణీతములైన పద్ధెనిమిది ఉప పురాణములలోకీ ముఖ్యమైనది. వ్యాసమునీంద్రునకు బ్రహ్మ తెలిపిన సంవాదముగా ఈ పురాణ రచన జరిగినది.

గణపతి సర్వవిద్యాధి దేవతగా, వేదకాలమునుండీ ఆరాధింపబడు తున్న అతిప్రాచీన దేవత! వేదములో

"గణానాం త్వా గణపతిగ్ం హవామహే!
కవిం కవీనా ముపమశ్రవస్తమం. ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణా బ్రహ్మణస్పత
ఆనశ్శృణ్వన్నూతిభిః సీద సాదనమ్" ॥

అని స్తుతింపబడిన ఛందో గణములకు అధిపతియైన గణపతి, శబ్దములకు జ్యేష్ఠమైన రాజుగా ప్రణవ స్వరూపుడై బ్రహ్మస్వరూపియైన శబ్దబ్రహ్మగా తెలియబడుచున్నాడు!

## శబ్దబ్రహ్మ :

సృష్టికి శ్రీకారము 'ఓం'కారము రూపంలో ఉద్భవించినది. అందు చేత ఈ గణపతిని ఓంకార స్వరూపుడిగాకూడా 'గణపత్యధర్వ శీర్షము' లో స్పష్టంగా వర్ణించబడియున్నది. అంతేకాదు గణములు అనగా అక్షరములతో ఏర్పడే ఛందస్సులకు, మాత్రాగణములకూ (ఉచ్ఛారణ కాలంతో ఏర్పడే గణములు) అధిపతి గనుక ఈయనకు గణాధిపతి అని పేరుకూడా తగివున్నది. ఇక్కడ "గణములు" అనగా "ఛందో గణములు" అని అర్థము.

ఇలాగ ఉచ్ఛారణవల్ల ఏర్పడే 'గురు', లఘువులతో ఏర్పడి నిర్మిత మైన 'గణము'ల లేక ఛందస్సులేగాక — వేదంలో "ఛందస్సులని" చెప్పబడేవానికిగూడ ఈ "గణాధీశు"డే అధిపతి! ఈ ఛందస్సులు సంఖ్య లలో ఏర్పడినవి 'గాయత్రి' (24) జగతీ (36) త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి, ఉష్ణిక్, మొదలైన వేదములలో చెప్పబడిన 'చందోగణములకు' అన్నింటికీ అధిపతి గనుక ఆయన గణపతి! అందుచేత వాక్కునకు ఈయన అధిష్టానదేవతగా వేదములు 'బ్రహ్మణస్పతి' ఈ విధంగా స్తుతించినవి.

## యోగశాస్త్రంలో గణపతి :

ఈయన యోగశాస్త్ర ప్రకారము మూలాధార స్థితుడు! మనం ఉండుటకు ఆధారం - 'మూలాధారం'గా యోగశాస్త్రంలో చెప్పబడు చున్నది - శరీరంలోని షట్చక్రములలో అన్నిటికన్నా అడుగున వుండే చక్రము 'మూలాధారమే'. మూలాధారమంటే ముఖ్యమైన ఆధారము

అని అర్థం. మనం కూర్చున్నప్పుడు భూమిపై ఆధారపడే మూలస్థానము లేక ఆసనము వద్దనే ఈ మూలాధార చక్రం ఉండటం ఆశ్చర్యకరం. ఈ మూలాధారమునకు అధిష్ఠాన దేవత, గణపతి! ఇది గణపత్యథర్వ శీర్షంలో కూడా స్పష్టంగా - 'త్వం మూలాధార స్థితో నిత్యమ్ అని - "నీవు మూలాధారంలో వేంచేసి ఉన్నావు" అన్న అర్థంతో స్పష్టంగా తెలుపబడివున్నది. పంచభూతములలో భూమి ఎట్లాగ అన్నిటికీ ఆధారమైయున్నదో శరీరంలో 'భూమి' అనే ఈ మూలాధార పీఠమునకు కూడా ఈ గణపతి ఆధారుడై, మూలాధారమున వున్నట్టుగా కీర్తింపబడి నిలిచియున్నాడు. "మూలాధారస్థిత ప్రణవాకారం." - అని వాతాపి గణపతి దీక్షితులవారిచే కీర్తింపబడినాడుగదా?

ఇక్కడ ఇంకొక యోగశాస్త్ర రహస్యముకూడా అంతర్గతమై వున్నది. గణపతిని 'మహాశక్తి' అయిన పార్వతీదేవికి 'ద్వారపాలకుడుగా' కావలి పెట్టినట్లు పురాణములలోని కథ తెలుపుచున్నది. దీనిలోని అంతరార్థ మేమిటి? అని యోచించగా మన శరీరములో మహాశక్తి ఉండే స్థాన మేది?

## కుండలినీ శక్తియే మహాశక్తి :

మూలాధారములో కుండలినీశక్తి యోగనిద్రలో నిద్రిస్తూ ఉంటుం దని 'హఠయోగ ప్రదీపిక'వంటి యోగశాస్త్ర గ్రంథములు, తంత్ర గ్రంథ ములవల్ల తెలియుచున్నది. ఈ "కుండలినీ శక్తి"యే మహాశక్తి — మూలప్రకృతి, అనగా 'మూలస్థానములో లేక మూలాధారం వద్ద నిద్రిత మైన ప్రకృతిశక్తి'! ఆ మూలాధారంలోనున్న కుండలినీ శక్తిని మేల్కొల్ప

డానికి ప్రవేశించవలసిన ద్వారంవద్దనే గణపతి కావలిగా వున్నాడుట, అనగా గణపతి బీజాక్షరంతోనే యోగి మూలాధారమును చైతన్యవంత మొనర్చి తద్వారా కుండలినీ శక్తిని మేల్కొల్పుట సాధ్యపడును అన్న యోగశాస్త్ర రహస్యం ఇలా నిగూఢంగా తెలుపబడినది.

మూలాధారంలో మేల్కొన్న కుండలినీశక్తి ఒక్కసారి కోపంతో బుసలుకొట్టిన పాములాగ పైకిలేచి 'ఇడ' 'పింగళ' నాడులలో సంచారం చేయుచూ పైనున్న షట్చక్రములను భేదించి సహస్రారమును చేరు చున్నది. ఈ కుండలినీశక్తిని మేల్కొల్పుటవలన యోగికి "సిద్ధి" కలుగు తుంది. మనస్సుకు పైగానున్న 'బుద్ధి' కూడా మేల్కొల్పుతుంది. ఈబుద్ధి, సిద్ధి—ఇడా, పింగళ అనే జంటలే సుషుమ్నానాడి (బ్రహ్మనాడి) లో నివసించు గణపతికి ఇద్దరుభార్యలు అని చెప్పబడినాయి. అయినా గణపతి "నిత్యబ్రహ్మచారి"గానే నిలచివున్నాడు! ఎందుకంటే బ్రహ్మ యందు చరించు యోగసిద్ధికి సుషుమ్నానాడిలో సంచారంచేసే గణపతి చైతన్యమే సర్వయోగసిద్ధికీ మూలాధారం గనుక!

## యోగసాధనలో గణపతి :

ఉపాసనలో, గణపతి ద్వారపాలకునివంటివాడు. ఎందుకనగా ప్రతి జపమునకు పూజకూ అరంభంలో ప్రాణాయామంతో యోగశక్తిని మేల్కొలిపి మంత్రోచ్ఛారణ చేయవలెను. అట్టి యోగశక్తికి మూలశక్తి అయిన 'కుండలినీశక్తి'! యోగి శరీరములోని మూలాధార చక్రములో ప్రతిష్ఠింపబడినాడు గణపతి. ఈ మూలాధార స్థితి కుండలినీ జాగృతీ ప్రక్రియకు గణపతి బీజాక్షరమే యోగద్వారము తెరిపించే విఘ్ననివారక

మగు కీలకము! అందుకనే గణపతిని అంబిక ద్వారపాలకునిగా నిలబెట్టినదని "వినాయక చతుర్థీ వ్రతకథ"లో కవితాచిత్రముగా వర్ణించారు ఋషీశ్వరులు.

## గణేశ–రూపము :

యోగసాధనలో గణపతికి విశేషమైన స్థానమున్నది! యోగియొక్క ఉచ్ఛ్వాస, నిశ్వాసలు దీర్ఘముగా వెన్నెముకలోవుండే సుషుమ్నాగొట్టము ద్వారా చేసే ప్రాణయోగ ప్రక్రియతో గాలిపీల్చే పొడుగాటి గొట్టమే — గణపతి తొండమువలే రూపకల్పన చేయబడినది.

తొండమునకు రెండు రంధ్రములు కలవు. యోగి ప్రాణాయామ మునకు కూడా కుడి ఎడమ ముక్కులయందు సూర్య చంద్ర నాడులు, భ్రూమధ్యములో జ్ఞాననేత్రము వుండుటకు సూచనగా గణపతి తొండము నకు పైన ఫాలనేత్రముతో సూర్య చంద్రాగ్ని రూపములతో త్రినేత్రునిగా వర్ణింపబడినాడు.

## నిత్యబ్రహ్మచారి :

యోగసాధనలో ఏకాగ్రతతో ఒకే అంతము కలిగిన - ఏకాంతము అనే సమాధిస్థితికి సూచనగా గణపతి 'ఏకదం' ఏకత్వసిద్ధిని ఇచ్చువాడు 'తం' = తత్ అనే బ్రహ్మశబ్ద వాచ్యుడు కనుక ఏకదంతం, ఏకదంతము గలవానిగా వర్ణింపబడినాడు. ఇంకను గణపతికి అనేక రూపములు నానా రూపములు ధ్యానరూపములూ వర్ణింపబడినాయి — ద్వాత్రింశత్ గణప తుల 32 రూపాలు. అందులో ప్రధానమైన షోడశ గణపతులు వర్ణింప బడినాయి. చంద్రకళలు శుక్లపక్షంలో 16, అలాగే బహుళ పక్షంలో 16, రెండూకలిస్తే 32 మూర్తులు! ఇది జ్యోతిష మంత్రశాస్త్ర సంకేతం!

## ద్వాత్రింశద్గణపతులు :

సూక్ష్మముగా గణపతియొక్క 32 మూర్తులను ఇప్పుడు మీకు పరిచయంచేసి గణేశపురాణ విషయం వివరించుతాను!

"త్వం మూలాధారే స్థితోఽసి"

అని 'గణపతి అథర్వశీర్షము' తెలుపుతున్నది! ఈయన బీజాక్షర ములు "గ్లౌం. గం." అను గకార రూపాంతరములే! గణేశునికి ద్వాత్రింశత్ (ముప్పది రెండు) మూర్తులు చెప్పబడినవి!

మంత్రశాస్త్రములో గణపతులు 32 రూపాలుతో చెప్పబడివున్నారు. అందులో ముఖ్యమైన — బ్రహ్మగణపతి, శక్తిగణపతి, హేరంబగణపతి, మహాగణపతి, సంకష్టగణపతి, అమృతసిద్ధిగణపతి, వరగణపతి, ఉచ్ఛిష్ఠ గణపతి మొదలైన అనేక రూపములలో అనేక బీజాక్షరముల సమ్మేళనం తో అనేక మూలమంత్రములతో వర్ణించబడివున్న ఈ 'గణపతి తంత్రం' అంతా ఈ '32' గణపతులపైనే ఆధారపడివున్నది. అందులో గణపతి ఎడమ తొడపై 'వల్లభాదేవి' కూర్చుండి ఆమె కుడిచేయి గణేశుని భుజముపై వేసినట్లు ఎడమచేత కలువపువ్వును ధరించినట్లూ గణేశుని చేతిలో అంకుశం, 'బీజాపూరం' 'పాశం', 'ఏకదంతం', 'పద్మం' ధరించి నట్లుగా "వల్లభగణపతి" మూర్తి వర్ణింపబడింది. 'మంత్రమహోదధి' లోనూ, ఇతర వాస్తు గ్రంథములలోనూ ఈ గణపతులకు ధ్యానరూప ములూ, మూలమంత్రములూ కూడా చెప్పబడివున్నాయి. ఇవి చాలా చోట్ల శిల్పములలోనూ చూడవచ్చు.

ముప్పైరెండు (32) ఎందువలన? అంటే దీనికొక ఆత్మవిద్యా రహస్యమైన కారణమున్నది. గణపతి ఆత్మస్వరూపుడు. ఆత్మకు పదహారు

(షోడశ) కళలు! ఈ ఆత్మ, దేవ పితృ యానములనే శుక్ల కృష్ణ గతుల యందు చంద్రుని 16 కళలవలే కళావృద్ధి క్షయమును గలిగి యుండుట చేత — సృష్టి కల్పమున 16, అలానే ప్రళయకల్పమున 16 కలిసి — 32 కళలతో నొప్పారు మూర్తుల చందోగణపతియై యలరారు చున్నాడు! అందుకే ఈయనను గణపత్యథర్వశీర్షము :-

"త్వం కేవలం ఆత్మాసి! సత్యం వచ్మి!"

'నీవు కేవలమూ ఆత్మస్వరూపుడవు!' — నిజమును పలుకు చున్నాను అనినొక్కి చెప్పుచున్న దేవరహస్యమీ గణేశ విద్యయొక్క కీలకము.

ఆత్మ — శరీరము సృష్టి యగునప్పుడు ముందుగా — మూలా ధారమందు వ్యక్తమైనది గణపతిగానే! అందుకని

"త్వం మూలాధార స్థితోఽసి"

అని శృతి చెప్పురహస్యము!

అయితే ఈ మూలాధారము శక్తిస్థానము — అనగా 'కుండలినీ' శక్తి మూడున్నర చుట్టలు చుట్టుకుని సర్పరూపమున ఉన్నదీ యోగ చక్రములోనే గనుక — గణపతి జగన్మాతయైన శక్తికి ద్వారమువద్ద కావలియున్నవాడని చెప్పే పురాణగాథలోని రహస్యసంకేతము!

ఇతడు ఈ కుండలినిశక్తిని — సర్పరూపిణి యైన దానిని — ధరించియుండుటచేత యజ్ఞోపవీతము ఎడమభుజంమీంచి వ్రేలాడేది — ఎడమశ్వాసకు సంకేతము!! 'నాగ యజ్ఞోపవీతము'గలవాడని పురాణ రహస్యవేత్త వ్యాసమౌనీంద్ర చంద్రులు గహనముగా ఈ దేవరహస్య మును తెలిపినారు!

ఎందుకంటే — ఇడా, పింగళ, అనెడు రెండు నాడులలోను శ్వాస సంచరించునప్పుడీ మూలాధార నివాసుడైన గణపతికూడ తన తొండమును — ఒకసారి కుడిప్రక్కకూ మరోసారి ఎడమప్రక్కకూ వేసుకునియున్నట్టుగా — దక్షిణహస్త గణేశుడుగానూ — వామహస్త గణపతిగానూ వర్ణించబడిన యోగమూర్తి!

అంతేగాదు! ఈ కుడి, ఎడమ పార్శ్వముల (ఇడా పింగళ) లో సంచరించు శ్వాసయే తన భార్య (శక్తి) గా కలిగిన సుషుమ్నానాడి యందుండిన **మోక్షమూర్తియే** — ఈ గణపతి! అందుకే ఈ గణపతి శివుని కుమారుడైనా 'విష్ణుస్వరూపి'గానే — 'శుక్లాంబర ధరం - విష్ణుం' అనే వర్ణించబడినాడు! ఎందుకనగా మోక్షప్రదాత విష్ణువే గదా?

**"ముక్తిప్రదాతా సర్వేషాం విష్ణురేవ న సంశయః"**

అని హరివంశము. అందుకే ఉభయపార్శ్వములయందు దేవేరులు (శ్రీదేవి భూదేవి) కొలిచిన (ఇడపింగళలతో) గణేశుడు వారి వల్లభుడుగాన **"వల్లభ గణపతి"** యైనాడు! పురుష సూక్తములో రెండు వైపులా దేవేరులచే కొలువబడే నక్షత్రమూర్తి (విష్ణువు)గా

**"హ్రీశ్చతే, లక్ష్మీశ్చ పత్నౌ" అహోరాత్రే పార్శ్వే... నక్షత్రాణి రూపమ్"**

అని వర్ణింపబడినాడు! ఇట్టి యోగశక్తులకు నిలయమైన మూలాధారవాసియైన ప్రణవస్వరూపి గనుకనే ఈయన ప్రథమారాధ్యుడు!

## జ్యోతిషపరమైన-స్థానం :

గణేశునకు నక్షత్రములలో నివాసమేమిటి? — అంటే గణపతి మూర్తి అకాశమున "హస్త" నక్షత్ర ముఖముననే కని పించును. హస్త-

ముఖముగా కలవాడు గనుకనే — "హస్తి ముఖుడు" గా పేర్కొన బడినాడు!

ఇది కేవలము శబ్దసాదృశ్యముచే సాధించిన పాండితీ వైచిత్రిగాదని తెలియుట కింకొక జ్యోతిశాస్త్ర ప్రమాణముకూడా కనపడుచున్నది! సరిగ్గా చంద్రోదయ సమయమునకు ఆకాశమున హస్తానక్షత్ర ముఖముతో దర్శనమిచ్చునది — ఒక్క భాద్రపదమాసమున శుద్ధ చతుర్థినాడే!!

సరిగ్గా ఈ హస్తా నక్షత్రోదయ సమయమే "గణేశచతుర్థి"గా ఋషులు నిర్ణయించుటలో ఈ ప్రమాణము స్థిరమైనది! అంతేగాక ఈ హస్తా నక్షత్రము కన్యారాశియందున్నది. కన్య అనగా నిత్యము వివాహముకానిది! అందుచే ఈ గణపతి కూడ "నిత్య బ్రహ్మచారి"గా వర్ణింపబడినాడు!

ఈ కన్యారాశికి అధిపతి — బుధుడు! అతడికి అధిష్ఠాన దేవత విష్ణుమూర్తి! అందుకే గణపతిని "శుక్లాంబర ధరం — విష్ణుం!" అని విష్ణుస్వరూపునిగా స్తుతించినారు. కాలపురుషుని శరీరములో 'కన్య' ఆరవరాశి — లేక మూలాధార స్థానముగా జ్యోతిషము తెలుపుటచే కూడా ఈయన "మూలాధారస్థితుడు"!

కన్యారాశి రంగు గరికెరంగు పచ్చ 'దూర్వాశ్యామః' అని వరాహ మిహిరుడు బుధుని వర్ణించినాడు! అందునా, గణపతికి ప్రియమైనది — దూర్వాంకురము.

దీనితో పూజింపబడువాడే — "దూర్వాగణపతి"

అట్టి గణేశుడిని వివిధ దోషములు పోవటానికి ఉపాసన చేయ వలసిన పద్ధతులను ఈ — **గణేశపురాణం** — **"ఉపాసనా ఖండము"**

లో వివరంగా తెలుపుతున్నది.

దీనిని పండితులు కేవలము కథలపుట్టగా — పుక్కిటి పురాణముగా చదువుకొనక అనేక శాస్త్రముల జ్ఞానమును సమన్వయముచేసి ఆచరించితే — ఈ వ్రతములు తక్షణమే ఫలితములు చూపెట్టుటా, నేను అనేకమందికిచెప్పి, వారు పొందుటా — గత 30 సంవత్సరాలుగా ఎందరో చూచిన అనుభవము!

## గ్రహదోషాలకు గణేశుడు :

బుధ కుజుల దోష సంయోగఫలమే జాతకములో 'గణపతి దోషం' అనబడును. అది పోవుటకు గణపతిని అర్చించవలెను.

కుజుని దోషము గణపతి దోషమునకు తోడైనప్పుడు "సంకష్ట గణపతి వ్రతము" పనిచేయును. ఇది మాఘ మాసమున మంగళవారము చతుర్థి కలిసినప్పుడు చేయవలెను. అది తెలుపుటకే గణేశపురాణము ఉపాసనా ఖండములో సంకష్టచతుర్థి వ్రతములో తెలుపబడినది.

అది చేయునప్పుడు తెల్ల నువ్వులపిండితో స్నానము చేయవలెను. దీనివలన మానవునికి శని బుధ, కుజ, కేతువుల దోషములు పోవును. ఇట్లు జ్యోతిశ్శాస్త్ర జ్ఞానముతో మంత్రశాస్త్రములను కలిపి ఈ ఉపాసనా ఖండములోని వివిధ వ్రతములను ఉపయోగించుకొన్నయెడల అవి పరిపూర్ణఫలము నిచ్చి సర్వ విఘ్నముల పోగొట్టి, సర్వసంపదలను నిజముగా ప్రసాదించుట అనుభవము!

## గణపతి – ప్రాచీనత!

హిందూమతంలోని దేవుళ్ళలో అతి ప్రాచీనమైనవాడు గణపతి! ఇలా చెప్పడానికి కారణం ఏమంటే వేదాలలో వర్ణించబడిన దేవతలైన,

అగ్ని, యమ, వరుణ, ఇంద్ర, మరుత్తులు — ఈనాడు, ఏ దేవాలయా లలోగాని, నిత్యపూజలలో, హిందూమతంలో మనకి కనిపించరు! కాని గణేశుడుమాత్రం ఋగ్వేదంలోనూ "గణపత్యుపనిషత్తు" "గణపత్యధర్వణ శీర్ష" మంత్రములవంటి వేదమంత్రాలలో వర్ణించబడి అతి ప్రాచీనమైనట్టి, దేవుడే!

వ్యాసమహర్షి హిమాలయపర్వత గుహలలో 'బదరీనారాయణము' వద్ద తపస్సుచేసి పరబ్రహ్మసాక్షాత్కారమును పొంది, తద్వారా తన దివ్య దృష్టికి గోచరించిన ఈ సర్వజగత్ సృష్టి మొదలుగా, ప్రళయము వరకూ గల అనేక దేవ రహస్యములను దర్శించినట్లు మహాభారతము ఆది పర్వంలో తెలిపినాడు.* ఈ "మహత్తర విశ్వానుభూతి"లో దేవతల పుట్టుకనుకూడా వ్యాసమహర్షి దర్శించియున్నాడు. ఇందులో స్వయం భువు అయిన "మూలవిరాట్టు" ఉద్భవమై, ఆయననుండి ముక్కోటి దేవతలూ, ఆ తర్వాత క్రమంగా 33 కోట్ల దేవతలున్నూ ఉద్భవించారు. వారిలో ముఖ్యులు -

**ఈక్రిందివారు :**

1) **ఒకటి** :- "స్వయంభువు" లేక పితామహుడు అయిన బ్రహ్మదేవుడు. ఈయన అద్వితీయుడు.

2) **రెండు** :- మూలప్రకృతి లేక దైవీప్రకృతి అయిన జగన్మాత. ఈమె ద్వైధీభూత.

---

* వివరాలు :- "భగవాన్ వేదవ్యాస" అన్న నాగ్రంథంలోని 'ఒక మహత్తర విశ్వానుభూతి' అనే అధ్యాయంలో ప్రచురించబడింది - ఇది USCEFI (1979) ప్రచురణ

3) మూడు :- 'త్రిమూర్తులు' లేక 'సృష్టి' 'స్థితి' 'లయ' కారకులైన చతుర్ముఖ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు.

4) నాలుగు :- నలుగురు 'ఆది-మనువులు' ("చత్వారో మనవస్తథా" - అని గీత)

5) ఐదు :- పంచభూతములు — వీటికి అధిదేవతలైన వరుణ, వాయు, అగ్ని, యమ, విష్ణు దేవతలు.

6) ఆరు :- ఆరుగురు కుమారులు (లేక ఆరు ఋతువులను కృత్తికల సహాయముతో త్రిప్పు ఆరు ముఖములుగల కుమారస్వామి.

7) ఏడు :- ఏడుగురు "మరుద్గణాలు" ఆతర్వాత సప్తలోకములూ వాని అధిపతులగు "సప్తమహర్షులు" వాటికి ప్రతిరూపమగు ఏడుగురు వారాధిపతులైన గ్రహములూ, సప్తస్వరములు గాయత్రిలోని "సప్తవ్యాహృతులు".

8) ఎనిమిది :- అష్టవసువులు లేక ఎనిమిదిమంది వసువులు.

9) తొమ్మిది :- నవదుర్గలు ("నవదుర్గాం మహాకాళీం" అని లక్ష్మి అష్టోత్తర శతం)

10) పది :- దశబ్రహ్మలు

11) పదకొండు :- ఏకాదశరుద్రులు

12) పన్నెండు :- పన్నెండుగురు, లేక ద్వాదశాదిత్యులు. వీరు దేవగణములు.

## దేవతాగణ నాయకుడు :

ఈవిధంగా సృష్టి, సంఖ్యా స్వరూపం (Numbers) గా వృద్ధిపొంది, చివరకు సర్వదేవతా స్వరూపమై వర్ధిల్లి — 33 కోట్ల, 33 లక్షల,

33 వేల, 33 వందల, 33 సంఖ్యాత్మకముగా — పరిణమించినట్లు వ్యాసమహర్షి ఆదిపర్వంలో తెలిపియున్నాడు.

"త్రయస్త్రింత్సహస్రాణి, త్రయస్త్రింశత్ శతానిచ,
త్రయస్త్రింశతి వర్షాణి, సృష్టిస్సంక్షేప లక్షణం."

— భారతము, ఆది.

ఈ 33 కోట్ల దేవతా గణముల సంఖ్యాసృష్టి ప్రారంభమునకూ, వాటన్నిటికి ఆది పురుషుడైన గణనాధునితో ప్రారంభించినట్లు గణేశ పురాణంలోనుండీ తదితర పురాణములనుండీ మనకు తెలియుచున్నది.

దేవతాగణములకు ఆదిపురుషుడై ఉద్భవించడంవల్లనే, ఈయనకు 'గణనాధు'డని, 'గణేశు'డని, 'గణపతి' అని పేరువచ్చింది. ఈయనే అది.

ఐనప్పటికీ ఈనాటికీ ఆలయాలలో ఇప్పటికీ, అనేకచోట్ల ఆరాధించబడుతూ — అనేక రూపాలలో ఆలయాలలో ఇప్పటికీ, అనేక చోట్ల ఆరాధించబడుతూ — **అనేక రూపాలతో** మనకి దర్శనమిచ్చే అతి ప్రాచీనమైన హిందూదేవుడు — గణపతి ఒక్కడేనేమో! బహుశా విష్ణుమూర్తి, రుద్రుడు, దుర్గా, సరస్వతి, లక్ష్మీలతోపాటు వేదమంత్రాలలో ప్రార్థించబడిన వేదకాలపు దేవుడు గణపతి — ఇంకా ఈనాటికీ ఆరాధ నీయుడుగా కొనసాగుతూ వుండటంవల్ల నిశ్చయంగా ఆయన, అతి ప్రాచీనమైన వేదకాలపు దేవుడు!

## గణపతి విష్ణుస్వరూపుడు :

ఎందుకనగా గణేశుడు విష్ణుస్వరూపుడు. ఇది తెలియక చాలా మంది వైష్ణవులు గణపతిని పూజించకుండుట అజ్ఞానంవల్లనే! దీనికొక

నిదర్శనం కూడ కలదు.

సామాన్యంగా విష్ణు దేవాలయములలో శివుడు క్షేత్రపాలకుడు గానూ, అట్లే శివాలయములో విష్ణువు క్షేత్రపాలకుడుగానూ ఉండవలెనని అలయనిర్మాణం తెలిపే 'ఆగమశాస్త్ర' ప్రమాణం. ఈ కారణంవల్ల కూడా విశ్వస్వరూపి అయిన గణేశుడు శివాలయమున నుండట విఘ్ననివార ణార్థం వాకిలివద్ద నిలచి ప్రథమ పూజలందుచున్నాడు. ఈనాటికీ శ్రీశైల క్షేత్రంలోని మల్లికార్జునాలయములో గర్భాలయంలోకి వెళ్ళి శంకరుడైన మల్లికార్జునుని పూజించుటకు ముందు వాకిలికి ఎడమవైపునున్న "రత్న గర్భ గణపతి"ని పూజించి ఆ తరువాతనే లోపలికి పోవుట ఆచారంగా ఉన్నది. ఇది మరింత స్పష్టంగా తెలుపుటకు గణపతి ప్రార్థనా శ్లోకములో మూర్ఖులకు కూడా తెలిసేవిధంగా —

"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే"

పై ప్రార్థనలో "శుక్లాంబర ధరం విష్ణుం" అని విష్ణుమూర్తిగా గణపతిగూర్చి చెప్పబడినందువల్ల స్పష్టంగా ఆయనయొక్క విష్ణత్వము రూఢియగుచున్నది. దీనికి నిదర్శనం యోగశాస్త్రంలో లభించుచున్నది. విష్ణువు 'స్థితి' కారకుడు. అనగా సృష్టిస్థితిలయములలో 'స్థితి' అనే దశకు విష్ణువు అధిపతి. సంస్కృతంలో 'స్థితి' అనగా 'ఉండటం' అని అర్థం.

## విఘ్నవారకుడు :

సర్వ కార్యారంభములకూ ఆదిలో విఘ్ననివారణకై ప్రతీవారూ పూజించే ప్రథమారాధ్యుడైన దైవం గణపతి! అలాగ మనుష్యులచేత

మాత్రమే కాకుండా దేవతలుకూడా విధిగా పూజింపవలసిన దేవుడు గణపతి! అలానే గణపతిపూజ చేయకుండా దేవతలు పాలసముద్ర మథనానికి పూనుకోవడంవల్లనే నడిమధ్యలో విఘ్నం కలిగిందనీ, స్వయంగా శ్రీమహావిష్ణువే, దేవతలకుపదేశించి వారిచేత గణపతిపూజ విధిగా చేయించి ఆతర్వాత తానే కూర్మావతారమెత్తి నిర్విఘ్నంగా దేవతలకు అమృత సంపాదనను సిద్ధింపచేసినాడు! కనుక గణపతి దేవతలకు కూడా ఆరాధనీయుడే!

## విదేశాలలో – వినాయకుడు! :-

అంతేకాకుండా హిందూదేవతలలో గణపతి ఇతర దేశాలలో సైతం మనకి ప్రపంచవ్యాప్తంగా కనిపించే విశిష్టమైన దేవుడు! చైనా, కంబోడియా, రష్యా, తుర్కిస్థాన్, జపాన్, టిబెట్, మంగోలియాలనుంచి గ్రీస్, రోమ్‌దాకా కూడా గణపతి "జేనస్" (Janus) గా రెండు ముఖ ములు కలిగిన విఘ్నహరుడైన దేవుడుగా ఆరాధించబడిన ఏకైక దేవుడు గణేశుడే!

## ఛందోగణాధిపతి :

వేదాలలో మంత్రములకు చందస్సులే ప్రాణపదములు! ఆ 'ఛందో గణముల'కు అధిష్టానదైవము శ్రీగణపతియే! అందువలన వేదమంత్రము లలో గణేశుడు వాక్కులకు అధిపతిగా, భాషకూ, ధారాశుద్ధికీ అధిదైవమై 'కవిం కవీనాం' కవులలోకి కవి — "గణానాంత్వా గణపతిం" — ఛందో గణములకు అధిష్టానదైవమైన గణపతిగా, జ్ఞానమునకు, భాషకూ అధి ష్టానదైవమైన "బ్రాహ్మణస్పతి" గా!

ఇక్కడ "బ్రహ్మణస్పతి" అనే గణాధీశుని వర్ణన చేయబడిఉన్నది.

ఎందుకనగా ఇక్కడ 'బ్రహ్మ' అనగా వాక్కు. వాక్కు 'శబ్దము'లచేత ఏర్పడుతున్నది. శబ్దమువల్ల వర్ణం, వర్ణములవల్ల ఉచ్ఛారణ, ఉచ్ఛారణ వల్ల గురు, లఘువులూ, దానివల్ల సమస్త మంత్రవర్ణ ఛందోవిజ్ఞాన మయమైన బ్రహ్మ సాగరమంతా ఉద్భవించినది. ఈ కారణంచేత గణ నాయకుడు సర్వ విద్యాప్రదాత అయి, ఈనాటికీ బమ్మెర పోతనగారు వర్ణించినట్లు "విద్యలకెల్ల నొజ్జయై" వెలుగొందినాడు! కాబట్టియే ఈ గణపతి బ్రహ్మరూపమైన వాక్కుల కధిపతి! ఈనాటికీ ఈయన నుపాసించి గణపతి సిద్ధిపొందిన అనేకమంది పండితులకు సంతత ధారగా ఆశుకవిత్వం, ధారాశుద్ధీ, విద్యలలో పాండిత్యం పొందినట్టివారు కావ్యకంఠ గణపతులై, మన చరిత్రలోకూడా వాసికెక్కినారుకదా!

**వాక్పతి :**

వ్యాసమహర్షి మహాభారతమును గణపతికి చెప్పగా ఆయన రచించినాడని చెప్పుటలో ఒక మంత్రశాస్త్ర రహస్యం నిగూఢంగా ఇమిడ్చి చెప్పబడినది. పైకితోచే అర్థము — గణపతి ముందుకూర్చుని వ్రాయగా వ్యాసమహర్షి, ఆశువుగా, మహాభారతమును 'డిక్టేషన్' (Dictation) ఇచ్చివున్నాడని! దీనికి అంతరార్థం ఏమిటంటే, వ్యాసమహర్షి ఏకాక్షర గణపతి నుపాసించి, సర్వవిద్యల సారం గ్రహించి, సర్వఛంధస్సులతో నేర్పడిన భాష చాతుర్యమంతా హస్తగతం చేసుకుని, చందస్సులతో నృత్యం చేసినట్లు మహాభారతమును అశుధారగా రచించెనని, ఇందలి నిగూఢ రహస్యం.

ఈ కారణంచేత, ఒక విధంగా చూస్తే వ్యాసమహర్షి రచించిన సర్వపురాణ, మంత్రశాస్త్ర, బ్రహ్మసూత్రాది వేదవిద్యలన్నిటికీ, ఈ 'గణపతి

విద్య'యే మూలకారణము అని తోచకమానదు! ధారాపాతంగా రచన సాగాలన్నా ఎక్కడా కుంటుపడకుండా భాష ప్రవహించవలెనుగదా! అట్టి అనుగ్రహము ఇచ్చుటవల్లనే గణపతి 'నిర్విఘ్న కార్యసిద్ధికి' అనుగ్రహ ప్రదాతయై అనాదిగా, ఈనాటికీ పూజింపబడుతున్నాడు.

అనగా బ్రహ్మజ్ఞానమునకే అధిష్టానమై, సర్వకార్యములను సిద్ధింపచేసే — 'సీద-సాదనం' దైవికమైన సాధనం అని వేదములలో కీర్తింపబడినాడొక్క గణపతియే!

## గణేశ-చతుర్థి ప్రాముఖ్యత :

వినాయక చవితి హిందువుల పండుగలలో ముఖ్యమైనది! భాద్రపద శుద్ధచతుర్థినాడే ప్రత్యేకంగా ఈ పండగ ఆరోజే ఎందుకు వస్తుంది? దీనికి సమాధానం చాలామందికి తెలియదు!

కారణం వేదకాలంలో మహర్షులు మనపండుగలను జ్యోతిషశాస్త్ర ఆధారంతో హిందూపంచాంగాన్నిబట్టి ఏర్పాటుచేశారు! అది ఎలాచేశారో తెలిస్తేనేకాని వినాయకచవితి రహస్యం బోధపడదు! భాద్రపదమాసం సూర్యుడు సింహరాశి చివరలో వుండగా వస్తుంది! శుక్లపక్ష చవితినాడు చంద్రుడు కన్యారాశిలో హస్తానక్షత్రంమీద ఉదయిస్తాడు! హస్తానక్షత్రం చేతివేళ్ళవలే 'హస్తా'కారం అంటే చేతివంటి ఆకారం కలిగిన నక్షత్రం! భాద్రపద శుద్ధ చవితినాడు చంద్రుడుదయించే సమయానికి శిరస్సున హస్తానక్షత్రంతో కనిపిస్తాడు. హస్త-ముఖమున కలిగినవాడు కనుక హస్తి ముఖుడు (హస్త ముఖముగా కలవాడు) హస్తి అనగా ఏనుగు అనికూడా అర్థం! దీనినిబట్టి గణపతికి ఏనుగు ముఖము అని గూడార్థముతో హస్తా + ముఖము = హస్తిముఖుడు అని వర్ణించారు!

ఇదిఇలా, ఒక భాద్రపద శుద్ధ చతుర్థినాడే హస్తలో చంద్రుడుండగా ఉదయిస్తాడు చంద్రోదయ సమయానికి! హస్తా నక్షత్రం కన్యారాశిలో వున్నది! దీని అధిపతి బుధుడు! మరకతము లేక పచ్చ బుధుని రంగు కనుక గణపతిని ఆకుపచ్చ రంగుగా వుండే గరికచిగుళ్ళు దూర్వాంకు రములు ఇంకా ఆకులు అంటే పత్రితో పూజిస్తారు!

వినాయక చవితినాటికి ప్రకృతిఅంతా ఆకులతో పచ్చబడి కంకులు వెన్నులూ పోసుకొని మొక్కజొన్నలు, మారేడులు, వెలగతో సమృద్ధిగా భూమిఅంతా ఒక ఆకుపచ్చని తివాచీలా కనిపిస్తుంది! పంటల సమృద్ధికి, నిండుగావుండే గరిశ దానికింద చేరే మూషికము సూచన! ధాన్యం, తూర్పారపోసే చేటలు గణపతిచెవులు! ఇలాగ ప్రకృతిలోని సస్యములకు, మొక్కలకు ధాన్యసమృద్ధికి చేటలకు ప్రతిరూపమైనవాడు గణపతి! అందుకని గణపతి చతుర్థి ఈ అంతరార్థంతో రూపకల్పన చేయబడింది!

ఇంకొక కారణంకూడా వున్నది! పూర్వం ఋషుల ఆశ్రమాలలో బ్రహ్మవిద్యాభ్యాసము వినాయకచవితి మర్నాడు ప్రారంభిస్తారు! ఎందు కంటే ఈరోజు సప్తఋషులు ఆకాశంలో ఉదయిస్తారు! పంచమి సప్త ఋషులతో ఉదయిస్తుంది! కనుక ఆనాడు కాబట్టి గణపతి 'విద్యల కెల్ల నొజ్జయై' బ్రహ్మ విద్యాధిపతియైనాడు! ఇకపోతే కన్యారాశి రాసులలో ఆరవది! ఆరవస్థానం శతృవులకూ, అపనిందలకు, నీలాపనిందలకు, రోగములకు, బాధలకు, విఘ్నములకు జ్యోతిషం ప్రకారం మూలస్థానం కాబట్టి ఈ ఆరవరాశిలో విఘ్నములకు, నీలాపనిందలకు, శత్రువులకు కారకుడైన గణపతిని ఏర్పాటుచేసి ఆయనను పూజించితే వచ్చే ఏడాది అంతా అవిలేకుండా సుఖంగా వుంటామని ఋషీశ్వరులందరూ భాద్రపద

శుద్ధ చతుర్థినాడు ఈ పండుగను ఏర్పాటుచేశారు! అందుకే వినాయక చవితి కథలో సింహముచేత మరణించిన ప్రసేనుడు, నీలాపనిందల పాలైన శ్రీకృష్ణప్రభువుకు మిత్రుడే శత్రువైన జాంబవంతునితో వైరము శతృత్వాలని ప్రమాదాన్ని సృష్టించే శమంతకమణి కథ ఈ జ్యోతిష రహస్యాన్నే సూచిస్తాయి తెలుసుకోగలిగిన వారలకు! ఇదే వినాయక చవితి యొక్క ప్రాముఖ్యత! అంతరార్థంయొక్క రహస్యం!

**నూతన-అంశాలు :**

గతంలో వేసిన "గణేశపురాణం" అచ్చులోలేని విశేషములనుచేర్చి, ఈ రెండవ సంపుటి ముద్రణలో గణపతి ఉపాసకులకూ, సాధకులకూ, ఉపయోగకారిగావుండే అనేక అంశాల్నికూడా సంపుటిచేసి మీకు ఇప్పుడు అందిస్తున్నాను.

ఇందులో :-

1. **షోడశ గణపతుల, 16 మంత్రమూర్తులు - వారి ఆకార-విశేషములు.**
2. **గణేశుని ఆకారము - దానియొక్క రహస్యార్థము.**
3. **యోగశాస్త్రంలో గణేశుని ప్రాముఖ్యత.**
4. **జ్యోతిషంలో గణపతి – వినాయక చతుర్థి విశిష్టత.**
5. **వివిధ గణపతి మంత్రములకు సంపుటి న్యాసవిధానము.**
6. **గణపతి యంత్రములతో ఈ "ప్రమాధి"నామ సంవత్సర గణేశచతుర్థి నాటికి ఈ "గణేశపురాణం"తో మీకు అందించ గలుగుతున్నందుకు సంతోషం!**

వేదవ్యాస మహర్షి రచనయైన - ఈ 'గణేశపురాణము'నకు ఇంతటి ప్రాశస్త్యము ఈ గణేశ పురాణమును వ్యాసులవారు విడిగా అందించడానికి కొన్ని విశేషమైన కారణాలున్నాయి. అందులో మొదటిది, వ్యాసుని మహాభారత రచనలో గణపతి వ్రాతపనిలో సహాయకుడుగా లేకపోతే శతసహస్ర శ్లోకములు కలిగిన మహాభారత గ్రంథమును మూడు సంవత్సరములలోనే, అందించుట వ్యాసమహర్షికి దుష్కరము!

ఇకపోతే రెండవ కారణము ప్రతి హిందువూ నిత్యమూ పూజించే ఐదుగురు ముఖ్య దేవతల్ని 'పంచాయతనము'గా విధించబడిన వారిలో గణపతి ముఖ్యదైవతము! (1) విఘ్నహరుడుగనుక ప్రథమారాధ్యుడు. (2) సంధ్యాకారకుడు కనుక సూర్యుడు ద్వితీయారాధ్యుడు, (3) సర్వ శక్తులకూ ఆరాధ్యశక్తి కనుక అంబిక తృతీయారాధ్య! (4) సర్వదేవతలకూ చక్రవర్తిగా కాలచక్రమును "శ్రీమహావిష్ణోరాజ్ఞయా" అని చక్రముగా కాలం వర్తించు నట్లు నడిపే విష్ణుమూర్తి చతుర్థారాధ్యుడు!! (5) సర్వశివకరుడు, మృత్యుంజయుడు అంబికానాథుడైన ఉమాశంకరుడు ఈ పంచాయతనంలో కడపటివాడు!

సాధకుల జాతకదోషంవల్ల కలిగే అనేక కష్టములకు, ఇబ్బందులకు శాంతిని కల్గించే వ్రతాలు అనేకం — ఈ గణేశ పురాణం రెండవభాగం లోని ఉపాసనాఖండంలో తెలుపబడ్డాయి.

ఉదాహరణకు 'సంకష్టగణపతి వ్రతము' జప, హోమ, తర్పణాదులతో ఆచరించిన వారికి — ఇంటినుండి పారిపోయినవారుగాని, కనిపించని బంధుమిత్రులు గలవారికిగాని, వారు అయిదు రోజులలో తిరిగి వస్తారని తెలుపబడినది!

ఇంతేగాక 'అంగారక-చతుర్థి' మహిమ, గణేశపూజలో దూర్వాంకు

రములు (గరిక చిగుళ్ళు)తో పూజించినందువల్ల కలిగే ప్రత్యేక ఫలితమూ కూడా గమనింపదగిన అంశములు!

# గణపతియొక్క 'మంత్రమూర్తి'

## ఆగమంలోని పదహారు (16) మూర్తులు షోడశ-గణపతులు!

**1. బ్రహ్మగణపతి** : ఈ మూర్తియొక్క ధ్యానశ్లోకం :

పాశంకుశ స్వదంతామ్ర ఫలవానాఖువాహనః
విఘ్నం నిహంతునః శోణగఃసృష్టిదక్షో వినాయకః

ఈయన గణపతియొక్క 'బ్రహ్మజ్ఞాన' శక్తికి మూర్తీభావము. ఈ గణపతి చతుర్ముఖములు కలిగి **కుడివైపుకు తిరిగిన** తొండముతో ఎడమచేత కమండులువు, తాళపత్ర గ్రంధములు, కుడిచేత జపమాల, చిన్ముద్ర కలిగి కుడికాలు అరిధపాదముగా - నుదుట బ్రహ్మజ్ఞానమును సూచించు **మూడవ నేత్రముతో** వర్ణించబడినాడు.



బ్రహ్మగణపతి



## 2. విఘ్నగణపతి :



విఘ్నగణపతి

శంఖేక్షు చాప కుసుమేషు కుఠారపాశ
చక్రస్వదంత సృణిమంజరికా శరైఘైః
పాణిశ్రితైః పరి సమిహిత భూషణశ్రీ
ర్విఘ్నేశ్వరో విజయతే తపనీయగౌరః

ఈయన ప్రత్యేకముగా భయంకరమైన విఘ్నములు కలిగినప్పుడు రాజ్యమునకుగాని, రాజునకుగాని, దేశ స్వాతంత్ర్యమునకు భయంకర ప్రమాదములు కలిగినప్పుడు పూజింపబడుతూ ఉన్నారు. ఈయనకు హోమము, ఆవాహన, జపపూజాదికములు ఆర్యచాణుక్యుని కాలంనుంచీ రాజులు చేస్తున్నట్లు చారిత్రక ఆధారాలు ఉన్నాయి. ఈయన త్రిమూర్త్యాత్మకుడు.

ఈ విఘ్న గణపతి పది భుజములు కలిగి వెనుక భుజములలో శంఖుచక్రములు ధరించి, విష్ణుస్వరూపుడై వెలుగొందును. కుడిచేత పరశువూ అంకుశము, శక్తిని ధరించి ఎడమచేత చెఱకుగడ, పాశము,

దర్భలు ధరించియుండును. ముందున్న కుడిచేతిలో భిన్నదంతము (పెరికిన దంతము) పట్టుకుని ఎడమచేయి వరదము (వరములిచ్చు చున్న ముద్రలో) కుడివైపు తిరిగిన తొండముతో పెద్దచెవులు మహోద రము కలిగి కుడిపాదము క్రిందకు చాసి (ప్రసార్య) పద్మముమీద నుండును. ఇది విఘ్నగణపతి మూర్తి.

## 3. హేరంబ గణపతి :

చాలామంది సంగీతంలో "హేరంబం భజే" అని గ్రుడ్డిగా నిద్ర పోతూ పాడతారు. ఊకదంపుడు పండితులు హేరంబుడనగా గణపతి అని చెబుతూవుంటారు. ఈయన రూపం తెలియకనే.

గణపతి రూపాలన్నింటిలోకీ విశిష్టమైన మంత్రమూర్తి! ఏ ఆలయం లోనూ మనకు కనిపించని గణపతిమూర్తులలో హేరంబుడు ముఖ్యుడు.



హేరంబ గణపతి

ఆయన రూపము అయిదు తలలు కలిగి (పంచముఖుడై), పది బాహువులతో, కుడివైపుకు తిరిగిన తొండముతో ఏకదంతముతో ఉండును. ఈయన సింహముపై కూర్చుండి శక్తిస్వరూపుడై (హేరంబ) తన ప్రత్యేకతను, ఉగ్రతను ప్రదర్శించును. నాలుగు తలలు నాలుగు దిక్కులకూ తిరిగియుండగా ఐదవశిరస్సు, వారిపైన దత్తాత్రేయులకు వలే నుండును. కుడివైపు చేతిలో జపమాల, శక్తి, ఏకదంతము, అంకుశము పట్టుకొని యుండును. ఎడమవైపు అయిదు చేతులలో మామిడిపండుగాని (దానిమ్మ పండుగాని), పాశము, పరశువు, కుడుము లేక ఉండ్రాళ్ళు, (మోదకము) ధరించియుండును. ముందు కుడిచేతితో అభయము, ఎడమచేతితో వరమిచ్చు ముద్ర (వరదము), కుడిపాద మును ఆలీఢముగా జాపి ఉంచును - ఇది హేరంబ గణపతిమూర్తి! ఈయన విగ్రహము పాండిచ్చేరి మనకో **వినాయగర్** ఆలయంలో ముఖమంటపములో నేను చూసి ఎంతో ఆనందించితిని. అక్కడ గణపతి కళ్యాణము జరిగినప్పుడు నన్ను ఆహ్వానించిరి.

**4. లక్ష్మీగణపతి :**

చాలామంది గణపతిని గురించి వ్రాస్తూ (ప్రత్యేకంగా తూర్పు గోదావరిజిల్లా, కరీంనగర్ జిల్లాలలోని పుస్తకాల్లో) **'లక్ష్మీగణపతి'** అన్నపేరు, క్రింద ధ్యానశ్లోకాన్ని వ్రాస్తూ **'వల్లభ గణపతికి'** సంబంధించినది తప్పుగా యిచ్చారు.

సామాన్యంగా అందరూ 'లక్ష్మీగణపతి' అనుకునే మూర్తి లక్ష్మీ గణపతి కాదు.



శ్రీలక్ష్మి గణపతి

లక్ష్మీగణపతికి ఇరుతొడలపైనా శ్రీదేవి భూదేవి ఇద్దరూ కూర్చొని వుంటారు. ఈయన తొండము కుడివైపుకు తిరిగి, పదిబాహువులు కల్గివుండును. ఒకే శిరస్సు కుడివైపుహస్తములో చిలుక, మూలకము (కారెట్ లేక 'మూలి') పైకెత్తబడిన ఖడ్గము, అంకుశము ధరించి యుండును. ఎడమ వైపు బాహువులలో పాశము, అమృత కలశమును ధరించి వరదహస్త ముండును. ముందున్న రెండు చేతులతో అమ్మ వార్లను ఆలింగనము చేసుకొని కుడిపాదము క్రిందకు ప్రసారముచేసి (ప్రసార్య) వున్న మూర్తియే లక్ష్మీగణపతి. అతని ధ్యానశ్లోకము ఈక్రింద ఇవ్వబడింది.

శ్లోకము :

బిభ్రాణః శుకబీజాపూరక మిలన్మాణిక్య కుంభాంకుశాన్
పాశం కల్పలతాంచ ఖడ్గవిలసజ్యోతి స్సుధా నిర్ఝరః
శ్యామేనాత్త సరోరుహేణ సహితం దేవీద్వయం చాంతికే
గౌరాంగో వరదానహస్త సహితో లక్ష్మీగణేశోఽవతాత్

## 5. శ్రీమహా గణపతి :



శ్రీమహా గణపతి

ధ్యానశ్లోకం :

హస్తీంద్రానన మిందుచూడ మరుణచ్ఛాయాం త్రిణేత్రం రసా
దాశ్లిష్టం ప్రియయా స్వపద్మకరయా స్వాంకస్థయా సంతతమ్।
బీజాపూర గదేక్షు కార్ముక లస చ్చక్రాబ్జ పాశోత్పల
వీహ్యగ్ర స్వవిషాణ రత్నకలశాన్ హస్తైర్వ హంతం భజే॥

ఈయన సమగ్రమూర్తి! కుడివైపు తిరిగిన తొండముతో ఎడమ చేతితో తొడపై కూర్చున్న అమ్మవార్ని ఆలింగనము చేయును. పది బాహువులలో కుడిచేత చక్రము, ఓషధి, కలువపూవు, నిధి (డబ్బు సంచి) ధరించి - ఎడమచేత పాశము, చెఱకుగడ, పద్మము, గద ధరించివుండును. కిరీటముపై అర్థచంద్రుడు, కుడిపాదము ప్రసార్యముగా నుండును. ఈయన మహాగణపతి సర్వఫలములనూ యివ్వగలవాడు.

## 6. తాండవ గణపతి లేక నృత్యగణపతి



నృత్య గణపతి

శ్లోకము :

> పాశాంకుశాప కుఠారదంత
> చంచ త్కరాక్లప్త వారాంగులీకమ్।
> పీతప్రభం కల్పతరో రధస్తం
> భజామి నృత్తోపపదం గణేశమ్।

సంగీత సాహిత్యప్రియుడీయన అన్నట్లు, బాలకృష్ణునివలె మూడేళ్ళ పసిబాలుని రూపంలో ఆనంద తాండవం చేస్తుంటాడు. బ్రహ్మజ్ఞానపు పరిపూర్ణ ఉద్రేకంచేత ఆత్మకు కలిగే ఆనందతాండవానికి రూపకల్పనయే ఈయన! ఈయన మోక్షస్వరూపుడు! కుడివైపు తిరిగే తొండముతో చతుర్భుజములు కలిగి ముందు రెండుచేతులలో, పాశము, ఏకదంతము, వెనుక చేతులలో పరశువు, అపూపము ధరించును. ఎడమకాలు పైకెత్తి కుడికాలు క్రిందఅన్చి పద్మముపై తాండవించును. మూలాధార పద్మంలో

కూర్చొన్న కుండలినీ తాండవ రహస్య స్వరూపమే ఈయన! ఇంకనూ అనేక గణపతి మూర్తులున్నవి.

## 7. ఢుంఢీ గణపతి :

ఈయన కాశీపురములో విశ్వనాధుని మ్రోల నిలబడే ప్రమధ గణనాధుడు. చతుర్భుజము కలిగి కుడివైపు తిరిగిన తొండముతో ఒకచేత అమృత కలశము, రెండవచేత జపమాలను, శక్తి, పరశువులను, మిగతా రెండు చేతులయందూ ధరించి ఉండును. కుడికాలు ఆలీఢపాదము.



ఢుంఢి గణపతి

శ్లోకం :

అక్షమాలాం కుఠారంచ రత్నపాత్ర స్వదంతకమ్
ధత్తేకరైర్విఘ్నరాజో ఢుంఢి నామా ముదే స్తునః!!

## 8. ద్విముఖ గణపతి :

ఈయన రోమన్ చరిత్రలో ప్రసిద్ధుడైన 'జేనస్' (Janus = Two Faced God) అని పేరొంది గణేశ్ అనే శబ్దమునకు రోమన్ పదమే 'జేనస్'గా వికృతి నొందినవాడు. ఈతని రెండు ముఖములు కుడి ఎడమలకు తిరిగివుండును. ఒకే కిరీటము ధరించివుండును. చతుర్భుజ ములలో పాశాంకుశములు, అమృత కలశము, ఏకదంతములను ధరించును. కుడికాలు ఆలీఢపాదము.



ద్విముఖ గణపతి

శ్లోకము :

స్వదంత పాశాంకుశ రత్నపాత్రం కరైర్దధానో హరినీల గాత్రః।
రక్తాంశుకో రత్న కిరీటమాలీ భూత్యై సదామే ద్విముఖో గణేశః॥

## 9. త్రిముఖ గణపతి :



త్రిముఖ గణపతి

శ్రీమత్తీక్ష్ణ శిఖాంకుశాక్ష వరదాన్ దక్షే దధానం కరైః
పాశాంచామృత పూర్ణ కుంభమయం వామే దధానో ముదా!
పీఠే స్వర్ణమయారవింద విలస త్సత్కర్ణికాభాసురే
స్వాసీనస్త్రిముఖః పరశురుచిరో నాగాననః పాతునః॥

ఈయన ప్రధాన స్వరూపుడు - త్రిమూర్త్యాత్మకుడు - అనగా అకార ఉకార మకారముల స్వరూపముగా కుడి ఎడమలకు రెండు ముఖములు మధ్య మనవైపుకు ముఖ్యశిరస్సు గలిగి కుడివైపుకు తిరిగిన తొండముతో ఆరుభుజములు కలిగివుండును. పద్మమునందు ఆసీనుడై అమృతకల శము, పాశాంకుశములు, జపమాలలను ధరించి, అభయ, వరద ముద్రలను కలిగివుండును.

## 10. యోగ గణపతి



యోగ-గణపతి

శ్లోకము :

> **యోగారూఢో యోగ పట్టాభిరామో**
> **బలార్కభశ్చేంద్ర నీలాంశుకాద్యః!**
> **పాశేక్షూన్ యోగదండందధానో**
> **పాయాన్నిత్యం యోగ విఘ్నేశ్వరో నః!!**

ఈయన కేవలము యోగమూర్తి! మూలాధారస్థితుడైన నిరంతర జపధ్యాన తత్పరుడు. బ్రహ్మజ్ఞానమునకు సూచిక!

ఒకే శిరస్సు కలిగి పెద్ద ఉన్నత బ్రహ్మ కిరీటముతో కుడివైపుకు తిరిగిన తొండము కలిగియుండును. ముందుచేతులతో యోగదండము, జపమాల ధరించి చిన్ముద్రతో నుండును. వెనుక రెండుచేతులలో చెఱకు గడ పాశము (కోరికయే బంధనము) లను ధరించి యుండును. పాదములు అయ్యప్పవలె జపముద్రలోనుండి యోగపట్టము ధరించి

ఏకదంతమును చేతబూనియుండును. మూషికములేదు. ఫాలచంద్రుడు లేడు. ఈతడు యజ్ఞోపవీతము కలిగియుండును.

## 11. వల్లభ గణపతి :

పైన లక్ష్మీగణపతి వర్ణనలో సామాన్యంగా చెప్పే ధ్యానశ్లోకం "ధ్యేయో వల్లభయా స పద్మకరయా" - అని వల్లభ గణపతియొక్క ధ్యానశ్లోకమే లక్ష్మీగణపతికి అనుకుని జపించేవారుకూడా తప్పుగా చేస్తున్నారు.



వల్లభగణపతి

బీజపూర గదేక్షుకార్ముక రుజాచక్రాబ్జ పాశోత్పల
వ్రీహ్యగ్ర స్వవిషాణ రత్నకలశ ప్రోద్యత్కరాంభోరుహః

ఈ వల్లభ గణపతియొక్క ఎడమ తొడపై వల్లభదేవి కూర్చుండి ఆమె ఎడమచేత ఆలింగనము చేయును. (ఆయన చేయడు!) ఈతడు పది భుజములను కలిగి, ఏకదంతమును, చక్రమును, కలువపూవును వరికంకిని కుడిహస్తములయందు, పాశము, పద్మమూ, చెఱకు వింటిని, అమృతకలశములను ఎడమ హస్తములయందునూ ధరించియుండును. ముందు మూషికము ఉండును. అర్ధచంద్రుడు, ఫాలనేత్రములేవు.

## 12. హరిద్రా గణపతి :



హరిద్రా గణపతి

హరిద్రాభం చతుర్బాహుం హరిద్రా వదనం ప్రభుమ్
పాంశాకుశధరం దేవం మోదకం దంతమేవచ
భక్తాభయప్రదాతారం వందే విఘ్న వినాశనమ్॥

అని ధ్యానింపబడే ఈయన మామూలుగా మనం వినాయకచవితి రోజున పూజించుకునే సాధనామూర్తి! - ఒక్కడే ఉండును. చతుర్భుజుడై వానియందు పాశాంకుశములను, ఏకదంతము, మోదకము (కుడుము) లను ధరించియుండును. లంబోదరము, వక్రతుండము ఉండును. ఇది నిత్యనైమిత్తిక కార్యములైన సంధ్యావందనాదుల యందునూ, వివాహాది శుభకార్యములలో విఘ్నవినాశనార్థం లఘువుగా పూజించుకునే పసుపుతో చేయబడే మూర్తి (హరిద్ర = పసుపు).

**13. ఉచ్ఛిష్ట గణపతి :**

ఈయన సామాన్యంగా తక్కువ కులాలవారిచేత పూజించబడును. 'ఉచ్ఛిష్ట'మనగా ఎంగిలి. ఏదైనా తిన్నతరువాత చేయి కడుగుకొనకుండా కొన్ని క్షుద్ర ప్రయోజనాలకై నిమ్న కులాలవారు ఉచ్ఛిష్ట గణపతి మంత్రములను సిద్ధిచేయుదురు. దీనివల్ల ఎదుటివారి జేబులో డబ్బెంత వున్నది? అతను ప్రస్తుతము ఏమనుకొనుచున్నాడు? అతనికి కొద్దిరోజుల్లో తెలియగల వార్తలు ఎట్టివో తెలుపును. చాలామంది కేరళ, కర్నాటక, తమిళనాడులనుండి వచ్చే "**జ్యోతిష్కుల**"మని చెప్పేవారూ "మీరిప్పుడు **టిఫిన్ ఏంతిన్నారో** చెప్తాం మీ **జాతకంవేసి**" అని గర్వించేవారు చాలా మంది ఉచ్ఛిష్ట గణపతి ఉపాసకులు! వీరి ఉపాసనను కొట్టివేస్తే వీరి జ్యోతిషం బంద్!

ఇతని మూర్తిని ఈక్రింది ధ్యానశ్లోకం వర్ణిస్తున్నది.

**"నీలబ్జ దాడిమీ వీణాశాలీ గుంజాక్షసూత్రకమ్**
**దధదుచిష్ట నామోయం గణేశః పాతుమేచకం (ప్రకారాంత రేణ)**
**నారీయోని రసాస్వాద లోలుపం కామమోహితమ్!"**



ఉచ్ఛిష్ట గణపతి

ఈయన చతుర్భుజుడు, ఎడమచేత వీణను, కుడిచేత జపమాలను ధరించి, కలువపువ్వును, వరికంకి (కుశలను) ను మరిరెండు హస్తములు దాల్చిఉండును. మూషికములేదు. ఒకే దంతముండును. ఇది ఉచ్ఛిష్ట గణపతియొక్క మూర్తి.

## 14. వీర గణపతి :

ఈయన గణపతియొక్క మహాభయంకర మూర్తులలో ప్రథముడు. అనగా గణపతి విశ్వరూపమును ధరించి బ్రహ్మాండమంతా నిండి దర్శన మిచ్చాడని గణేశ పురాణములో వర్ణించబడి వున్నది. సర్వదేవతా స్వరూపు డుగా, లోకమునకు ఏకైక ప్రభువుగా - సృష్ట్యారంభంలో 'గణేశకల్పం' లో ఈ సృష్టి ఆరంభించింది అని తెలుస్తున్నది.

ఈయన నిలుచుండి వుండును. పదహారు బాహువులు కలిగి వుండును. (షోడశ భుజుడు) ముందుచేతిలో ధనస్సు, అర్ధచంద్ర బాణము (శిలీముఖము) ధరించి నాగపట్టముతో - (అనగా లంబోదరముచుట్టూ చుట్టబడిన పెద్ద సర్పముతో) నిలుచుండియున్న భీకరమూర్తి! చక్రము, త్రిశూలము, భేతాళము (శవము లేక పిశాచము), ఖడ్గము, పరశువూ, గద, పాశమూ, సర్పమూచేత ధరించి ఎముకలూ ధ్వజము ధరించి, ఏకముఖుడై నిలిచిన భయంకరమూర్తి వీరగణపతి.



వీరగణపతి

ఈయన ధ్యానశ్లోకము :

"భేతాళ శక్తి శరఖార్ముఖ చక్రఖడ్గ
ఖట్వాంగ ముద్గర గదాంకుశ నాగపాశాన్
శూలాంచ కుంత పరశు ధ్వజ ముదహ్వంతం
వీరం గణేశమరుణం సతతం స్మరామి"

## 15. విజయ గణపతి :



విజయగణపతి

ధ్యానశ్లోకము :

> పాశాంకుశ స్వదంతామ్ర ఫలనాఖువాహనః
> విఘ్నం నిహంతునస్సర్వం రక్తవర్ణో వినాయకః

సర్వ కార్యములయందూ విజయమును కోరినవారు సర్వత్రా విజయమునకై ఈ విజయగణపతిని పూజించవలెను.

ముఖ్యముగా దేవీనవరాత్రులలో విజయదశమితో పూర్తయ్యే శరన్నవరాత్రుల్లో ఈ విజయ గణపతి ఎర్రని శరీరకాంతిని కలిగి నాల్గు బాహువులతో, మూషికము వాహనముతో నుండును. కుడిచేత ఏక దంతమునూ అంకుశమునూ ధరించి, ఎడమవైపు రెండుచేతులయందూ

మామిడిపండు, పాశములను ధరించియుండును. ఇట్టి కుంకుమ వర్ణముతో ప్రకాశించు విజయగణపతి ఈక్రింది విధముగా ధ్యానించిన సర్వత్ర విజయము ప్రసాదించగలడు.

## 16. సిద్ధ గణపతి :



సిద్ధ గణపతి

ఈయన చతుర్భుజుడు కుడిఎడమల సిద్ధి బుద్ధి దేవతలు విడి విడిగా కూర్చుని యుండును. ఈయన లేతపసుపురంగు శరీరకాంతితో పరశువును, చెరకుగడను, పూలగుత్తిని, నువ్వులతో చేసిన కుడుమును ధరించి వుండును.

శ్రీదేవి, సద్బుద్ధిదేవి, అను సిద్ధి బుద్ధి దేవతలు యిరుప్రక్కల యందు ఉందురు. బంగారు పసిమివర్ణముతో ప్రకాశించు సిద్ధగణపతి మూర్తిని ధ్యానించు శ్లోకము :

"పక్వచూత ఫలపుష్ప మంజరీచేక్షుదండ తిలమోదకైస్సహ
ఉద్వహన్ పరశుమస్తుతే నమః శ్రీ సమృద్ధియత హేమపింగళో"

ఇవి, పదహారుగణపతుల మూర్తివివరాలు! ఇక గణేశ ఉపాసన గురించి తెలుపుతాను.

## శ్రీమహాగణపతి - ఉపాసనా రహస్యాలు

గణపతి వివిధ రూపాలు పరతత్త్వాన్ని ఉపాసించే సాధకులకు వేరువేరు ప్రయోజనాలను సిద్ధింపజేయడానికి ఈవిధంగా నానా రూపములతో 'మంత్రశాస్త్రం'లో గణపతి మనకి సాక్షాత్కరిస్తాడు! అనగా 'విద్యా ప్రదాత' (విద్యాగణపతి)గానూ, 'లక్ష్మీప్రదాత' (లక్ష్మీగణపతి) గానూ, 'శక్తి' స్వరూపుని (హేరంబగణపతి) గానూ, 'బ్రహ్మజ్ఞాన ప్రదాత' (బ్రహ్మ గణపతి) గానూ, 'శతృప్రయోగాది సంహారకుడు' (హరిద్రా గణపతి) గానూ, పరతత్త్వముగానూ (గణపత్యుపనిషత్తు) ఇలా సర్వదేవతలయొక్క ఉపాసనలోని ఫలము ఒక్క గణపతి ఉపాసనలోనే లభించగలదని వేదఋషులు దీనిద్వారా మనకు అందించే సూచన!

## గణపతి – విచిత్రమైన ఆకారం :

ఇకపోతే తరచు ప్రతివారూ ప్రశ్నించే అంశము = "గణపతియొక్క రూపము అంత వికారముగా ఎందుకు వర్ణించబడినది? ఇతర మతస్థులు హిందూ దేవతలను చూసినవ్వరా? ఈ కుండవంటి బొజ్జఏమిటి? 'వక్రతుండం' - వంకరగావున్న తొండం ఎందుకు? నుదుట ఈ అర్ధ చంద్రుడేమిటి? పూర్ణచంద్రుడు వుండరాదా? నుదుట నడిమధ్య ఆ 'ఫాలనేత్రం' ఎందుకు? పైగా సర్వ విద్యాప్రదాతకూ, జ్ఞానప్రదాతకూ ఇన్ని వికారములు కలిగిన ఈ రూపమేమిటి? అందమైన సుందరరూపం ఏదైనా కల్పించరాదా?" అని సాంప్రదాయ పద్ధతిలో హిందూమతాన్ని

గురుముఖతః ఉపాసనగా నేర్చే అదృష్టంలేని, కలగని - ఈనాటి ఇంగ్లీషు చదువులతో తయారయ్యే "విదేశీ - హిందూవుల"కు కలిగే సందేహం!

దీనికి మంత్రశాస్త్రం గూఢార్థం విప్పి అర్థంచేసుకునే, సైన్సువంటి పారిభాషిక జ్ఞానంవుండాలి! అప్పుడే వేదము దేవతల రూపాలకూ, వారి ఆయుధములకూ, ముఖములు, చేతులూ అలా ఎందుకు కల్పించిందో అర్థమౌతుంది! ఎలాగైతే 'కెమిస్ట్రీ' (Chemistry) లో ప్రాణవాయువు $O_2$ బొగ్గుపులుసు గాలికి $CO_2$ సంకేతములు (Symbols, Equations) లో వున్నట్టే "వేదంలోని - సైన్సు" "యోగశాస్త్రం" - దీనియొక్క సాంకేతిక గూఢార్థము (Symbolic meaning) కూడా గురుశుశ్రూష లేనిదే అర్థంకాదు! - ఇంతకీ గణపతి రూపానికి వెనుక దాగివున్న - గూఢార్థ మేమిటీ అని తెలుసుకుందాం!

గణపతి మనలాగ 'స్థూలశరీరం' అంటే భోజనంతో ఏర్పడే పదార్థ మయ శరీరంగల రూపం కలవాడని భావించరాదు. దీనివలననే ఈ గల్లంతు ఏర్పడుతోంది. దేవతలు "శబ్దమయ-శరీరులు" - అని, వేదము - అంటే దేవతలయొక్క "ఆకారం" (Shape) శబ్దతరంగాలు (Sound Vibrations) లేక అనబడే బీజాక్షరములే అని గ్రహించాలి!

ఒక్కొక్క 'అక్షర'మునకు ఒక్కొక్క "స్పందన" "వైబ్రేషన్" వున్నట్టు ఈనాటి "ఫిజిక్స్" వల్లకూడా రూఢి అవుతున్నది. శబ్దతరంగ స్పందన మారితే కాంతియొక్క రంగులు కూడా మారుతాయిగదా! అందుకే "వర్ణము" అనగా సంస్కృతములో "అక్షరము" అని "రంగు" అని రెండర్థాలు - ఒకే మాటకు వున్నాయి! ఇలా 32 శబ్దములకు 32

"దేవతలు" - అంటే స్పందనలు "వర్ణములూ" చెప్పబడినాయి!

ఒక్కొక్క "శబ్దము" జపిస్తే మనస్సులో ఒక్కొక్క "ఫలితము" జ్ఞానమూ, శాంతీ, "వాక్శుద్ధీ" ఇత్యాది "సిద్ది"! మెదడులో అనేక సిద్ధులు కలిగించగలవు! ఇలాటి 'అక్షర' స్వరూపములకు "ఛందస్సులు" 'గణములు' అనిపేరు! పద్యములలో "గణవిభజన" ఈ శబ్దముల వలననే ఏర్పడుతున్నది! ఈ 'ఛందోగణము'లకు అధిపతియే గణపతి! అంటే శబ్దతరంగములకు ప్రధానమైన 'స్పందన' ప్రణవం, లేక 'ఓం'కారము ఈ గణపతియొక్క - 'శబ్ద స్వరూపము' అని అర్థం!

సంస్కృతములో "ఓం" అనే అక్షరం "ॐ" అని రాయబడుతుందిగదా! దీనిలో గుండ్రంగావుండే కిందిభాగము 'పొట్ట'వలే, "లంబోదరము" అన్నారు మునులు! ఇక కుడివేపుకు తిరిగివుండే 'కొమ్ము'! అదే ఓంకారము. దానిపైన అర్థసున్నా చంద్రవంకవలే సగముసున్నా C-అరసున్నా శబ్దమును పలికే అర్ధానుస్వర చివరకు కేవలము సున్నా = '0' అని, ఉచ్చారణలో "బిందువు" ఇది 'ఫాల నేత్రము' (నుదుట చుక్కవంటిది) దానిపైన 'అర్థమాత్ర'మే 'ఏకదంతం' ఇవన్నీ కలిపి రేఖాచిత్రంగా ప్రణవస్వరూపాన్ని ॐ ప్రణవస్వరూపాన్ని గణపతియొక్క మూర్తిగా వర్ణించారు! కనుక 'లంబోదరము', 'వక్ర తుండమూ', 'అర్థచంద్రుడూ', 'ఫాలనేత్రము' - ఇవిఅన్నీ కలిపి రాసి ఉచ్ఛరించితే ॐ అనే 'ప్రణవ' శబ్దం పుట్టును! కాబట్టి "గణపతి - ప్రణవ స్వరూపుడు"!

ప్రతీమంత్రానికీ మొదట, ఓంకారం రానిదే ఇతర బీజాక్షరములను పలకరాదు! కాబట్టి - "గణపతి ప్రథమారాధ్యుడు!" అన్నారు!!

'ప్రణవం' ఒక్కటే జపించితే మనస్సుకు ఏకాగ్రత కలుగును! ఇలాగ 'ఏకమైన'వాడు గనుక 'ఏకాకి'యైన 'బ్రహ్మచారి' (నిత్య బ్రహ్మచారి) బ్రహ్మవిద్యలకు మూలము కాబట్టి 'విద్యలకెల్ల - నౌజ్ఞ!'

అక్షరం రూపమగు దేవతలంటే అర్థం - 'బీజాక్షరము'లు! 33-మూలమైన 'వర్ణము'లు! వాటన్నిటికీ ప్రథమము ఉచ్ఛరించే 'ప్రణవ' స్వరూపుడే ఈ గణపతి! ఈ ఓంకారమును జపించటంవల్ల 'బుద్ధి' ప్రకాశము కలిగి మానవుడు 'బుద్ధుడు'గానూ, యోగసిద్ధి గలవాడుగానూ ప్రకాశించును! కాబట్టి 'సిద్ధి' - 'బుద్ధి', ఈరెండునూ గణపతికి భార్యలు (విడిచిపెట్టకుండా వుండే 'శక్తులు') - అయినప్పటికీ ఆయన "నిత్య బ్రహ్మచారి!" ఇలాగ పైకి, పరస్పర విరుద్ధంగా కనిపించే ఆధ్యాత్మిక రహస్యములతో కలిపి వర్ణించబడిన 'మంత్రమూర్తే' గణపతి! ఇది తెలిసిన వారికి, సూక్ష్మబుద్ధి కలిగినవారికి గణపతి ఆకారంలోని అంతరార్థం బోధపడుతుంది.

## గణేశ-పురాణం :-

ఈ గణపతి ఉపాసనను విస్తారంగా వర్ణించే ఏకైక పురాణం 'గణేశ పురాణం!'

వేదవ్యాసమహర్షి 18-'మహాపురాణములు' రచించిన తరువాత తిరిగి 18-'ఉప పురాణములు' వ్రాసి వాటిలో "గణేశ పురాణము" మానవజాతికి అనుగ్రహించారు. ఈ గణేశపురాణం గొప్ప ప్రాశస్త్యముగల రహస్య పురాణం! ఇందులో గణపతియొక్క అవతారములు వేరువేరు యుగాల్లో వేరువేరు రాక్షసులను సంహరించడానికి ఎత్తిన గణేశుని

వివిధ అవతారగాథలూ, ఎంతో మనోహరంగా వర్ణించబడినాయి! అలానే బ్రహ్మచేత వ్యాసమహర్షికి గణేశుని నామములయొక్క వివరణము వర్ణించబడినది! ఇంతేకాక 'ఏకాక్షర గణపతి-మంత్రము', "షడక్షర గణపతి-మంత్రము" గణపతి నవాక్షరీ మంత్రము, గణపతి మూల మంత్రము గణపత్యుపనిషత్తు, మహిమగల అనేక గణేశ స్తోత్రములు - అష్టోత్తర, శత, సహస్రనామ స్తోత్రములు అన్నీ వర్ణించబడి వున్నాయి!

ఇంకనూ రహస్యములు కొన్ని ఈ గణేశపురాణములో లభించ గలవు. "గణేశ చతుర్థి" నాడు కనుక మంగళవారం కలిసివస్తే అది విశిష్ఠమైనది! సర్వ సంకటములను, చెడుకర్మలను, ఋణములను, శత్రుబాధలు నివారించి నిస్సంతానులకు సంతానరాహిత్యము శాశ్వతంగా నివారించగల మహిమకలది! కనుక దీనికి 'సంకష్టహర-చతుర్థి వ్రతము' అని గణేశపురాణంలో వర్ణించబడినది!

గత యుగములలో ఎవరెవరు శ్రీగణపతిని ఉపాసించి విశిష్టమైన మహిమలను ఏవిధంగా పొందారో కూడా "గణేశపురాణం" కథాభాగము లో వర్ణించబడినది! ఇట్టివారిలో (1) కార్తవీర్యుడు (2) కుమారస్వామి (3) పరశురాముడు (4) మన్మధుడు! మన్మధునికి గణేశానుగ్రహము (5) ఆదిశేషుని ఉపాఖ్యానము (6) శివుడు కుమారస్వామికి ఉపదే శించిన 'వరగణపతి' - మహిమ, ఆయనను పూజించి కుమారస్వామి తారకాసురవధచేసిన వృత్తాంతం విశేషంగా వర్ణించారు! ఇంతేకాక కశ్యపునిగాథ, చంద్రునికి శాపనివృత్తి, జనకమహారాజు వృత్తాంతము, విశేషించి - 'ప్రవాళ' - గణపతియొక్క మహిమా, ఇంకా అనేక గణపతి - సిద్ధక్షేత్రములయొక్క వర్ణన ఈ గణేశపురాణములో మనకి లభిస్తాయి!

## గణేశపురాణోక్త విషయాలు :

## సంగ్రహంగా గణేశపురాణంలోని విషయాలు :

1. కృతవీర్యుని కథ
2. అంగారక చతుర్థి మహిమ (సంకష్టహర చతుర్థి)
3. చంద్రశాపము
4. దూర్వామహత్యము
5. జనకవృత్తాంతము
6. ప్రవాళ గణపతి – కార్తవీర్య జననం
7. కుమారస్వామి
8. పరశురాముడు
9. మన్మధుడు
10. తారకాసుర వధ
11. వరగణపతి కథ – శివుడు కుమారస్వామికి వరదానం
12. మన్మధునికి – గణేశ ప్రత్యేకం
13. శేషోపాఖ్యానం
14. బ్రహ్మ వ్యాసునికి గణేశుడి నామవివరాలు
15. కశ్యపుని గాథ
16. ఏకాక్షర గణపతి మంత్రం
17. షడక్షరీ గణేశ మంత్రవిధానం

ఇంకా ఎన్నో విశేషాలు 'విషయసూచిక' చూస్తేనే తెలుస్తాయి!

గణపతి పురాణ పారాయణకు గణపతి మంత్రవిధానము తెలియాలి! అది ఇస్తున్నాను.

## గణేశ మంత్రములు :

"అస్యశ్రీ మహాగణపతి మహామంత్రస్య గణకఋషిః విచ్ఛృద్గాయత్రీ ఛందః । శ్రీమహాగణపతిర్దేవతా! 'గం'-బీజం, 'హ్రీం' శక్తిః మహా గణపత్యనుగ్రహ సిద్ధ్యర్థే, మమ - సర్వ సంకల్పసిద్ధ్యర్థే జపే వినియోగః।

## న్యాసం :

### అంగన్యాసం :

'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – హృదయాయనమః
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – శిరసేస్వాహా
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – శిఖాయేవషట్
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – కవచాయ హుం
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – నేత్రత్రయాయవౌషట్
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – అస్త్రాయఫట్ (శిరసేస్వాహ)

### కరన్యాసం :

'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – అంగుష్ఠాభ్యాంనమః
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – తర్జనీభ్యాంనమః
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – మధ్యమాభ్యాంనమః
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – అనామికాభ్యాంనమః
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – కనిష్ఠికాభ్యాంనమః
'ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గాం' – కరతలకరపృష్ఠాభ్యాంనమః

## మంత్రశాస్త్రంలో గణపతి :

ఈ పంచాయతన పూజలోనేగాక ప్రతి శుభకార్యములకూ గణేశుడే ప్రథమారాధ్యుడు! హిందూమతంలో హిందూమతంలో మంత్రశాస్త్రం మహాసముద్రం వంటిది 36,000 మహామంత్రములలో అనేక బీజాక్షరములు, యంత్రము మంత్రదేవతామూర్తులు కలిగివున్న ఈ మంత్రోపాసనవిద్యకు గణపతి బీజాక్షరము. సర్వ విఘ్నహరము, సర్వ విద్యా ప్రదము అయిన 'గ'కారము ప్రాణబీజము. 'గ్లం, గ్లౌం, గ్లః' అనునవి గణపతి బీజ వికల్పములు.

## శ్రీమహా గణపతి-యంత్రము :



మూలాధారమునకు త్రిభుజము యంత్రరూపం! మూడు అంచులు కలిగిన ఈ త్రికోణము శరీరములోని త్రిశక్తులకూ సంపుటి! బ్రహ్మశక్తి, విష్ణుశక్తి, రుద్రశక్తులకు ఈ మూలాధారస్థితి త్రిభుజ రూపమైన 'మూల కందమే' గణపతియొక్క ఆధారపీఠం.

మన ప్రాణశ్వాసయొక్క ఉద్భవముకూడా స్వరంరూపంలో మూలాధారమునుండి బయలువెడలి వాక్కురూపములో ఆరంభించేది, ఈ మూలాధారంనుంచే కాబట్టి యోగసాధనకు మంత్రోపాసనకు మూలమైన గణపతికి ఆధారస్థానం ఇదే!

అ-కార, ఉ-కార, మ-కారముల మూడు అక్షరముల సంపుటియైన ఓంకారమే గణపతియొక్క ప్రణవాకారము. కాబట్టియే గణపతి శబ్దబ్రహ్మ స్వరూపము, వాక్కులకు అధిపతి, చందో గణములకు అధిష్టానము! సర్వమంత్రములకు బీజభూతుడు! కుండలినీ ద్వారమున కావలివుండే ఉద్భోధనా విఘ్నహరుడు, విఘ్నకరుడూ. అయోగ్యులకు బ్రహ్మ విద్య ద్వారములు తెరవకుండా ఇతడు విఘ్నములను కలిగించుటచేత రావణునికి ఆత్మలింగమును సిద్ధించకుండా, గజాసురునకు శివలింగసిద్ధి శాశ్వతముకాకుండా జగత్తును రక్షించినవాడీ గణపతియే.

## గణపతి యంత్రమును లిఖించే విధానం :

ముందుగా 'త్రికోణము' దాని మధ్యలో ప్రణవం. 'గం' సాధ్య మంత్రము, 'షట్ కోణము' పైన లిఖించి దానిచుట్టూ - "శ్రీం హ్రీం క్లీం గ్లౌం" - అను బీజాక్షరములు సవ్యప్రదక్షిణంగా వ్రాయాలి! ఆతరువాత షట్కోణములయందూ ఆరు బీజాక్షరములు - అంటే 'ఓం శ్రీం హ్రీం

క్లీం గ్లౌం గం' - వ్రాయాలి! యంత్ర అంతరాళములలో అంగషట్కము రాసి, అష్ట దళములయందు (బయట అష్టదళపద్మములో) మంత్రము లోని 8-పదములు వ్రాయాలి! దానిబయట మూడు వృత్తములు వ్రాసి "మాతృకా వర్ణము"లు వ్రాసి - 'పాశ' 'అంకుశ'ములచేత దాన్ని చుట్టి, దానిబయట రెండు "భూపురమొలు" రాసి, కోణములలో - "అం హ్రీం", అనే బీజాక్షరములు ఎనిమిది దిక్కులయందూ రాయాలి!

ఈ విధముగా తామ్రం (రాగి) రేకుపైగాని, పంచలోహముగాని, సువర్ణంపై గాని 'మహాగణపతియంత్రము'ను లిఖించి తరువాత ఈక్రింది న్యాస విధి ప్రకారము చేయాలి.

షడధ్వర న్యాసము ముందుచేసి అది (1) వాచ్య (2) వాచక విధములతో చేయాలి! వాచ్యవిధానంతో "కళాన్యాసము" ఈక్రింది విధంగా చేయాలి!

కళాన్యాసము :

హౌం నమః పరాయ - శాంత్యతీత కళాత్మనే నమః
హైం నమః పరాయ - శాంతి కళాత్మనే నమః
హ్రూం నమః పరాయ - విద్యా కళాత్మనే నమః
హ్రీం నమః పరాయ - ప్రతిష్ఠా కళాత్మనే నమః
హ్వాం నమః పరాయ - నివృత్తి కళాత్మనే నమః

— అని, పైవిధంగా పంచకళామంత్రములను (1) శిరస్సు (2) భ్రూమధ్యం (3) హృదయం (4) గుహ్యము (5) పాదములయందు న్యాసంచేసి 'మూలమంత్రము' చేత "వ్యాపకము" చేయాలి! ఆపైన "తత్త్వమూలన్యాసం" - ఈక్రింది విధముగా చెయ్యాలి!

## పంచతత్త్వన్యాసః :

మం నమః పరాయ - జీవాత్మనే నమః

భం నమః పరాయ - ప్రాణాత్మనే నమః

బం నమః పరాయ - బుద్ధ్యాత్మనే నమః

ఫం నమః పరాయ - అహంకారాత్మనే నమః

పం నమః పరాయ - మన ఆత్మనే నమః

- అని పై మంత్రములతో రెండిటియందు శిరస్సున 'వ్యాపకము' హృదయమునందు 'న్యాసము' చేయాలి! ఆపైన

నం నమః పరాయ - శబ్దతన్మాత్రాత్మనే నమః

ధం నమః పరాయ - స్పర్శతన్మాత్రాత్మనే నమః

దం నమః పరాయ - రూపతన్మాత్రాత్మనే నమః

థం నమః పరాయ - రసతన్మాత్రాత్మనే నమః

తం నమః పరాయ - గంధతన్మాత్రాత్మనే నమః

- అని శిరస్సు, భ్రూమధ్యము, హృదయము, గుహ్యాము, పాదములయందు న్యాసము చేయాలి! ఆపైన 5-ఇంద్రియముల న్యాసము ఈక్రింది విధంగా చేయాలి!

## పంచేంద్రియ - న్యాసవిధి :-

ణం నమః పరాయ - శ్రోత్రాత్మనే నమః

ఢం నమః పరాయ - త్వగాత్మనే నమః

డం నమః పరాయ - చక్షురాత్మనే నమః

ఠం నమః పరాయ - జిహ్వాత్మనే నమః

టం నమః పరాయ - ఘ్రాణాత్మనే నమః

- అనిచెప్పి శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణేంద్రియముల యందు న్యాసం చెప్పాలి! ఇది జ్ఞానేంద్రియన్యాసము! కర్మేంద్రియముల న్యాసం ఈక్రిందివిధంగా చేయాలి!

జం నమః పరాయ - వాగాత్మనే నమః

ఝం నమః పరాయ - ప్రాణాత్మనే నమః

జ నమః పరాయ - పాదాత్మనే నమః

ఛం నమః పరాయ - పాయ్యువాత్మనే నమః

చం నమః పరాయ - ఉపస్థాత్మనే నమః

- అని ఐదు కర్మేంద్రియములైన వాక్, పాణి, పాద, పాయ్యు, ఉపస్థేంద్రియములయందు న్యాసము చెయ్యాలి! ఆపైన పంచభూత ముల న్యాసము ఈక్రిందివిధంగా చెయ్యాలి!

## పంచభూత న్యాసవిధానం :-

'ఙం' నమః పరాయ - ఆకాశాత్మనే నమః

'ఘం' నమః పరాయ - వాయ్యువాత్మనే నమః

'గం' నమః పరాయ - తేజోఆత్మనే నమః

'ఖం' నమః పరాయ - జలాత్మనే నమః

'కం' నమః పరాయ - పృధ్వ్యాత్మనే నమః

- అని శిరస్సు, ముఖము, హృదయము, గుహ్యము పాదముల యందు న్యాసం చెప్పాలి!

శం నమః పరాయ - హృత్పుండరీకఆత్సనే నమః

షం నమః పరాయ - సూర్యమండలాయ ద్వాదశకళాత్మనే నమః

సం నమః పరాయ - సోమమండలాయ షోడశ కళాత్మనే

రం నమః పరాయ - వహ్నిమండలాయ దశకళాత్మనే నమః

- అనిచెప్పి పై నాలుగింటిచేత హృదయంలో న్యాసం చెప్పాలి!

'గేం' నమః పరాయ - శాంతతీతాత్మనే నమః

'గౌం' నమః పరాయ - శాంత్యాత్మనే నమః

'గుం' నమః పరాయ - విద్యాత్మనే నమః

'గిం' నమః పరాయ - ప్రతిష్టాత్మనే నమః

'గం' నమః పరాయ - నివృత్త్యాత్మనే నమః

- అనిచెప్పి శిరో, ముఖ, హృదయ, గుహ్య పాదములయందు - "మూలమంత్ర" న్యాసం చెయ్యాలి (వ్యాపకం)! ఆపైన భువనత్రయ న్యాసం ఇలా చేయాలి.

## భువనత్రయ - న్యాసం :-

'గాం' - భూలోకాయ నమః

'గీం' - భువర్లోకాయ నమః

'గూం' - సువర్ణోకాయ నమః

- అనిచెప్పి (i) పాదాది నాభ్యంతం (ii) నాభ్యాది కంఠం వరకూ (iii) కంఠంనుండి శిరస్సువరకూ మూలమంత్రం 'వ్యాపకం' చెయ్యాలి! ఆతరువాత "వర్ణన్యాసము" ఈక్రిందివిధంగా చేయాలి!!

## వర్ణ న్యాసము! :-

మహాగణపతి "మూలమంత్రము", పైన చెప్పినదానితో 'మాతృకా వర్ణములను' ప్రత్యేకముగా సంపుటిచేసి మాతృకాన్యాస స్థలములయందు 'న్యాసము' - చెయ్యాలి! దాని విధానము! బిందుసహితముగా ఆది





లోనూ, అంతములోనూ మహాగణపతి మంత్రం ఉచ్ఛరించి "నమః" - అనిచెప్పి న్యాసంచెయ్యాలి! అదేవిధంగా "క్రాం' అనే బీజాక్షరం అంతములో చెప్పి మూలమంత్రముతో "వ్యాపకం" చెయ్యాలి! ఆ తరువాత "పదన్యాసం" చెప్పాలి!

**పదన్యాసం! :-**

ఓం, తత్పురుషాయ నమః
విద్మహేనమః
వక్రతుండాయ నమః
ధీమహే నమః
తన్ నమః
నో నమః
దంతి నమః
ప్రచోదయాత్ నమః

- అని చెప్పి

"తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నోదంతిః ప్రచోదయాత్" - అని, ఫాలమునందు, ముఖ, కంఠ, నాభి, ఊరు (తొడలు), జాను (మోకాళ్ళు), పాదములయందూ న్యాసముచెప్పి 'మూల మంత్రము'తో "వ్యాపకం - చెయ్యాలి!"

ఈవిధంగా షడధ్వన్యాసముతో సూక్ష్మశరీరం కల్పనార్థము చెప్పి తిరిగి స్థూలశరీర కల్పనార్థము '15-విఘ్న (విఘ్నేశ) మూలన్యాసము' చెయ్యాలి! ఇది "శ్రీవిద్యావిధానములోని" లఘు షోఢాన్యాస ప్రకారము ఈ 15 విఘ్నముల నాశనములకై న్యాసం చెప్పబడిన విధానములో చేయాలి! (ఇది నా "చండీసప్తశతి - గ్రంధ పీఠికలో యిచ్చినవిధంగా

చెయ్యాలి!)

పై విధముగా ముందుగా ప్రాణాయామముచేసి, గురుప్రార్ధన గాయత్రీజపం ఆ తర్వాత "గణపతి - మహామంత్ర జపవిధానము" ప్రకారము మంత్రన్యాసం చెయ్యాలి! పైన చెప్పిన పద్ధతిలో భాద్రపద శుద్ధ చతుర్థి (వినాయక చవితి) మొదలుకొని 48-రోజులు "దీక్ష"గా ప్రతిదినము 5000 - మహాగణపతి మంత్రపురశ్చరణ 'దూర్వాంకురము' లతో గణపత్యుపనిషత్తు పాఠముచెప్పి స్థండీలముపై కలశస్థాపనచేసి ఆవునేతితో అఖండ దీపారాధన సహితంగా 'గణపత్యోష్టోత్తరము' పుష్పాంజలి"ని చెప్పి పచ్చపెసలూ, బెల్లము, ఆవునెయ్యి, సుగంధ వస్తువులతో చేసిన మధుర ప్రాసాద నైవేద్యము నివేదించి, మంత్ర-పుష్పాంజలినిచ్చి మంత్రపుష్పంచేసి నీరాజనం ఇవ్వాలి!

దీక్షాంతమున జపములో దశభాగము హోమము, అందులో దశ భాగము తర్పణము అందులో దశభాగము సంఖ్యతో, బ్రాహ్మణ భోజనము పెట్టి సదక్షిణ తాంబూలకముగా బ్రాహ్మణాశీస్సులను పొంది తాను భుజించి 'ఉద్వాసన'-చెప్పి ఆపైన యధాశక్తి సహస్రమునకు తక్కువ లేకుండా 'మూలమంత్రం' జపిస్తూ గణేశపురాణ పారాయణ చేసినవారికి నిశ్చయముగా శ్రీ మహాగణపతి సాక్షాత్కారం కలుగును! సర్వ విఘ్నములూ తొలగి, తన అభీష్టములు అన్నీ సిద్ధించును! తన 'తన చెడుకర్మ'లు నశించి గణపత్యనుగ్రహం తప్పక పొందును!

## నియమములు :

దీక్షాకాలములో పూర్ణబ్రహ్మచర్యము దర్భాసనము లేక చాపపై శయనము ఏకభుక్తము ఉభయసంధ్యలయందు గణపత్యుపాసన, గణేశ

పురాణ పారాయణతో అతిథిభోజనము చేయాలి! తామస వస్తువులైన ఉల్లిపాయ, వెల్లుల్లి మసాలా ఇత్యాది వస్తువులను స్పర్శ, వాసన, భక్షణ లేకుండానూ, ఊరువిడిచి ప్రయాణము లేకుండానూ, దుఃఖము వాదోపవాదము, కలహము, అతిసంతోషము, బంధువుల సాన్నిహిత్యము విడిచి, నియమనిష్ఠుడై ఉండాలి!

దీక్షాకాలంలో ఎవరి చేతినుండీ దేనిని - పరిగ్రహించరాదు (తీసుకోరాదు)! తనచేతితో ఇవ్వరాదు! తీర్థ ప్రసాదములు, వితంతువు లకు తనచేతితో ఇవ్వరాదు! వితంతువుల వడ్డనతో భుజించరాదు! ఈ శిష్టాచార నియమములు పాటించాలి! మలినులతో (మైలలో వున్నవారు) అశుచియైనవారితో సాంగత్యము చేయరాదు! అశ్లీలము పలుకరాదు, వినరాదు! పరుషవాక్యములు పలుకరాదు, వినరాదు! నిత్యము శాంతుడై భగవధ్యానమున మనస్సు నిలపాలి! ఇవి "గణేశపురాణ-ఉపాసనా" సిద్ధికై చేయవలసిన నియమ - విధానములు!

ఇవేగాక, కథాభాగములో ఆసక్తికరమైన విషయములెన్నో "కుమార స్వామి చరిత్ర", 'కార్తికేయ చరిత్ర', మన్మధునికి గణేశుడు సాక్షాత్కరించిన గాథ, కశ్యప చరిత్ర, ఆశ్రయ కౌండిన్యముని-వృత్తాంతము చంద్రుని శాపము, చంద్రశాపానుగ్రహము, కృత వీర్యుని పూర్వచరిత్ర వంటివీ, అనలాసుర చరిత్రవంటి మనోహర గాధలు ఎన్నో ఈ ఉపాసనా ఖండము లో కనబడును.

ఆదిశేషునిగాధ, గణేశనామ మహిమను వ్యాసమహర్షికి బ్రహ్మ దేవుడు ఉపదేశించుట, వరగణపతి పూజావిధానము, ప్రవాళ గణపతి సాక్షాత్కారము ముఖ్యమైన ఘట్టములు, ఎన్నో ఉపాసకులకు చాలా

ఉపయోగించే రహస్యములతో నిండి యున్నవి!

ఇందులోని కథాభాగముతోపాటు సంభాషణా వశమున, ఇంకా అనేక ఉపాసనా రహస్యములుకూడా — ఏకాక్షర గణపతి మంత్రము, షడక్షరీ మంత్రము, గణేశస్తోత్రము, ఇంద్రుడూ, బ్రహ్మ మొదలగు దేవతలు గణేశునికి చేసిన స్తోత్రములూ వంటివి నిత్యము పారాయణలో ఉపయోగించే శక్తివంతమైనవి ఎన్నోకలవు.

గణేశ మంత్రమును సద్గురువువద్ద ఉపదేశముగా తీసు కొని, అంగన్యాస, కరన్యాసములతోనహా ధ్యానమూర్తిని జప, హోమ, తర్పణచేయు విధానములు తెలుసుకుని ఉపాసనచేస్తూ అప్పుడు — ఈ గణేశపురాణం పారాయణంగా చదివినవారికి — సకల దుష్టగ్రహ దోషములు పోవుటయేగాక గత చెడుకర్మ వల్ల ఏర్పడే కష్టములు ఎన్నో నివారణ అయి సంపదలు, మోక్షము ప్రసాదించునని వేదవ్యాస మహర్షి తన పురాణములలో "గణేశపురాణము"ను అతి విశిష్టమైనదానిగా మలచి గణపతియొక్క మహిమలను ఆయన వివిధ రూపాలలో అవతరించిన అవతారములను గణపతియొక్క అనేక మంత్ర, సంపుటి, బీజాక్షర, సహిత, నానావిధ గణపత్యుపాసనా విధులను మనయొక్క హితమునకై జగత్తుకు అందించినాడు!

కాని ఇప్పటిదాకా తెలుగు భాషలో లభించనిదీ, ఇంతవరకూ, ఎవరూ ప్రచురించనిదీ, అపురూపమైనదీ ఈ "గణపతి పురాణమూ".

అందువలన నేను గతంలోనే అప్పటి శృంగేరీపీఠ పరమాచార్యులు ఆదేశించిన దివ్యాదేశముతో వ్యాసప్రోక్త "గణేశపురాణము"ను తెలుగు

అనువాద సహితంగా సంస్కృత మూలంతోపాటు గోదావరీ పుష్కరం సమయంలో ముద్రించి దాని అద్భుతమైన ప్రచారమునకు ఆశ్చర్యపో వలసి వచ్చినది.

ఎందువల్లనంటే ఎన్నోనెలలూ, సంవత్సరాలూ, ఈ గణేశపురాణం గ్రంథాలు అమ్మడానికి పట్టవచ్చునని భయపడిన మా **యోగమిత్ర మండలి** ప్రచురణకర్తలకే ఆశ్చర్యం గొలిపేవిధంగా కొద్దినెలలలోనే "గణేశ **పురాణం**" కాపీలు అన్నీ ఖర్చుఅయిపోవడమేకాక మావద్ద శాంపిల్‌కాపీ కూడా లేకుండా మందుకు కనిపించకుండా ఖర్చుకావడమే ఇందుకు నిదర్శనం.

ఈ కారణంచేత మళ్ళీ "శ్రీ గణేశ **పురాణము**"ను తిరిగి ముద్రించే అవకాశము శ్రీగణేశానుగ్రహము వలననే కలిగినది.

సకల సన్మంగళానిభవంతు

'గణేశచతుర్థి'<br>హైదరాబాదు<br>13-9-1999

ఇట్లు<br>సం॥ ఇ. వేదవ్యాస



# 57

# భ్రుశుండ్యుపాఖ్యానం

(మూలం)

## సప్త పంచా రింశో అధ్యాయః

శక్ర ఉవాచ :-

హంతతే కథయిష్యామి కథామేతాం పురాతనీం ।
యథాతేనాపి సాదృశ్యం గణనాథస్య భక్తితః ॥ 1

దండకారణ్య దేశేషు నగరేనందురాభిదే ।
ఏకంః కైవర్తకోదుష్టో నామ్నా నామైవ విశ్రుతః ॥ 2

ఆబాల్యా చ్చౌర్యనిరతో యౌవ్వనే జారకర్మకృత్ ।
ప్రత్యక్షం దృష్టివిగమాద్ధరతే చ శపత్యపి ॥ 3

శపధాన్ కురుతేమిథ్యా పరహృద్భేద కారకాన్ ।
తతోనిస్సారితో గ్రామాత్ ద్యూత మద్యరతోయతః ॥ 4

లోకైర్బహిర్దూరతరం గిరికందర కాననే ।
స్థితః కాంతాయుతో మార్గేజఘాన పథికాన్ బహూన్ ॥ 5

ఏవం బహుధనోజాతో నానాలంకరణైః స్త్రియం ।
భూషయామాస ససుతాం తోషయామాంస మాయయా ॥ 7

శస్త్రం ఖడ్గంచ ఖేటంచ పాశాన్ధను రనుత్తమం ।
దండం చోభయతో లోహం వహన్ పూర్ణేమహేషుధీ ॥ 8

వృక్షాగ్రేకోటరేవాపి స్థితో మారయతే బహూన్ ।
నానావిధాని వస్త్రాని వాసాంస్యాభరణాని చ ॥ 9

గృహేసంచయతే నీత్వా విక్రేణాతిపురాంతరే ॥ 10

యథేష్టంభజతేనిత్యం విషయాన్ మందిరేనిజే ।
ఏవం పాపసమాచారో హంత్యరణ్యే పశూనపి ॥ 11

ఏకదాకస్యచిత్ప్రేష్ఠధావితో యోజనావధి ।
సతుతస్మాద్గతోదూరం స్ఖలిత్వాపతితో భువి ॥ 12

తతఉద్ధాయకష్టేనశనైః శనైర్యయౌఖలః ।
అవశ్యత్పథిగచ్ఛన్సతీర్థం గాణేశ్వరం శుభం ॥ 13

అకరోన్మజ్జనం తత్ర శ్రమమేవ వ్యపోహితుం ।
తతోగచ్ఛన్ సవిషయం దదర్శపథిముద్గలం ॥ 14

జపం తం గణనాథస్య మంత్రం నామసమన్వితం ।
ఖడ్గముద్యమ్య నిష్కోశం ముద్గలస్యాంతికం యయౌ ॥ 15

కైవర్తకోనామ నామాహం హంతుంకృత మతిస్తదా ।
జగలుస్తస్య శస్త్రాణి ఖడ్గోపి దృఢముష్టితః ॥ 16

అన్యథాచాభవద్బుద్ధి స్తస్యదుష్టస్య తక్షణాత్ ॥ 17

ద్విరదాననభక్తస్య ముద్గలస్య ప్రభావతః ।
జహాసమునిముఖ్యో సౌదృష్ట్వా తంతు తథావిధం ॥ 18

పప్రచ్ఛసంయతః కస్మాచ్ఛస్త్రాణి గలితానితే ।
బద్ధాన్యపిచ సర్వాణి పతితాని కుతోవద ॥ 19

**కైవర్తక ఉవాచ :-**

గణేశతీర్థస్నానేన మునేరాలోకనేనచ ।
జ్ఞానవైరాగ్య యుక్తోసౌ వ్యబ్రవీ న్ముద్గలం వచః ॥ 20

అశ్చర్యం పరమం మన్యేకుండస్నానే నమేమతిః ।
విపరీతా భవద్బ్రహ్మ న్విశేషాద్దర్శనేనతే ॥ 21

బాల్యాత్ప్రభృతి యేదుష్టాబుద్ధిం పాపరతాభవత్ ।
అసంఖ్యాతీనిపాపాని కృతాన్యద్యావధిప్రభో ॥ 22

ఇదానీమేవ నిర్విణ్ణామతిర్మేత్వ త్ప్రసాదతః । 23

నాదాస్యేపునరేతాని శస్త్రాణిపతితానిమేః
కురుమేనుగ్రహంపూర్ణం ఉద్ధరస్వభవార్ణవాత్ । 24

సాధవేహ్యను గృహ్ణంతి దీనాన్ దుష్కృతినో పిచ ॥ 25

నసాధు సంగమః క్వాపి వృథాదృష్టో మహామునే ।
యథాశేవధి సంపర్కోనధాతుషు వృథాభవేత్ ॥ 26

**శక్ర ఉవాచ :-**

ఏవముక్తో ముద్గలోసౌతం జగాద కృపాన్వితః ।
శరణాగత సంత్యాగేస్మరన్ దోషం విశేషతః ॥ 27

**ముద్గల ఉవాచ :-**

విధిప్రయుక్తేదానాదౌ నాధికారో స్తికుత్రచిత్ ।
తథాపితే నామజపం కథయామిప్రసాదత ః ॥ 28

గజాననస్య పరమం సర్వసిద్ధికరం న్నృణాం ।
తతః ప్రణామ మకరో త్త్రైవర్తో ముద్గలంమునిం ॥ 29

సకరం స్థాపయామాస తస్య మూర్ధ్న్యభయంకరం ।
గణేశాయనమ ఇతినామ మంత్రముపాదిశత్ ॥ 30

స్వయష్టింరోపయామాస పురస్తస్య ధరాతలే ।
ఉవాచచైనం సంప్రీత్యా యాపదాగమనం మమ ॥ 31

తావజ్జపస్వనామేదం యావద్యష్టిశ్చసాంకురా ।
ఏకాసనగతో వాయుభక్ష ఏకాగ్రమానసః ॥ 32

సాయం ప్రాతర్జలందేహి యష్టిమూలే నిరంతరం । 33

శక్ర ఉవాచ :-

ఉపదిష్టో ముద్గలేన నామాకైవర్తక స్తదా ॥ 34

నిరాశోజీవితే తస్థౌ తస్మిన్నంతర్హితే మునౌ ॥ 35

ఏకాసనగతోరణ్యే జజాపనామ మంత్రకం ।
పురోధాయమునే ర్యష్టిం వృక్షచ్ఛాయా సమాశ్రితః ॥ 36

నిరాహారో నిరీహశ్చ జితేంద్రియగణోవశీ ।
ఏవం సహస్రవర్షాంతే సాయష్టిః సాంకురా భవత్ ॥ 37

తతః ప్రతీక్షా మకరో న్మునేరాగమనం ప్రతి । 38

వల్మీకవేష్టిత తనుః లతాజాల సమన్వితః । 39

తతోముని ర్ముద్గలోపి దైవాత్తం దేశమాయయౌ ।
సస్మారచ తదా యష్టింతం చ కైవర్తకం యదా ॥ 40

దదర్శభ్రమమాణస్సః సాంకురాం యష్టిముత్తమాం ।
వల్మీకాక్రాంతదేహంచ తం చకైవర్తకం మునిః ॥ 41

దుశ్చరం మునిభిస్సర్వైరాస్థితంతప ముత్తమం ।
లక్షితం నేత్రమాత్రేణయతతామునినాతదా ॥ 42

ఉత్పాద్యతస్యదేహస్థం వల్మీకం మునిసత్తమః ।
మంత్రితేనజలేనాస్యసిషే చాంగంచ సర్వశః ॥ 43

తద్రైవ దివ్యదేహంతం జగాదమునిసత్తమః ॥ 44

ప్రాప్తవంతం గణేశస్యసారూప్యం కరయోగతః ॥ 45

స్వకరం ప్రజపంతంచ నామ వైనాయకం శుభం ।
రాన్మీలితే తదానేత్రే మునినాబోధితస్తునః ॥ 46

తస్య నేత్రోద్భవో వహ్నిః విద్యుద్వద్గగనం గతః ।
త్రిలోకీముద్యతోదగ్ధుం మునినావారితో యతః ॥ 47

సోపితం మునిమానమ్య స్వగురుం కరుణాయుతం ।
ఆలిలింగ ముదాయుక్తస్తనయః పితరం యథా ॥ 48

ఉపదిష్టో ముద్గలేన నామకైవర్తక స్తథా ।
వల్మీకాత్పునరుత్పన్నం మానయామాసతం సుతం ॥ 49

చకారనామ కర్మాస్య ముద్గలోముని రాదరాత్ ।
భ్రూమధ్యా న్నిర్గతాశుండా భ్రుశుండీతి తతోన్నప ॥ 50

ఏకాంక్షరం చ మంత్రం చ తస్మైప్రాహాథముద్గలః ।
వరానస్మైదదౌ పశ్చాద్భవత్వం మునిసత్తమః ॥ 51

ఇంద్రాది దేవగంధర్వైః సిద్ధై రర్చ్యతమో భవ ।                52

యథాగజాననో దేవోధ్యాతో దృష్టోఘనాశనః ।                53

తథాహిత్వమపి మునే భ్రుశుండిః ప్రథితోభవ ।
యస్యతే దర్శనం స్యాత్స కృతకృత్యో భవేన్నరః ॥                54

ఆయుశ్చ కల్పలక్షంతే భవితా మమవాక్యతః ॥                55

ఏవం బహువిధా తస్మైవరాన్ యచ్ఛతిముద్గలే ।
యయురింద్రాద యోద్రష్టుం మునయో నారదాదయః ॥                56

ఊచుస్తం ప్రణిపత్యైవ భ్రుశుండే తవదర్శనాత్ ।
సార్థకం జన్మనో విద్యాపితరౌచ తపోయశః ॥                57

త్వమేవ గణనాథోసి పూజనీయోసినోమునే ।
సతుసంపూజ్యతాన్ సర్వాన్ ప్రణమ్యచ విసృజ్యచ ॥                58

పునః పద్మాసనగతో జజాపైకాక్షరం మనుం ।
పురోమూర్తిం ప్రతిష్ఠాప్య గణేశస్య మనోహరాం ॥                59

ఉపచారైః షోడశభి రపూపుజద్దినే దినే ।
ఆశ్రమశ్చ బభౌవాపీ సరోవృక్షలతాదిభిః ॥                60

త్యక్తవైరైః సింహమృగై ర్నకులై ర్భుజగోత్తమైః ।
తతోవర్ష శతస్యాంతే ప్రసన్నోభూద్గజాననః ॥ 61

ఉవాచ మత్స్వరూపస్త్వం కిమర్థం తపసేతపః । 62

కృతకృత్యోపి సాయుజ్యం అయుషోంతే చలప్స్యసే ।
ఇదం క్షేత్రం సువిఖ్యాతం నామతే తి భవిష్యతి ॥ 63

అనుష్ఠానకృతామత్ర నానాసిద్ధిప్రదం నృణాః ॥ 64

మన్మూర్తిదర్శనాదత్రన పునర్జన్మ భాగ్భవేత్ ।
అపుత్రశ్చలభే త్పుత్రాన్ విద్యార్థీ జ్ఞానమాప్నుయాత్ ॥ 65

శుక్ర ఉవాచ :-

ఇతితే కథితం సర్వం శూరసేన నృపోత్తమ ।
యత్వయాపరిపృష్టంమే కిమన్య చ్ఛ్రోతుమిచ్ఛసి ॥ 66

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**భ్రుశుండ్యుపాఖ్యానం నామ సప్తపంచారింశో అధ్యాయః**



# 57-వ అధ్యాయము

# భ్రుశుండోపాఖ్యానం

అప్పుడు దేవేంద్రుడిలా అన్నాడు. 'ఓయీ! నీ కుతూహలానికి సమాధానం తప్పకయిస్తాను. ఏ పరమపుణ్యప్రదమైన భక్తిభావంచేత భ్రుశుండి మహాముని సాక్షాత్తూ వరప్రదుడైన గణపతిగా సారూప్యాన్ని పొందాడో, అటువంటి పురాతనేతిహాసగాథను తప్పక చెబుతాను. అందు వల్ల శ్రోతా, వక్తా యిరువురూకూడా ధన్యులౌతారు. శ్రద్ధగా విను!

దండకారణ్యానికి సమీపంలో 'నందుర' అనే ఊరు ఉండేది. ఆ అరణ్యంలో అత్యంత దుష్టుడైన కైవర్తకుడొకడుండేవాడు. అతడు సమస్తమైన దుర్లక్షణాలకు ఆలవాలమై వుండేవాడు. బాల్యంలో చేతివాటం చూపి సమస్తమైన వస్తువులను, విలువైన ఆభరణాలనూ తస్కరిస్తూ, యితరులను మోసంచేస్తూండేవాడు. అబద్ధపు ప్రమాణాలను చేయటం, బొంకడమూ అతడికి వెన్నతోపెట్టిన విద్య! వయస్సు పెరిగేకొద్దీ

స్త్రీలోలుడై, దానికితోడు మధువు మత్తులో యుక్తాయుక్తాలను మరచి ద్యూతక్రీడ (జూదం) లో మగ్నుడై ఉండేవాడు. అటువంటి దుష్టుడిని ఊరిలోనివారందరూ తరిమివేయగా పర్వతములు, .గుహలు ఉన్నట్టి అరణ్యానికి వలసపోయి భార్యాసమేతుడై అక్కడే నివసిస్తూ, దారిన పోయే బాటసారుల నందరినీ దోచుకుని తన యింట్లోవారిని సకల భోగభాగ్యాలలో తులతూగేలా ఉంచేవాడు. వయసులోఉన్న తనభార్యను ఒంటినిండా ఆభరణాలను తొడిగి తృప్తిపరిచాడు. తాను శస్త్రాస్త్రాలను ధరించి అరణ్యంలోని వృక్షాల కొమ్మలపైన దాక్కుని బాటసారులను సంహరించి, వారి వస్తువుల నన్నింటినీ సంగ్రహించి, యింట్లోదాచి గ్రామాంతరాలలో వాటిని విక్రయిస్తూ, సకల భోగాలనూ అనుభవించే వాడు.

ఇటువంటి ఘోరకృత్యాలు చాలవా అన్నట్లు అరణ్యంలోని జంతు వులను కూడా విడవకుండా నిత్యం వేటాడి వధించేవాడు. ఇలావుండగా ఒకనాడు ఒక లేడిని వేటాడుతూ అరణ్యంలో దాదాపు యోజనం (8 మైళ్ళు) దూరానికి తరుముకుంటూ వెళ్ళి అక్కడ జారిపడ్డాడు. ఆ పడటం లో కాలికి దెబ్బతగిలి మెల్లగా కుంటుకుంటూ తిరుగు ప్రయాణ మయ్యాడు. ఆతరువాత మార్గమధ్యంలో గణేశతీర్థంలో బడలిక తీరేందు కని స్నానంచేశాడు. ఆ సమీపంలోవున్న ముద్గలుడనే మహర్షిని చూశాడు. ఆ మహర్షి మహానిష్ఠతో నామంతో కూడిన గణేశమహామంత్రాన్ని జపించ సాగాడు. ఆ కిరాతుడు అతడిని మామూలు బాటసారిగా భావించి సత్వరున తన ఒరలోంచి కత్తిని బైటికితీసి చేతిలో ధరించి ఆ ముద్గలుని వద్దకు వెళ్ళి యిలా అన్నాడు :

"ఓయీ! నేను కైవర్తుడనే పేరుగల కిరాతుణ్ణి! నిన్ను హత్యచేసే ఉద్దేశ్యంతో వచ్చాను!" అని చెబుతూండగా ఆ కైవర్తుడి చేతిలోని శస్త్రములు ధృఢమైన అతడి పిడికిలిలోంచి జారి క్రిందపడిపోయాయి. మహనీయుడైన ఆ మహర్షి సన్నిధిలో ఆ దుర్మార్గుడి బుద్ధి, ప్రవృత్తి ఒక్కసారిగా మారిపోయింది. అలా క్రిందపడినట్టి శస్త్రాస్త్రములు గల్గిన ఆ కైవర్తుడిని చూసి చిరునవ్వుతో ఆ ముని యిలాఅన్నాడు. "ఓయీ కైవర్తకా! నీచేతిలోనున్న ఆయుధాలు జారిపడటానికి కారణం ఏమిటి? అవన్నీ అల్లెత్రాటితో కట్టబడినవైనా ఎందుకని ఒక్కసారిగా క్రింద పడినట్లు?" అంటూ అడిగాడు.

తాత్కాలిక జ్ఞానోదయమైన ఆ కైవర్తుడు "ఓ మునిసత్తమా! గణేశ తీర్థంలో స్నానం చేయటంచేతా, మీ సందర్శనభాగ్యంచేతా నాకు జ్ఞాన వైరాగ్యములు కలిగాయి. ఐనా ఈ కుండంలో స్నానంచేయటంతోటే నాబుద్ధి యింతగా మారటం నాకే అంతుబట్టకుండా ఉన్నది. ఆ వెంటనే తమ దర్శనంయొక్క ప్రభావంచేత నాబుద్ధి మరింత పరిశుద్ధమైంది.

చిన్నతనాన్నుంచీకూడా నాబుద్ధి పాపప్రవర్తనయందే మగ్నమై వున్నది. ఈనాడు కేవలం మీ అనుగ్రహ ప్రభావంచేతనే నాకీ దుష్ట కార్యాలపట్ల విరక్తి కలిగింది. అందువల్ల ఈ జారిపోయినట్టి ఆయుధా లను నేను యింకెన్నటికీ చేతబూనను! ఓ ఋషిపుంగవా! నాపై దయ వహించి నన్ను అనుగ్రహించి ఈ సంసారమనే బురదలోంచి పైకిలాగండి! సత్పురుషులయొక్క విశిష్టత ఎట్టిదంటే ఎంతటి దుష్కర్ములనైనా వారి దీనత్వంపట్ల జాలికలిగి అనుగ్రహిస్తారు. ఓమునివర్యా! నిధులు ధాతు సంపర్కంతో ఎలా మరింతగా విలువైనవవుతాయో ఆ రీతిలోనే సాధు

పురుషులతో సంగమం ఎటువంటి వారినైనా సంస్కరించి తీరుతుంది కదా!"

అంటూ కన్నులు నీటితో నిండిపోగా ఆ ఋషి పాదాలపై వాలి పోయాడు. ఈ కథనంతటినీ శూరసేనుడికి వినిపిస్తున్న ఇంద్రుడు యిలా కొనసాగించాడు.

"ఓరాజా! ఈరీతిగా దీనుడై తన పాదాలపై పడిన కైవర్తకునిపట్ల ముద్గలమహర్షి మనస్సు కరుణతో నిండిపోయింది. శరణాగతుడైన అతడిని తిరస్కరించటానికి ఆఋషికి మనస్సు అంగీకరించలేదు. అందు కని ఆ కైవర్తకుడితో యిలాఅన్నాడు.

"నీకు శాస్త్రాలలో చెప్పబడిన దోషహరణములైన దానాదులు చేసేటందుకు అధికారంలేదు. ఎందుకంటావా నీవు సంపాదించినదే యితరులను కొల్లగొట్టి! కనుక నీకు దుష్కర్మ తొలగటానికి ఒకటే మార్గాంతరం ఉంది. అదేమిటంటే విధివత్తుగా నీకు సర్వసిద్ధికరము, సకల దోషహరము ఐన గజానునుని నామము జపమునకై ఉపదే శిస్తాను!" అనగానే ఆ కైవర్తుడు ఆర్తితో ముద్గలుని చరణాలను గట్టిగా పట్టుకున్నాడు. అప్పుడా మహర్షి తన హస్తమును అతడి శిరస్సుపైన ఉంచి అతడికి 'గణేశాయనమః' అనే మంత్రాన్ని ఉపదేశించాడు. అప్పుడు తన చేతిలోఉన్న దండాన్ని దానిఎదుట పాతి అతనితో యిలాఅన్నాడు. "ఓయీ! నేను తిరిగి వచ్చేటంతవరకూ ఒకే ఆసనంపై నిశ్చలంగా కూర్చొని కేవలం వాయువునే ఆహారంగా భక్షిస్తూ నీవు చేసిన జపజలాన్ని ఈ దండం మొదట్లో ఉదయం, సాయంసంధ్యలలో ధారపోస్తూండు.

ఈ కఱ్ఱ చిగురు తొడిగేవరకూ అలా చేస్తూండు' అని నియమించి, అంతర్హితు డైనాడు.

అప్పుడా కైవర్తుడు అన్యమైనవన్నీ విడిచి, జీవితంపైని ఆశనుకూడా వదలి వృక్షచ్ఛాయలో, ఆ ముని పాతిన దండమునకు ఎదురుగా కూర్చుని జపంచేయ నారంభించాడు ఏకాగ్రచిత్తంతో! ఈ విధంగా ఇంద్రియాలను నిగ్రహించి, ఆహారాన్ని కూడా త్యజించి అన్యమైనవేవీ మనస్సులోనికి రానీయకుండా వేయిసంవత్సరాలు తపస్సు ఆచరించగా అప్పుడా ముద్గలుడు నాటిన దండం చిగిర్చింది. అప్పుడా కైవర్తకుడు మునిరాకకై ప్రతీక్షించసాగాడు! చిరకాలం ఒకే ఆసనంపైన కదలక మెదలక స్థిరంగా కూర్చొనడంతో ఆతడి శరీరంపై పుట్టలుపోసి పాదలు బయలుదేరి అతడిని కప్పివేసాయి. అప్పుడు దైవవశాన ముద్గలుడు అక్కడికి రావటమూ, ఆ మునికి కైవర్తకుడు గుర్తొచ్చి అతడికై వెతుక్కుంటూ వచ్చి చిగిర్చిన తన దండమునూ, దానికెదురుగా పుట్టలు, చెదలుకట్టి తపోమగ్నుడైయున్న కైవర్తకుడినీ చూశాడు! ఎంతో దుస్సాధ్య మైన తపోదీక్షను అకుంఠితంగా నిర్వహించి కేవలం ఎముకలగూడుగా మిగిలిన ఆతడిపైనున్న పుట్టల నన్నిటినీ ముద్గలుడు తొలగించి, ఉదక మును అభిమంత్రించి ఆ కైవర్తకునిపైన చల్లగానే ఆతడు దివ్యదేహాన్ని ధరించాడు. కేవలం తనవద్ద హస్తదీక్షనూ, ఉపదేశాన్నిగైకొని ఘోరమైన దీర్ఘతపస్సుతో వైనాయక సారూప్యాన్ని పొంది నామజపంచేస్తూన్న ఆతడిని నెమ్మదిగా తట్టిలేపాడు ముద్గలమహర్షి! ఆతడు కన్నులు తెరచీతెరువగానే అతడి కన్నుల్లోంచి మెరపువంటి ప్రకాశంగల తపోగ్ని వెలువడింది. ఆ ముని దానియొక్క తీవ్రతను తనయందు లయంచేసుకుని, చిరునవ్వుతో ఆతడిపై అనుగ్రహదృష్టిని బరపాడు. తన గురువైన ఆ మునికి సాష్టాంగ

నమస్కారం చేసిన ఆ కైవర్తకుడిని పుత్రవాత్సల్యంతో లేవనెత్తి ఆలింగనం చేసుకున్నాడు ముద్గలుడు!

అలా తన ఉపదేశాన్ని పొంది ఘోరతపస్సు ఆచరించి, తన పాతకము లనన్నిటినీ తపోగ్నిలో భస్మంచేసుకొని వల్మీకంనుండి తిరిగి పుట్టడంచేత చాలా సంతుష్టిని పొందిన ఆ ముద్గలముని అతడిని తన కుమారునిగా భావించి తండ్రిగా సకల సంస్కారాలను కావించాడు. భ్రూమధ్యం లోంచి శుండము మొలవటంచేత అతడికి భ్రుశుండుడన్న నామకరణం చేశాడు.

ఈరీతిగా కైవర్తకుడు దివ్యశరీరాన్ని ధరించి భ్రుశుండుడుగా మహర్షియై అవిర్భవించాడు. అప్పుడు ముద్గలుడు ఆతడికి గణేశుని ఏకాక్షర మంత్రాన్ని ఉపదేశించి, అనేక వరములు ప్రదానంచేసి అతడిని మునిసత్తముడవు కమ్మంటూ దీవించాడు. "నీవు ఇంద్రాది దేవగణము లకు కూడా ఆరాధ్యుడవగుదువుగాక! గజానునివలే నీవుకూడా భక్తజనుల పాపములను నశింపచేసి, కేవలం నిన్ను దర్శించినంత మాత్రాన్నే సకల జనుల మనోభీష్టములీడేరునుగాక! 'భ్రుశుండ' నామంతో చిరకీర్తివై వర్ధిల్లుదువుగాక! నా ఆశీర్వచన ప్రభావంచేత నీవు నూరుకల్పముల ఆయుర్దాయం కలిగివుందువుగాక!" అంటూ అనేకవరాలను ప్రసా దించాడు. అప్పుడు ఇంద్రాదిదేవతలు, నారదాదిమునులు వచ్చి ఆభ్రు శుండమహర్షిని దర్శించుకుని ఆతడికి నమస్కరించి యిలా కీర్తించారు.

"ఓ భ్రుశుండమహర్షీ! నీ దర్శనవిశేషంచేత మా జన్మ, విద్య, తపస్సు సర్వమూ సార్థకమైనాయి! మా అందరికీ నీవు గణనాధునివలే పూజ్యుడవైనావు!"

ఆ మాటలకు భ్రుశుండి వారందరికీ నమస్కరించి తిరిగి ఏకాక్షరీ గణేశ మంత్రానుష్ఠానానికి పూనుకున్నాడు! అతిసుందరుడైన గణేశమూర్తిని ఎదురుగా స్థాపించి, ఆతడిని షోడశోపచారములతోనూ అత్యంత శ్రద్ధా భక్తులతో అర్చించసాగాడు. ఆముని తపోవాటిక అంతా ఎంతో ప్రశాంత తనూ పవిత్రతనూ సంతరించుకోసాగింది! సహజంగా విరోధులైన జంతువులుకూడా ఆ ఆశ్రమప్రాంగణంలో తమ సహజవైరాన్ని విడనాడి అన్యోన్యంగా మెలగసాగాయి.

ఈ రీతిగా నూరుసంవత్సరాలు సుదీర్ఘ తపస్సు ఒనరించిన భ్రుశుండి మహర్షిని వినాయకుడు అనుగ్రహించి తన దివ్యదర్శనాన్ని ప్రసాదించాడు.

"నాయనా! భ్రుశుండీ! నీవిప్పటికే నా స్వరూపాన్ని పొందావు! నీ తపస్సు సిద్ధించింది! నీవు కృతకృత్యుడవైనావు. అంత్యమున నీవు నా సాయుజ్యాన్ని పొందగలవు. నీవు తపస్సు చేసిన ఈ క్షేత్రము 'నామల' అన్న పేరుతో ప్రసిద్ధమౌతుంది. ఇక్కడ తపస్సు అనుష్టానం చేసినవారు సకల సిద్ధులనూ పొందగలరు! ఈ క్షేత్రంలో వెలసిన నామూర్తిని దర్శించి, అర్చించినవారు పునరావృత్తి రహితమైన మోక్షాన్ని పొందుతారు. పిల్లలులేని వారికి పుత్రసంతానమూ, విద్యార్థులు జ్ఞానమునూ పొందుతారు" అంటూ అనుగ్రహించాడు గణేశుడు. ఓ శూరసేన మహారాజా! నీవడిగిన వివరమంతా తెలిపాను ఇంకా నీవేమైనా వినగోరితే అడుగు! అదికూడా తెలియ జేస్తాను" అన్నాడు శచీపతి!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'భ్రుశుండ్యోపాఖ్యానము' అనే 57-వ అధ్యాయం.

# 58

# సంకష్టచతుర్థీ వ్రతకథనం

(మూలం)

## అష్ట పంచారింశో అధ్యాయః

**బ్రహ్మోవాచ :-**

ఏవం శృత్వా శూరసేనో మరుత్వద్వాక్య ముత్తమం ।
పునః పప్రచ్ఛ తం వ్యాసః ప్రీతః శృత్వాతత్కధామృతం ॥ 1

**శూరసేన ఉవాచ :-**

కేనోపాయేన దేవేశ యానంతే గగనంవ్రజేత్ ।
తముపాయం కురు విభో వదావా కిం కరోమితే ॥ 2

**బ్రహ్మోవాచ : -**

ఏవంపునఃకృత ప్రశ్నం నృపం ప్రాహసురారిహా ।
శృణ్వతాం సర్వలోకానాం రస్మమాన ఇదంవచ॥ 3

**ఇంద్ర ఉవాచ :-**

కశ్చిత్స్యాదిహ సంకష్టచతుర్థీ వ్రతకారకః ।
విప్రోవా క్షత్రియోవాపి నగరేతే నృపోత్తమ ॥ 4

తస్యాబ్ధ కృతపుణ్యేన నమ్యగ్దత్తేన భూభుజ ।
ఇదానీం ప్రచలే దేతన్నాన్యథాయుత పూరుషైః ॥ 5

నృప ఉవాచ :-

కథం వ్రతంతు సంకష్ట చతుర్థ్యావదయే ప్రభో ।
కిం పుణ్యం కిం ఫలం తస్యకోవిధిః కస్య పూజనం ॥ 6

పురాకేనకృతం చాత్ర సిద్ధిర్యస్మి న్కృతేభవత్ ।
ఏతత్సర్వం శునాసీర కృపయా వద విస్తరాత్ ॥ 7

శక్ర ఉవాచ :-

అత్రాప్యుదాహరంతీ మ మితిహాసం పురాతనం ।
కృతవీర్యస్య సంవాదం నారదేన మహాత్మనా ॥ 8

బభూవ బలవాన్ రాజా కృతవీర్యో మహీతలే ।
సత్యశీలోవదాన్యశ్చ యజ్వామానీ మహారథః ॥ 9

జితేంద్రియో మితాహారో దేవద్విజ నిషేవకః ।
యస్యాశ్వగజ యోధానాం రథినాం సర్వధన్వినాం ॥ 10

నసంఖ్యావిద్యతే రాజన్ సహ్యాద్రి విషయాసినాం ॥ 11

మందిరేయస్యసౌవర్ణా ః పర్యంకా భాజనానిచ ॥ 12

నాసీదౌదుంబరం పాత్రం పాకార్థ మపిసర్వదా ।
యస్య ద్వాదశసాహస్రాః బ్రాహ్మణాః పంక్తిభోజినః ॥ 13

సుగంథానామయ స్యాసీ త్పత్నీ ధర్మపరాయణా ।
పతివ్రతా పతిప్రాణా త్రైలోక్యేతి మనోరమా ॥ 14

నానాలంకార సుభగా ద్విజదేవాతిథి ప్రియా ।
ఏవంతౌ దంపతీరాజన్న పుత్రౌ సంబభూవతుః ॥ 15

పుత్రార్థం సర్వదానాని వ్రతానిచ తపసాంసిచ ।
చక్రతుర్ని యమాన్యన్యాన్ యాజ్ఞాంశ్చ బహుదక్షిణాన్ ॥ 16

నానాతీర్థాని క్షేత్రాణి జగ్మతుః పుత్రలిప్సయా ।
తథాపినా భవత్పుత్రో జన్మాంతర కృతైనసాః ॥ 17

ఏకదా దుఃఖితోరాజా సమాహూయ సమంత్రిణః ।
రాజ్యం ముద్రాంచకోశంచ జనాన్ జనాన్ జనపదాంస్తథా ॥ 18

తేభ్యోనివేద్యసర్వంతౌ జగ్మతుర్వన ముత్తమం ।
వల్కలాజినసంవీతౌ దంపతీతప ఆస్థితౌ ॥ 19

జితేంద్రియౌ జితాహారౌ జీర్ణపర్ణాని లాశినౌ ।
చక్షుర్మాత్రేణ లక్ష్యౌతౌ దృష్ట్వాథ నారదోమునిః ॥ 20

జనకం కృతవీర్యస్య పితృలోకస్థ మబ్రవీత్ । 21

అపుత్రత్వా త్ర్పాయగతోవిద్యతే తనయస్తవ । 22

కృతవీర్యో మృత్యులోకేశ్వః పరశ్వోమరిష్యతి ।
యదితస్య భవేత్పుత్రో నాకలోక ప్రదర్శకః ॥ 23

కృతవీర్య స్తదాజీవే న్మృతోవా స్వర్గమాప్నుయాత్
ఇత్యుక్త్వానారదోయాతః పశ్యతి స్మాద్భుతం భువి ॥ 24

భ్రుశుండేః పితరౌపుత్రా తస్య పత్నీం సకన్యకాం ।
అగ్నిజ్వాలావృతే ఘోరేకుంభీపాకేహ్యభో ముఖాన్ ॥ 25

యామ్యదూతైస్తాద్య మనాస్క్రందతో వివిధాన్ రవాన్ ।
తేషామాక్రందితం శృత్వానారదః కరుణానిధిః ॥ 26

ఆగత్యకథయామాస తేషాం దుఃఖం భ్రుశుండయే । 27

నారద ఉవాచ :-

శక్రాదయో దేవగణా మునయః కపిలాదయః ॥ 28

యస్యతే దర్శనం కర్తుం యాంతి హేరంబరూపిణః ।
తత్కథం పితరౌ పత్నీపుత్రాః పుత్రశ్చ కింకరాః ॥ 29

యమలోకే కుంభీపాకే పచ్యంతే తవదోషతః ।
త్వం చాపి జ్ఞాన సంపన్నః కథం తం నావబుధ్యసే ॥ 30

పూర్వజానాం త్వముద్ధారే యత్నం కురు మహామతే । 31

శుక్ర ఉవాచ :-

భ్రుశుండిరతి సంతప్తో వాక్యం శృత్వామునీరితం ॥ 32

దుఃఖితః పితృదుఃఖేన భ్రుశంజజ్వాల వహ్నివత్ ।
ఉపాయం చింతయామాస తేషాముద్ధారకారకం ॥ 33

దదౌత్రేయః స సంకష్ట చతుర్థీవ్రతజం తదా ॥ 34

విలోక్య ప్రణిధానేన భ్రుశుండీస పరోక్షవిత్ ।
ధ్యాత్వా గజాననం దేవం కరేధ్రుత్వాశుభం పయః ॥ 35

ఉవాచ పిత్యానుద్దిశ్య యాచన్దేవం గజాననం । 36

భ్రుశుండిరువాచ :-

యదిభక్త్యా కృతం మేస్తి గణనాథ వ్రతం తవ ॥ 37

తదాతస్య ప్రభావేన శీఘ్రముద్ధర పూర్వజాన్ ।
ఏవముక్త్వాతు తత్తోయం గజానన కరేక్షిపత్ ॥ 38

క్షిప్రమాత్రే తదాతోయే గజానన ప్రసాదతః ।
విమానాని సమారుహ్య సర్వేతే దేవరూపిణః ॥ 39

సేవ్యమానా అప్సరోభిః స్తూయమానాశ్చ చారణైః ।
గంధర్వైర్గీ యమానాస్తే గణేశస్థాన మాప్నువన్ ॥ 40

అన్యేచ కుంభీపాకేచ నరాదుష్కృతి నోభవన్ ।
తేపి సర్వే విమానస్థాః పదం గాణేశ్వరం యయుః ॥ 41

ఏవం వ్రతస్య మహిమా మయాతే పరికీర్తితః ।
యదేక దినపుణ్యేన సర్వేతే సద్గతిం గతాః ॥ 42

జన్మావధి కృతంయేన సంకష్టం వ్రతమాదరాత్ ।
శేషోపి తస్య పుణ్యస్య సంఖ్యాం కర్తుం నవైక్షమః ॥ 43

అతస్తస్య ప్రభావేన విమానం ప్రచలేన్మమ ॥ 44

**ఇతి శ్రీ గణేశపురాణే ఉపాసనాఖండే**
**సంకష్టచతుర్థీ వ్రతకథనం నామ అష్టపంచాశింతో అధ్యాయః**



## 58-వ అధ్యాయము

# సంకష్టచతుర్థీ వ్రతకథనం

"ఓ వ్యాసమునీంద్రా! ఆ శూరసేనుడు ఇంద్రుని వచనాలను విని తిరిగి ఆ గణేశ కథామృతాన్ని వినగోరి ఆ శచీపతిని యిలా ప్రశ్నించాడు." అంటూ కథాగమనాన్ని కొనసాగించాడు చతుర్ముఖుడు.

"ఓ ఇంద్రా! క్రిందకు దిగిపోయినట్టి నీ ఈ దివ్యవిమానము తిరిగి ఏ ఉపాయంచే నింగికెగరగలదు? ఆ ఉపాయంచేయి! లేదా అట్టి ఉపాయాన్ని నాకు చెప్పు!" అంటూ పదేపదే తనని అర్థిస్తున్న ఆ శూరసేనుడితో శచీపతియైన దేవేంద్రుడిలా అన్నాడు.

"ఓ శూరసేనమహారాజా! నీపట్టణంలో 'సంకష్టచతుర్థి వ్రతము' ను ఆచరించిన బ్రాహ్మణులుగాని క్షత్రీయులుగాని ఎవరైనా ఉన్నట్లైతే — అట్టివారు తాము ఒకసంవత్సరంపాటు ఆచరించిన వ్రతఫలాన్ని ధారపోసినట్లైతే ఈ దివ్యవిమానం అప్పుడు యథావిధిగా నింగికెగురగల్గుతుంది! అలాకాక పదివేలమంది బలాఢ్యులు పైకెత్తబూనినా ఏమీ

ప్రయోజనముండబోదు!" అన్న ఇంద్రుని మాటలకు శూరసేనుడిలా ప్రశ్నించాడు.

"ఓ ఇంద్రా! ఇంతటి ప్రభావయుతమైన ఆ సంకష్టచతుర్థీవ్రత విధానమెలాగ ఆచరించాలి? అదిచేస్తే ఎలాంటి పుణ్యం లభిస్తుంది? అందులో పూజించబడే దేవుడెవరు? ఇంతకుపూర్వం ఎవరా వ్రతమాచ రించారు? వారు ఎలాంటి ఫలితాన్ని పొందారు? ఓ ఇంద్రా! ఆ వివరాలన్నీ దయతో నాకు విస్తరించి వివరించు!" అంటూ ప్రార్థించిన శూరసేనుడితో ఇంద్రుడిలా బదులుపలికాడు!

"ఓ రాజా! ఈ విషయమై ఒక ప్రాచీనమైన ఇతిహాసాన్నొకదానిని నీకు చెబుతాను! ఇది కృతవీర్యుడనే రాజుకూ, దేవర్షియైన నారదుని మధ్య జరిగిన సంవాదం!"

పూర్వం కృతవీర్యుడనే మహాబలపరాక్రమ సంపన్నుడైన రాజు ఒకడుండేవాడు. అతడు సకల సద్గుణోపేతుడు! అనేక యజ్ఞాలుచేసి భూరిగా దానధర్మాలు చేసినవాడు సత్యవాది! ఇంద్రియములనన్నింటినీ తన వశం చేసుకున్నట్టి జితేంద్రియుడుకూడా!

దేవతలన్నా అతిథులన్నా అతనికిగల ప్రీతిమెండు! అసంఖ్యాకమైన చతురంగబలాలు ఆరాజు సేనావాహినిలో ఉండేవి! ప్రతినిత్యం పన్నెండు వేలమంది బ్రాహ్మణులను సహపంక్తిలో నుంచుకునిగాని భుజించేవాడు కాడాతడు! అట్టి కృతవీర్యునికి సుగంధియనేపేరుగల మహాపతివ్రతా, అతిలోక సౌందర్యవతీయైన భార్యఉండేది! ఆమె ద్విజ, దేవ, అతిథి పూజాపరురాలు. ఆమె సుగుణవతి సౌశీల్యవతీ! ఇంత అపూర్వ గుణ సంపత్తి కలిగివున్న ఆ దంపతులకు పుత్రసంతతి మాత్రం కరువైంది.

సంతానంకోసం వారు చేయని వ్రతంలేదు! ఇవ్వని దానములేదు. అనేక క్రతువులనూ యజ్ఞయాగాదికాలనూ కూడా నిర్వహించినా ఫలితం మాత్రం శూన్యం! అనేక పుణ్యతీర్థాలనుకూడా సందర్శించారు. ఎన్ని చేసినప్పటికి జన్మాంతర పాపకర్మ ఫలితంగా సంతతిమాత్రం కలుగలేదు!

ఈరకంగా నిరాశకు గురైన ఆరాజు ఒకనాడు తన మంత్రులను పిలిచి వారికి రాజ్యభారాన్ని అప్పగించి అరణ్యానికి వెళ్ళాడు. నారబట్ట లను ధరించి తపోదీక్షను ప్రారంభించాడు - ఇంద్రియాలను వశపరచు కొని, ఆహారాన్ని పూర్తిగా వర్జించి, పైనుంచి రాలిపడ్డ ఆకులనే భుజిస్తూ, కేవలం వాయువునే ఆహారంగా స్వీకరిస్తూ, కాలం గడుపుతూన్న ఆ దంపతులకు రాజు శల్యావశిష్టుడైవుండగా - దేవర్షియైన నారదమహర్షి యొక్క సందర్శనభాగ్యం కలిగింది!

ఆతరువాత ఆ నారదుడు పితృలోకానికి వెళ్ళి అక్కడ కృతవీర్యుని తండ్రిని కలిసి, అతని కుమారుడు సంతతికోసం పడే ఆరాటాన్నీ బాధనూ వివరించి అక్కడినుండి వెళ్ళిపోయాడు.

ఇలా వెళ్ళిన దేవర్షి నారదుడు ఊర్ధ్వలోకాలగుండా పోతూ భ్రుశుండిమహర్షి తలిదండ్రులూ, కన్యకాసహితయైన ఆతనిభార్య అందరూ కుంభీపాక నరకంలో విపరీతయాతనలు అనుభవించడాన్ని గమనించి వారి దుస్థితికి జాలిపడి వేగంగా భ్రుశుండిమహర్షియొక్క ఆశ్రమానికి చేరుకున్నాడు.

"ఓయీ భ్రుశుండా! నీవు సమస్త దేవతలచే వంద్యనీయుడవై నప్పటికీ అక్కడ నీ తలిదండ్రులూ, భార్యాకుమార్తె సకలురూ కుంభీపాక నరకంలో లెక్కలేని నరకయాతనలు అనుభవిస్తున్నారు. గనుక నీవు

నీ పూర్వులను ఉద్ధరించే ప్రయత్నం తప్పక సలుపవలసింది! అది సర్వులకూ శ్రేయస్కరము."

అన్న నారదముని పలుకులకు భ్రుశుండమహర్షి ఎంతో ఖిన్నుడై వారి దుఃఖనివారణకు తప్పక ప్రయత్నించాలని పూనుకుని సమాధినిష్ఠలో ఏకాగ్రచిత్తంతో గణేశుని ధ్యానిస్తూ అందుకు పరిష్కారమార్గం తెలుసు కుని తనచేతిలోకి పరిశుద్ధమైన మంత్రోదకాన్ని తీసుకుని తనచే ఆచరించ బడిన సంకష్ఠ చతుర్థీవ్రతంచే సముపార్జించబడిన పుణ్యం యావత్తూ తన పితరుల ఉద్ధరణకై ధారపోయసంకల్పించి :

"ఓ గజాననా! నీ వ్రతాన్ని నేను భక్తిభావముతో చేజేసినట్లైతే దానియొక్క మహత్తర ప్రభావంచేత నా పితరులు తక్షణమే ఉద్ధరించ బడుదురు గాక!" అంటూ గజాననుని స్మరిస్తూ చేతిలోని మంత్రజలాన్ని విడిచిపెట్టగానే — ఆ గజాననుని దివ్యానుగ్రహంచేత భ్రుశుండుని పూర్వీకులందరూ దేవరూపులై, శ్రేష్టములైన దివ్యవిమానాలను అధిరో హించి అప్సరలచే సేవించబడుతూ, చారణులచేత కీర్తించబడుతూ, గంధర్వులచేత గానం చేయబడుతూ గణేశ లోకాన్ని పొందారు."

'ఓ శూరసేన మహారాజా! ఇట్టి అనంతఫలప్రదమైన సంకష్ట చతుర్థీ వ్రతాచరణవల్ల ఒకరోజుకే కల్గిన మహాప్రభావ మిలాంటిది! ఇక జన్మప్రభ్రుతి ఈ వ్రతాచరణ చేసినవారి పుణ్యం లెక్కించటం ఆదిశేషునికి కూడా వీలుకాదు. కనుక అట్టి మహత్తర పుణ్యంచేతనే నావిమానంకూడా పైకెగెయగలదు" అన్నాడు ఇంద్రుడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'సంకష్ట చతుర్థీవ్రత కథనం' అనే 58-వ అధ్యాయం.

59

# కృతవీర్యుని పూర్వచరిత్ర

(మూలం)

## ఏకోన షష్టితమో అధ్యాయః

రాజోవాచ :

కుంభీపాకాద్వినిస్సృత్య తేషు యాతేషు, వైదివం ।
కముపాయం స కృతవాన్ కృతవీర్యపితా తదా ॥ 1

శక్ర ఉవాచ :

బ్రహ్మలోకం జగామాశు దదర్శ కమలాసనం ।
దుఃఖితో నారదాచ్ఛ్రుత్వా వంశ విచ్ఛేద మాత్మనః ॥ 2

ప్రణమ్య తమపృచ్ఛత్ సవంశ విచ్ఛేద కారణం ।
మమ పుత్రోతిధర్మాత్మా వదాన్యో యజ్ఞకారకః ॥ 3

దేవతాతిథిభక్తశ్చ మాన్యమానయుతా శుభం ।
నానావిధ ప్రయత్నం స పుత్రార్థం కృతవాన్ విదే ॥ 4

తథాపి నాభవత్కస్మా త్తస్యపుత్రః సురేశ్వర ।
రాజ్యం ప్రకృతి సాత్కృత్వా వాయుభక్షః స్థితో వనే ॥ 5

అస్థిమాత్రా వశేషో సావద్య, శ్వోవా మరిష్యతి ।
జన్మాంతరీయం తస్యై నో యేన గచ్ఛేల్లయం ప్రభో ॥ 6

తముపాయం దయాం కృత్వా వదమే కమలాసన ।
తం ప్రాపయిష్యే తత్రాహం స్వవంశస్య వివృద్ధయే ॥ 7

ఏవం సులలితాం వాణీం శృత్వోవాచ తథావిధిః ।
శ్రూయతాం తవ పుత్రస్య పూర్వజన్మ మయేరితం ॥ 8

సామనామ్నాభవత్పూర్వం త్వత్రైవ నగరీంత్యజః ।
దుష్కర్మాతితరాం యస్య దర్శనం పుణ్యనాశకృత్ ॥ 9

ఏకదా తేన విత్తస్య లోభేన పథి ఘాతితాః ।
బ్రాహ్మణాః ద్వాదశ శ్శాంతా స్త్యక్తాస్తేన గుహాంతరే ॥ 10

సర్వం తదీయ మాదాయ నిశి స్వగృహమాగతః ।
మాఘకృష్ణ చతుర్థ్యాం స ఉదయే శశినో .నృప ॥ 11

గణేశేతి గణేశేతి పుత్రమాహూయ సత్వరం ।
అలబ్ధా న్నజలస్తేన సహైవ బుభుజే ముదా ॥ 12

కాలేన తస్యపుత్రోసౌ పంచత్వ మగమన్నిశి ।
చంద్రోదయే చతుర్థ్యాంతు కృష్ణాయామేవ భూభుజ ॥ 13

అజ్ఞానకృత సంకష్ట చతుర్థీ వ్రతసంభవాత్ ।
పుణ్యా ద్వైనాయకం ధామ జగామ సుఖదంతు సః ॥ 14

విమాన వరమారూఢో వీక్ష్యమాణోప్సరోగణైః ।
వైమానికైః స్తూయమానోదివ్యపుష్పైరథార్చితః ॥ 15

తేనైవ పుణ్యశేషేణ కృతవీర్యాభిధో నృపః ।
తవ పుత్రః సమాపేదే పుత్రత్వ మధునా భువి ॥ 16

తదఘౌఘ క్షయాత్తస్య పుత్రః ఉత్పత్స్యతే నఘ ।
ఇతి బ్రహ్మవచశ్శ్రుత్వా చకంపే స నృపోత్తమః ॥ 17

పప్రచ్ఛ పునరేవాసౌ ఉపాయం పాపనాశనం ॥

**కృతవీర్యపితోవాచ :**

బ్రహ్మహత్యా కృతం తస్యపాపం నశ్యేత్కథం విధే ॥
తద్వదస్వ దయాసింధో యద్యపిస్యాత్సుదుష్కరం ॥ 18

**బ్రహ్మోవాచ :**

స చేద్వ్రతంతు సంకష్టచతుర్థీ సంజ్ఞకం తవ ।
సుతః కరిష్యతే సమ్యక్తదా పాపాత్ ప్రమోక్ష్యతే ॥ 19

రాజోవాచ :

కథం తత్క్రియతే బ్రహ్మన్ కస్మిన్ మాసే వ్రతం శుభే ।
తత్సర్వం వదమే స్వామిన్ ఏనపాపం లయం వ్రజేత్ ॥ 20

బ్రహ్మోవాచ :

చతుర్థీ భౌమవారేతు మాఘేకృష్ణే భవేద్యది । 21

శుభే ముహూర్తే చంద్రేచ కుర్యాత్ ప్రారంభమస్య హ ।
దంత ధావనపూర్వాణి స్నానాని చైక వింశతిం ॥ 22

కుర్వీత నిత్యకర్మాణి జపేన్మంత్రం తతః పరం ।
నిరాహారో భవేన్మౌనీ పరనిందా వివర్జితః ॥ 23

దుష్టకర్మచ తాంబూలం వర్జయేత్ న్నియమేన చ ।
వర్జయే జ్జలపానంచ పరద్రోహంచ పైశునం ॥ 24

తిలామలక కల్కేన దినాంతే స్నాన మాచరేత్ ।
ఏకాక్షరం షడర్ణం వా జపేద్వావైదికం మనుం ॥ 25

గణేశ ప్రీతయే తస్య నామ మంత్రం యథావిధి ।
ధ్యాయేత్ స్థిరేణమనసా దేవదేవం గజాననం ॥ 26

ముహూర్త మాత్రేణ తతః పూజయేత్ గణనాయకం ।
ఉపచారై ష్షోడశభి ర్నైవేద్యై ర్వివిధైరపి ॥ 27

మోదకా పూప శష్కులీ లడ్డుకైర్వటకైరపి ।
పాయసైర్వివిధైః ర అన్నై ర్వ్యంజనైర్లేహ్యచోష్యకైః ॥ 28

ఫలైర్నానావిధైః పూగ తాంబూలైః దక్షిణాదిభిః ।
ఏకవింశతి దూర్వాభి ర్దీపైశ్చ కుసుమైరపి ॥ 29

చంద్రోదయే అర్ఘ్యదానేన తిథయే మంత్ర పూర్వకం ।
గజాననాయ పశ్చాత్తంచంద్రాయచ తతః పరం ॥ 30

నివేద్య పూజనంనత్వా క్షమాప్యచ తతఃపునః ।
బ్రాహ్మణాన్ భోజయేద్భక్త్యా శక్త్యావా చైకవింశతిం ॥ 31

దశ ద్వాదశవా శక్తో దక్షిణాభిః సుతోషయేత్ ।
కథాం శృత్వా తతస్సమ్యక్ స్వయంభుం జితవాగ్యతః ॥ 32

గీత వాదిత్ర ఘోషేణ శేషాంరాత్రిం తతో నయేత్ ।

ఏవం వ్రతం చైకవర్షం కృతం చేద్యత్నతోనృప ॥
సర్వపాప క్షయాత్తస్య భవితా పుత్రఉత్తమః ॥ 33

అన్యంవా చింతయేత్కామం యం యం తంప్రాప్నుయాన్నరః 34

సర్వ సంకష్టనాశంః స్యాత్పరచక్ర భయం నహి ।
శమీమూలే జపం స్తిష్ఠ న్నుపవాస పరాయణః ॥ 35

ఆ చంద్రోదయ పర్యంతం వ్రతమేతత్ సమాచరేత్ ।
అంధో మూకో జడః పంగు స్తదీప్సిత మవాప్నుయాత్ ॥ 36

దారాన్ పుత్రాన్ ధనం రాజ్యం లభతే నాత్ర సంశయః ।
శ్రావణాదిషు మాసేషు ఘృతలడ్వాదికం పృథక్ ॥ 37

భక్షయేద్వర్షపర్యంతం తస్యసిద్ధి రనుత్తమా ।
శ్రావణే సప్తలడ్డూకాన్నభస్యే దధిభక్షణం ॥ 38

అశ్వినే చోపవాసంచ కార్తికే దుగ్ధపానకం ।
మార్గశీర్షే నిరాహారం పౌషే గోమూత్ర పానకం ॥ 39

తిలాంశ్చ భక్షయేన్మాఘే ఫాల్గుణే ఘృతశర్కరాం ।

చైత్రమాసే పంచగవ్యం వైశాఖే శతపత్రికాం ।
ఘృతస్య భోజనంజ్యేష్ఠే ఆషాఢే మధు భక్షణం ॥ 40

**కృతవీర్య పితోవాచ :**

అంగారక చతుర్థ్యాంతు విశేషో భిహితః కుతః ॥ 41

వదత్వం కృపయాబ్రహ్మన్ ప్రశ్రయావనతాయ మే ।
శృణ్వతో నచమే తృప్తిర్గజానన కథాం శుభం ॥ 42

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే చతుర్థీవ్రతకథనం**
**నామ ఏకోనషష్టితమో అధ్యాయః ॥**



# 59-వ అధ్యాయము

# కృతవీర్యుని పూర్వచరిత్ర

ఆ తరువాత దేవేంద్రునితో ఆ శూరసేనమహారాజు తన సందేహాన్ని గూర్చి యిలా ప్రశ్నించాడు.

"ఓ ఇంద్రా! ఆ ప్రకారంగా కృతవీర్యునియొక్క పితరులు కుంభీ పాక నరకంనుండి విముక్తులై స్వర్గాన్ని చేరుకున్నాక, కృతవీర్యుని తండ్రి ఏం చేశాడు? ఆ వివరాన్ని దయతో నాకు తెలియచేయవలసింది!" అన్న ఆతడి మాటలకు శచీపతియైన ఇంద్రుడు చిరునవ్వుతో యిలా బదులిచ్చాడు.

"ఓ రాజా! నారదమహర్షివల్ల తన వంశవిచ్ఛేదం గురించి తెలుసు కొని కడు దుఃఖితుడైన ఆ కృతవీర్యుని తండ్రి బ్రహ్మలోకానికి వెళ్ళి అక్కడ కమలాసనుడైన చతుర్ముఖుడికి సాష్టాంగనమస్కార మాచరించి, తన వంశవిచ్ఛేదమునకు కారణం తెలుపమంటూ ప్రార్థించాడు.

'ఓకమలాసనా! అన్ని సుగుణాలకూ ఆలవాలమై, సకల శుభలక్షణ సమన్వితుడై అనేక యజ్ఞ, దాన, తపః కర్మలను త్రికరణశుద్ధిగా ఆచరించి, దేవతలను అతిధులనూ పూజించి, అందరికీ తలలో నాల్కలా ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేసే నా కుమారునికి పుత్రసంతానం కలుగకపోవడానికి కారణమేమి? అతడు ఆ బాధచేత వివశుడై, చివరికి తన యావత్ రాజ్యభారాన్నీ మంత్రుల భుజస్కంధాలపై ఉంచి తాను ఘోరారణ్యములో కేవలం వాయుభక్షణ మొనరిస్తూ – ఎముకలగూడుగా మారి నేడోరేపో మరణించటానికి సంసిద్ధుడై వున్నాడు! ఏ పాపంవల్ల వానికి సంతానప్రాప్తి కలుగలేదు? ఆ పాప ప్రక్షాళన ఏ ఉపాయంవల్ల జరుగుతుంది? ఆ వివరం నాకు తాము దయతో తెలిపితే నేను నా కుమారునికి తెలియజేస్తాను!" అన్న ఆతడి మాటలకు బ్రహ్మ ఆతనితో వాని కుమారునియొక్క పూర్వజన్మ వృత్తాంతాన్ని యిలా తెలియచేశాడు.

"పూర్వం ఈనగరంలోనే సాముడు అనే పేరుగల పంచముడు ఉండేవాడు. అత్యంత దుర్మార్గుడవటంచేత – కేవలం వాడిని చూస్తేనే ఎవరికైనా తమ సకల సత్కర్మలూ నశిస్తాయి! ఇలాఉండగా ఒకనాడు ఆ ఛండాలుడు ధనంమీదగల కాంక్షచేత సత్పురులైన పన్నెండుగురు విప్రులను సంహరించి వారిని దోచుకున్నాడు. అలా వారివద్దనున్న సకల సంపదలూ దోచుకుని ఆరాత్రి తన యిల్లు చేరుకున్నాడు. ఆనాడు మాఘబహుళ చవితి! సాయంసంధ్య గడిచి చంద్రుడు ఉదయించే సమయంలో ఆ తస్కరుడు తన కుమారుడిని "గణేశా! గణేశా! వెంటనే రా!" అంటూ పిలిచాడు.

ప్రొద్దుటినుంచి అన్నపాదులు లేనివాడవటంచేత తన కుమారుని

చేరపిలిచి అతనితోకలిసి కడుపారా భుజించాడు. తరువాత కొంతకాలానికి అతని కుమారుడు మరణించాడు. అలా ఆ మాఘబహుళ చవితినాడు చంద్రోదయ సమయంలో అన్యాపదేశంగా తనకే తెలియకుండా ఉపవాసంతో ఉండి గణేశస్మరణను కావించి ప్రసాదాన్ని భుజించినందు వల్ల, సంకష్టచతుర్థీవ్రత సంభవమైన అనంతమైన పుణ్యంయొక్క ప్రభావంచేత, ఆ బాలకుడు పరమ ఆనందమయమైన వైనాయకలోకానికి దివ్యవిమానారూఢుడై పుణ్యశాలులందరూ అర్చిస్తూండగా వెళ్ళాడు. ఆ పుణ్యంయొక్క విశేషంవల్లనే కృతవీర్యుడనే పేరిట రాజై మరుజన్మలో నీకు కుమారునిగా జన్మించాడు! పూర్వజన్మకృతమైన ఆ పాపం నశించిన వెంటనే ఆతడికి పుత్రసంతతి కలుగుతుంది! ఈ మాటలు వింటూన్న కృతవీర్యుని తండ్రి భయంతో గడగడా వణికి, "అతి హేయమైన బ్రహ్మహత్యాపాతకంనుంచి తన కుమారునికి ఎలా విమోచన కలుగ గలదో దయాసముద్రులైన బ్రహ్మదేవుడు ఎంత కష్టతరమైనదైనా ఆ ఉపాయాన్ని దయతో సెలవీయవలె"నంటూ ప్రార్థించాడు.

అప్పుడు బ్రహ్మయిలా బదులిచ్చాడు :

"ఓయీ! నీకుమారుడు "సంకష్టచతుర్థీవ్రత"మనే పేరుగల వ్రతాన్ని శ్రద్ధాభక్తులతో, నియమనిష్టలతో ఆచరించినట్లైతే ఆ మహాపాతకాన్నుంచి విముక్తుడు కాగలడు!" రాజు యిలా తిరిగి ప్రశ్నించాడు.

"ఓ కమలాసనా! ఐతే ఆవ్రతవిధానమెలాగ? అది ఎప్పుడు ఏ మాసములో ఆచరించాలి? అటువంటి మంగళప్రదము అమోఘఫల ప్రదమైన వ్రతవిధానాన్ని దయతో నాకెరిగించు!" అంటూ ప్రార్థించగా,

"ఓయీ! మాఘమాసపు బహుళపక్షములో మంగళవారంతో కలిసి వచ్చే చతుర్థి (చవితి) నాడు శుభముహూర్తంలో — చంద్రుడు ఉదయించే వేళ ఈ వ్రతాన్ని ప్రారంభించాలి! దంతధావనతోపాటు ఇరవైఒక్కమార్లు స్నానంచేసి, నిత్యకర్మలను నిర్వర్తించుకొని, గణేశమహామంత్రజపం చేయాలి! ఆ రోజు ఆహారాన్ని వదిలి, తాంబూలము మొదలైన వాటిని వర్జించి, మౌనంవహించి, యితరులను నిందించటం పిశునత్వం (పీనాసి తనం), యితరులపట్ల ద్రోహచింతన వంటివి విడనాడి నియమంగా గడపాలి!

ఆనాటి సాయంత్రం తిలామలకచూర్ణం (తెల్లనువ్వులు, ఉసిరి కాయలు కలిపి నూరినది) తో నలుగుపెట్టుకొని స్నానంచేయాలి! తన శక్తికొలది ఏకాక్షరి, షడక్షరి లేదా వైదికమంత్రము (గణానాం త్వా) ను జపించి ఆ గజాననుని మూర్తిని స్థిరమనస్కుడై ధ్యానించాలి. ఒక ముహూర్తకాలం గడిచాక భక్తవరప్రదుడైన ఆ గణేశుని షోడశోపచారము లతో పూజించాలి! ఇక నివేదనకై మోదుకములు (ఉండ్రాళ్ళు), లడ్లు, అరిసెలు, జంతికలు, పాయసము మొదలైన పిండివంటలతో షడ్రసో పేతములైన ఆధరవులతో అన్నము, పులిహారలను సమర్పించాలి! రకరకాల ఫలములను, తాంబూలమును (సదక్షిణకంగా), ఇరవైఒక్క దూర్వాంకురము (గరికె) లనుకూడా గణేశునికి భక్తితో సమర్పించాలి. వివిధములైన సుగంధపుష్పాలతోనూ, దీపములతోనూ ఆ దేవదేవుని అలంకరించాలి! చంద్రోదయ సమయానికి చతుర్థీతిథికి, గజాననునికీ ఆ తరువాత చంద్రునికీ అర్ఘ్యం యివ్వాలి!

ఆ తరువాత మహానివేదననిచ్చి, అపరాధక్షమాపణకై గణేశుని

వేడుకుని నమస్కరించి, తన శక్తికొలదీ ఇరవైఒక్క మందికి తక్కువ కాకుండా బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి! ఆ తరువాత వ్రతకధను విని మౌనంగా తాను భుజించాలి! మిగతా రాత్రిభాగాన్నియావత్తూ సంకీర్తనతో గడపాలి! ఈవిధంగా ఒక సంవత్సరకాలం నియమపూర్వకంగా ఈవ్రతాన్ని ఆచరించినట్లైతే — సర్వపాపక్షయమై, ఆతడు పుత్రసంతాన మును పొందటంతోపాటూ యింకా ఏ యితర కోరికలున్నప్పటికీ అవన్నీ కూడా అవశ్యం నెరవేరతాయి! ఈ వ్రతంయొక్క ప్రభావంవల్ల సర్వ సంకటములూ నశించి, శత్రుపీడకూడా తొలగుతుంది. ఈ వ్రతాన్ని శమీ (జమ్మి) వృక్షముయొక్క మూలములో (మొదట్లో) కూర్చుని ఉపవాస దీక్షలో మరునాటి ఉదయం చంద్రోదయమయ్యేవరకూ నిష్టతో గణేశ మంత్రాన్ని జపిస్తూ ఈవ్రతాన్ని ఆచరించాలి! అలా చేయడంచేత పుట్టుగుడ్డి, మూగ, చెవిటి వారైనప్పటికీ తప్పక తమ సకలాభీష్టములను పొందుతారు! రాజులు రాజ్యవైభోగాలను బహుళీకృతంగా పొందుతారు.

ఐతే ఆహార నియమాలుకూడా పాటిస్తూ ఈ వ్రతాన్ని ఆచరిస్తే సకలసిద్ధులూ వశమౌతాయి! ప్రతీ మాసంలోనూ చతుర్ధినాడు విధిగా కొన్ని ఆహారనియమాలు పాటించాలి అవేమిటంటే

1) శ్రావణమాసంలో నేయి, లడ్లు విడివిడిగా భుజించాలి!
2) భాద్రపదమాసంలో పెరుగును భుజించాలి
3) ఆశ్వయుజమాసంలో ఉపవాసం చేయాలి!
4) కార్తీకంలో పాలు, పానకములను ఆహారంగా స్వీకరించాలి!
5) మార్గశిరమాసంలో నిరాహారిగా ఉండాలి!
6) పుష్యమాసంలో గోమూత్రము, పానకమును సేవించాలి!

7) మాఘమాసములో నువ్వులను

8) ఫాల్గుణమాసంలో చక్కెర-నేయిలను

9) చైత్రమాసంలో పంచగవ్యములను

10) వైశాఖమాసంలో పుష్కరబీజములను

11) జ్యేష్ఠమాసంలో నేయితోతడిపిన భోజనాన్ని

12) ఆషాఢమాసంలో తేనెనూ భుజించాలి

ఈ విధంగా ప్రతిమాసంలోనూ ఆహారనియమాన్ని పాటిస్తూ ఈ చతుర్థీవ్రతాన్ని విధివత్తుగా ఆచరించినట్లయితే సకలసిద్ధులూ సిద్ధిస్తాయి" అన్న బ్రహ్మదేవుడితో కృతవీర్యుని తండ్రి తిరిగి యిలా ప్రశ్నించాడు "ఓ చతురాననా! అన్ని మాసముల చతుర్థీలలోనూ అంగారక చతుర్థి (మంగళవారంతో కూడివచ్చిన బహుళ చతుర్థి) కి విశేషాధిక్యత ఎందుచేత చెప్పబడింది? ఆ విషయాన్ని కూడా దయతో నాకు తెలుపవలసింది. మంగళకరములు, శుభప్రదములైన గజాననుని కథలను ఎంతవిన్నా నాకు తనివితీరటం లేదు!"

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని 'చతుర్థీవ్రతకథనం' అనే 59-వ అధ్యాయం సంపూర్ణం.



60

# అంగారక చతుర్థీ మహిమ

(మూలం)

## షష్టితమో అధ్యాయః

బ్రహ్మోవాచ :

అంగారక చతుర్థ్యాస్తు మహిమేదం మహీపతే ।
శృణుష్వైవ హితోభూత్వా కథయామి సమాసతః 1

అవంతీనగరే రాజన్ భారద్వాజో మహామునిః ।
వేదవేదాంగవిత్ప్రాజ్ఞః సర్వశాస్త్ర విశారదః ॥ 2

అగ్నిహోత్రరతో నిత్యం శిష్యాధ్యయన తత్పరః ।
నదీతీర గతస్తిష్ఠన్ను నుష్ఠానపరో మునిః ॥ 3

ఏకస్మిన్నేవ సమయే దృష్టాతేనా ప్సరోవరా।
తాం దృష్ట్వా చకమే భోక్తుం భారద్వాజో మహామునిః ॥ 4

అకస్మాత్కామినీం దృష్ట్వా కామాసక్తో భవన్మునిః ।
కామబాణాభిభూతస్సన్ నిపపాత మహీతలే ॥ 5

అతివిహ్వలగాత్రస్య తస్యరేతః ప్రచస్థలే ।
ప్రావేష్టం తస్యతద్రేతః పృధివీ బిలమధ్యతః ॥ 6

తతఏతః కుమారో అభూ జ్జపాకుసుమ సన్నిభః ।
తం ధరిత్రీ స్నేహవశా త్పాలయామాస సాదరం ॥ 7

జనుః స్వం తేన ధన్యసా మనుతే పితరౌ కులం ।
తతః స సప్తవర్షస్తాం పప్రచ్ఛ జననీం నిజాం ॥ 8

మయి లోహిత మాకస్మా న్మాణుషం దేహమాస్థితే ।
కశ్చమే జనకో మాతస్త్వం మమాచక్ష్వ సాంప్రతం ॥ 9

**ధరణ్యువాచ :**

భారద్వాజమునే రేతఃస్కలితం మయిసంగతం।
తతో జాతోసి రేపుత్ర వర్ధితోసి మయా శుభం ॥ 10

**పుత్ర ఉవాచ :**

తర్హి తం మేమునిం మాతర్దర్శయస్వ తపోనిధిం ॥

**బ్రహ్మోవాచ :**

తమాదాయ తదా దేవీ భారద్వాజం జగామ కుః ॥ 11

ఉవాచ ప్రణిపత్యైనం త్వద్వీర్యప్రసవం సుతం ॥
వర్ధితం తంపురోధార్య స్వీకురుష్వ మునేధునా ॥ 12

తదా జయా యయౌ ధాత్రీ స్వధామ రుచిరం తదా ।
భారద్వాజః సుతం లబ్ధ్వా ముముదే చాలిలింగ తం ॥ 13

అఘ్రాయ శిర ఉత్సంగే స్థాపయామాస తం ముదా ।
సుముహూర్తే శుభేలగ్నే చకారోపనయంమునిః ॥ 14

వేదశాస్త్రాణ్యుపాదిశ్య గణేశస్య మనుం శుభం ।
ఉవాచ కుర్వనుష్ఠానం గణేశప్రీతయే చిరం ॥ 15

సంతుష్టో దాస్యతేకామాన్ సర్వాం స్తవమనోగతాన్ ।
తతస్స నర్మదా తీరే పద్మాసన గతో మునిః ॥ 16

సన్నియమ్యేంద్రియాణ్యాశు ధ్యాయన్ హేరంబ మంతరా ।
జజాప పరమం మంత్రం వాయుభక్షో భ్రుశం కృశః ॥ 17

ఏవం వర్షసహస్ర సంతపస్తేపే సుదారుణం ।
మాఘ కృష్ణచతుర్థ్యాంత ముదయే శశినో మలే ॥ 18

దర్శయామాస రూపం స్వం గణనాథో అథ దిగ్భుజం ।
దివ్యాంబరం బాలచంద్రం నానాయుధ లసత్కరం ॥ 19

చారు శుండం లసద్దంతం శూర్పకర్ణం సకుండలం ।
సూర్యకోటి ప్రతీకాశం నానాలంకార మండితం ॥ 20

దదర్శ రూపం దేవస్య స బాలః పురతస్థితం ।
ఉద్ధాయ ప్రణిపత్యైనం తుష్టావ జగదీశ్వరం ॥ 21

**భౌమ ఉవాచ :**

నమస్తే విఘ్ననాశాయ నమస్తే విఘ్నకారిణే ।
సురాసురాణా మీశాయ సర్వశక్త్యుపబృంహణే ॥ 22

నిరామయాయ నిత్యాయ నిర్గుణాయ గుణచ్ఛిదే ।
నమో బ్రహ్మవిదాం శ్రేష్ఠః స్థితి సంహార కారిణే ॥ 23

నమస్తే జగదాధార నమస్త్రై లోక్య పాలక ।
బ్రహ్మాదయే బ్రహ్మవిదే బ్రహ్మణే బ్రహ్మరూపిణే ॥ 24

లక్ష్యాలక్ష్య స్వరూపాయ దుర్లక్షణఛిదే నమః ।
నమః శ్రీగణనాథాయ పరేశాయ నమో నమః ॥ 25

ఇతి స్తుతః ప్రసన్నాత్మా పరమాత్మా గజాననః ।
ఉవాచ శ్లక్ష్ణయా వాచా బాలకం సంప్రహర్షయన్ ॥ 26

**గజానన ఉవాచ :**

తవోగ్రతపసా తుష్టో భక్త్యా స్తుత్యానయాపి చ ॥ 27

బాలభావేపి ధైర్యాత్తే దదామి వాంఛితాన్ వరాన్ ।
ఏవముక్తో భూమిపుత్రో వచూచేతం గజాననం ॥ 28

**భౌమ ఉవాచ :**

ధన్యా దృష్టిర్ఘననమపి మే దర్శనాత్తే సురేశ,
ధన్యం జ్ఞానం కులమపివిభో భూస్సశైలాద్య ధన్యా ।
ధన్యంచైతత్సకలమపి తపో యేనదృష్టో ఖిలేశో,
ధన్యావాణీ వసతిరపి మయా సంస్తుతో మూఢభావాత్ ॥ 29

యదితుష్టోసి దేవేశ స్వర్గే భవతుమే స్థితి : ।
అమృతంపాతుమిచ్ఛామి దైవైః సహ గజానన ॥ 30

కల్యాణకారి మేనామ ఖ్యాతిమేతు జగత్రయే ।
దర్శనం మేచతుర్థ్యాంతే జాతం పుణ్యప్రదం విభో । 31

అంతఃసా పుణ్యదానిత్యం సర్వసంకష్ట హారిణీ ॥
కామదా వ్రతకర్తౄణాం త్వత్ప్రసాదాత్ సదాస్తుచ ॥ 32

**గణేశ ఉవాచ :**

అమృతం ప్రాస్యసేసమ్య గ్దేవైఃసహ ధరాసుత ।
మంగళేతి చ నామ్నాత్వం లోకేఖ్యాతిం గమిష్యసి ॥ 33

అంగారకేతి రక్తత్వాద్వసుమత్యాః యతస్సుతః ।
అంగారకచతుర్థీం యే కరిష్యంతి నరా భువి ॥ 34

తేషామబ్ద సమంపుణ్యం సంకష్టీవ్రత సంభవం ।
నిర్విఘ్నతా సర్వకార్యేషు భవిష్యతి నసంశయః ।
అవంతీ నగరే రాజా భవిష్యసి నసంశయః ॥ 35

వ్రతానాముత్తమం యస్మాత్త్వకృతం తే వ్రతముత్తమం ।
యస్య సంకీర్తనాన్మర్త్యః సర్వాన్కామానవాప్నుయాత్ ॥ 36

**బ్రహ్మోవాచ :**

ఇతి దత్వావరో దేవః పిదధే ద్విరదాననః ॥

తతస్తు మంగళో దేవం స్తావయామాసభక్తితః ।
శుండా ముఖం దశభుజం సర్వావయవ సుందరం ॥ 37

ప్రాసాదం కారయామాస గజాననముదావహం ।
సంజ్ఞాం మంగళమూర్తీతి దేవదేవస్య సోకరోత్ । 38

తతో భవత్కామదాత్ర క్షేత్రం సర్వజనస్య తత్ ।
అనుష్ఠానాత్పూజనాచ్ఛ దర్శనాత్సర్వమోక్షదం ॥ 39

తతో వినాయకో దేవో విమానవరముత్తమం ।
ప్రేషయామాస స్వగణైర్భ్రాజమానే తమంతికం ॥ 40

తే గత్వాతేన దేహేన తంభౌమ మానయన్బలాత్ ।
గణేశస్యాంతికం రాజం స్తదద్భుతమివాభవత్ । 41

తతో భౌమోభవత్ ఖ్యాతః త్రైలోక్యే సచరాచరే ।
యతో భౌమేన సంకష్ట చతుర్థీ భౌమసంయుతా ॥ 42

కృతా ప్రాప్తం చ స్వర్గేచామృతపానం సురైస్సహ ।
అతశ్చాంగారకయుతా చతుర్థీ ప్రథితా భువి ॥ 43

చింతితార్థప్రదానేన చింతామణీరితి ప్రథాం ।
ప్రయాతో మంగళమూర్తిః సర్వానుగ్రహకారకః ॥ 44

పారినేరాత్తునగరా త్పశ్చిమేప్రథితో భవత్ ।
చింతామణీరితి ఖ్యాతః సర్వవిఘ్ననివారణః ॥ 45

అధునా సిద్ధగంధర్వైః పూజ్యతే సవిధూదయే ।
దదాతీ వాంఛితానర్థాన్ పుత్రపౌత్రాది సంపదః ॥ 46

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే అంగారకచతుర్థీ ఉపాఖ్యానే**
**షష్టితమో అధ్యాయః సంపూర్ణం ॥**



## 60-వ అధ్యాయము

# అంగారకచతుర్థీ మహిమ

కార్తవీర్యునితండ్రి అంగారకచతుర్థియొక్క ప్రాశస్త్యాన్ని చెప్పమని ప్రార్థించగా అప్పుడు బ్రహ్మ యిలా చెప్పసాగాడు. "ఓ రాజా! **అంగారక చతుర్థియొక్క** మహిమను వివరిస్తాను. సావధానంగా విను! పూర్వం అవంతీ నగరంలో భారద్వాజుడనే ముని వుండేవాడు. అతడు యమ, నియమ సంపన్నుడై, వేదవేదాంగాలలోని తత్త్వమంతా అవపోశనపట్టి, శిష్యులకు మహోత్కృష్టమైన శిక్షణగరపుతూ నిరతాగ్నిహోత్రపరుడై 'మరో అగ్నిదేవుడా' అన్నంత తేజస్సుతో ప్రకాశించేవాడు. అతడొకనాడు ఒక నదీతీరములో అనుష్టానంలో మగ్నుడై ఉన్నసమయంలో మహాసౌందర్య వతియైన ఒక అప్సరసను చూశాడు. ఆమెపట్ల కోరిక కలుగగా కామ మోహితుడై మూర్ఛిల్లాడు. అప్పుడు వివశుడైన ఆతనికి రేతస్ఖలనం కలిగింది. ఆ వీర్యం నేలపైనిగల ఒక బొరియలోకి జారింది. ఆ

రేతస్సునుండి జపాకుసుమం వంటి ఒక సుందరుడైన బాలకుడు ఉద్భ వించాడు. ఆ బాలుని సంరక్షణాభారాన్ని భూదేవత స్వీకరించి పెంచ సాగింది. ఇలా ఏడుసంవత్సరాలు గడిచాక ఆ బాలుడు 'నాతండ్రి ఎవరు?' ఏ కారణంచేత నాకు ఈ ఎఱ్ఱటిశరీరం కలిగింది? ఆ వివరం నాకు యిప్పుడు వెంటనే చెప్పు' అంటూ ప్రశ్నించాడు.

అప్పుడు 'ఓ కుమారా! భారద్వాజుని రేతస్సు నాయందు స్ఖలిత మవ్వగా నీవు జన్మించావు. నావలన సంరక్షించబడుతూ యింతవాడ వైనావు!' అనగానే ఆ బాలకుడు

'ఐతే వెంటనే నాతండ్రియైన ఆ తపోనిధిని నాకు చూపించు!'' అన్న ఆ బాలకుడిని తీసుకునివెళ్ళి భారద్వాజుని ఆశ్రమం వద్దకు కొనిపోయి, ఆతడితో యిలా అన్నది. 'ఓయీ! నీవీర్యంచేత ఉద్భవించిన ఈ బాలకుడు నాచేత సంరక్షింపబడ్డాడు. కనుక నీవిక వీనిని స్వీకరించు!' అంటూ అప్పచెప్పి ఆ ముని వద్ద సెలవుగైకొని వెళ్ళిపోయింది! అప్పుడా ముని తన కుమారుని ఆలింగనం చేసుకొని, తలపై ముద్దాడి, తన వడిలో కూర్చుండ బెట్టుకున్నాడు. ఒకానొక సుముహూర్తంలో ఆ బాలకునికి ఉపనయనాది సంస్కారములు జరిపించి, వేదశాస్త్రాలను అభ్యసింపచేశాడు. చివరకు సకలార్థప్రదమైన గణేశమంత్రాన్ని ఉపదే శించి, 'నాయనా! దీనిని శ్రద్ధాభక్తులతో భక్తజనవల్లభుడైన గణేశునికి ప్రీతికలిగేలా అనుష్టించు! ఆ దీనపోషకుడి అనుగ్రహాన్ని పొందితివా ఆతడు నీ యెడల అమితప్రసన్నుడై నీకు సకలాభీష్టములను ప్రసాదించ గలడు!' యిలా తండ్రియైన భరద్వాజునిచేత ప్రేరితుడై ఆ బాలకుడు

ఆతడి ఆదేశాన్ననుసరించి నర్మదానదీ తీరాన్ని చేరుకొని అక్కడ ఒకచోట పద్మాసనంలో కూర్చుని సకల ఇంద్రియాలనూ నిగ్రహించి, అంతర్ముఖుడై దీక్షగా తన హృదయకమలంలో గణేశునే ధ్యానిస్తూ, ఆతడి మంత్రజపం చేస్తూ — నిరాహారుడై వేయిసంవత్సరాలు సుదీర్ఘమైన తపస్సును ఆచరించాడు! ఇలా చేస్తూన్న సమయంలో మాఘమాసపు బహుళపక్షంలో చవితినాడు చంద్రోదయకాలంలో నాలుగుచేతులతో, తలపై బాల చంద్రుని చంద్రకళగా ధరించి, సకల ఆయుధాలను ధరించి, దివ్యమైన దేవతావస్త్రాలతో సకలాభరణాలతో శోభిల్లుతూ సుందరమైనట్టి వంకర తిరిగిన తుండముతో, ప్రకాశిస్తూన్న దంతమును కలిగి కుండలాలతో అలంకరించబడిన చేటలవంటి చెవులతో, వేయిసూర్యుల కాంతితో వెలుగుతూ గణేశుడు భక్తవరదుడై శుభంగా దర్శనాన్ననుగ్రహించాడు.

ఆ మంగళప్రదునికి భక్తితో ప్రణమిల్లి ఆ బాలకుడిలా స్తోత్రం చేయసాగాడు!

"ఓ భక్తులపాలిట మందారమై, అభక్తులకు సకల విఘ్నకర్తనైన దీనజనావనా! నీకు నమో నమః! దేవతలకు, అసురులకు సకలగణము లకు అధినాయకుడవైన ఓప్రభూ! నీకు నమస్కారం! సకల శక్తులను వికసింపచేసి విజృంభింపచేసే ఓ మూలశక్తిస్వరూపా! నీకు నా నమస్కారము! పరబ్రహ్మతత్త్వమువై, నిర్వికారుడవై, నిర్గుణుడవై, గుణభేదకుడవైన నీకు నమస్కారము! బ్రహ్మాదులలో శ్రేష్ఠుడవునూ, సృష్టిస్థితిలయాలకు కారణభూతుడవైన నీకిదే నా ప్రణతి! మూడు లోకాలనూ ఏలే త్రైలోక్య పాలకా! నీకిదే నాసన్నుతి! ఓ దేవా! లక్ష్యాలక్ష్యస్వరూపుడవూ, సమస్త దుర్లక్షణములను నశింపచేసే నీకిదే ప్రణతి! పరేశుడవైన ఓ విఘ్న

నివారకా! నీకు మరల మరల నమస్కారం!" అంటూ భక్త్యుత్సాహాలతో తనను స్తుతించి తన పాదాలముోల వాలిన ఆతడిని లేవనెత్తి, చిరునవ్వు వెన్నెలలా వర్షిస్తూండగా ఆతడిని ఉత్సాహపరుస్తూ మృదుమధురంగా గజాననుడిలా అన్నాడు.

'ఓ బాలకా! నీ భక్తికీ, నీయీ స్తుతికీ నాకు ఎంతో సంతోషం కలిగింది! నీ ఉగ్రతపస్సు నన్ను తృప్తిపరచింది! అందుచేత నీవు బాలుడ వైనప్పటికీ నీ సకల మనోభీష్టాలనూ అనుగ్రహించదలచాను! అవేమిటో కోరుకో!'

ఆమాటకు స్వాంతనచెందిన ఆ భూమి పుత్రుడిలా ప్రార్థించాడు. "ఓ దేవాధిదేవా! మీయొక్క దివ్యమంగళరూపాన్ని చూడటంవల్ల నా దృష్టి ధన్యమైంది! మీ దర్శనభాగ్యంచేత నాజన్మ, నాకులము, పావనమైనాయి! మిమ్ములను ధరించుటచేత సకల పర్వతాలతోనూ, వనాలతో విలసిల్లే ఈ భూమి యావత్తూ ధన్యమైంది. అందరికీ ప్రభువువైన తమ దర్శన భాగ్యంచేత నా తపస్సూ, మూఢభావంతో కూడినదైనా నిన్ను స్తుతించటం చేత నావాక్కూ ధన్యములైనాయి! ఓదేవా! సకలమంగళకారకా! నీవు సంతుష్టుడవైతే నన్ను స్వర్గలోకం చేర్చి, అక్కడగల దేవతలతోపాటూ నాకూ అమృతపానంచేసే భాగ్యం ప్రసాదించు. నేను మంగళుడన్న పేరిట లోకప్రసిద్ధుడనౌదును గాక! నీ దివ్యదర్శనము నాకు సంప్రాప్తమైన ఈ చతుర్థితిథి పుణ్యప్రదమై సర్వసంకష్టములనూ హరించునుగాక! నీ అనుగ్రహ విశేషంచేత ఈ చతుర్థితిథినాడు వ్రతమాచరించినవారికి సకలాభీష్టములూ నెరవేరునుగాక!"

అంటూ ప్రార్థించిన ఆతడితో గణేశుడిలా వరమిచ్చాడు.



వీరగణపతి

"నాయనా! భూమిసుతుడవైన నీవు రక్తవర్ణము కలవాడవటంచేత నీకు అంగారకుడవన్నపేరుతో వర్ధిల్లు! **అంగారకచతుర్థినాడు** వ్రతం ఎవరు ఆచరిస్తారో వాళ్ళకు ఒక సంవత్సరంపాటు సంకష్టీవ్రతంవల్ల కలిగేంత పుణ్యం కలుగుతుంది. ఈ అంగారక చతుర్థీవ్రత ఆచరణవల్ల సర్వ కార్యములయందూ అవిఘ్నత నిస్సందేహంగా కలుగుతుంది. నీవు ఎంతో ఉత్తమమైనదీ, అమితఫలవంతమైన ఈ వ్రతాన్ని అనుష్టించటంచేత ఈ పుణ్యప్రభావంవల్ల నీవు అవంతీదేశానికి రాజువవుతావు!" అంటూ అంతర్హితుడైనాడు.

ఓ వ్యాసమునీంద్రా! ఈవిధంగా కృష్ణ అంగారక చతుర్థినాడు సకలాభీష్టప్రదమైన అంగారక చతుర్థీవ్రతాన్ని అనుగ్రహించి, ఆతడి సకలాభీష్టములనూ ప్రసాదించి సకల జగన్మోహనకరమైన తన దివ్యమంగళ విగ్రహంతో దర్శనమిచ్చి గణేశుడు అంతర్ధానం చెందాడు! ఆతరువాత ఆమంగళుడు పదిబాహువులుగల సుందరమైన గణేశమూర్తిని ప్రతిష్ఠించి గజాననుని సంతుష్టికొరకు గొప్ప ఆలయాన్ని నిర్మించాడు. అంతేకాక ఆమూర్తికి **"మంగళమూర్తి"** అన్న నామకరణం చేశాడు. అప్పటినుండీ ఆ ప్రదేశము **'కామదాతృ క్షేత్రము'** అన్నపేరుతో ప్రసిద్ధిచెందింది.

ఈ క్షేత్రములో జరిపే అనుష్టానము, పూజ, దర్శనములు మోక్ష దాయకములు! ఆ తరువాత గజాననుడు తన వైనాయకగణాలను తోడిచ్చి, భౌముని తనవద్దకు తీసుకురావటానికి ఉత్తమమైన విమానమును పంపించాడు. అప్పుడా దూతలు ఆ భౌముని సశరీరునిగా గజాననుని సన్నిధికి తీసుకువెళ్ళురు. **మంగళవారం చవితి కలిసివచ్చిన నాడు సంకష్టహర చతుర్థీవ్రతాన్ని ఆచరించటంవల్ల** అతడు ముల్లోకాల

లోనూ 'భౌముడు' అన్న పేరుతో ప్రసిద్ధిచెందాడు. ఆ తరువాత ఆతడికి దేవలోకంలో దేవతలతోపాటు అమృతపానముచేసే భాగ్యం సంప్రాప్తించి నది'. అంటూ వ్యాసభగవానునికి చెప్పిన గాధనే కార్తవీర్యుని తండ్రియైన కృతవీరునికీ తెలిపి బ్రహ్మ యింకా యిలాఅన్నాడు.

"ఓరాజా! పారినేర నగరానికి పశ్చిమభాగంలో 'చింతామణి' అన్న పేరిట సర్వవిఘ్ననివారకుడైన మంగళమూర్తి అవిధంగా వెలిశాడు. అప్పటినుంచీ **అంగారకచతుర్థీ లోకంలో** ప్రఖ్యాతమైంది. ఇప్పటికి ఆ మంగళమూర్తి సన్నిధికి నిత్యం చంద్రోదయ సమయంలో సిద్ధులు, గంధర్వులూ చేరి పూజిస్తూ ఉంటారు. ఆ దేవదేవుడు భక్తులయొక్క సకల మనో రధాలనూ పూర్తిచేసి పుత్రపౌత్రాది సంపదలనూ ప్రసాదిస్తూ న్నాడు."

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'అంగారకచతుర్థీ మహాత్మ్యం'** అనే 60-వ అధ్యాయం.



61

# చంద్రశాపానుగ్రహ వర్ణనం

(మూలం)

## ఏకషష్టితమో అధ్యాయః

## చంద్రశాపకథా

**బ్రహ్మోవాచ :**

ఏకదాఽహం గతోరాజన్ కైలాసం గిరిశాలయం ।
ఉపవిష్టః సభామధ్యే పశ్యన్నారదమాగతం ॥ 1

తేనాఽపూర్వం ఫలంచైకం శంకరాయ నివేదితం ।
యయాచే గణపస్తత్తు కుమారోఽపి చ శంభవే ॥ 2

కస్మై దేయంఫలమిదం అపృచ్ఛచ్ఛంకరోఽపి మాం ।
అహం ప్రోవాచ బాలాయ కుమారాయేతి తంతదా ॥ 3

దత్తం శివేన తస్మై తచ్చుక్రోధ చ గజాననః ।
తతో బ్రహ్మ స్వభవనం గత్వా స్రష్టుమియేష సః ॥ 4

తత్ర విఘ్నకరో విఘ్నం చకార పరమాద్భుతం ।
ఉగ్రరూపం సమాస్థాయ భీషయామాస మాం సదా ॥ 5

మయి భ్రాంతే సవిధు ర్ద్రుష్ట్వా క్రూరతరంతు తం ।
అహిస త్వరమం చంద్రః స్వగణై ర్ద్విరదాననం ॥ 6

తతః పరమకృద్ధో సా దశపత్త్రం విధుంతదా ।
ఆదర్శనీయస్త్రైలోక్యే మద్వాక్యాత్త్వం భవిష్యసి ॥ 7

కదాచిత్కేన దృష్టః స మహాపాతకవాన్ భవేత్ ।
ఏవం శప్త్వాగతో దేవో నిజధామ గణైర్వృతః ॥ 8

చంద్రసు మలినో దీనో లీనశ్చింతామయే హ్రదే ।
అణిమాది గుణోపేతే జగత్కారణ కారణే ॥ 9

కథమాచరితం దౌష్ట్య మజ్ఞానాద్బాలవ న్మయా ।
ఆదర్శనీయః సర్వేషాం వివర్ణో వదనోభవత్ ॥ 10

కథం సురూపో వంద్యశ్చ కలాభిః సురతోషకః ।
ఏతస్మిన్నంతరే దేవైః శ్రుతః శాపో మహాన్విధోః ॥ 11

తత్రేయుర్వహ్నిశక్రాద్యా యత్రాస్తేఽసౌ గజాననః ।
విజిజ్ఞపుః సురౌఘాస్తే విఘ్నకారణ కారిణే ॥ 12

దేవా ఊచుః :

త్వం దేవదేవ జగతామసి వందనీయ
స్త్వంపాసి హంసి విదధాసి యథేష్ట మీశ ॥ 13

త్వం నిర్గుణోఽపి గుణకృత్ గుణినాం త్ర్యధీశ
త్వామేవ దేవ శరణం వయమద్య యాతాః ॥ 14

పాహీశః నోఽఖిల జగత్తవ శాపభీతం ।
చంద్రాపరాధిని కథం పతితం సుకష్టం ॥ 15

తస్మాద్వయంచ జగదీశ: జగచ్చ చంద్ర: ।
శర్మాఽప్నుయామ భువనేశ: తథావిదేహి । 16

కష్టే నిపతితం విశ్వం అదృశ్యే శశిని ప్రభో ।
అనుగ్రహం చ చంద్రేస్మిన్ స్త్రైలోక్యైకర్తుమర్హసి ॥ 17

నాజ్ఞాసీద్యస్యతే రూపం మహిమానం శృతిత్రయం ॥
స కస్యస్తవనీయః స్యా త్తథాపి స్తూయసేఽఖిలైః ॥ 18

కృతకృత్యా వయంతేఽద్య దర్శనాద్భాషణాదపి ।
శరణం తే ప్రసన్నాస్మః ప్రపన్నార్తిహరావ్యయ ॥ 19

ఇతి తద్వచనం శృత్వా జగాద ద్విరదాననః ।
సుప్రసన్నః స్తవైస్తేషాం ధర్మకామార్థ మోక్షదః ॥ 20

**వికట ఉవాచ :**

ప్రసన్నోహం సురాః స్తుత్యా వృణుధ్వం వాంఛితం మహత్ ।
అసాధ్యమపి వో దద్యాం త్రిషులోకేషు యద్భవేత్ ॥ 21

**దేవా ఊచు :**

సుధాకరేనుగ్రహం తే సర్వ ఈహామహేవయం ।
అనుగ్రహీతే తస్మింస్తు సర్వేషాంనో గ్రహోభవేత్ ॥ 22

**గణేశ ఉవాచ :**

ఏకాబ్దంవా తదర్ధంవా తదర్ధార్ధమథాపివా ।
అదర్శనీయోస్తు శశీ బ్రూత్వాన్యంవా వరం సురాః ॥ 23

తతస్తే దండవత్సర్వే ప్రణేము ర్ద్విరదాననం ।
సా వాచప్రణతాం స్తాంస్తు వికటో భావపూర్వకం ॥ 24

అప్రమాణం కథ మహో వచనం కర్తుముద్యతాః ।
శరణం చ ప్రపన్నానాం నత్యాగం కర్తుముత్సహే ॥ 25

మేరుశ్చతత్పతిః సూర్యోవహ్నిః శీతో భవేద్యది ।
మర్యాదా ముత్సృజేత్సింధుః వచో మేనానృతం భవేత్ ॥ 26

అథాపి గదతోవాక్యం శృణుధ్వం సురసత్తమాః ।
భాద్రశుక్ల చతుర్థ్యాంయో జ్ఞానతో అజ్ఞానతో పి వా ॥ 27

అభిశాపీ భవేచ్చంద్ర దర్శనాద్ధృశ దుఃఖభాక్ ।
ఇతి తద్వచనం శృత్వా దేవా(ము) ముదిరే ఖిలాః ॥ 28

ఓమితి ప్రణిపత్యోచుః పుష్పవృష్టించ చిక్షిపుః ।
తదనుజ్ఞాం గృహీత్వేయు ర్దే వాశ్చంద్రమసం ప్రతి ॥ 29

తమూచు స్త్వంమూఢతరో యో హసద్విరదాననం ।
త్రైలోక్యం సంకటేక్షిప్తం త్వయా శ్రేష్ఠాపరాధినా ॥ 30

త్రైలోక్యనాయకే దేవే జగత్త్రయ విధాయిని ।
అవ్యయే నిర్గుణే నిత్యే పరబ్రహ్మ స్వరూపిణీ ॥ 31

గజాననేఽఖిలగురావపరాధం యతో చరః ।
ఏవం నియమితం తేన సర్వలోక హితేప్సు నా ॥ 32

అస్మాభిః పరమక్లేశా త్ప్రసన్నోసౌ కృతోవిభుః ।
భాద్రశుక్ల చతుర్థ్యాం త్వం నద్రష్టవ్యః కదాచన । 33

త్వం చాపిశరణం యాహి దేవదేవం గజాననం ।
తత్ప్రసాదా చ్ఛుద్ధతనుః పరాంఖ్యాతి మవాప్స్యసి । 34

ఇతి చంద్రోవచఃశృత్వా దేవానాం హితమాత్మనః ।
జగామ శరణం దేవం శరణాగత వత్సలంః ॥ 35

గజాననం సురేశానం మహేశానాది వందితం ।
జజాప పరమం మంత్రం ఏకాక్షర మఘాపహా ॥ 36

విధురింద్రోపదిష్టం స పరమేణ సమాధినా ।
దశద్వాదశ వర్షాణి తపస్తేపే సుదారుణం ॥ 37

గంగాయాః దక్షిణేతీరే సర్వసిద్ధి ప్రదాయినీ ।
తతఃప్రసన్నో భగవాన్ పురో యాతో గజాననః ॥ 38

రక్త మాల్యాంబర ధరో రక్తచందన చర్చితః ।
చతుర్భుజో మహాకాయో సింధూరారుణ విగ్రహః ॥ 39

ప్రభయా భాసయన్ లోకా న్కోటిసూర్యాధిక ప్రభః ।
తేజస్సమూహం దృష్ట్వా తం ప్రచకంపే భృశం శశీ ॥ 40

పరమం స్థైర్యమాస్థాయ కృతాంజలి పుటః పురః ।
తర్కయామాస మనసా ప్రాయోయం ద్విరదాననః ॥ 41

వరం దాతుమిహాయాత ఇతి నత్వా ననామతం ।
తుష్టావ పరమా భక్త్యా దేవదేవం గజాననం ॥ 42

**చంద్ర ఉవాచ :**

నమామి దేవం ద్విరదాననం తం యస్సర్వవిఘ్నం హరతే జనానాం ।
ధర్మార్థకామాం స్తనుతేఽఖిలానాం తస్మై నమో విఘ్నవినాశనాయ॥ 43

కృపానిధే! బ్రహ్మమయాయ దేవ విశ్వాత్మనే విశ్వవిధానదక్ష!
విశ్వస్యబీజాయ జగన్మయాయ త్రైలోక్యసంహారకృతే నమస్తే 44

త్రయీమయాయాఖిల బుద్ధిదాత్రే బుద్ధిప్రదీపాయ సురాధిపాయ ।
నిత్యాయ సత్యాయ చ నిత్యబుద్ధే నిత్యం నిరీహాయ నమోస్తు నిత్యం॥ 45

అజ్ఞాన దోషేణ కృతో పరాధరో స్తం క్షంతుమర్హోసి దయాక రత్వం ।
తదాపి దోషఃశరణాగతస్య త్యాగేమమాత్మన్ కురుమేఽనుకంపాం ॥ 46

బ్రహ్మోవాచ :

ఇది తద్వచనం శృత్వా సుప్రసన్నో గజాననః ।
తస్మైవరాన్ దదౌ దేవః స్తుత్యా నత్యా సుతోషితః । 47

యధాపూర్వం స్థితంరూపం తధాతత్తే భవిష్యతి ।
భాద్రశుక్ల చతుర్థ్యాంత్వాం యో నరః సంప్రపశ్యతి ॥ 48

తస్యాఽభిశాపో నూనంస్యా త్పాపం హానిశ్చ మూర్ఖతా ।
తస్యామదర్శనీయోసి యదుక్తం యోసురైస్సహ ॥ 49

కృష్ణపక్షే చతుర్థ్యాంతు వ్రతం చ యత్క్రియతే నరైః ।
తవోదయే సుపూజ్యస్త్వం పూజనీయఃప్రయత్నతః । 50

దర్శనీయః ప్రయత్నేన విపరీతే వ్రతం వృధా ।
లలాటే కలయాతిష్ఠ మమ ప్రీతికరఃశశిన్ ॥ 51

ప్రతి మాసం ద్వితీయాయాం సమస్యశ్చ భవిష్యసి
ఏవం లబ్ధవరశ్చంద్రో యథా పూర్వం భవత్తదా ॥ 52

స్థాపయామాస వరదమూర్తిం దేవర్షిభిస్సహ ॥

ఫాలచంద్రేతి నామాస్య చక్రుస్తే మునయస్సురాః ।
ప్రాసాదం కారయామాస కాంచనం రత్నసంయుతం ॥ 53

ఉపచారై షోడశభిః పూజయామాస సాదరం॥ 54

పూజయిత్వా సురాః సర్వే మునయశ్చ వరాన్ దదుః ।
సిద్ధిక్షేత్రమిదంలోకే విఖ్యాతంతు భవిష్యతి ॥ 55

అనుష్ఠానవతామత్ర సర్వసిద్ధికరం భవేత్ ।
తతస్తే దేవమునయో నత్వా తం ద్విరదాననం ॥ 56

యయుః ప్రసన్నమనసః స్వంస్వంస్థానం ముదాయుతాః ।
యాతేషు దేవమునిషు దేవోఽపిపిదధే వపుః ॥ 57

అంతర్హితే భాలచంద్రే చంద్రోహృష్టమనా ఇవ ।
స్వంధామ ప్రతిపద్యైవ స్వంధామ ప్రయయౌ తదా ॥ 57

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే చంద్ర శాపానుగ్రహ వర్ణనంనామ ఏకషష్టితమో అధ్యాయః**



# 61-వ అధ్యాయము

# చంద్రశాపానుగ్రహ వర్ణనం

ఆ తరువాత బ్రహ్మ యిలా చెప్పసాగాడు :

"ఓ రాజా! ఒకానొకప్పుడు నేను పరమేశ్వరుడు నివసించే కైలాసమునకు వెళ్ళాను! అక్కడ ఉచితాసనాన్ని అలంకరించిన నేను నారదమహర్షి రాకను గమనించాను. ఆతడు ఒక అపూర్వఫలాన్ని తెచ్చి శంకరునకు యిచ్చాడు. ఆ ఫలమును తనకివ్వమని గణపతీ, తనకే యివ్వమని కుమారస్వామీ శివుడిని కోరారు. అప్పుడు శివుడు నన్ను 'ఆఫలాన్ని యిరువురిలో ఎవరికివ్వమంటా'వని అడిగాడు. నేను చిన్న వాడైన కుమారునికిమ్మన్నాను'. శివుడు అలాగే చేయగా, గజాననుడు క్రోధపరవశుడైనాడు. తాను మహోగ్రరూపం ధరించి నన్ను భయపెట్ట సాగాడు. ఒక అద్భుతమైన విఘ్నాన్నికూడా నాకు కల్గించాడా విఘ్నకరుడు.

ఇలా నేను భ్రాంతి చెందియుండగా చంద్రుడు తన పరివారముతోకూడి వికృతరూపుడైన గజాననుని చూసి గొప్ప పరిహాసం చేశాడు. అప్పుడు క్రోధోద్దీపితుడైన గజాననుడు చంద్రుణ్ణి యిలా శపించాడు.

"ఈ మూడులోకాలలోనూ ఎవరిచేతా చూడబడతగనివాడవగుదువు గాక! ఒకవేళ అలా ఎవరైనా నిన్నుచూస్తే అట్టివాడు మహాపాపి అవుతాడు!"

ఇలా శాపాన్ని యిచ్చి గణేశుడు స్వగణాలతో కూడి తన లోకానికి వెళ్ళిపోయాడు. ఇక చంద్రుడు శాపగ్రస్తుడవటంచేత మలినుడూ, దీనుడూ అయి, దుఃఖసముద్రంలో మునిగిపోయి ఇలా విచారించసాగాడు.

"మూర్ఖుడిలా అనాలోచితంగా దేవపరిహాసంచేసి ఎంతటి చేటును కొనితెచ్చుకున్నాను? బాలునిలా అజ్ఞానంతో యిలా చేయడంవల్లనే నాకీ దురవస్థ సంప్రాప్తమైంది! అందరిచేతా ఆహ్లాదకారిగా కొనియాడబడే నేను ఈరకంగా వివర్ణుడనైనాను! ఎప్పటికి తిరిగి మళ్ళీ సురూపుడను కాగలనో కదా? అందరిచేత వందనీయుడనయ్యేది ఇక ఎన్నటికో? పదహారు కళలతోనూ సకల లోకులకూ, దేవతలకూ మునుపటిలా సంతోషకరుడినెలా కాగలను?" అనుకుంటూ పరిపరి విధాల పరితపించాడు.

బ్రహ్మ యిలా కొనసాగించాడు. 'ఓరాజా! ఇంతలో దేవతలకు చంద్రుని శాపవృత్తాంతం తెలిసి వెంటనే ఇంద్రాది దేవతలు గజాననుడిని చేరుకుని విఘ్నకారకుడూ, సకల విఘ్నహర్తాయైన ఆ గజవదనునితో యిలా మనవిచేసుకున్నారు.

"ఓ దేవదేవా! సమస్త జగత్తులచేతా పూజింపతగినవాడవు! సృష్టిస్థితి

లయములకు కారకుడవు! నీవు స్వతః నిర్గుణస్వరూపుడవైనప్పటికీ గుణములను సృష్టించి, సృష్టి అనే లీలను నడిపిస్తూంటావు! త్రిమూర్తు లకూ ఆధారమైనటువంటి పరబ్రహ్మతత్త్వానికి రూపుకట్టినవాడవు, మహా మహిమోపేతుడవు! ఓ ప్రభూ! మమ్ములను రక్షించు! అపరాధియైన చంద్రుడికింతటి మహాకష్ట మెందుకు కలిగింది? ఓ దేవా! సకలజగత్తూ, దేవతలమైన మేమూ, చంద్రుడూ ఏంచేస్తే సుఖము పొందగలమో అది ఒనరించు! ఓ ప్రభూ! చంద్రుడు కానరాక ఈ జగత్తంతా కష్టజలధి లో మునిగిఉన్నది! అందువల్ల చంద్రునియందూ, త్రైలోకములందూ నీ దివ్యానుగ్రహాన్ని ప్రసరించు. మమ్మల్ని కృతార్థులను చేయి!'

ఓ దేవా! వేదాలుసైతం నీరూపాన్నిగాని, మహిమనుగాని తెలుసుకో లేక మౌనం వహించాయి! అట్టి నిన్ను స్తుతించబూనుకోవటం ఎంతటి సాహసం? మహామహిమాన్వితుడవూ కరుణాంతరంగుడవూ ఐన నిన్ను శరణుపొందుతున్నాము. నీ దర్శనంచేతా, నీతో సంభాషించటంచేతా మా హృదయాలకు స్వస్థతచిక్కింది! ప్రపన్నులైనవారి బాధలను తొలగించే ఓ దయాసముద్రా! నిన్ను శరణుపొందుతున్నాము!"

దేవతల ఈ స్తుతికి ప్రసన్నుడైన ఆ కరివదనుడు సకలమనోభీష్టా లను ప్రసాదించగల కామితార్థప్రదుడై, చిరునవ్వు దరహాసచంద్రికయై వదనంపై విరియంగా మనోహరంగా యిలాఅన్నాడు.

"ఓ దేవతలారా! మీ ఈ స్తుతిచేత నేను ప్రసన్నుడనైనాను. మీ వాంఛితాన్ని ఎంతటి దుర్లభమైనదైనా అనుగ్రహించదలిచాను! కోరు కోండి!" అనగా అప్పుడు సకలదేవతలూ యిలా వేడుకున్నారు.

'ఓ దేవా! చంద్రుని దయతో అనుగ్రహించవలసిందిగా మేమంద రమూ వేడుకుంటున్నాం! చంద్రుణ్ణి తాను అనుగ్రహిస్తే, మేమందరమూ అనుగ్రహించబడ్డట్లే!' అనగానే ఆ వినాయకుడిలా అన్నాడు. ఓ దేవత లారా! నాశాపం అప్రతిహతమైనది. ఐనా మీకోరికమేరకు ఒక సంవత్సర కాలంగాని, ఆరు నెలలుగాని, అందులో సగమైన మూడునెలలపాటు కానీ, చంద్రుడు దర్శింపతగినవాడుకాదు! కనుక ఇదికాక మరోవరం కోరుకోండి!'

అప్పుడు సకలదేవతలూ ఆ ద్విరదాననుని పాదాలపైబడి అనన్య భావంతో శరణాగతులై సాష్టాంగ దండప్రణామాలు ఆచరించారు. వారి భక్తిప్రపత్తులకు కరిగిన దీనజన బాంధవుడైన ఆ కరుణాసముద్రుడు యిలా అన్నాడు.

'ఓ దేవతలారా! నావాక్యమును అప్రమాణము చేయటానికి ఎందుకు ప్రయత్నిస్తారు? శరణాగతులైనవారిని విడుచుట నాకు ఏమాత్రం యిష్టం లేనిపని! మేరుపర్వతం చలించవచ్చు, సూర్యుడు గగనాన్ని వీడి నేలపై పడవచ్చు. అగ్ని చల్లదనాన్ని వహించవచ్చు, సముద్రుడు సైతం తన మర్యాద నతిక్రమించి చెలియలికట్టను దాటవచ్చు! నా మాట మాత్రం ఎన్నటికీ వ్యర్థంకాదు! ఐనా ఒకమాటను మీయందరి అనుగ్రహ విశేషంచేత చెబుతాను వినండి! ఎవరైనప్పటికీ తెలిసిగాని, తెలియకగాని భాద్రపద శుక్లచతుర్థినాడు చంద్రదర్శనం చేసినట్లయితే వారు తప్పక దుఃఖాన్ని పొందుతారు! ఇది నిశ్చయం!'

ఈ మాటలకు దేవతలు ఎంతో సంతోషించారు. 'శ్రీగణేశాయ

నమః' అంటూ ఆ దేవదేవునిపై పుష్పవృష్టి కురిపించి, నమస్కరించి, అనుజ్ఞను గైకొని చంద్రునివద్దకు వెళ్ళి యిలాఅన్నారు.

'ఓయీ! నీవెంతటి మూఢుడివి? సకల జగద్వందనీయుడూ పరమ పావనుడైన ఆ గజాననుని చూసి పరిహసిస్తావా? నీయొక్క అవివేకత వలన, నీవొనరించిన అకృత్యంవలన మూడులోకాలూ ఎంతో సంకటం లో పడివున్నాయి. ఆ కరుణాసముద్రుడు ముల్లోకాలకూ అధినాయ కుడు. జగత్రయములకే విధాత! నాశరహితుడు - నిర్గుణుడు, పరబ్రహ్మస్వరూపుడూ, సకలజగాలకు గురుస్వరూపుడైన ఆ మహనీయు నికి ఎందుకు అపరాధం చేశావు? ఆ మహానుభావుడు అతికష్టంమీద మా ప్రార్ధనలకు ప్రసన్నుడై, సకలలోకహితంకోరి మాకు యిలా నియ మించాడు. 'భాద్రపద శుక్లచవితినాడు మాత్రం నీవు ఎవరిచేతా చూడబడ తగనివాడవు! ఓ చంద్రా! నీవుకూడా వివేకం కలిగి వెంటనే ఆ దేవదేవుని శరణువేడు! ఆతడనుగ్రహిస్తే నీవు మరల శుద్ధశరీరాన్నీ, లోకఖ్యాతినీ పొందగలుగుతావు!"

ఈ రకంగా ఆత్మహితోక్తులను దేవతలవద్ద విన్న చంద్రుడు శరణాగతవత్సలుడైన ఆ వరదగణపతిని శరణువేడాడు! తన నిజరూప ప్రాప్తికై సకలపాపహర మైనట్టి ఏకాక్షరీగణపతి మంత్రాన్ని అకుంఠితదీక్షతో 120 సంవత్సరాలపాటు జపిస్తూ దారుణమైన తపస్సుచేశాడు. గంగానదీ తీరానికి దక్షిణఒడ్డున ఘోరతపస్సు ఆచరించగా గజాననుడు ప్రసన్నుడై అతనికి యిలా దివ్యరూపంతో సాక్షాత్కరించాడు.

ఎఱ్ఱటి వస్త్రమును ధరించి, రక్తచందనంతో అలదబడిన మేనును కలిగి నాలుగు బాహువులతోనూ, పెద్ద శరీరంతోనూ సింధూరవర్ణంలో

కోటిసూర్యప్రకాశమానుడై, సకలజగాలనూ ప్రకాశింపచేస్తూ ప్రత్యక్షమవగా ఆ తేజస్సును తట్టుకోలేక అంజలియొగ్గి ఎదుటనిలిచి మనస్సులోనే యిలా స్తుతించసాగాడు.

"సర్వవిఘ్నహరుడవైన ఓ మంగళస్వరూపా నీకు నమస్కారము! భక్తులకు చతుర్విధ పురుషార్థాలనూ అలవోకగా ప్రసాదించే నీకు ఓస్వామీ! శరణాగతి! విశ్వాత్మకుడవు, విశ్వవిధాతవూ కృపానిధివీ, బ్రహ్మ మయుడవైన ఓప్రభూ! నీకు సాష్టాంగనమస్కారం! విశ్వానికే బీజస్వరూపు డవై, జగత్తంతా వ్యాపించిన మోహనకరమైన మాయాస్వరూపుడవై మాయాతీతుడవైన నీ లీలావిభూతికిదే నా ప్రణామం! త్రైలోక్యసంహార కర్తవుగా జీవులలోని బుద్ధిప్రదీపకుడవుగా వెలుగొందే నీకు పదేపదే ఆర్తితో నమస్కరిస్తున్నాను. సురలకు అధిపుడవై, నిత్యసత్య స్వరూపుడవై, నిరీహుడవైన నీకు మరిమరి నమస్కారం! అజ్ఞానంచేత నావల్ల ఒనరింప బడిన అపరాధాన్ని క్షమించు. శరణునొందిన శరణార్థిని! కనుక రక్షించి నన్ను అనుగ్రహించు!" అంటూ పరిపరివిధాల వేడిన ఆ చంద్రుని ఊరడించి చంద్రునికిలా ఆ వరదగణపతి వరాల ననుగ్రహించాడు.

## చంద్ర-వరప్రదానం

ఓ చంద్రా! నీకు యథాపూర్వరూపం సంప్రాప్తమౌగాక! భాద్రపద శుక్ల చతుర్థినాడు మాత్రమే నీవు అదర్శనీయుడవవుతావు! ఇక కృష్ణ పక్ష చతుర్థినాడు నీవు ఉదయించినప్పుడు ఎవరైతే సంకష్ట చతుర్థీ వ్రతాన్ని ఆచరిస్తారో - వారిచేత ఆసమయంలో నీవుకూడా నాతోపాటూ పూజ్యుడవు కాగలవు!

ప్రయత్నపూర్వకంగానైనా ఆరోజు నిన్ను సర్వులూ తప్పక దర్శించి తీరాలి! అలా చేయకపోతే ఆ వ్రతం వృథా అవుతుంది! ఓ చంద్రా! నీవు ఒకకళతో నా లలాటంలో ఉండు! అదినాకు ఎంతో సంతోష కరము! అంతేకాదు ప్రతినెలలోనూ శుక్లపక్ష ద్వితీయనాడు నీవు ప్రయత్న పూర్వకంగా దర్శింపతగినవాడవూ, నమస్కరింపతగినవాడవూ అవుతావు!"

అంటూ భక్తజనపరిపాలకుడైన గజాననుడు కురిపించిన అనుగ్రహ ఫలితంగా చంద్రుడు యధాపూర్వకంగా తిరిగి ప్రకాశవంతుడైనాడు. ఆ తరువాత దేవతాబృందాలు అనుసరించగా గజాననుని మూర్తిని అక్కడ ప్రతిష్టించి, సువర్ణమయమైన, రత్నఖచితమైన మందిరాన్ని నిర్మించి షోడశోపచారములతోనూ ఆ మూర్తిని పూజించాడు. దేవతలు, మునులు కూడా అక్కడ వరదమూర్తిని పూజించి ఆ క్షేత్రానికి శక్తివంతమయ్యేలా వరాలిచ్చారు. సిద్ధక్షేత్రమనే పేరుతో ఆ క్షేత్రము లోకవిఖ్యాతమైంది!

"ఆ దివ్యక్షేత్రంలో అనుష్టానం చేసినవారికి సర్వసిద్ధులూ కలుగు తాయి." అంటూ దీవించి దేవతలు మునులు వరదునికి నమస్కరించి నిర్మలమనస్కులై తమతమ స్థానాలకు వెళ్ళిపోయారు. ఫాలంలో చంద్రుడు అంతర్హితుడైన తరువాత చంద్రుడు సెలవుగైకొని సంతుష్టాంత రంగుడై తన నిజస్థానాన్ని చేరుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'చంద్రశాపానుగ్రహ వర్ణనం' అనే 61-వ అధ్యాయం.



62

# దూర్వోపాఖ్యానం

(మూలం)

## ద్విషష్టితమో ధ్యాయః

**కృతవీర్య పితా ఉవాచ :**

చతుర్థ్యాం కృష్ణపక్షేతు భుక్తిశ్చంద్రోదయే యతః ।
క్రియతే తన్నిమిత్తంయత్ పృష్టం తన్మే నిరూపితం ॥ 1

దూర్వాంకుర అర్పణస్యాపి శ్రోతుమిచ్ఛామి కారణం ।
కిమర్థం గణనాథస్య ప్రియా దూర్వాంకురా వద ॥ 2

**బ్రహ్మోవాచ :**

హంత తేకథయిష్యామి దూర్వాంకుర సమర్పణే ।
యత్ఫలం గణనాథస్య శ్రూయతాం తన్నృపోత్తమ ॥ 3

అవంతీనగరే ఖ్యాతా దేశేదక్షిణతోఽ భవత్ ।
క్షత్రియః సులభోస్యాంతు గుణీ దాని ధనీబలీ ॥ 4

వివేక్యాసీన్మాన్యమానీ శమీదమపరాయణః ।
సర్వ శాస్త్రార్థతత్వజ్ఞ సర్వ వేదార్థతత్వవిత్ ॥ 5

వికటేభక్తి మాన్నిత్యం స్తుతిస్తోత్రపరాయణః ।
తస్య భార్యాసుముద్రాసీన్నామ్నా పరమవిశ్రుతా । 6

అత్యంత సుందరీసాధ్వీ స్వరూపాత్ ధిక్కృతఅప్సరాః ।
దేవ విప్రాతిథిపరా పత్యుః చిత్తానువర్తినీ ॥ 7

పతివ్రతానాం సర్వాసాం మాన్యా శ్రేష్టతమా నృప ।
ఏకస్మిన్దివసే తౌతు దంపతీ స్నాననిర్మితౌ ॥ 8

ఉపవిష్టాపురాణార్థం పరస్పరమనోనుగౌ ।
యావత్ తావత్సమాయాతో బ్రాహ్మణో మధుసూదనః ॥ 9

భిక్షాభిలాషేత తతం పరమేశ్వర చింతకః ।
కుచేలశ్చ దరిద్రత్వాత్సాంబరోపి దిగంబరః ॥ 10

సులభస్తంతు దృష్ట్వైవ ప్రణనామ ముదాయుతః ।

జహాస చైనం సహసా మోహావిష్టీ ద్విజోత్తమం ।
సఉవాచ తతః శాపం ప్రతిక్షుబ్ధో మహామునిః ॥ 11

క్రోధసంరక్త నయనః త్రైలోక్యం ప్రదహన్నివ ।
హలకర్షణకో నిత్యం నిత్యం దుఃఖసమన్వితః । 12

వృషో భవ కుబుద్ధేత్వం యో హసద్విప్రవృత్తై ర్ద్విజైః ।
భర్తుః శాపం పరిశ్రుత్య సుముద్రా క్రోధమూర్ఛితా । 13

అశపత్తం ద్విజం రుష్ట్యా సర్పిణీవ పదాహతా ।
యతస్త్వయా అవివేకేన శాపోదత్తః పతిర్మమ ॥ 14

అతస్త్వం చక్రివాన్ భూత్వా విష్టాశీ భవ కుద్విజ ।
సోపి తామశపత్క్రూరం శృత్వా శాపం తదీరితం ॥ 15

స్త్రీ త్వమశపో యస్మాత్త్వం ఛాండాలీ భవిష్యసి ।
దరిద్రా దోషబహుళా విణ్మూత్రాశీ అశుభంకరీ ॥ 16

ఏవం పరస్పరంశప్త్వా త్యక్త్వా దేహాన్ సుదుర్లభాన్ ।
సులభో వృషభోజాతో హలకర్షణవాన భవత్ ॥ 17

నవిశ్రాంతిః క్షణంతస్య విప్రశాపా త్తదాభవత్ ।
ద్విజోపి రాసభేర్యోనౌ జాతోసౌ మధుసూదనః ॥ 18

జాతా సుముద్రా ఛాండాలీ దుష్టా ప్రాణివిహింసికా ।
దరిద్రా పైశాచవతీ విణ్మూత్రాశన తత్పరా ॥ 19

అతి శుష్కశరీరా సా దంతురా వికటాననా ।
కదాచి దటమానా సా దక్షిణే నగరస్య తు ॥ 20

ప్రాసాదం గణనాథస్య దదర్శ పరమాద్భుతం ।
నానావృక్ష లతాజాలైః నానాపక్షి గణైర్యుతం ॥ 21

యత్ర యోగీశ్వరాన్ కేచి దనుష్టాన రతాఃస్సదా ।
ఉపాసకాః గణేశస్య నియమస్థా వసంతి హి ॥ 22

కేచిత్కామార్థినః కేచిత్ పుత్రమోక్ష ధనార్థినః ।
కదాచి ద్భాద్రమాసస్య చతుర్థ్యాం తు గృహే గృహే । 23

తస్మిన్పురే సంప్రవృత్తో గణనాథ మహోత్సవః ।
అతివృష్టిః ప్రవృత్తాచ మహాప్రళయ సన్నిభః ॥ 24

ఛాండాలీ వృష్టిభీతాసా యాతి యద్యన్నివేశనం ।
తతస్తతో ఖిలజనైః నిరస్తా తాడనాదిభిః 25

తతో దేవాలయంయాతా ప్రాణావగ్నిం ప్రగృహ్యాసా ।
తత్రాపి, అతాడయన్కేచిత్ యోగిభిస్తైర్నిరాకృతా । 26

ప్రజ్వాల్య సాతృణైరగ్నిం ఉష్ణాన్యంగాని కుర్వతీ ।
అకస్మాద్వాయునాప్రాగాదేకో దూర్వాంకుర స్తదా ॥ 27

పతితో గణనాథస్య మస్తకే దైవయోగతః ।
స రాసభః శీతభీతో యాతో దేవాలయం తదా ॥ 28

తదా వృషోలాంగలాత్తు ముక్తో దైవాత్సమాయయౌ ।
ప్రాసాదం గణనాథస్య భావినో ర్థస్యగౌరవాత్ ॥ 29

ఉభావపి తృణం తస్యాశ్చండాల్యాస్తౌ బభక్షతుః ।
పరిసుప్తే జనేతత్ర తయోర్యుర్ద్ధ మవర్తత ॥ 30

అతస్తాభ్యాం చైవ శృంగాభ్యాం గజానన సమీపతః ।
తయో రాస్యాన్నిపతితౌ శుండాయాం చ పదే తదా । 31

దూర్వాంకురౌ గణేశస్య తుతోష చ గజాననః ।
తతః సా యష్టిమాదాయ దేవాంతిక ముపాగమత్ ॥ 32

అహనత్రౌ ఖరవృషౌ స్వయం పూజాం బభక్ష చ ।
ఖుర శబ్దంతయోః శృత్వా బబుధే నిద్రితో జనః ॥ 33

బహిశ్చకార దండేన ముష్టి కూర్పర ఘాతతః ।
పలాయన పరా సాఽపి తాడితా శర్కరాది భిః ॥ 34

ఛాండాల్యాః రాసభస్యాపి స్పర్శ శంకాకులైర్ద్విజైః ।
స్నాపిత స్తీర్థతోయేన మంత్రితా చ గజాననా ॥ 35

పూజితః సరయా భక్త్యా నానా ద్రవ్యైరనేకశః ।
వృష రాసభ ఛాండాలీ రతి దుష్టాః జనాః పునః ॥ 36

తాడయామాసురవ్యగ్రా లగుడై ర్జానుభిఃస్తలైః ।
దేవద్వారేచ పిహితే గతిస్తేషాం న విద్యతే ॥ 37

భ్రమతాం క్రందతాం తేషాం త్రయాణాందారుణైః స్వనైః ।
మనస్తు దేవదేవస్య వికటస్యతదాహృతం ॥

ఏతేషాం తు ప్రసంగేన పునః పూజా సమాభవత్ ।
ఏతైశ్చ పూజితశ్చాహ మేక దూర్వాంకురాది భిః 38

ప్రదక్షిణా బహుతరా కృతాదుష్టేషు సత్స్వపి ।
భాద్ర శుక్ల చతుర్థ్యాం మే దూర్వామేకాం సమర్పయేత్ ॥ 39

స మేమాన్యశ్చ పూజ్యశ్చ పూజ్యశ్చ యశ్చ కుర్యాత్ప్రదక్షిణం ।
తస్మాదేతాన్విమానే న స్వధామ ప్రాపయామ్యహం ॥ 40

ఏవం విమాన మప్రేషీత్స్వగణై రుపలక్షితం ।
స్వరూప ధారిభిర్దేవో గంధర్వా ప్సరసాంగణైః ॥ 41

యుతం వాదిత్ర నిచయైః పుష్పైః పరిమళైరపి ।
దివ్య భోగ సమాయుక్తం పతాకా ధ్వజమండితం ॥ 42

తానాదాయ గణాస్తేతు గజానన స్వరూపిణః ।
తస్మిన్విమానే నిక్షిప్య దివ్యదేహా న్ముదాయుతాన్ ॥ 43

గజాననాజ్ఞయా తస్య ధామ సంప్రాపయన్ జవాత్ ।
పశ్యతాం సర్వ లోకానా మాశ్చర్య మభవద్భువి ॥ 44

ఏతేషాం పూర్వ పుణ్యేన గతిరేషేతి చాబ్రువన్ ।
తతో యోగీశ్వరాః కేచి త్త్యక్త్వా ధ్యానం గతా గణాన్ ॥ 45

ప్రప్రచ్ఛుః కథమేతేషా బ్రూత పుణ్యాగతిర్ధ్రువా ।
అతి పాతకినాం మేషాం పుణ్య లేశో నవిద్యతే ॥ 46

గతిః సుదుర్లభా కస్మాత్ ప్రాప్తానో గదతా నష్టాః ।
తదేవాశు కరిష్యామ స్త్యక్త్వా నుష్టానమాత్మనః ॥ 47

అసంఖ్యాతో గతః కాలో నదేవో దృక్పథంగతః ।
విరక్తానాం వాయుభుజాం అనుష్టానవతాం సదా ॥ 48

ధామప్రాప్తిః కదా నస్యా ద్గణేశస్య వదంతు నః

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే దూర్వోపాఖ్యానం నామ ద్విషష్టితమో అధ్యాయః**



## 62-వ అధ్యాయము

# దూర్వోపాఖ్యానం

ఆ తరువాత పై కథాకథనాన్ని బ్రహ్మ ముఖకమలంనుంచి మకరందంలా గ్రోలి ఆస్వాదిస్తూన్న కృతవీర్యుని తండ్రి - ఆ చతురాస్యునితో యిలాఅన్నాడు.

'ఓ చతురాననా! కృష్ణపక్ష చతుర్థినాడు చంద్రోదయ సమయంలో గజాననుని ఆరాధించి ప్రసాదమును భుజించుటవలన అనంతఫలం కల్గుతుందనీ - అది సకలార్థప్రదమనీ చెప్పావు! ఐతే ఆనాడు గజాననునికి ప్రీతిపాత్రమైన దూర్వాంకుర సమర్పణవల్ల ఎలాంటి ఫలితం కల్గుతుందో అదిగూడా దయతో వివరించు! గణనాథునికి దూర్వాంకురము ఎందువల్ల అత్యంత ప్రీతిపాత్రమైనది? ఆ వివరం కరుణతో తెలియజేయి!"

జిజ్ఞాసువైన అతడి మాటలకు బ్రహ్మ ఎంతో సంతసించి యిలా మధురంగా జవాబిచ్చాడు.

'ఓరాజా! దూర్వాంకురం గణేశునికి ఏల ప్రియమో, అలా సమర్పిస్తే కలిగే ఫలమేమిటో చెబుతాను విను! పూర్వం దక్షిణదేశంలో 'అవంతి' అనుపేరుగల నగరం ఉండేది! సులభుడనే పేరుగల రాజు ఆనగరాన్ని పరిపాలించేవాడు! అమిత పరాక్రమోపేతుడూ, సకల సద్గుణ సంపన్నుడూయైన ఆ రాజు సకలశాస్త్రాలకు నిధివంటివాడై వేదార్థ మంతటినీ తెలుసుకున్నవాడై, ప్రజానురంజకంగా పాలించేవాడు! ఈతడు గజాననుని పట్ల అమితమైన భక్తితో అనునిత్యం పూజాదికాలు సల్పేవాడు. సుముద్ర అన్నపేరుగల ఆ రాజు పత్ని అత్యంత సౌందర్యంతోపాటూ రాజుకు అన్నివిధాలా తగినదై, పతివ్రతాధర్మం నెఱపుతూ దేవ, బ్రాహ్మణ, అతిథిపూజా తత్పరురాలై ఉండేది!

ఒకనాడు ఆ రాజదంపతులిరువురూ పురాణశ్రవణాసక్తులై తమ మందిరంలో కూర్చునివుండగా అక్కడికి మధుసూదనుడనే పేరుగల బ్రాహ్మణుడు వచ్చాడు! ఆ బ్రాహ్మణుడు నిరంతర దైవచింతా పరాయ ణుడూ; దరిద్రుడూ కావటంచేత చిరిగిన వస్త్రం ధరించి, బట్ట ధరించినా ధరించనట్లు ఉన్నాడు. అట్టి బ్రాహ్మణుడు భిక్షార్థమై వచ్చివుండగా, రాజు అతనికి నమస్కరించి, గట్టిగా పరిహసించాడు. దానికా బ్రాహ్మణుడు కోపంతో మండిపడి 'ఓరాజా! మదాంధుడవై, అర్థినైవచ్చిన నన్నుచూసి పరిహసించావు గనుక ఎల్లప్పుడూ నాగలిచాలుకు కట్టబడ్డ వృషభానివై భూమి దున్నుతూ దుఃఖిస్తూందువుగాక!' అంటూ శపించాడు.

ఆమాటలకు ప్రక్కనేఉన్న రాజపత్నియైన సుముద్ర క్రోధపరవశు

రాలై 'ఓయీ! బ్రాహ్మణోత్తమా! నీవు అవివేకంతో రాజనికూడా చూడ కుండా నాభర్తను శపించావు గనుక నీవుకూడా ఉచితానుచితాలను మరచి సర్వమూ భక్షించే కంచరగాడిదవై జన్మింతువుగాక!' అంటూ ప్రతిశాపమిచ్చింది.

అప్పుడా మధుసూదనుడా మాటలను విని యిలా మండిపడ్డాడు :

'ఓసీ! స్త్రీవైన నీవు శపింపబడరానిదానవైనా ఛండాలురాలవై, దారిద్ర్యబాధతో అభక్ష్యములను భక్షిస్తూ దౌర్భాగ్యురాలవవుదువుగాక!' అంటూ ఆ సుముద్ర అనే రాజపత్నికి కూడా శాపమిచ్చాడు.

ఇలా ఒకరికొకరు శాపప్రతిశాపాలను యిచ్చుకుని దుర్లభమైనట్టి మానవదేహాలను త్యజించివైచారు. సులభుడు తక్షణమే నాగలిదున్నే ఎద్దుగా మారాడు. విప్రశాపంచేత వానికి క్షణకాలమైనా విశ్రాంతిలేక దుఃఖించసాగాడు. ఇక మధుసూదనుడు కంచరగాడిదయై పుట్టాడు. రాజుపత్నియైన సుముద్ర దుష్టురాలూ, ప్రాణిహింసకురాలైన చండాల స్త్రీయై దరిద్రం ఓలలాడేచోట జన్మించింది.

ఇలాఉండగా చండాలస్త్రీయైన ఆమె ఒకనాడు తానుండే గ్రామా నికి దక్షిణదిక్కుగా సంచారంచేస్తూ అక్కడ ఉన్న ఒక అద్భుతమైన గణేశుని ఆలయాన్ని చూసింది. ఆ ప్రదేశము అనేరకాలైన వృక్షాలతోనూ, లతలతోనూ రకరకాల పక్షిగణములచేతా విరాజితమై ఉన్నది. ఆ గణేశ మందిరంలోకి అనేకమంది మహామహులైన యోగిపుంగవులు నియమ బద్ధులై గణేశమంత్రానుష్ఠానానికై విచ్చేసేవారు. ఇలాఉండగా ఒకానొక ప్పుడు భాద్రపద శుక్లచతుర్థి సంప్రాప్తమైంది! ఆ రోజున ప్రతి యింటి

లోనూ గణేశమందిరాలను నిర్మించి అత్యంత శ్రద్ధాభక్తులతో ప్రజలంతా గణేశుని అర్చించసాగారు. ఆ రోజు ప్రళయకాలంలోవలే భీకరమైన వాన కురియసాగింది! ఆ వర్షపుధాటికి తట్టుకోలేని ఆ ఛండాలి ఏయింటిలోకి వెళ్ళినా ఆ యింట్లోవాళ్ళు తరిమివేయసాగారు. చివరికి చేసేదిలేక చేతిలో అగ్గిపుచ్చుకొని ఆమె ఆ గణేశ దేవాలయం చెంతకు చేరుకున్నది! అక్కడివారు కూడా ఆమెను తరిమికొట్టబోగా కొందరు సాధుపుంగవులు అక్కడివారిని నివారించారు. చలిబాధకోర్వలేక గడ్డితో చలిమంటవేసుకొని ఆమె చలి కాచుకొనసాగింది! అలా చేస్తూండగా ఒక దూర్వాంకురము గాలికెగిరి గజాననుని మూర్తిపై పడింది! ఆ కంచరగాడిదకూడా వర్షపు బాధకోర్వలేక గుడిని చేరుకున్నది. వృషభముకూడా నాగలినుండి విడివడి దైవవశాత్తూ గుడికి చేరుకున్నది. ఆ గాడిద, వృషభమూ కూడా ఆ ఛండాలి మంట వేసుకోవడానికి తెచ్చుకున్న గరికను తినసాగాయి! ఇంతలో జనులంతా విశ్రాంతిగా పడుకున్నాక వాటిమధ్య పోరు మొదలైంది! అలా పెనుగులాడుతూన్న వాటి నోటినుండికూడా దూర్వాంకురములు ఎగిరి గజాననుని మూర్తిపై పడినవి! అందుచేత ఆ గజాననుడు సంతుష్టుడైనాడు. అప్పుడా ఛండాలి దేవతాసన్నిధిన పోట్లాడుతున్న ఆ రెండు జంతువులనూ తానొక దండాన్ని చేతబూని చావమోదింది! అక్కడఉన్న ప్రసాదాన్ని తాను పూర్తిగా తినేసింది.

ఆ పశువుల డెక్కల చప్పుళ్ళు విన్నవారు నిద్రనుంచి మేల్కొని పిడిగుద్దులతోనూ, మోచేతిపోట్లతోనూ వాటిని వెలుపలకు తరిమారు. ఆ ఛండాలినికూడా రాళ్ళతోకొట్టి తరిమారు!

అక్కడి అర్చకులు ఛండాలియొక్క, గాడిదయొక్క, ఎద్దుయొక్క స్పర్శవల్ల దేవతామూర్తి అపవిత్రమైందని అందువల్ల తిరిగి మంత్రోదకంతో సంప్రోక్షణచేసి, నానావిధ పూజాద్రవ్యాలతో ఎంతో భక్తిగా ఆ గణేశుని మూర్తిని ఆరాధించారు.

ఆ తరువాత అక్కడి ప్రజలు ఆ ఛండాలస్త్రీని, కంచరగాడిదను, ఎద్దునూ గుడిప్రాకారం తలుపులు మూసేసి కర్రలతో, మోచేతిపోట్లతో తాపులతో చావమోదారు. తలుపులు మూసివుండటంచేత బైటకు వెళ్ళే దారిలేక పెద్దగా అరుస్తూ, అవి గుడిచుట్టూ పరుగెత్తసాగాయి.

వాటి ఆక్రందనలకు దీనావనుడైన గజాననుడు కరుణించాడు. 'వీటి ప్రదక్షిణాదికములచేత, అరపులచేత మరలా పూజించబడ్డాను! ఇంతకుముందే వీటిచే సమర్పితములైన దూర్వాంకురములచేత అర్చించ బడ్డాను! ఈ ముగ్గురు నాకత్యంత ప్రీతిపాత్రమైన భాద్రపద శుక్లచతుర్థి నాడు నాకు ప్రియమైన దూర్వాంకురాలను నాకు సమర్పించారు. ఎట్టివారైనప్పటికీ ఈరకంగా నా అనుగ్రహానికి పాత్రులైనారు! కనుక వీరికి ముక్తిని అనుగ్రహించవలసిందే!' అనుకొని తన వైనాయకలోకా న్నుంచి దివ్యవిమానాన్ని తెప్పించాడు. అప్పుడు ఆ మువ్వురూ దివ్యమైన దేహాలను పొందినవారై గణేశలోకానికి వెళ్ళారు.

ఈ మహోత్తమమైన దివ్యలీలను చూస్తున్న యోగులు మొదలైన అనుష్టానపరులు కూడా ఆశ్చర్యచకితులై 'ఎట్టి పూర్వపుణ్యంచేత వీరికీ ఉత్తమగతి సంప్రాప్తమైంది?' అంటూ విస్తుపోయారు. అందులోని కొందరైతే తమ అనుష్టానాన్ని వదలి ఎలుగెత్తి 'ఓ దేవదూతలారా!

ఎంతోకాలాన్నుంచి అనుష్ఠానం చేస్తున్నా మాకెవరికీ లభించని దివ్యాను గ్రహం వీరికెలా ఇంతత్వరగా ప్రాప్తమైంది? అదేమిటో మాకూ సెల వియ్యండి. విరక్తులమై, నిరాహారులమై అనుష్ఠానమొనరిస్తున్న మాకు గణేశానుగ్రహం ఎలా సంప్రాప్తమౌతుందో దయచేసి చెప్పండి!' అంటూ ఆ గణేశ దూతలను అర్థించారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
**'దూర్వోపాఖ్యానం'** అనే 62-వ అధ్యాయం.



63

# దూర్వామహాత్మ్యం

(మూలం)

## త్రిషష్ఠితమో ధ్యాయః

**గణా ఊచుః :**

శృణుధ్వం యోగినస్సర్వే స్థిరీకృత్య మనశ్చలం ।
యన్న శేషేభవేద్వక్తుం సమర్థశ్చతురాననః ॥ 1

తద్వక్తుం కస్సమర్థస్యా ద్యథాశక్తి వదామిచ ।
కుర్వంతి స్తవనం యస్య సర్వదా అజశివాదయః ॥ 2

తస్య శ్రీగణనాథస్య మహిమానం వదేత్సస్ఫుటం ।
ఇద్ధం తదీయాం లీలాంవా తథాపి శృణుతానఘాః ॥ 3

దూర్వాంకురాణాం మహిమా నజ్ఞాతో మునిభిస్సురైః ।
యజ్ఞై ర్దానైస్తపోభిశ్చ వ్రతైరార్ఘ్యైమైర్నవాప్యతే ॥ 4

అత్రాప్యుదాహరంతీ మ మితిహాసం పురాతనం ।
వాసనస్య వచసంవాదం నారదస్యమహాత్మనః ॥ 5

ఏకదా నారదో గచ్ఛద్వ్యాసవం ద్రష్టుముత్సుకః ।
పూజితః పరయాభక్త్యా కృతాసన పరిగ్రహం ॥ 6

మునిం పప్రచ్ఛబలహా దూర్వామాహాత్మ్యమాదరాత్ ।

**ఇంద్ర ఉవాచ :**

కిమర్థం దేవదేవస్య గణేశస్య మహాత్మనః ।
విశేషతః ప్రియాబ్రహ్మన్ మహాదూర్వాంకురా మునే ॥ 7

**మునిరువాచ :**

కథయామి యథాజ్ఞాతం దూర్వామాహాత్మ్యముత్తమం ।
స్థావరే నగరేపూర్వం కౌండిన్యో అభూన్మహామునిః ॥ 8

ఉపాసకో గణేశస్య తపోబలసమన్వితః ।
రమణీయతరస్తస్య గ్రామదక్షిణ భాగతః ॥ 9

ఆశ్రమః సుమహానాసీ ల్లతావృక్ష సమన్వితః ।
సరాంసి పుల్లపద్మాని యత్రాసన్ సుమహాంతి చ ॥ 10

భ్రమరై రుపజుష్టాని హంస కారండకైరపి ।
చక్రవాకైర్బకైశ్చైవ కచ్ఛపై ర్జలకుక్కుటైః ॥ 11

సతు ధ్యానరత స్తత్ర ప్రారభత్తవ ఉత్కటం ॥
పురఃస్థాప్యమహామూర్తిం గణేశస్య చతుర్భుజం ॥ 12

సంప్రసన్నాం సువరదాం దూర్వాయుక్తాం సుపూజితాం ।
జజాప పరమం మంత్రం షడ్వర్ణం దేవతోషకం

పప్రచ్ఛ సంశయావిష్టా పత్నీనామ్నాఽశ్రయాస్యతం ॥ 13

**ఆశ్రయో వాచ :**

స్వామిః స్గజాననే దేవే దూర్వాభారం దినేదినే ।
సమర్పయసి కస్మాత్త్వం తృణైఃకోపి నతుష్యతి ।
అస్తిచేత్పుణ్యమేతేన తన్మేత్వం కృపయా వద ॥ 14

**కౌండిన్య ఉవాచ :**

శృణు ప్రియే ప్రవక్ష్యామి దూర్వామాహాత్మ్యముత్తమం ।
ధర్మస్య నగరే పూర్వమాసీదుత్సవ ఉత్తమః ॥ 15

సర్వదేవాః స గంధర్వాః ఆహూతా శ్చాప్సరోగణాః ।
సిద్ధచారణ నాగాశ్చ మునయో యక్షరాక్షసాః ॥ 16

తిలోత్తమా యాః నృత్యంత్యాః ప్రావారోన్యపతద్భువి ।
దదర్శ తస్యాః సయమః కుచౌ చారుబృహత్తమౌః ॥ 17

అభవత్కామ సంతప్తో విశ్రాంతో నిరపత్రపః ।
ఇయేషాలింగితుం తస్యా శ్చుంబితుంచ తదాననం ॥ 18

సదసో నిర్గతస్తస్మా ల్లజ్జయా ధోముఖో యమః ।
గచ్ఛతస్తస్య రేతశ్చ స్ఖలితం పతితం భువి॥ 19

జ్వాలామాల్య భవత్తస్మా త్పురుషో వికృతాననః ।
కుర్వన్దంష్ట్రారవం క్రూరం త్రాసయన్ భువనత్రయం ॥ 20

దదాహ పృథివీం సర్వాం జటాభి ర్గగనం స్పృశన్ ।
చకంపే తస్య శబ్దేన త్రిలోకే మానసం భృశం ॥ 21

తదైవ విష్ణుమగమం స్తేతు సర్వే సభాసదః ।
స్తుతిం నానావిధాం కృత్వా నానాస్తోత్రైర్యథామతి ॥ 22

ప్రార్థయామాసురవ్యగ్రాః సర్వలోకహితాయ తం।
సతై స్సర్వైస్సమాగమద్గజానన మనామయం ॥ 23

తస్య నాశంతతో జ్ఞాత్వా తుష్టువుః సర్వఏవ తం ।
దేవా మునయశ్చ ఊచుః నమోవిఘ్నస్వరూపాయ నమస్తే
విఘ్నహారిణే నమస్తే సర్వరూపాయ సర్వసాక్షిన్నమోస్తుతే ।
నమో దేవాయ మహతే సమస్త జగదాదయే - నమః కృపానిధే ।
తుభ్యం జగత్పాలన హేతవే - నమస్తే పూర్ణతపసే ।

సర్వసంహార కారిణే నమస్తే భక్తవరద సర్వదాత్రే
నమోనమః - నమస్తేఽనన్యశరణ సర్వకామ ప్రపూరక ॥ 24

నమస్తే వేదవిదుషే నమస్తే వేదకారిణే ।
కమన్యం శరణం యామః కోను నః స్యాద్భయాపహః ॥ 25

ఆకాలఏవ ప్రళయః కథం లబ్ధో జనైరయం ।
హా! గజానన దేవేశః హాహావిఘ్నహరావ్యయ ॥ 26

సర్వేషాం మరణే ప్రాప్తే కథమస్మానుపేక్షసే ।

ఇతి తద్వచనం శ్రుత్వా కరుణాబ్ధిర్గజాననః ।
ఆవిరాసీ త్పురస్తేషాం శిశురూపో ర్నిభీతిహా ॥ 27

బిభ్రత్కమలనయనే శతచంద్ర నిభాననం ।
కోటిసూర్యప్రభా జాలః కోటికందర్ప జిద్వపుః ॥ 28

కుంద కుట్మల శోభాజి ద్దశనోధర బింబజిత్ ।
ఉన్నసో భృకృటీచారు నయనః కంబు కంఠయుక్ ॥ 29

సుచారు జంఘా గుల్ఫ శ్రీ విలసత్పాదపద్మకః ।
నానాలంకార శోభాఢ్యో మహాఘన సమావృతః ॥ 30

ఏవం దేవం నిరీక్ష్యైవ నగరస్య పురో భువి ।
ఉత్తస్థుర్దేవ మునయో జయశబ్ద పురస్సరం ॥ 31

ప్రణేముః దండవద్భూమౌ శక్రం దేవగణా యథా

**దేవా ఋషయ ఊచుః :**

కోభవాన్కుత ఆయాతః కింకార్యం వద నోవిభో ॥ 32

వయమేవం విజానీమో బ్రహ్మైవ బాలరూపధృక్ ।
అనలాసుర సంత్రాసాత్త్యక్త్వాకర్మాది సంస్థితాన్ ॥ 33

అవిర్భూతంతు నస్త్రాతుం దుష్టసంహార కారకం ।
ఇతి తద్వచనం శృత్వా శిశురూపీ గజాననః ॥ 34

బభాషే హాస్యవదనః సర్వాన్దేవ మునీన్ప్రతి ।
భవంతో జ్ఞానసంపన్నాః యదుక్తం సత్యమేవ తత్ ॥ 35

అహం తస్యవధాయేవ దుష్టస్యపరపీడనః ।
నిజేచ్ఛయా బాలరూపీ వేగేనాగాం సురర్షయః ॥ 36

ఉపాయం వచ్మివస్తస్య వధే తంకురుతాఽనఘాః ।
సర్వైర్భవద్భిస్తందృష్ట్వా నోదనీయో బలాదయం ॥ 37

ద్రష్టవ్యం కౌతుకంతస్య తమశ్చైవ మహత్తరం ।
ఏవం శృత్వా కృపావాక్యం సర్వేతే హర్షనిర్భరాః ॥ 38

ఊచుఃపరస్పరం సర్వే న జానీయోస్య పౌరుషం ।
ఈశ్వరో బాలరేపేణ కర్తుమస్య వధంనుకిం । 39

అవతీర్ణో భవేత్త్రాతుం పీడితం భువనత్రయం ।
ఇద్ధముక్త్వాతు తేసర్వే ప్రణేముః సాదరంచ తం ॥ 40

ఏతస్మిన్నేవ కాలేతు కాలానల స్వరూపధృక్ ।
దహద్దశదిశో భక్ష్యన్నరలోకం సమాయయౌ ॥ 41

కోలాహలో మహానాసీత్ లోకానాం క్రందతాంతదా ।
దృష్ట్వైవ సర్వేమునయః పలాయన పరాయయుః ॥ 42

తంచ తేమునయః ప్రోచున్ శీఘ్రంకురు పలాయనం ।
నోచేద్ధింసిష్యతేత్వద్య సుమహానసలో ధ్రువం ॥ 43

తిమింగలో యథా మీనా నురగాన్ గరుడో యథా ।
ఇతి తద్వచనం శృత్వా పరమాత్మా గజాననః ॥ 44

బాలరూపధరో తిష్ఠత్ పర్వతో హిమవానివ ।
సురర్షయో యయుర్ద్వారా త్యక్త్వాతత్రైవ బాలకం ॥ 45

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే దూర్వామహాత్మ్యనామ**
**త్రిషష్టితమో అధ్యాయః**



# 63-వ అధ్యాయము

# 'దూర్వామహాత్మ్యం'-I

ఈవిధంగా యోగులు ప్రశ్నించగా దేవతాగణములు ఈవిధంగా చెప్పారు :

"ఓ యోగీశ్వరులారా! ఏకాగ్రమనస్సుతో వినుడు. గజాననుడి మహిమలు వర్ణించుటకు బ్రహ్మదేవునికిగాని, సహస్రఫణములుగల ఆది శేషునికిగాని శక్యము కానిపని. ఐనప్పటికీ మా శక్తిమేర మీకు వర్ణించి తెలిపెదము. ఏ మహానుభావుని నిత్యమూ బ్రహ్మమహేంద్రాదులు వేదమంత్రములతో స్తోత్రములు చేయుచుందురో అట్టి గణేశుని మహిమ నెవరు వర్ణించగలరు? ఇంకనూ దూర్వాంకుర మహిమలను గురించి తెలుపుటకు దేవతలకూ మునులకూ కూడా వశముగానిపని! ఎందు కనగా కేవలం దూర్వాంకురము సమర్పించడంవల్ల కలిగేటటువంటి అసమాన ఫలము - యజ్ఞము, దానము, వ్రతము తపస్సులతోకూడా పొంద వీలుకానంతటి అనంత పుణ్యఫలము! దీనిగురించిన ఒక ప్రాచీన

ఇతిహాసము కలదు! దానిని వర్ణించి తెలిపెదము. గతంలో ఇంద్రునకూ నారదునకూ జరిగిన సంవాదాన్ని మీకిప్పుడు తెలిపెదను.

ఒకానొకప్పుడు దేవర్షియైన నారదుడు ఇంద్రదర్శనమునకై స్వర్గానికి వెళ్ళగా ఇంద్రుడాయనకు అర్ఘ్యపాద్యములను ఒసగి సమస్త గౌరవాలతో పూజించి, సుఖాసీనుడైన నారదుని ఇంద్రుడు దూర్వాంకురములు (గరిక చిగుళ్ళు) గణేశునకు సమర్పించుటవలన కలిగే ఫలాన్నిగురించీ వాని మహాత్మ్యం గురించీ తెలుపమని ప్రశ్నించెను. అంతట ఇంద్రుడు "ఓ మునీంద్రా! దేవతలకు అధిదేవుడైన గణపతిదేవునకు ఈ దూర్వాంకుర మంటే అంతప్రీతి ఎందుకు? దాని ప్రత్యేకమైన మహిమనుగూర్చి వివ రముగా తెలుప"మని ప్రార్థించెను. దానికి నారదమునీంద్రుడు :

"ఓ దేవేంద్రా! పూర్వకాలములో స్థావరమనే నగరంలో కౌండిన్యు డనే పేరుగల మహాముని నివసించేవాడు. ఆయన గొప్ప గణపతి ఉపాసకుడు. గణేశమంత్ర జపసిద్ధిపరాయణుడు. గొప్ప తాపసి! ఆ గ్రామమునకు దక్షిణదిక్కుగా పరమపవిత్రమైన ఆశ్రమాన్ని నిర్మించినాడు! దానిలో పచ్చని నవనవలాడే వృక్షములు, దివ్యౌషధులు, ఫలపుష్పములు కలిగి నిర్మలమైన కొలనులో వికసించిన తామరపద్మములు లక్ష్మీకళతో విలసిల్లేవి! ఆ సరస్సులో తెల్లని హంసలు, పున్నమచంద్రునివంటి చక్రవాకపక్షులు, కొంగలు, కలకలలాడే జలపక్షులు ఆనందంగా విహరించేవి! అట్టి నిర్మలమైన ఆశ్రమంలో ఆ మునీశ్వరుడు యోగనిష్టా పరాయణుడై ధ్యానసమాధిస్థితిలో తన హృదయములో గణేశునిమూర్తిని ప్రతిష్ఠింపజేసుకుని "గణేశషడక్షరీమంత్రము"ను అఖండముగా జపించే వాడు. అంతేకాక పరమపవిత్రములైన దూర్వాంకురములతో ప్రతీనిత్యం

గణపతి విగ్రహాన్ని పూజించేవాడు.

ఇట్లుండగా ఆ మునీశ్వరుని భార్య మునిపత్నియగు ఆశ్రయాదేవి ఒకనాడు తన భర్తను యిలా ప్రశ్నించింది

"ఓ ప్రాణనాథా! ప్రతిరోజూ మీరు గజాననునిపై పూజానంతరము పచ్చని గరికచిగుళ్ళు (దూర్వాంకురములు) ఎందుకని ఉంచుతున్నారు! కేవలము గడ్డిపరకల వలననే గణేశుడు సంతసించునా? ఇలా దూర్వాంకురములు సమర్పించడంవల్ల కలుగు ఫలితమేమి? దీనికి ఏదైనా రహస్యము ఉంటే దానిని తెలియజెప్పండి దయతో!" అని ప్రశ్నించెను. దానికా మునీశ్వరుడు

"ఓ ప్రియభార్యామణీ! దూర్వాంకురముయొక్క మహాత్మ్యము ఇంతింతని చెప్పరాదు. దీని గురించిన మహాత్మ్యకథను నీకు చెప్పెదను శ్రద్ధతో విను :

పూర్వకాలంలో "సంయమనీ పురము"లో ఒక గొప్ప మహోత్సవము జరుగుతున్నది! ఆ ఉత్సవానికని సమస్త దేవతాగణములు అప్సరసలు, గంధర్వ, విద్యాధరులూ, కిన్నరకింపురుషాదులు ఆహ్వానించబడి తరలివచ్చారు. ఆ దేవతాసభలో అతిలోకసుందరియైన 'తిలోత్తమ' అనే అప్సరస నాట్యంచేస్తున్నది. నృత్యం మధ్యలో ప్రమాదవశాత్తూ ఆమె చీరచెంగు జారిపోయింది. దేవసభలో కూర్చున్న యమధర్మరాజు ఆమె సౌందర్యమును తటాలున చూసి మోహపరవశుడై ఆమె సౌందర్యమునకు వశపడి కామంతో తపించి ఒక్కసారిగాలేచి ఆమెను కౌగలించుకోవాలని లేచాడు. మరుక్షణమే ఒడలు తెలిసి సభలోంచి తలవంచుకుని

వెళ్ళిపోతూండగా ప్రమాదవశాత్తూ అతని వీర్యము స్ఖలించి భూమిపై పడింది!

ఆ యమధర్మరాజు వీర్యంచేత అగ్నిజ్వాలవలే మండుతున్న ఒక భయంకరాకారుడైన అసురుడు పుట్టాడు. భయంకరమైన కోరలు, పెద్ద నోరు, జ్వాలలవంటి జడలు, నిప్పుకణికెలవంటి మిడిగ్రుడ్లు ప్రపంచాన్ని దద్దరిల్లచేసే పెద్దఅరుపులతో భయంకరమైన వాడికోరలుగల నోటిని తెరచి లోకాలను భక్షించాలని ఉరికాడు. ఆ రాక్షసుని భయంకర వికటాట్టహాసంతో ముల్లోకములలోనివారూ గడగడలాడిపోయారు. అకస్మాత్తుగా జరిగిన ఈ విపరీత ప్రమాదమునకు భయపడిన దేవతలందరూ దేవసభలో లేచి శ్రీమహావిష్ణుదేవుని శరణుపొంది అనేక విధముల స్తోత్రం చేశారు. శ్రీవిష్ణుదేవుడు వారందరినీ శ్రీగణేశప్రభువును ఆశ్రయించవలసిందిగా సలహాయిచ్చాడు. ఆ దేవతాగణములను వెంటపెట్టుకుని ఆ రాక్షసుని సంహారం నిమిత్తం మహాగణపతిని శక్తివంతమైన దివ్యమంత్రాలతో స్తుతింపచేశాడు.

## దేవతల గణపతిస్తోత్రం

దేవతాగణాలు ఈవిధంగా ప్రార్థనచేసిరి!

'విఘ్నస్వరూపుడైన గణపతి దేవునకు నమోనమస్తే! సర్వ విఘ్నములనూ హరించు విఘ్నహరునకు నమోనమః, సర్వసాక్షీభూతుడైన పరమాత్మరూపియగు గణేశునకు నమో నమస్తే! సర్వసృష్టి స్వరూపుడైన గణేశ పరబ్రహ్మకు యివే మా నమోవాకములు! ఓ సర్వసాక్షివగు ప్రభూ! నీకిదే నమోనమః!! ఓ దేవదేవా నమస్తే! నమస్తే!! ఓ మహానుభావా! మహాగణపతీ!! సమస్త జగదాధార భూతుడా! మహాగణపతీ నమోవాకములు! ఓ కృపానిధీ!

జగద్రక్షకుడా, గణేశా! నీకిదే మా శరణాగతి! ఓ జగత్పరిపాలకుడా! పూర్ణబ్రహ్మ స్వరూపుడా! పరిపూర్ణ తపస్స్వరూపుడా నీకిదే మా నమోనమః!

సర్వదుష్ట అసురసంహారకర్తకు, సమస్త కష్టనివారకునకు, వరములిచ్చి అనుగ్రహించే దయామూర్తికివే మా నమస్సులు! ఓ పరమేశ్వరా! నీకంటే మాకు అనన్యశరణ్యం వేరులేదు! మా సమస్త కోరికలనూ తీర్చగల నీకిదే మా నమస్కారము.

ఓ సమస్త వేదమంత్రాత్మకుడా! సమస్త వేదచ్ఛందస్వరూపుడా! సమస్త వేదఛందోగణాధిపా! వేదమూర్తీ! నమస్కారము! నీవుతప్ప దిక్కులేని మేము వేరెవరిని శరణుపొందగలము? నీవుతప్ప మమ్ములను సంకటములనుండి భయములనుండీ రక్షించగల దయామూర్తి ఎవరుంటారు?

ఈ అకాలప్రళయమేమిటిప్రభూ? ఈ దుష్టరాక్షసబాధ ఏలమాకు? హేగజాననా! అయ్యో! హాహా!! సర్వవిఘ్నహరుడా! దేవదేవేశా!! సర్వరక్షకా!!! మాకందరకూ మరణప్రాప్తి కాగల గొప్ప మృత్యుభయంనుంచి రక్షించు! మమ్ములను ఉపేక్షించకు! ఓ కరుణాసముద్రా! మహాగణేశా!! శరణు! శరణు!!"

అంటూ దేవతలు ప్రేమతో, ఆర్తితో, భక్తితో స్తుతించగా వారి ముందర శిశువురూపములో గణపతిదేవుడు "బాలగణపతి"గా సాక్షాత్కరించి – 'భయములేదు! అభయం!! అభయం!!!' అంటూ తామర పద్మములవంటి నేత్రములతో దయను వర్షించుతూ పున్నమిజాబిల్లివంటి ముఖం కోటిచందమామల అందం కులికించగా, కోటిసూర్యకాంతి ప్రభలతో, వేయిమన్మధుల అదంతో తెల్లని మల్లెపూవులవంటి ధవళవర్ణంతో చవితిచంద్రునివలే తెల్లగా ప్రకాశించే దంతంతో, తామరమొగ్గవంటి ఎఱ్ఱని క్రిందిపెదవితో గంభీర కంబుకంఠస్వరంతో ఉన్నతమైన కుంభ

స్థలంతో, ముద్దులు మూటగట్టే చిట్టిపాదములతో లక్ష్మీకళతో వెలుగొందే గుండ్రని మోకాళ్ళు, బొద్దుగా ముద్దుగావుండే పాదపద్మములతో నవరత్న ఖచితమైన అందెలతో మేఘస్వరం వంటి మంగళవాద్యస్వరంతో నృత్య తాండవ స్వరూపంలో వారిఎదురుగా భూమిపై సాక్షాత్కరించాడు గణేశ ప్రభువు!!

ఒక్కసారిగా దేవతలు ఖంగారుగా లేచినిలబడ్డారు! జయజయ శబ్దములతో దండములవలె సాష్టాంగముగా క్రిందపడి నమస్కరించారు. తామరపుష్పములవంటి సుకుమారమూర్తియైన గణేశునితో ఇంద్రాది దేవతలు ప్రార్థనగా యిలాచెప్పారు.

**దేవతలు ఉవాచ :**

"ఓ దేవదేవా! ఈ బాలస్వరూపమేమిటి? పరమాశ్చర్యమైనది! బ్రహ్మరూపివైన బాలకుడా ఏకార్యం నిమిత్తం యిట్టి సుందర శిశురూపం లో సాక్షాత్కరించావు? ఘోరమైన అనలాసురుడు మమ్ములను భక్షించే ప్రమాదంలో యిలా మాకు బాలకుడిగా ప్రత్యక్షమైతేఎలా? మమ్ములను నీవే రక్షించగలవని నమ్మి ఉన్నామే? అయ్యో! శిశురూపీ! పసిబాలకుడా! గజాననా! ఏమి ఈరూపం?" అంటూ ఆశ్చర్యంతో ప్రార్థించిన మునిగణా లతో కలిసి ప్రణామంచేసిన దేవతలతో శ్రీ గణేశుడు యిలాచెప్పాడు

**గణేశ ఉవాచ :**

"నేను నా సంకల్పంచేతనే ఇలా బాలరూపంతో ప్రత్యక్షమైనాను! అతివేగంగా, జన్మించగానే బాలునివలే మీముందర ఆ రాక్షసుని సంహారం నిమిత్తం అవతరించాను. ఓ అనఘులారా! ఈ రాక్షసవధకు ఉపాయం చెబుతాను!

నేను ఆరాక్షసుని యొక్క పరాక్రమాన్ని చూడాలన్న కుతూహలం తోనే ఈ బాలరూపంతో అవతరించాను. మీరుపోయి ఆ రాక్షసుణ్ణి ప్రేరేపించండి!"

గణపతి వాక్యములు విని దేవతలు ఆనందపరవశులైనారు. దేవతలు ఒకరితో ఒకరు 'ఆహా! ఈశ్వరుడైన ఈ గణపతి ఇలా బాలరూపం లో సాక్షాత్కరించి ఆరాక్షసునితో తలపడటం ఎలాసాధ్యం? మనల్ని రక్షించేందుకూ, ముల్లోకాలను పీడిస్తున్న ఈ రక్షసుని వధార్థము ప్రార్థించాముకదా!' ఇంతలోనే ఈ కాలానలుడు అగ్నిస్వరూపుడైన జ్వాలలు దశదిక్కులకూ ప్రజ్వలించగా మానవలోకం హాహాకారాలు చేసేలా ప్రత్యక్ష మయ్యాడు! గొప్ప కోలాహలంతో సర్వత్రా గగ్గోలుగా సమస్తలోకాల జీవులూ రోదనం చేస్తున్నారుకదా! ఈ మహత్కష్టంచూసి మునులు, దేవతలు భయంతో పరుగెత్తసాగారు. మనంకూడా శీఘ్రంగా తప్పించుకు పోకుంటే ఈ రాక్షసుడు మనలను ఒక్కసారిగా ఓపెద్ద తిమింగలం చిన్నచిన్న చేపలను మింగినట్లు గుటుక్కున భక్షించగలడు! గరుత్మంతుడు సర్పాలను చీల్చినట్లు మనలను చీల్చి చెండాడనూగలడు! పారిపోదాం పదండి!" - అంటూ పరుగెత్తిపోయే కోలాహలశబ్దం విని పరమాత్ముడైన గజాననుడు బాలరూపం ధరించి, ఆ రాక్షసుని దారి కడ్డంగా బండరాయివలే కదలక స్థిరంగా నిలబడ్డాడు. ఆ బాలకుని ఒంటరిగా విడిచి దేవతలు దూరంగా పరుగెత్తారు ప్రాణభయంతో.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని

'దూర్వామహాత్మ్యం' అనే 63-వ అధ్యాయం.



64

# అనలాసుర వృత్తాంతం

(మూలం)

## చతుష్షష్ఠితమో అధ్యాయః

**ఆత్రేయోవాచ :**

దేవర్షిషుప్రయాతేషు లేదాఽచలవత్స్థితే ।
కిమాసీత్కౌతుకం తత్ర బాలకాలానలోద్భవం ॥ 1
తత్సర్వం విస్తరాన్మహ్యం కథయాశు మహామునే ॥

**నారద ఉవాచ :**

ఏవం తయాకృతప్రశ్నః కౌండిన్యో మునిసత్తమః ।
యదబ్రవీ చ్ఛచీభక్తః తత్త్వం శృణు మయోదితం ॥ 2

**కౌండిన్య ఉవాచ :**

అచలే చలవద్బాలే స్థితే తస్మిన్ గజాననే ॥ 3

కాలానలైవాక్షోభ్యః అయయౌ సో నలాసురః ॥
తస్మిన్ క్షణే చలావాపి చచాలాచల సంయుతా ॥ 4

నభో దధ్యాన సదృశ ఘనగర్జిత నిస్స్వనైః ।
నిపేతు ర్వృక్షశాఖాభ్యః పక్షిబృందాని భూతలే ॥ 5

నిర్వారి ర్వారిధిర్వాతో వృక్షా ఉన్మూలితాస్తదా ।
ప్రకంపనేన మహతా నప్రాజ్ఞాయత కించన ॥ 6

తస్మిన్నేవ క్షణే దేవో బాలరూపీ గజాననః ।
దధారానలరూపం తం దైత్యం మాయాబలేనహి ॥ 7

ప్రాశత్సర్వేషు పశ్యత్సు జలధిం కుంభజో యథా
తతస్సోచింతయద్దేవో యద్యయం జఠరేగతః ॥ 8

దహేత్త్రి భువనంకుక్షా ధ్రుష్టమాశ్చర్యముత్కటం ॥
తతఃశక్రో దదౌచంద్రం తస్యవహ్నేః ప్రశాంతయే ॥ 9

ఫాలచంద్రేతి చ దేవా స్తుష్టువుర్మునయోపి చ ॥
తథాపి చనశాంతోభూ దనలః కంఠమధ్యగః ॥ 10

తతో బ్రహ్మాదదౌసిద్ధిబుద్ధీ మానసకన్యకే ।
రంభోరు పద్మనయనే కేశ శైవలసంయుతే ॥ 11

చంద్రవక్త్రే మృతగిరౌ కూపనాభీ సరిద్వలీ ।
మృణాలమధ్యే ప్రవాళహస్తే శైత్యస్యకారణే ॥ 12

ఉవాచేమే సమాలింగ్య తవశాంతో నలోభవేత్ ॥
తయోరాలింగనే శాంతః కించిదేవ హుతాశన ః ॥ 13

దదౌ సుకోమలంతస్మై కమలం కమలాపతిః ।
పద్మపాణిరితిప్రోచుః తంసర్వే సురమానుషాః ॥ 14

ఆశాంతే గ్నైతువరుణః సిషేచే శీతలైర్జలైః ।
సహస్రఫణినం నాగం గిరిశోస్మై తదా వద ॥ 15

తేన బద్ధోదరోయస్మా ద్వ్యాళబద్ధోదరోఽభవత్ ।
తథాపి శైత్యంనాపేదే కంఠోస్యానల సంయుతః ॥ 16

అష్టాశీతి సహస్రాణి మునయస్తం ప్రపేదిరే ।
అమృతా ఇవదూర్వాస్తే ప్రత్యేకంసేకవింశతిం ॥ 17

ఆరోపయన్మస్తకేస్య తతః శాంతో అనలో భవత్ ॥
తుతోష పరమాత్మాసౌ దూర్వాంకుర భరార్చితః ॥ 18

ఏవం జ్ఞాత్వాతు తేసర్వే పుపూజుస్తం గజాననం ॥
దూర్వాంకురై రనేకైస్తై ర్విఘ్నహర్తాఽసౌ గజాననః ॥ 19

ఉవాచ చ మునీన్ దేవాన్ మత్పూజా భక్తినిర్మితా ।
మహతీ స్వల్పికావాపి వృథా దూర్వాంకురైర్వినా ॥ 20

వినా దూర్వాంకురైః పూజా ఫలం కేనాపి నాప్యతే ।
తస్మాదుషసి మద్భక్తై రేకావాప్యేక వింశతిః ॥ 21

భక్త్యా సమర్పితా దూర్వా దధాతి యత్ఫలం మహత్ ।
న తత్క్రతుశతైర్దానై ర్వ్రతా అనుష్ఠాన సంచయై ॥ 22

తపోభిరుగ్రై ర్నియమైః కోటిజన్మార్జితై రపి ।
ప్రాప్యతే మునయోదేవా యద్దూర్వాభి రవాప్యతే ॥ 23

**కౌండిన్య ఉవాచ :**

ఇతి తద్వచనం శృత్వా దేవా దూర్వాంకురైః పునః ।
అనర్చుః పరమాత్మానం దేవదేవం గజాననం ॥ 24

జగర్జానందయుక్తోసౌ నాదయన్ రోదసీ భృశం ।
హృష్టానాం సర్వదేవానాం మునీనాం చ నృణామపి । 25

అనేకశో వరాన్దత్వా పివథే బాలరూపధృక్ ।
కాలానల ప్రశమన ఇతితం తే సర్వే సమూచిరే ॥ 26

ప్రాసాదే నిర్మితే సర్వైః స్థాప్యమూర్తిం గజాననీం ।
విఘ్నహరోయమిత్యస్యా భిధాం చక్రుర్ముదా సురాః ॥ 27

అత్రస్నానం తథా దానం తపోనుష్ఠాన మేవచ ।
అనంతం జాయతే విఘ్నహరస్యాస్య ప్రసాదతః ॥ 28

జయః ప్రాప్తో యతస్తేన పురంచ విజయాభిదం ।
సర్వేషాంచ హృతావిఘ్నా విఘ్నహర్తేతి అసో భవత్ ॥ 29

**కౌండిన్య ఉవాచ :**

ఇతి తేకథితం సర్వం దూర్వామాహాత్మ్య ముత్తమం

శ్రవణాత్పఠనాచ్చాస్య సర్వపాపక్షయో భవేత్ ।
పురాతన మితిహాసం శృణుమే కథతః ప్రియే ॥ 30

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే దూర్వామహాత్మ్యం**
**నామ చతుష్షష్టితమో అధ్యాయః**



# 64-వ అధ్యాయము

# అనలాసుర వృత్తాంతం

ఈ కధావృత్తాంతాన్నంతటినీ కౌండిన్యమహర్షినుండి వింటున్న ఆతడి ధర్మపత్ని యిలా ప్రశ్నించింది. "ఓ మునివర్యా! దేవతలు, మునులు అలా రాక్షసుడి భీతితో కాలికి బుద్ధిచెప్పి పారిపోగా ఓ పర్వతంలా ఆ బాలకుడా నిలిచివున్నది? ఆ తరువాత ఏం జరిగింది? ఆ వృత్తాంతమంతా వినాలని కుతూహలమౌతున్నది. కనుక దయతో వివరించండి!" అలా ప్రశ్నించిన ఆశ్రయకు కౌండిన్యుడు ఏమి బదులిచ్చాడో ఓ దేవేంద్రా నీవూవిను! అంటూ నారదుడు తరువాత జరిగిన కధను వివరించాడు.

బాలుడైన గజాననుడు అలా అచలుడై నిలచియుండటంచూసి అనలాసురుడు కాలాగ్నిలా మండిపడుతూ మీదకి దాడిచేయవచ్చాడు.

అతడి భయంకర పదఘట్టనలకు భూమి గడగడా వణికింది! ఆకాశంలో ఉరుములతో మేఘగర్జన వినవచ్చింది. ఆ వికృతమైన ధ్వనులకు చెట్ల కొమ్మల పైనుండే పక్షులన్నీ నేలపై రాలినాయి. సముద్రములు ఉప్పొంగాయి! ఒక ప్రచండవాయువు పెనుతుఫానులా వీచి పెద్దపెద్ద వృక్షాలన్నీ కూకటివేళ్ళతోసహా పెకలించబడ్డాయి.

అప్పుడు బాలస్వరూపుడైన ఆ గజాననుడు అనలరూపుడైన ఆ రాక్షసుణ్ణి తన మాయాబలంతో పట్టేసి అందరూ చూస్తుండగా అగస్త్యుడు సముద్రాలను అవపోశనపట్టినట్లు ఆ దానవుడిని మ్రింగేశాడు. అలా మ్రింగివేసి 'వీడుగాని కడుపులోకి వెళ్ళాడా - కుక్షిలోని భువనాలన్నీ దగ్ధమౌతాయి' అనుకున్నాడు.

అప్పుడా బాలగజాననుడి తాపోపశమనమునకై ఇంద్రుడు చంద్రుని కళని యిచ్చాడు. అనాటినుండి అతడికి 'ఫాలచంద్రుడ'న్న నామం కలిగింది. బ్రహ్మదేవుడు తన మనఃసంకల్పమాత్రంచేతనే సిద్ధిబుద్ధియనే ఇరువురు కన్యలనూ సృజించి - సర్వాంగసుందరులూ, కోమలశరీరులైన ఆ భామలను సమర్పించి 'ఓదేవా! వీరిని ఆలింగనం చేసుకుంటే నీ తాపం శాంతిస్తుంది' అంటూ మొక్కాడు. అప్పుడు విష్ణుమూర్తి కమలములను యివ్వగా 'పద్మహస్తుడు' అన్న నామం సుప్రసిద్ధమైంది! అప్పటికీ అగ్ని శాంతించనందున వరుణుడు చల్లని ఉదకంతో తడిపాడు. శంకరుడు శేషుడిని బహూకరించగా దానితో బంధింపబడిన ఉదరము కలవాడైనందున 'వ్యాళబద్ధు'డని దేవతలు కీర్తించారు. ఐనా వేటివల్లా కూడా గణేశునికి తాపోపశమనంకాలేదు. అప్పుడు 8,800 మంది

మునీశ్వరులు వచ్చి ఒక్కొక్కరూ ఇరవైఒక్క దూర్వాంకురముల చొప్పున భక్తితో సమర్పించారు. అప్పుడు వాటివల్ల ఆ అగ్ని శాంతించింది.

ఈ రీతిగా దూర్వాంకురములచేత అర్చించబడిన గజాననుడు చాలా సంతసించాడు. ఈ విషయం తెలుసుకున్న దేవతలందరూకూడా ఆ భక్తసులభుడిని దూర్వాంకురములతో పూజించి సంతుష్టిపరిచారు. అలా అనంతమైన దూర్వాంకురములచేత అర్చించబడ్డ గజాననుడు దేవతలతోనూ, మునులతోనూ యిలాఅన్నాడు.

"నా పూజకై భక్తిశ్రద్ధలతోపాటూ సేకరించాల్సిన మహాముఖ్యమైన పూజాద్రవ్యం ఈ దూర్వాంకురాలే! అందువల్ల నాపూజలో వీటిని తప్పక వినియోగించాలి! దూర్వాంకురములులేని పూజవల్ల ఎట్టి ప్రయోజనం ఉండదు! అందువల్ల నా భక్తులు ఉషఃకాలంలో ఒక్కటైనా, ఇరవైఒక్క టైనా దూర్వాంకురములు సమర్పిస్తే అది అనంతఫలప్రదమౌతుంది! ఆ ఫలితం నూరుయజ్ఞాల వల్లగానీ, దానాదికములవల్లగాని ఉగ్రతపోనిష్ట వల్లగాని సంపాదించే పుణ్యంకన్న ఎన్నోరెట్లు అధికమైనది."

'ఓ ఆశ్రయా! ఈ విధంగా దేవతలు, మునులు గజానను వాక్యాలను విని తిరిగి ఆయనను దూర్వాంకురములతో పూజించారు. అప్పుడా భక్తవత్సలుడు అమిత సంతోషంతో భూనభోంతరాళాలు ప్రతిధ్వనించేలా గర్జించాడు. అనేక వరాలను ఆనందపరవశులైన దేవతలకు, మునులకు, మానవులకు ఒసంగి అంతర్థానం చెందాడు. అదిమొదలు ఆయనకు **'కాలానల ప్రశమనుడు'** అన్ననామం కల్గింది. తరువాత అందరూ ఆ ప్రదేశంలో ఒక గణేశదేవాలయాన్ని నిర్మించి గణేశమూర్తిని స్థాపించి ఆ మూర్తికి 'విఘ్నహరుడ'న్న నామం ఉంచారు.

ఎవరైతే ఈ ప్రదేశంలో స్నానం, దానము, అనుష్ఠానము నిష్ఠగా ఆచరిస్తారో వారికి విఘ్నహరుని కృపవలన అనంతమైన పుణ్యం సంప్రాప్త మౌతుంది. ఇక్కడ గజాననుడు కాలానలఅసురునిపై జయంపొందాడు గనుక ఈ ప్రదేశము విజయపురమన్న పేరిట ఖ్యాతివహించింది. సకల భక్తజనుల విఘ్నహర్త కనుకనే ఆ దేవదేవునికి విఘ్నహరుడన్న పేరుకూడా విఖ్యాతమైంది. "ఓ ఆశ్రయా! నీవు అడిగావుగనుక అమిత ఫలప్రదమైన ఈ దూర్వాంకుర మహాత్మ్యాన్ని నీకు వివరించాను. దీనిని పఠించుటవలన వినటం వలన సర్వపాపములు క్షయమౌతాయి! ఇది అతిపురాతనమైన ఇతి హాసం" అంటూ కౌండిన్యమహర్షి తన అనుష్ఠానానికి నదీతీరానికి వెళ్ళి పోయాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'అనలాసుర వృత్తాంతం' అనే 64-వ అధ్యాయం.



65

# దూర్వామహాత్మ్యం

(మూలం)

## పంచషష్ఠితమో అధ్యాయః

**కౌండిన్య ఉవాచ :**

కస్మింశ్చిసమయే దేవి సుఖాసీనం గజాననం ।
నారదో మునిరభ్యాగా ద్ద్రష్టుం తం బహువాసరైః ॥ 1

సాష్టాంగం ప్రణిపత్యైనం ప్రాహనః సార్థకం జగుః ।
యత్పుణ్య నిచయైర్జాతం దర్శనం తే గజానన ॥ 2

ఇత్యుక్త్వా స్వాంజలింబద్ధ్వా తస్థౌ తత్పురతో మునిః ।
ధృత్వా కరేణ తత్పాణిం ఉపవేశయదాసనే ॥ 3

గజాననో మహాభాగో మహాభాగం మహామునిం ।
నారదో భగవాంస్తేన సంతుష్టిం మునిపుంగవః ॥ 4

ఉవాచతంగణాధీశం అశ్చర్యం హృదయేస్థియత్ ॥
తన్నివేదితుమాయాతో నత్వా త్వాంపునరావ్రజే ॥ 5

**గజానన ఉవాచ :**

కిమాశ్చర్యం త్వయాదృష్టం హృది కింతేఽభివర్తతే ।
వద సర్వం విశేషేణ తతో వ్రజ నిజాశ్రమం ॥ 6

**నారద ఉవాచ :**

మైధిలే విషయేదేవ జనకో రాజసత్తమః ।
అతిమానీ వదాన్యశ్చ వేదవేదాంగ పారగః ॥ 7

అన్నదాన రతోనిత్యం బ్రాహ్మణాన్పూజయత్యసౌ ।
నానాలంకార వాసోభి రక్షిణాభి రనేకతః ॥ 8

దీనాంధ కృపణేభ్యశ్చ బహుద్రవ్యం దదాత్యసౌ ।
యాచకై ర్యాచ్యతేయద్యత్ తత్తత్తేన ప్రదీయతే ॥ 9

తథాపి నవ్యయంయాతి ద్రవ్యం తస్యమహాత్మనః ।
గజాననస్య సంతుష్ట్యా ద్రవ్యం తద్వర్థతే నకిం ॥ 10

ఇత్యాశ్చర్యం మహంద్రష్టుం ప్రయాత స్తద్గృహానహం ।
బ్రహ్మజ్ఞానాభిమానేన ఉపహాసం మమాకరోత్ ॥ 11

అహంచ తమువాచేద్ధం ధన్యోసి నృపసత్తమ ।
చింతితం తే పిభక్త్యాయం ప్రయచ్ఛతి గజాననః ॥ 12

సతు గర్వాదువాచేద్ధం అహమీశో జగత్రయే ।
అహం దాతాచ భోక్తాచ పాతా దాపయితా తథా ॥ 13

మత్స్యరూపం వినానాన్య ద్విద్యతే భువనత్రయే ।
కర్తాచ కారణంచాహం కరణం మునిసత్తమ ॥ 14

**నారద ఉవాచ :**

ఇతి తద్వచనం శృత్వా క్రోధేనాహం జగాద తం ॥

ఈశ్వరాజ్జగతః కర్తా నాన్యః కశ్చన విద్యతే ।
త్వంతు ధర్మ్యమిమం రాజన్ దంభేనైవ కరోషి కం ॥ 15

ధర్మయిష్యే సాక్ష్యమస్య స్వల్పకాలేన తే అనఘ ।
ఇత్యుక్త్వా తమహంయాతః త్వదంతిక మిభావన ॥ 16

**కౌండిన్య ఉవాచ :**

ఆకర్ణ్యేద్ధం మునేర్వాక్యం పూజయామాస తంవిభుః । 17

అర్ఘ్యాదాభి రలంకారై ర్దివ్యైః పుష్పైస్సచందనైః ।
మునిరాజ్ఞాం ప్రగృహ్యైవ వైకుంఠే విష్ణుమభ్యగాత్ ॥ 18

గజాననోపి మిథిలాం రాజభక్తిం పరీక్షితుం ।
కుత్సితం వేషమాదాయ సర్వజ్ఞోపి సమాయయౌ ॥ 19

అనేక క్షతసంయుక్తం స్రవద్రక్త మమంగళం ।
మక్షికా నిచయాక్రాంతం రదహీన మివాతురం ॥ 20

గచ్ఛంతం తాదృశం దృష్ట్వా నరా నాసా నిరోధనం ।
కుర్వంతి వాససాకేచిత్ ష్ఠీవనంచ యథా తథా ॥ 21

స్థలన్మార్ఛ న్నత స్గచ్ఛ న్నర్భకావలి సంయుతః ।
నృపద్వారం సమాగమ్య ద్వారపాలానువాచ సః ॥ 22

రాజ్ఞే నివేద్యతాం దూతా అతిథిం మాం సమాగతం ।
బ్రాహ్మణం క్షుదితం వృద్ధం ఇచ్ఛా భోజనకాంక్షిణం ॥ 23

తే తద్వాక్యం తథాచఖ్యు ర్గత్వాతం జనకం నృప ।
అనీయతామితి ప్రాహ దూతాద్రష్టుంతు కౌతుకం ॥ 24

హేదూతా ఆజ్ఞాపపయామాసుః కుచేలం మలినం నృపం ॥
దదర్శ దూరాజ్జనకోఽ కంపంతం మక్షికావృతం ॥ 25

అస్రుక్స్రవంతం వృద్ధం తం బ్రాహ్మణ్యం శ్రమవారిణం ।
తర్కయామాస జనక ఈశ్వరో రూపధుక్ నుకిం ॥ 26

ఫలితుం మాం సమాయాతో యది పుణ్యం భవేన్మమ ।
సమాధాస్యే మనోహ్యస్య భవిష్యం నావ్యథా భవేత్ ॥ 27

ఇత్యేవం చింతయత్యేవ జనకే నృపసత్తమే
ప్రవేశితో ద్వారపాలై ర్బ్రాహ్మణః సర్వదృశ్యత॥ 28

**బ్రాహ్మణ ఉవాచ :**

చంద్రాంతు ధవలాం కీర్తిం శృత్వా తేహం సమాగతః ॥ 29
దేహి మే భోజనం రాజన్! క్షుధితస్య చిరాద్భృశం ।

మమ తృప్తిర్భవేద్యావ త్తావదన్నం ప్రదీయతాం ।
తవక్రతుశతం పుణ్యం భవిష్యతి నరేశ్వరః ॥ 30

**కౌండిన్య ఉవాచ :**

ఇతి వాచం నిశమ్యాసౌ గృహమధ్యే నినాయ తం ।
సంపూజ్య విధివచ్చైనం స్వాద్వన్న ముపవేశయత్ । 31

ఏకగ్రాసేన సర్వం స జగ్రాహద్విజ సత్తమః ।
అయాచ దన్న మన్యత్స నృపో దాత్సర్వతోపమం ॥ 32

తదప్యేకేన జగ్రాస కబళేన ద్విజోత్తమః ।
యావదన్నం స్థితం సిద్ధం పర్యాప్తమయుతస్య యత్ ॥ 33

తద్దత్తం పురతస్తస్య బభక్షత తక్షణేన సః ।
అసంఖ్యాతేషు పాత్రేషు పక్తుంక్షిప్తాః సుతండులాన్ ॥ 34

దీయతే పురతస్తస్య యః సిద్ధశ్చోదనో భవత్ ।
బుభక్షయతి సర్వంతం తతఊచే జనో నృపం ॥ 35

రాక్షసో యం భవేత్త్రాయః కిమర్థం దీయతే బహు ।
రాక్షసేభ్యః ప్రదానేన న కించిత్పుణ్యమాప్యతే॥ 36

కేచిదూచుస్త్రిభువనే భక్షితేవ్యస్యనో భవేత్ ।
తృప్తిః పరమికా రాజన్ ధాన్యమస్మై ప్రదీయతాం ॥ 37

తతో ధాన్యానిసర్వాణి గృహేచ భూమౌ స్థితానిచ ।
అనీయ చిక్షిపుస్తస్య పురగ్రామ గతానిచ॥ 38

పుంసోస్య ద్విజరూపస్య సర్వభక్షస్య చాతిథేః ।
నతృప్తి మగమత్సోథ భక్షితేషుచ తేషుచ ॥ 39

తతో దూతా న్నృపంప్రోచుః ధాన్యం క్వాపి నలభ్యతే ।
ఇతి దూతవచశ్రుత్వా జనకే అధోముఖే స్థితే ॥ 40

స్వస్తీత్యుక్త్వా గమద్విప్రో నతృప్తోసౌ గృహంగృహం ।
దీయతా మన్నమిత్యాహ తే జనాస్తం జగుస్తదా ॥ 41

సర్వేషాం గృహగం ధాన్యం సర్వం రాజ్ఞాసమాహృతం ।
జగ్ధం త్వయాఖిలం బ్రహ్మన్ గమ్యతాం యత్రతే రుచిః ॥ 42

**ద్విజ ఉవాచ :**

కీర్తిస్వశ్రుతాలోకా అన్నదాతా జనకాత్పరః ।
తృప్తికామః సమాయాతో హ్యతృప్తోహం కథంవ్రజే ॥ 43

క్షూప్లేంభూతేషులోకేషు బభ్రమన్ సదదర్శహ ।
విరోచన త్రిరసోర్మందిరం ద్విజయో ర్వరం ॥ 44

తన్మధ్యం ప్రావిశత్సోహి గృహస్వామీ వసత్తయా ।
సర్వోపస్కార రహితం ధాతుపాత్ర వివర్జితం ॥ 45

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే దూర్వామహాత్మ్యం నామ పంచషష్టితమో అధ్యాయః ।**



## 65-వ అధ్యాయము

# దూర్వామహాత్మ్యం-II

ఆ తరువాత కౌండిన్యుడు తన పత్నియైన ఆశ్రయతో దూర్వా మహాత్మ్యగాధను యిలా కొనసాగించాడు :

"ఓ ప్రియపత్నీ! ఒకనాడు గజాననుడు సుఖాసీనుడైవుండగా త్రైలోక్యసంచారీ బ్రహ్మమానసపుత్రుడైన నారదమహర్షి ఆయనను దర్శించి సాష్టాంగ దండప్రణామంచేసి, 'ఓదేవా! తమ దర్శనవిశేషంచేత నాజన్మ సార్థకమైంది. అనేక జన్మార్జిత పుణ్యఫలంవల్లకాని తమదర్శనం కలుగదు!' అంటూ వినయంతో అంజలిఘటించి నిలిచాడు. అప్పుడు భక్తవత్సలుడైన గజాననుడు ఎంతో ఆదరంతో నారదుని చేయిపట్టుకుని అతడిని ఉచితాసనంపై కూర్చుండపెట్టాడు. నారదుడా ప్రేమకు ఆనందపరవశుడై గజాననునితో యిలా అన్నాడు :

'ఓ దేవా! నాకు మార్గమధ్యంలో ఒక ఆశ్చర్యకరమైన విషయం తటస్థించింది. దానిని తమకు విన్నవించాలన్న కుతూహలంతో వచ్చాను. అది చెప్పి వెళతాను!'

అప్పుడు భక్తజనమందారుడైన గణేశుడు చిరునవ్వుతో 'ఆ వివరం చెప్పి వెళ్ళమని' అనుజ్ఞనిచ్చాడు. అందుకు నారదుడిలా చెప్పసాగాడు :

"ఓ ప్రభూ! మిథిలానగరాన్ని జనకుడు అనేరాజు ప్రజారంజకంగా ప్రజలను తన కన్నబిడ్డలకన్న మిన్నగా ప్రేమిస్తూ పాలిస్తున్నాడు. అతడు సకల శుభగుణోపేతుడవటమేకాక గొప్పదాత! నిత్యం అడిగినవారికి లేదనకుండా దానమివ్వటమేకాక నిరతాన్నదానంతో ప్రజల ఆకలికూడా తీర్చే గుణవంతుడు. దేవతలను, బ్రాహ్మణులను అనునిత్యం పూజిస్తూ ధర్మబద్ధుడై జీవిస్తున్నాడు. ఆ కారణంచేతనే కాబోలు - లేక తమ అనుగ్రహవిశేషంవల్లనో ఇంతగా ద్రవ్యమును వెచ్చిస్తున్నా ఆతడి సంపద తరగక బహుముఖంగా పెరుగుతూనే ఉన్నది. ఈ ఆశ్చర్యాన్నంతటినీ ఆతడి గృహానికి స్వయంగా వెళ్ళిచూచాను! ఆతడు బ్రహ్మజ్ఞానాభిమానం తో నన్ను కొంచెం అపహసించాడు. అతడిని అభినందిస్తూ యిలా అన్నాను :

'ఓ రాజా! నీవు ధన్యుడవయ్యావు! నీకు అక్షయమైన సంపద లను సర్వసమృద్ధినీ ఆ గజాననుడే నీభక్తికి ప్రతిఫలంగా అనుగ్రహిస్తు న్నాడు!' నా మాటలు విన్న జనకుడు గర్వంతో యిలాఅన్నాడు. 'నేనే ముల్లోకాలకూ ప్రభువును! మహాదాతను! భోగిని! సర్వరక్షకుడనూ నేనే! నాకన్నా యితర మార్గమేమీ ముల్లోకాలలోనూ లేదు! సర్వమూ నా ప్రమేయం వల్లనే జరుగుతున్నది. కర్త, కార్యము, కరణమూ యివన్నీ

కూడా నేనే!' అంటూన్న ఆ గర్విష్టితో కినుకవహించి ఆగ్రహంతో యిలా అన్నాను :

'ఓ రాజా! ఈ జగత్కర్త, భర్త, హర్తా ఈ మూడూకూడా ఆ ఈశ్వరుడే! ఇంకెవరూ ఆ పనిని నిర్వర్తించజాలరు! నీవే సత్కార్యములన్నీ చేస్తున్నానంటున్నావే? దంభముతో నీ గొప్పతనాన్ని చాటుకునే నిమిత్తమే వాటిని చేస్తున్నట్లు స్పష్టమైంది. నీ పొరపాటు నీకర్థమయ్యేరోజు అతి సమీపంలోనే ఉన్నది!" అని అక్కడినుండి మీసన్నిధికి వచ్చాను' అంటూ నారదుడు విఘ్నేశ్వరునికి భక్తితో నమస్కరించి సెలవుపుచ్చుకున్నాడు. అక్కడినుండి నారదుడు విష్ణుదర్శ నార్థమై వైకుంఠం చేరుకున్నాడు.

"ఓ ఆశ్రయా! నారదమహర్షి అలా సెలవుతీసుకున్నాక గజాననుడు రాజభక్తిని పరీక్షించటానికై మిథిలానగరాన్ని చేరుకున్నాడు. శరీరమంతా వ్రణాలు రసిఓడుతూ శరీరంపై ఈగలు ముసురుతూండగా చిరిగిన, మాసినవస్త్రం ధరించి ఓ బీదబ్రాహ్మణ వేషధారియై పడుతూ, లేస్తూ రాజమందిరంవద్దకు చేరాడు మాయారూపంలో ఆ గజాననుడు! ద్వారం వద్దనున్న ద్వారపాలకులతో

"ఓ దూతలారా! అతిథియై ఒక బ్రాహ్మణుడు వచ్చాడని మీ రాజుతో తెలపండి. కడువృద్ధుణ్ణి. బాగా ఆకలిగొని ఉన్నాను. మృష్టాన్న భోజనాన్ని మాత్రమే ఆశించివచ్చాను" అన్నాడు. దూతలీవార్తను జనక మహారాజుకు ఎరిగించగానే 'ఓ దూతలారా! ఆ వృద్ధుణ్ణి వెంటనే లోనికి తీసుకురండి!' అని ఆజ్ఞాపించాడు. దూతలుకూడా అతడిని వెంటనే ప్రవేశపెట్టారు. ఆరాజు దూరాన్నుంచే మలినదేహంతో వంటిమీద వ్రణాల

తోనూ వాటినుండి స్రవిస్తూన్న నెత్తుటిపై మూగే ఈగలతో జుగుప్సా కరంగాఉన్న ఆ వృద్ధుడిని చూసి

'ఆహా! నన్ను పరీక్షించటానికి ఈశ్వరుడేమైనా ఈ రూపందాల్చి వచ్చాడో ఏమో? ఏదేమైనప్పటికీ ఈతడి క్షుద్బాధను తొలగించి మనస్సును సమాధానపరుస్తాను!' అనుకున్నాడు. ఆ బ్రాహ్మణుడు రాజుదగ్గరకు వచ్చి

"ఓ రాజా! చంద్రునికాంతివంటి తెల్లనిదైన నీ కీర్తిచంద్రికనిగూర్చి విని నీ సన్నిధికి వచ్చాను! చిరకాలంనుండి ఆకలిబాధతో తల్లడిల్లుతున్నాను. కనుక నాకు కడుపునిండా భోజనంపెట్టు! అలాగాని చేస్తివా నీకు నూరుయాగాలు చేసినంతటి పుణ్యం వస్తుంది!" అన్నాడు.

ఈ కథనంతా చెబుతున్న కౌండిన్యుడిలా అన్నాడు : 'ఓఆశ్రయా! ఆ జనకమహారాజు బ్రాహ్మణుని పలుకులువిని కూడా వెంటబెట్టుకొని తన మందిరంలోకి తీసుకువెళ్ళి ఆతడికి సకల రుచులతో కూడిన భోజనం పెట్టించగా అదంతా ఒక గడ్డిపరకలా తినేశాడు ఆ మాయా రూపి! ఇంకా ఆకలిగావున్నదంటే ఒక పర్వతమంత అన్నపురాశిని వండించి పెట్టాడు. అదంతాకూడా ఒక ముద్దను తిన్నట్లుగా మ్రింగేశాడు.

ఈ విధంగా పదివేలమందికి సిద్ధంచేసిన ఆహారపదార్థాలన్నీ తినేసి 'యింకా అన్నంకావాలి!' అనగానే గాడిపొయ్యలు త్రవ్వించి యింకా అన్నం వండించి వడ్డింపచేశాడు. వండింది వండినట్లుగా వడ్డించినా అదంతా ఖాళీచేసేయసాగాడు. అప్పుడు ప్రజలంతా రాజువద్దకు వెళ్ళి

'ప్రభూ! వీడెవరో రాక్షసునిలా ఉన్నాడు. వీనికెందుకింత ఆహారం

పెడతారు? ఇటువంటి రాక్షసులకు భోజనం పెట్టడంవల్ల ఏమీ ప్రయో జనంలేదు! వీడు ముల్లోకాలూ మ్రింగించినా తృప్తిచెందునా?' అన్నారు. ఉన్నబియ్యం అన్నీ నిండుకున్నవి! ధాన్యమైనాసరే కడుపునిండేందుకు తెచ్చి యివ్వమన్నాడు! అప్పుడు ప్రజలందరి యిళ్ళలోనివీ, గ్రామాల లోనూ పల్లెలలోని ధాన్యపురాశులన్నీకూడా తెచ్చిపెట్టారు. అవి అన్నీకూడా భక్షించినా ఆతడికి తృప్తి కలుగలేదు! అప్పుడు దూతలు రాజసన్నిధికి వెళ్ళి 'ప్రభూ! ఇంక ధాన్యముకూడా ఎక్కడాలేదు!' అని చెప్పగా జనకుడామాటలు విని తలవంచుకుని సిగ్గుపడ్డాడు. ఆ బ్రాహ్మణుడు

'ఓ రాజా! నస్తితేస్తు!' అనిపలికి గ్రామములో యింటింటికీ భిక్షాటనకై వెళ్ళగా

'ఓ బ్రాహ్మణోత్తమా! మా ఇళ్ళలోని సమస్త ధాన్యమునూ రాజు ఎప్పుడో తీసుకెళ్ళిపోయాడు నీకిప్పుడు అన్నంపెట్టుట ఎలాగ? కనుక వేరేచోటుకి వెళ్ళు!' అనసాగారు - అప్పుడా మాయాబ్రాహ్మణుడు

"ఓ జనులారా! జనకమహారాజు నిరతాన్నప్రదాత అన్న కీర్తివిని తృప్తిని పొందగోరి వచ్చాను. ఆ తృప్తి కలుగకుండా ఎక్కడికి వెళ్ళ గలను!" అనగానే మారుమాట్లాడలేక ప్రజలు మౌనం వహించారు. ఆ మాయాబ్రాహ్మణుడు అలా తిరుగుతూ విరోచన, త్రిరోచనుల యింటిలో ప్రవేశించాడు. ఆ ఇంట్లో ఏరకమైన వస్తుసామాగ్రి, పాత్రలు కనుపించ లేదు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'దూర్వామహాత్మ్యం' అనే 65-వ అధ్యాయం.



66

# దూర్వామహాత్మ్యం

(మూలం)

## షట్షష్ఠితమో అధ్యాయః

**కౌండిన్య ఉవాచ :**

ధరామాత్రాసనౌ తౌతు నభః ప్రావార సంయుతా ।
దిగంబరౌ సర్వధాతు సంస్పర్శవర్జితావుభౌ ॥ 1

అయాచిత భుజౌ నిత్యం జనైర్లేనాఖిలాః క్రియాః ।
ద్విజరూపధరో పశ్యత్ కుర్వాణౌ సత్యసిద్ధయే ॥ 2

గృహంచ మక్షికా బృందై ర్మశకైరభితో వృతం ।
మూర్తించ గణనాధస్య పూజితాం పుష్పపల్లవైః ॥ 3

అనన్యభక్త్యా తాభ్యాంచ తత్పరాభ్యాం దదర్శసః ।
తావూచే శ్రూయతాం వాక్యం యన్మయా ప్రోచ్యతేనఘౌ ॥ 4

మిథిలాధిపతేః కీర్తిం శృత్వాహం క్షుధితోభ్రుశం ।
తృప్తికామః సమాయాతో నసతృప్తిం సమాకరోత్ ॥ 5

కర్మణా దాంభికేనైవ సత్త్వంన పరిరక్ష్యతే ।
మమ తృప్తికరం కించిద్గృహేచే దస్తిదీయతాం ॥ 6

దంపతీ ఊచతుః

చక్రవర్తీనృపో యోసౌ తేన తృప్తిర్నతేకృతా ।
ఆవాభ్యాంతు దరిద్రాభ్యాం కిందేయం తృప్తికారకం ॥ 7

నదీనదజలైరబ్ధి రసంఖ్యైర్యోనపూర్యతే ।
బిందుమాత్రేణ్య పయసా సకథంపూర్య తే వద ॥ 8

ద్విజ ఉవాచ :

భక్త్యాదత్తంస్వల్పమపి బహూతృప్తికరం మమ ।
అభక్త్యావాథ దంభేన బహూదత్తం వృథా భవేత్ ॥ 9

తావూచతు :

ఆవయోర్నగృహే కించి చ్ఛపథస్తే ద్వీజోత్తమ ।
పూజాయై గణనాథస్య ప్రాతర్దూర్వాంకురా హృతాః 10
పూజితో గణనాథస్తైస్త తేకోవశిష్యతే ।

ద్విజ ఉవాచ :

భక్త్యాదత్తః స ఏకోపి తృప్తయే స్యాత్త్వదీయతాం ॥ 11

కౌండిన్య ఉవాచ :

విరోచనా దదౌతస్మై శృత్వా వాక్యం తదీరితం ।
ఏకం దూర్వాంకురం భక్త్యా తేనతృప్తో భవద్విజః ॥ 12

శాల్యన్నం పాయసాన్నంచ నానాపక్వాన్నమేవచ ।
వ్యంజనానిచ సర్వాణి లేహ్యా చోష్యాణ్యనేకధా ॥ 13

విరోచనో దదౌ కల్యా తస్మిన్ దూర్వాంకురే చతం ।
గృహీత్వా బ్రాహ్మణ స్తత్తు బభక్ష పరయా ముదా ॥ 14

తస్మిన్దూర్వాంకురే భక్త్యా దత్తేతే నాథభక్తితః ।
ప్రశశామ ద్విజస్యాస్య తత్ క్షణాజ్జఠరానలః ॥ 15

తృప్తిశ్చ పరమాతేన ప్రాప్తా తత్క్షణమాత్రతః ।
ఆలిలింగ త్రిశిరసం దృష్ట్వా హర్షాత్ ద్విజి స్తదాః 16

తత్యాజ కుత్సితం రూపం ప్రకటోభూద్గజాననః ।
చతుర్భుజో అరవిందాక్షః శుండా దండవిరాజితః । 17

కమలం పరశుం మాలాం దంతం తు కరతలైర్దధత్ ।
మహార్ఘముకుటోరాజత్కర్ణ కుండల మండితః ॥ 18

దివ్యవస్త్ర పరీధానో దివ్యగంధానులేపనః
ఉవాచ తౌ ప్రసన్నాత్మా దంపతీ సగజాననః 19
వృణీతం తం వరం శీఘ్రం మనసాయం యమిచ్ఛథః

తాఊచతు :

జన్మనీ యత్రనౌపస్యాతాం తత్రతే దృఢభక్తితా ॥ 20

ముక్తిర్వాదీయతాం దేవ దుస్తరా ద్భవసాగరాత్ ।
నచావాం చిత్తయోరవ్య న్నాపేక్షిత మిభానన ॥ 21

కౌండిన్య ఉవాచ :

ఇతి, తద్వాక్య మాకర్ణ్యం తథేత్యుక్త్వా గజాననః ।
పునరాలింగ్య పిదధే భక్తం త్రిశిరసం ముదా ॥ 22

ఏతస్మాత్కారణాద్దూర్వా భారోస్మైదీయతే మయా ।
అసంఖ్య భక్షణాద్యేన తృప్తిం దేవః సమాయయౌ ॥

దూర్వాంకురేణ చైకేన స తృప్తిం పరమాం యయౌ ॥ 23

ఇతితే కథితంసమ్యగాస్రయే మహిమా శుభ ।
దూర్వా సమర్పణభివః శ్రవణాత్సర్వకామదః ॥ 24

ఇతిహాస మిమంభక్త్యా శృణుతే శ్రావయేచ్చ యః ।
సపుత్రధన కామాఢ్యః పరత్రే హచ మోదతే ।

గజాననే లభేద్భక్తిం నిష్కామో ముక్తిమాప్నుయాత్ ।

గణా ఊచు :

శ్రుత్వాపీద్ధతీహాసమాశ్రయా సంశయం పున।

ప్రపేదేహృదితం జ్ఞాత్వా కౌండిన్యః పునరబ్రవీత్ ।
ఆశ్రయే శృణుమే వాక్యం సంశయస్యా పనుత్తయే ॥ 27

యద్బ్రవీమి హృదిస్థస్య మాయాజ్ఞాతస్య తేనఘే ।
ఏకం దూర్వాంకురం గృహ్యగచ్ఛశీఘ్రం బిడౌజసం ॥ 28

వదాశీర్వచనం పూర్వంపశ్చాద్యాచస్వకాంచనం ।
దూర్వాంకురేణ తులితంగృహిత్వా తదిహానయ ॥ 29

తన్న్యూనం నాధికం గ్రాహ్యం తస్య భారాచ్ఛుభాననే ॥ 30

**గణా ఊచు :**

ఇతి వాణీంతస్య శృత్వా గృహిత్వైకం తదాశ్రయా ।
దూర్వాంకురం యయేశక్రం భర్తృవాక్యపరాయణా ॥ 31

**ఇతి శ్రీగణేశ పురాణే దూర్వామహాత్మ్యం నామ ఉపాసనాఖండే**
**షట్ షష్ఠితమో అధ్యాయః**



# 66-వ అధ్యాయము

# దూర్వామహాత్మ్యం-III

ఆ ఇంటియందు చివరికి కూర్చునేందుకు కనీసం పీటయైనా లేనందున విరోచన త్రిరోచనులు యిరువురూ నేలపైనే కూర్చున్నారు. ధరిం చేందుకు సరైన వస్త్రాభరణములుకూడా లేనివారవటంచేత దిగంబరులై ఉండిరి. అయాచితంగా లభించినదానిని మాత్రమే భుజించే నియమం కలవారవటంచేత తమకు భుజించేందుకు ఆహారం లభించని రోజులలో కేవలం నీటితోనే తమ అవసరాలు తీర్చుకునేవారు. ఇల్లంతా ఈగలచేత, దోమలతో నిండి ఎంతో అశుభ్రంగా ఉండినది. నానా రకాల పత్రి చేత అర్చించిన వినాయకునిమూర్తి, నీరుతప్ప మరింకేమీలేని వారియింటిలో ప్రవేశించిన ఆ కపటబ్రాహ్మణుడు వారలతో ఇలా అన్నాడు

"ఓ పుణ్యదంపతులారా! ఈ దేశపు రాజైన జనకుని కీర్తినివిని ఆకలిగా వున్నదికదా! కడుపారా భోజనంచేద్దామని వచ్చిన నాఆశ

అడియాసే అయింది! అతడు చేసేదంతా దంభముతోటి తనగొప్ప చాటుకునేందుకే చేస్తున్నాడు కనుక నాకు తృప్తికలిగేలా మీ యింట ఏమివున్నా పెట్టండి!"

ఆ మాటలకు నిర్ఘాంతపోయిన ఆదంపతులిలా అన్నారు.

'ఓ బ్రాహ్మణోత్తమా! చక్రవర్తియైన రాజుసైతం నీకు తృప్తికలిగించ లేకపోయినాడే? దరిద్రులమైన మేము నీకెలా తృప్తినొందించగలము? నదీనదములచేత నిండని సముద్రము కేవలము బిందువుతో నిండు తుందా?'

ఆ మాటలకు కపటియైన ఆ బ్రాహ్మణుడిలా అన్నాడు :

"ఓ దంపతులారా! భక్తితో సమర్పించినది కొంచెమైనా అది నాకు అనంతతృప్తిని కలిగిస్తుంది! అలాకాక దంభముతో నాకు ఎంతయిచ్చినా అది వృథాయే అవుతుంది!" అప్పుడు ఆదంపతులిలా అన్నారు.

'ఓ బ్రాహ్మణోత్తమా! నీకు యివ్వటానికి మాఇంట ఏమీలేవు! నిజమే చెబుతున్నాము. ఉదయాన్నే గణనాథుని పూజించటానికి సేక రించిన దూర్వాంకురాలలో ఒక్కటి మిగిలివున్నది.' ఆ మాటలకు ఆ బ్రాహ్మణుడిలా అన్నాడు.

'ఓ దంపతులారా! మీరు భక్తిభావముతో ఆ ఒక్క దూర్వాంకురాన్నే సమర్పించినా నేను సంతుష్టుడనౌతాను. కనుక నాకు మీరు దానిని నిస్సందేహంగా యివ్వండి!'

'ఓ ఆశ్రయా! ఆ విధంగా బ్రాహ్మణుడినుండి ఆదేశించబడ్డ

విరోచన అనే ఆ ఇంటి యిల్లాలు ఆ ఒక్క దూర్వాంకురమును తెచ్చి సమర్పించింది. దానితో ఆ బ్రాహ్మణుడు సంతుష్టుడైనాడు. ఆమె షడ్రసోపేతమైన భక్ష్యభోజ్యాదులతోకూడిన విందుభోజనం సమర్పిస్తున్నట్లు భావించి ఆ ఒక్క దూర్వాంకురమునే భక్తిశ్రద్ధలతో ఆ బ్రాహ్మణుడికి సమర్పించటంచేత ఆ దూర్వాంకురంచేత ఆ మాయాబ్రాహ్మణుడి జఠరాగ్ని ఉపశమించింది. ఆతడు పరమతృప్తిని చెందాడు. అప్పుడా బ్రాహ్మణుడు ప్రేమతో త్రిశిరసుని ఆలింగనంచేసుకొని తన మాయా రూపాన్ని త్యజించి, తన నిజరూపంతో ప్రత్యక్షమైనాడు.

ఆ దివ్యమంగళరూపం ఎలావున్నదంటే నాలుగుచేతులలో కమలము, పరశువు, పద్మమాల, దంతములను ధరించి కమలాల వంటి నేత్రాలతో అనేకమైన దివ్యాభరణాలను ధరించి దివ్యసుగంధ లేపనాల పరిమళం గుబాళించగా ప్రత్యక్షమై అనుగ్రహమూర్తిగా యిలా అన్నాడు.

'ఓ పుణ్యదంపతులారా! మీ నిరతిశయమైన భక్తికి నేను ముగ్ధుడి నైనాను. మీ మనోభీష్టములన్నీ తప్పక నెరవేరుస్తాను. కోరుకోండి!' అంటూ అభయమిస్తూ చిరుదరహాసచంద్రికలు వెదచల్లుతూ ప్రసన్నవదనంతో గజాననుడు అనుగ్రహపూర్వకంగా అన్నాడు.

'ఓ ప్రభూ! మేమెక్కడ జన్మించినప్పటికీ నీ చరణకమలాలపైన యెడ బాటులేని భక్తిని ప్రసాదించు. లేదా ఈ ఘోర సంసారసాగరం నుండి మమ్ములను విముక్తుల్నిచేయి! ఇంతకంటే వేరేమీ కోరము!' అన్న ఆ దంపతులతో 'తథాభవతు' ("అలాగే జరుగుగాక!") అంటూ ఆ త్రిశిరుని మరోసారి ప్రేమమీర ఆలింగనం చేసుకొని అంతర్ధానం చెందాడు.

ఓ ఆశ్రయా! అసంఖ్యాకములైన భక్ష్యభోజ్యాదులను ఎన్ని సమర్పించినా తృప్తిచెందని ఆ భగవంతుడైన గజాననుడు కేవలం ఒక్క దూర్వాంకురంవల్లనే అఖండతృప్తిని చెందాడు. కనుక ఓ ఆశ్రయా! దూర్వాంకుర మహిమను దాని సమర్పణ ఫలమును నీకు వర్ణించి చెప్పాను!

**ఈ దూర్వామహిమను పఠించుటవలన, వినుటవలన సకల శుభాలూ ఒనగూరుతాయి! ఈ పవిత్రమైన మహిమను చదివినవారు ధనధాన్య పుత్రపౌత్రాది సంపదలను కలిగి ఇహలోకములో అనంత భోగాలను అనుభవించి గజాననునియందు భక్తికలిగి, కోరికలన్నీ నశించి ముక్తిపొందుతారు'** అంటూ తన ధర్మపత్నియైన ఆశ్రయకు కౌండిన్యుడు వివరించాడు.

ఇదంతా విన్న ఆశ్రయకు ఇంకా సందేహం తొలగనందున ఆమెను పిలిచి కౌండిన్యుడు 'ఓ ఆశ్రయా! నీ సందేహనివారణకై ఒకవాక్యం చెబుతావిను! నీవు ఒక దూర్వాంకురము తీసుకుని ఇంద్రునివద్దకు వెళ్ళి మొదట ఆశీర్వదించి తరువాత ఈ దూర్వాంకురంఎత్తు బంగారము యిమ్మని యాచించు! అది తీసుకుని శీఘ్రముగా రమ్ము!' అంతకు ఎక్కువగాని, తక్కువగాని గ్రహించవలదు!' అన్నాడు.

ఈరకంగా భర్తృ ఆదేశాన్ని విన్న ఆశ్రయ ఆతనివద్దనుండి దూర్వాంకురమును గ్రహించి భర్త ఆజ్ఞానుసారము ఇంద్రునివద్దకు వెళ్ళింది.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'దూర్వామహాత్మ్యం' అనే 66-వ అధ్యాయం.



67

# దూర్వామహాత్మ్యం

(మూలం)

## సప్తషష్టితమో అధ్యాయః

**గణా ఊచు :**

అజ్ఞప్తాస్తేన మునినా స్వాభిప్రీతార్థసిద్ధయే ।
ఏకం దూర్వాంకురం గృహ్య శక్రసన్నిధి మాయయౌ ।  1

తమువాచాశ్రయా శక్ర దేహిమే కాంచనం శుభం ।
యాచితుం త్వాం సమాయాతా భర్తృవాక్యాత్సురేశ్వర ॥  2

**ఇంద్ర ఉవాచ :**

కిమిర్థం త్వమిహాయాతా యద్యాజ్ఞా ప్రేషితా భవేత్ ।
మయా సంప్రేషితంస్యాత్తే జాతరూపం స్వశక్తితః ।

**ఆశ్రయోవాచ :**

దూర్వాంకురస్య తులయా యద్భవేత్కాంచనం సుర ।
తద్గ్రహీష్యే శచీభర్తర్నన్యూనం నచ వాధికం ॥  4

**శక్ర ఉవాచ :**

దూతైనాం నయ శీఘ్రంత్వం కుబేర భవనం ప్రతి ।
స దాస్యతి సువర్ణం చ దూర్వాంకుర మితం శుభం ॥ 5

**గణాఊచు :**

ఆజ్ఞయా దేవరాజస్య దేవదూతస్తయా సహా ।
ప్రాయాత్కుబేర భవనం శక్రస్య వచనాత్తదా ॥ 6

అస్యై దూరాంకురమితం జాత రూపం ప్రదీయతాం ।
ఇంద్రేణ ప్రేషితా సాధ్వీ మునిపత్నీ మయా సహ ।

ప్రాపితా భవనం తేద్యయామి దేవ నమోస్తుతే ॥ 7

**కుబేర ఉవాచ :**

అత్యాశ్చర్యమహం మన్యే మునిశక్ర స్తథాశ్రయాః ।
మోహావిష్టా నజానంతి దూర్వాంకురమితం కియత్ ।

కాంచనం తేనకింవా స్యాత్ బహుళం కినయాచితం। 8

**గణాఊచు :**

ఏవమేవ దదౌ తస్యై బహుళం కాంచనం సః 9

న జగ్రాహ భయాద్భర్తు ర్వ్యానాధిక విశంకయా ॥
స్వర్ణకార తులాయాం తం దూర్వాంకుర మధారయత్ । 10

నాభవత్తులయంతస్య పర్యాప్తం తత్తు హాటకం ।
వణిక్తులా సమాన్తా తత్రాపినా భవత్సమం ॥ 11

తైలకార తులాయాంతు దూర్వాంకుర సమం నచ ॥
ఘటో బద్ధస్తతస్త్ర హాటకం చత్తమేకతః ॥ 12

దూర్వాంకురో పరత్రాపి యాతవత్ర మధస్తదా ।
అన్యదన్యద్దధేత్ర కుబేరః కాంచనం బహు ॥ 13

తచ్చాపి నాభవత్తేన సమం దూర్వాంకురేణ చ ।
సర్వం కోశగతం ద్రవ్యం దత్తం తే నగిరీంద్రవత్ ॥ 14

తథాపి నాభవత్సామ్యం తేన దూర్వాంకురేణ తత్ ।
పత్నీమాహూయతాంప్రాహ కుబేరః కౌతుకాన్వితః ॥ 15

కురుమద్వాక్యతః సుభ్రూ ఘటారోహణమగ్రతః ।
న సమంచేత్సమారోక్ష్యే నిజ సత్వరిరక్షయా ॥ 16

పతివ్రతా జ్ఞయాతస్య ఘటమారురుహే తదా ।
న సమాసాపీ పితేనా సీత్తతః సర్వాం పురీందదౌ ॥ 17

ఘటమధ్యే కుబేరోసౌ నచోర్ధ్వం జాయతే అంకురః ।
శృత్వా దూతముఖాందింద్రో గజారూఢః సమాయయౌ ॥ 18

స్వకీయ ద్రవ్యసహితో ఘటమారురుహే స్వయం ।
దూర్వాంకురో నచోర్ధ్వంస తథాపి సమజాయత । 19

అధోముఖోగతశ్చింతాం కిమేతదితి చింతయన్ ।
విష్ణుం హరంచ సస్మార తత్రారోహణ కామ్యయా ॥ 20

తత్రాగతౌ సనగరౌ ఘటమారుహతాం తదా ।
తథాపి నోర్ధ్వమగమత్తదా దూర్వాంకురస్ఫుటం ॥ 21

తతస్తే తతఉత్తేరుః శివవిష్ణుధనేశ్వరాః వరుణేంద్రాగ్ని
మరుతః । కౌండిన్యమభితో యయుః । 22

దేవా దేవర్షయశ్చైవ సిద్ధ విద్యాధరోరగాః ।
దినాంతే సమనుప్రాప్తే స్వం నీడమివ పక్షిణః ॥ 23

నమస్కృత్య మునింసర్వే ప్రోచురుద్విగ్న చేతసః ।

సర్వే ఊచుః :

వృజం విలయం యాతం దర్శనాత్తవ భోమునే ॥ 24

పూర్వపుణ్య భవాదగ్రే కల్యాణం నోభవిష్యతి ।
తవ పత్న్యాహృతంసర్వం సర్వేషామద్యనఃస్ఫుటం ॥ 25

మహిమానం నజానీమో దూర్వాంకుర సముద్భవం ।
ఏక దూర్వాంకుర తులాం త్రైలోక్యమపి నాలభత్ ॥ 26

గజానన శిరస్థస్య త్వయా భక్త్యార్పితస్య చ ।
జానీయా న్మహిమానంకః సమ్యగ్దూర్వాంకురస్య హ ।
యజ్ఞ దాన వ్రత తప స్స్వాధ్యాయోపి నతత్సమః ॥ 27

గజాననైక భక్తస్య జపత స్తపతో నిశం ।
తవాపి మహిమానం కోజానీయాత్స ర్వదేహినః ॥ 28

ఏవముక్త్వా మునిం సర్వే పూర్వం పూజ్య గజాననం ।
సర్వే సభార్యం పుపుజుః తుష్టువు ర్నన్నృతు ర్జగుః ॥ 29

న బ్రహ్మ నహరిః శివేంద్ర మరుతో నాగ్ని ర్వివస్వాన్ యమః ।
శేషో శేషకలానిధిశ్చ వరుణో నో చంద్రమా నాశ్వినౌ ।

నో వాచామధిపో నచైవ గరుడో నో యక్షరాట్ నాంగిరా ।
మహాత్మ్యం పరివేదదేవనిగమై రజ్ఞాతరూపస్యతే ॥ 30

ఏవం సంతోష్య సర్వేతే దేవదేవం గజాననం ।
మునించ సమనుజ్ఞాప్య యయుః స్వం స్వం నికేతనం ॥ 31

ఆశ్రయాపి తతో జ్ఞాత్వా దూర్వా మాహాత్మ్యముత్తమం ।
విశ్వస్తా భర్తృవాక్యే సా దూర్వాభిః ప్రత్యపూజయత్ ॥ 32

విఘ్నేశ్వరం సర్వదేవం సర్వైర్దూర్వాభి రర్చితం ।
ప్రణనామ చ కౌండిన్యం భర్తారం సత్యవాదినం ॥ 33

ఉవాచ సుప్రసన్నా సా స్వాత్మానం నిదతీభ్రుశం

**ఆశ్రయోవాచ :**

మాదృశీ నైవ దుష్టాస్తి యాతేవాక్యేస సంశయా ॥ 34

విశేష విదుషా స్వామి న్విశేషవిదుషా త్వయా ।
సమ్యక్కృతం మమ విభో సర్వభూత దయావతా ॥ 35

తత్ క్షమస్వా పరాంధం మే త్వామహం శరిణం గతా ।
తత ప్రాతః సముద్ధాయ దూర్వా ఆదాయ సత్వరం ॥ 36

స్నాత్వా దేవం సమభ్యర్చ్య దూర్వార్పణ మకుర్వతాం ।
అనన్య భక్త్యా జ్ఞాత్వా తౌ దూర్వామహాత్మ్యముత్తమం ॥ 37

సాయం ప్రాతర్దేవదేవం పూజయంతౌ నిరంతరం ।
త్యక్త్వా యజ్ఞవ్రతం దానం జ్ఞాత్వాదేవో గజాననః ॥ 38

కృపయా పరయా విష్ణః స్వం ధామ ప్రత్యపాదయత్ ।

**గణాఊచుః**

అగాధం వర్ణితం దూర్వామాహాత్మ్య మిదముత్తమం ॥ 39

అశేష వర్ణనే శేషో నేశోనైశౌ హరీశ్వరౌ ।
త్రైలోక్యం తులయా యస్యాః పత్రేణైవాభవత్సమం ॥ 40

దూర్వేతి స్మరణాత్పాపం త్రివిధం నిలయం వ్రజేత్ ॥
తత్రస్మృతౌ స్మర్యతే దేవో యతః సోపి గజాననః ॥ 41

ఇతి చింతామణి క్షేత్రమహిమా వర్ణితం స్మృతం ।
శ్రవణా త్కీర్తనాద్ధ్యానా ద్భుక్తి ముక్తి ఫలప్రదః ॥ 42

ఏతస్మా త్కారణాద్యానం త్రయాణాం ప్రేషితం శుభం ।
రాసభస్య ముఖా ద్దూర్వా గతా దేవే వృషస్యస ॥ 43

చాండాల్యాః శీత నాశాయ త్వానీతా తృణభారతః ।
వాయునా ప్రబలేనాపి గతా దూర్వా గజాననే ॥ 44

యతస్తస్య ప్రియా దూర్వా సంతుష్టోసౌ వినాయకః ।
నిష్పాపత్వా త్త్రయాణాం స సాన్నిధ్యం దత్తవాన్నిజం ॥ 45

గంధ మాత్రేణ దూర్వాయాః సంతుష్టో జాయతే విభుః ।
ప్రసంగేన తు భక్ష్యావా కిం పునర్మస్తకార్పణాత్ । 46

బ్రహ్మోవాచ :

ఇతి దూతముఖాద్రాజ్ఞా సశ్రుతో మహిమాంతదా ।
దూర్వాయా మునిభిస్సర్వై ర్నదృష్టి నచసంశ్రుతః ॥ 47

స్నాత్వా దూర్వాంకురాన్ గృహ్య పుపూజుస్తే వినాయకం ।
సేవకా అపి దూర్వాభి రానర్చుః శ్రీగజాననం ॥ 48

ఆసన్సర్వే దివ్యదేహా స్తేజసా సూర్యవర్చసాః ।
శృణ్వంతో దేవవాద్యానాం నానా రావాన్సమంతతః । 49

విమానవర మారూఢాః దివ్యవస్త్రానులేపినః ।
యాతా వైనాయకం ధామ కేచిత్తద్రూ పధారిణః ॥ 50

నరా నాగరికాః కేచి దాగతాస్తం మహోత్సవం ద్రష్టుం ।
దూర్వాభి రానర్చురేకవింశతిభిః పృథక్ ॥ 51

భుక్త్వా భోగాంశ్చతే సర్వే గణేశం స్థానమాగమన్ ।
విమానం చాపి చలిత మూర్ధ్వం తత్పుణ్యపుంజతః । 52

తస్మాద్గణేశ భక్తేన కార్యం దూర్వాభి రర్చనం ।
న కరోతి నరోయస్తు ప్రమాదా త్తాభిరర్చనం ॥ 53

స చాండాలస్తు విజ్ఞేయో నరకాన్ ప్రాప్నుయాద్బహూన్
న తన్ముఖం ప్రతీక్షేత కదాచిదపి మానవః ॥ 54

యస్తు దూర్వాభి రర్చంతం దేవదేవం గజాననం ।
తస్య దర్శనతోఽప్యపి పాపీ శుద్ధిమవాప్నుయాత్ ॥ 55

అలాభే బహూ దూర్వాణామేకయైవా భిపూజయేత్ ।
తేనాపి కోటిగుణితా కృతా పూజా నసంశయః ॥ 56

బ్రహ్మోవాచ :

ఇతి నానావిధో రాజన్మహిమా కథితస్తవ ।

సేతిహాసస్తు దూర్వాణం శ్రవణా త్పాపనాశనః ।
నాఖ్యేయో దుష్టబుద్ధేస్తు ప్రియేపుత్రే నివేదయేత్ । 57

**ఇంద్ర ఉవాచ :**

ఇతి బ్రహ్మముఖాచ్ఛృత్వా పరమాఖ్యాన ముత్తమం ।
ననంద పరమప్రీతో ననామ కమలాసనం ।
తదాజ్ఞయా యయౌస్థానం స్వకీయం విస్మయాన్వితః ॥ 58

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే దూర్వామాహాత్మ్యం నామ**
**సప్త షష్టితమో అధ్యాయ :**



## 67-వ అధ్యాయము

# దూర్వామహాత్మ్యం-IV

అప్పుడు గణములు ఇంకా యిలాఅన్నారు 'ఓరాజా! ఈవిధంగా కౌండిన్యపత్నియైన ఆశ్రయ తనకు కలిగిన సందేహనివారణకై భర్తయైన కౌండిన్య ముని ఆదేశానుసారం అతడు యిచ్చిన దూర్వాంకురాన్ని తీసుకుని దానిఎత్తు బంగారాన్ని దేవేంద్రునివద్దనుంచి అర్థిద్దామని ఇంద్రునివద్దకు చేరుకున్నది. దేవతల ప్రభువైన ఇంద్రునితో ఇలాఅన్నది :

'ఓఇంద్రా! నాభర్తయైన కౌండిన్యముని ఆదేశాన్ననుసరించి సరిగ్గా ఈ దూర్వాంకురంతో సమంగాతూగగల బంగారాన్ని నీనుంచి అర్థించి తీసుకువెళ్ళగోరి వచ్చాను.'

'ఓ మాతా! నీభర్త దూర్వాంకురంఎత్తు బంగారానికై పంపించినట్లయితే వారి అభీష్టానుసారమే నాశక్తికొలది యిచ్చి పంపిస్తాను.' అని దూతను పిలిచి అతడితో ఆ మునిపత్నిని కుబేరునివద్దకు తీసుకువెళ్ళి

ఈమెకు దూర్వాంకురమునకు సరిపోయినంత బరువుగల బంగారాన్ని నేను యిమ్మన్నానని నాఆదేశంగా చెప్పి ఇప్పించు" అంటూ ఆదే శించాడు.

"ఓ రాజా! దేవేంద్రుని ఆజ్ఞను అనుసరించి ఆ దూత ఆమెను కుబేరునివద్దకు తీసుకువెళ్ళి యింద్రుని ఆదేశాన్ని వివరించాడు. ఆ కుబేరుడు అందుకు ఎంతో ఆశ్చర్యపడి 'మునిదంపతులు, దేవతల ప్రభువైన ఇంద్రుడు ఈవిధంగా ఇంతకొంచెం బంగారాన్ని ఎందుకు కోరారు? దూర్వాంకురానికి ఎంతబంగారం తూగుతుంది? అతిస్వల్పమైన బంగారంకోసం ఎంతశ్రమతీసుకున్నారు!' అనుకున్నాడు. ఆ దూతలు 'ఓ కుబేరా! ఆమె కేవలం అంతఎత్తు బంగారాన్నే కోరింది. ఆమె పతివ్రత యైన కారణంచేత భర్తమాటను జవదాటదు!' అన్నారు. అప్పుడు కంసాలి వద్ద ఉండేటటువంటి చిన్నిత్రాసును తెప్పించి దానిలో ఒకవైపు బంగారాన్నీ రెండోవైపు దూర్వాంకురమునూ ఉంచగా దూర్వాంకురమే ఎక్కువ తూగింది. ఇంకా మిగిలిఉన్న బంగారాన్నంతటినీ, ఆ తరువాత కోశాగారంలోని బంగారాన్నంతటినీ వేయించాడు కుబేరుడు. ఐనా అవి అన్నీకూడా దూర్వాంకురంఎత్తు బంగారంతో సమంగా తూగలేదు! అప్పుడు కోశాగారంలోఉన్న ద్రవ్యాన్నంతటిని పర్వతంలా కుప్పగా త్రాసులో పోయించాడు. ఐనా అవేవీ దూర్వాంకురముయొక్క బరువుకు సరితూగలేదు. అప్పుడు తన భార్యనుకూడా అందులోకి ఎక్కమనినాడు. చివరికి తనతోపాటూ అలకాపురిలోని ఐశ్వర్యా న్నంతటినీ త్రాసులో పెట్టినా దూర్వాంకురం పైకి ఎంతమాత్రమూ లేవలేదు.

ఈ వృత్తాంతాన్ని విన్న ఇంద్రుడు స్వయంగా ఐరావతాన్ని

అధిరోహించి వచ్చి తన యావత్ ద్రవ్యాన్నీ వేసి చివరకు తానూ అధిరోహించినా ఆ త్రాసు పైకిలేవలేదు. అప్పుడు ఇంద్రుడు సిగ్గుతో తలదించుకుని చాలా ఆశ్చర్యపోయాడు. అప్పుడు ఇంద్రుడు హరిహరు లను సైతం స్మరించి వారినికూడా ఘటారోహణం చేయించాడు. ఇంతచేసినా దూర్వాంకురం పైకిలేవలేదు. అప్పుడు వారందరూ త్రాసు దిగి దేవతాగణములు తమవెంటరాగా, కౌండిన్యముని ఆశ్రమానికి చేరుకున్నారు. ఆ మునికి భక్తిశ్రద్ధలతో నమస్కరించి, దిగ్భ్రమనుంచి యింకా తేరుకొనక పోవటంచేత సంభ్రమంగా యిలాఅన్నారు :

"ఓ మునిసత్తమా? నీ యొక్క దివ్యసందర్శనభాగ్యంచేతనే మా సకల పాపాలూ నశించాయి. మా పూర్వపుణ్యవశముననే మాకు నీవద్ద శుభం ప్రాప్తించునుగాక! మహానుభావా! మీరు తమ భార్యచేత పంపిన దూర్వాంకురముయొక్క మహిమను మేమందరమూ కనులారా చూశాము! మూడులోకాలు సైతం దూర్వాంకురంయొక్క బరువుకు సరితూగలేదు! పైగా అది నీచేత గజాననుడికి కడుభక్తితో సమర్పించబడటంచేత దాని మహిమ అనంతమైంది. గజాననుడికి ఏకాంతభక్తి సలిపేవారి మహిమను యదార్థంగా తెలుసుకోవడం ఎవరితరమూకాదు!" అంటూ ఆ దేవతా గణాలు ముందుగా గజాననుణ్ణి అర్చించి, ఆతరువాత భార్యాసమేతంగా ఆ కౌండిన్యమునిని పూజించి, అతడిని అనేకరకాల స్తుతించి గానం చేశారు.

"ఓ మునిపుంగవా! అష్టదిక్పాలకులూ, త్రిమూర్తులూ, సిద్ధ, విద్యాధర, గంధర్వ, కింపురుషాదులకు సైతం నీ మహిమ తెలుసుకోవడం

అన్నది అలవికానిపని!" అంటూ భక్తజనసులభుడైన గజాననుని, ఆతని భక్తుడైన కౌండిన్యునీ కీర్తించి వారి సెలవు గైకొని తమతమ నెలవులకు వెళ్ళిపోయారు.

అప్పుడు మునిపత్నియైన ఆశ్రయకూడా, దూర్వాంకురమహాత్మ్యాన్ని స్వయంగా తెలుసుకున్నదవటంచేత తన భర్తృవాక్యముపట్ల యెనలేని గురికుదిరినదై సర్వదేవతావంద్యుడైన ఆ కరివదనుడిని అనేక దూర్వాంకు రములతో కడు భక్తిశ్రద్ధలతో పూజించింది.

తన భర్తయైన కౌండిన్యుని చరణకమలాలపై వ్రాలి "ఓనాథా! దుర్మతినై అత్యంత ప్రతిభావంతమైన తమ సత్యవాక్కుపట్ల విశ్వాసం లేనిదాననై ఎంతో అపరాధంకావించాను. కాని అత్యంత కరుణాంతరంగు లైన మీరు నాలో వివేకాన్ని మేలుకొలిపి తగిన అనుభవాన్ని గరపి నా కళ్ళు తెరిపించారు! కనుక అజ్ఞానకృతమైన నా అపరాధాన్ని క్షమించండి! మిమ్మల్నిదే శరణువేడుతున్నాను!" అంటూ ప్రార్థించంగా ఆ ముని ఆమెను ఊరడించి స్వాంతనవచనాలతో ఓదార్చాడు. ఆ మర్నాడు ఉదయము ప్రాతఃకాలాన్నే ఆ దంపతులిద్దరూ దూర్వాంకురములను భక్తితో సేకరించి భక్తజనవత్సలుడైన విఘ్నేశుని శ్రద్ధగా అర్చించారు. అదిమొదలు వారు ఇరువురూ అనన్యభక్తితో ప్రాతఃసాయంకాల అర్చనలలో గణేశుని క్రమం తప్పక దూర్వాంకురములతో అర్చించి, గణేశానుగ్రహానికి పాత్రులై తరించారు.

అప్పుడు దూతలిలా అన్నారు. "ఓరాజా! అత్యంత మహిమోపేత మైన దూర్వామహాత్మ్యాన్ని పూర్తిగా వర్ణించడం బ్రహ్మరుద్రాదులకు కూడా శక్యముగానిపని! త్రిలోకాలలోని ఐశ్వర్యముకూడా దూర్వాపత్రంతో

సమానంగా తులతూగలేదు! 'దూర్వా' అన్న నామోచ్ఛారణచేతనే సకల పాపములూ నశిస్తాయి. దూర్వాంకురాన్ని స్మరించటం ఆ గజాననుణ్ణి స్మరించటమే అవుతుంది! ఓరాజా! నీకై చింతామణిక్షేత్రంయొక్క మహిమనూ, దూర్వాంకుర మహాత్మ్యమును వివరించాము. దీనిని వినటం, కీర్తించటం, ధ్యానించటంవలన సర్వకామ్యసిద్ధీ, ముక్తీ రెండూ లభిస్తాయి! ఈ కారణం చేతనే ఆ ఛండాలికీ, గానుగకు కట్టివేయ బడిన ఎద్దుకూ, కంచరగాడిదకూకూడా గణేశుని దివ్యానుగ్రహ ప్రభావం చేత దివ్య విమానములు పంపించబడ్డాయి.

ఆ ఎద్దు, కంచరగాడిదల ముఖములనుండి దూర్వాపత్రములు ఆ వినాయకుని పైనబడినాయి. ఆ ఛండాలి తన చలిబాధ తీర్చుకో గోరి దూర్వాంకురములు వెంటతెచ్చుకొనగా ప్రబలమైన గాలివీచి, కొన్ని దుర్వాంకురములు అమె చేతినున్న దుర్వాపత్రములు విఘ్నేశునిపై పడేసింది. దూర్వాంకుర అర్చన విఘ్నేశ్వరునికి అత్యంత ప్రీతిపాత్ర మైనందువల్ల ఆ ముగ్గురి కల్మషాన్నీ తొలగించి, వారిని పాపరహితు లనుగా చేసి వారిపై తన దివ్యానుగ్రహాన్ని వర్షించి తన నిజలోకానికి తీసుకు వెళ్ళాడు. దూర్వాగంధం సోకగానే గజాననుడు సంతుష్టుడౌతాడు. ఇక భక్తిపురస్సరంగా ఆతడి మస్తకమున దూర్వాంకుర సమర్పణచేస్తే వేరుగా చెప్పాలా?" అంటూ ముగించారు.

ఈ వృత్తాంతాన్ని వినిపిస్తూన్న బ్రహ్మ యిలా కొనసాగించాడు. "ఆ విధంగా దూతలవల్ల దూర్వామహాత్మ్యాన్ని విన్న రాజు సపరివారంగా స్నానసంధ్యాదులొనర్చి, భక్తజనమందారుడైన విఘ్నపతిని దూర్వాంకురము లతో భక్తిప్రపత్తులతో పూజించాడు. ఆ పుణ్యప్రభావంచేత వారందరూ

దివ్యమైన పుణ్యశరీరాలను ధరించి, అమితమైన తేజస్సుతో ప్రకాశిస్తూ దివ్యమైన ఆభరణాదులను ధరించి దివ్యవిమానారూఢులై వైనాయక లోకాన్ని చేరారు.

అప్పుడు పురజనులుసైతం అదేవిధంగాచేసి ఐహికభోగాలను ఆ తరువాత గణేశధామాన్ని పొందారు. కనుక ఓరాజా! గణేశుని నిజభక్తులైన వారు ఆ దేవదేవుని దూర్వాంకురములతో తప్పక పూజించాలి! అలా దూర్వార్చన చేస్తున్న భక్తులను చూసినప్పటికీ సకలపాపములూ తొలగి పరిశుద్ధులౌతారు. పెక్కు దూర్వాంకురములు లభించనట్లైతే కనీసం ఒక్క దూర్వాంకురాన్నైనాసరే సమర్పించి పూజించాలి! దానివల్ల అట్టిపూజ కోటిరెట్లు ఫలవంతమౌతుంది. ఓ రాజా! ఈరకంగా దూర్వామహాత్మ్యాన్ని నీకు వివరించాను. ఈ దూర్వామహాత్మ్యాన్ని వినటంవల్లకూడా సర్వపాపక్షయ మౌతుంది. ఇది దుష్టులకు వినిపించరాదు. ప్రియుడైన సచ్ఛీలుడైన కుమారునికి శ్రేయస్సునుగోరి వినిపించవచ్చు."

అప్పుడు ఇంద్రుడిలాఅన్నాడు. "ఇలా బ్రహ్మనుంచి అత్యుత్తమమైన ఈ ఆఖ్యానాన్ని విని కృతవీర్యుడు చాలా సంతోషించి బ్రహ్మను అనేక విధముల కీర్తించి తన స్వస్థానానికి ఆయనవద్ద సెలవుపుచ్చుకుని ఆశ్చర్యచకితుడై వెడలిపోయాడు."

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'దూర్వామహాత్మ్యం' అనే 67-వ అధ్యాయం.



# 68

# ప్రేతనిరూపణం

(మూలం)

## అష్టషష్టితమో అధ్యాయః

**శూరసేన ఉవాచ :**

అన్యాం కథయ శక్రత్వం గణనాథ కథాం పునః ।
కృతవీర్యస్య జనకః కిం చకార తతః పరం ॥ 1

**ఇంద్ర ఉవాచ :**

శ్రుత్వాఖ్యానంతు సంకష్ట చతుర్థ్యా రాజసత్తమః ।
దూర్వాఖ్యానం తు సంశృత్యా చింతావిష్టో నృపో భవత్ ॥ 2

అపుత్రస్య గతిర్నాస్తి పుత్రోమే భవితాకథం ।
స్వప్నే దదర్శ పితరం కార్తవీర్యస్తథావిధః ॥ 3

సగద్గదాభ్యాం కంఠాభ్యాం నేచతుస్త్రౌ పరస్పరం ।
ఆలిలింగతు రన్యోన్యం ప్రేమ విహ్వలచేతసా ॥ 4

తతః పుత్రం కరే ధృత్వా పర్యంకే స్థాపయత్పితా ।
ఉవాచ చ త్వయా పుత్ర పుత్రార్థం బహుధాశ్రమః ॥ 5

క్రియాతే చాహమప్యేక ముపాయం వచ్మితేనఘ ।
మృత్యులోకాదాగతేన కథితం నారదేన మే ॥ 6
తదైవాహం గతః పుత్ర బ్రహ్మణః సదనం ప్రతి
ప్రప్రచ్ఛాహం నమస్కృత్య బ్రహ్మాణం సర్వవేదినం । 7

కథం మే భవితాపుత్ర సంతతిః కమలాసన ॥
కథితం తేన సంకష్ట చతుర్థీవ్రతముత్తమం । 8

**క ఉవాచ :**

అస్మిన్వ్రతే కృతే పాపక్షయే జాతే నృపోత్తమ ॥
సంతతి స్తవ పుత్రస్య భవిష్యతి న సంశయః । 9

**పితోవాచ :**

తదాతదైవలిఖితం బ్రహ్మణాకథితం యథా ॥ 10

గృహాణపుస్తకంచైత ద్యథావత్కురు తద్వ్రతం ।
యావదబ్దం సమాప్యేత తావత్సిద్ధి వినాయకః ॥ 11

ప్రసన్నో భవితాదేవః సర్వసంకష్ట హారకః ।
తస్మిన్ప్రసన్నే పుత్రస్తే భవితా నాత్రసంశయః ॥ 12

ఇత్యుక్త్వా అంతర్హితస్తస్య పుత్రస్య జనకోన్నృత ।
జజాగార తతోరాజా కృతవీర్యస్తువై బలీ ॥ 13

దదర్శ పుస్తకంహస్తే ।
స్వప్నార్థాన్ పరి సస్మరే ॥ 14

ముమోచాశ్రూణి నేత్రాభ్యాం శోకానంద పరిప్లుతః ।
పితుర్వియోగా చ్ఛోకార్తః పుస్తకాప్తేశ్చ హర్షితః ॥ 15

తావత్తత్సంగతామాత్యాః పరివార్యా అభవన్ధ్రువం ।

**అమాత్యా ఊచు :**

జహి ప్రమాదం రాజంస్త్వం సావధానమనా భవ ॥ 16
త్యజ శోకంవదాస్మాన్కిం కారణం శోకకారకం ।

అస్మానపి సమావిష్ట స్త్వచ్ఛోకా చ్ఛోక ఉత్కటః ॥ 17

**ఇంద్ర ఉవాచ :**

శృత్వా వాక్యమమాత్యానాం కార్తవీర్యో జగాద తాన్ ।
మయాస్వప్నే పితాదృష్ట స్తేనమేవిహ్వలింమనః ॥ 18

పుస్తకంచైవ సంకష్ట చతుర్థీ వ్రతబోధకం ।
దత్తం మమకరే తేన పిదధే తత్క్షణాచ్చ సః ॥ 19

తద్వియోగేన శోచామి గతార్థం నిర్ధనో యథా ।
ఉక్తంచతే నమేవాక్యం పుత్రార్థం కుర్విదంవ్రతం ॥ 20

ప్రబుద్ధోహం యదామాత్యా హస్తే దృష్టంచ పుస్తకం ।
ఆశ్చర్య హర్షశోకైె శ్చాప్యశ్రుముంచామి నాన్యథా ॥ 21

**అమాత్యా ఊచు :**

యఃపితాసర్వలోకానాం మనుష్యోరగ రక్షసాం ।
సఏవపిత్యరూపేణ పరితుష్టో గజాననః ॥ 22

ఉపాయ మవదత్తేస సంతత్యై రాజసత్తమ ।
అన్యథా పుస్తకంక్వేద్ధం స్వప్నార్థ క్వప్రమాం భవేత్ ॥ 23

వినా ప్రసాదం స్వప్నోసి విపర్యయ ముదాహృతః ।

**ఇంద్ర ఉవాచ :**

ఇత్యమాత్యవచశ్రుత్వా సావధానమనా నృపః ॥ 24

ఆహూయ పరిపప్రచ్ఛ పండితాన్ సుహృదో పిచ ।
వదంత పుస్తకస్యార్థం ప్రసాదాత్తస్య భోద్విజాః ॥

**తఊచు :**

పుస్తకం దృష్ట్వా తస్యార్థం సర్వసంసది । 25

**ద్విజా ఊచు :**

బ్రహ్మణః కృతవీర్యస్య సంవాదోత్ర మహాన్ నృప ॥ 26

చతుర్థీ సర్వసంకష్ట నాశిన్యత్ర నిరూపితా ।
చంద్రోదయే గణేశస్య పూజా ప్రోక్తా సవిస్తరా ॥ 27

అంగారక చతుర్థ్యాస్తు మహిమా బహుళోపిచ ।
తిథి దేవవిధూనాంచ అర్ఘ్యదానం సమంత్రకం ॥ 28

ఏకవింశతి విప్రాణం భోజనంచైవ పూజనం ।
నానా దానానితేభ్యశ్చ దేయానీతి నిరూపితం ॥ 29

దూర్వా సమర్పణఫలం శ్వేతదూర్వా ఫలంపృథక్ ।
ఏతద్వ్రతం మహాభాగ భాగ్యాత్ప్రాప్తం త్వయానఘ ॥ 30

నదృష్టం నశృతం లోకే భవిష్యత్యుపకారకం
శ్రవణా త్స్మరణాచ్చాపి సంకష్ట హరణం నృణాం ॥ 31

**ఇంద్ర ఉవాచ :**

శృత్వా తత్పండిత ముఖాద్రాజా సర్వజనశ్చహ ।
ఆశ్చర్యానంద సంయుక్తః పుపూజే సద్విజోత్తమాన్ ॥ 32

వస్త్రాలంకార రత్నాని ధనం ధాన్యందదౌ బహు ।
అత్రిమాహూయ రాజాపి గురుం నిజకులస్య చ ॥ 33

సుముహూర్తే తతోగృహ్ణాతీ పరిపూజ్య యథావిధి ।
దేవం వినాయకం తంచ విద్యా ఏకాక్షరాం శుభాం ॥ 34

జజాప మంత్రం తమనన్య భక్త్యా ధ్యాయన్గణేశం
విజితేంద్రియస్సః వ్రతం చచక్రే గణనాథతుష్ట్యై ।
సుతా ప్తయే సంకటనాశనం తత్ । 35

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే వ్రతనిరూపణం నామ**
**అష్ట షష్ఠితమో అధ్యాయః**



# 68-వ అధ్యాయము

# వ్రతనిరూపణం

ఆ తరువాత శూరసేన మహారాజు ఇంద్రుడిని తిరిగి యిలా ప్రశ్నించాడు. 'ఓ ఇంద్రా! గణనాధుని చరిత్ర ఎంతవిన్నా యింకా వినాలని పిస్తూనే ఉంది. తనివితీరటంలేదు! దయఉంచి ఆ తరువాత కృతవీర్యుడి తండ్రి ఏంచేశాడో ఆవివరం తెలుపు!'

శూరసేనుడి శ్రద్ధాభక్తులకు ఎంతో సంతోషించి యిలా చెప్ప సాగాడు. "ఓరాజా! చతురాస్యునివద్దనుండి కృతవీర్యుని తండ్రి సంకష్ట చతుర్థీ వ్రతవిధానాన్ని, దూర్వామహాత్మ్యాన్నీ విని, నిదురించిఉన్న తన కుమారునికి కలలో కనిపించాడు. చింతావ్యాకులములతోఉన్న ఆ కృత వీర్యుడు అలా తలవని తలంపుగా తనతండ్రి స్వప్నములో కనపడగా అత్యంత ఆనందంతో మాటలుకూడా అందని ఉద్విగ్నతతో పరస్పరం ఆలింగనం చేసుకున్నారు. అప్పుడా కృతవీర్యుడు తన కుమారుని తన పర్యంకంమీద కూర్చోబెట్టుకొని

'నాయనా! సంతానం నిమిత్తం నీవుపడ్డ శ్రమంతా నాకుతెలుసు! అందుకని నీకొక ఉపాయము నేను బ్రహ్మవద్ద తెలుసుకున్నదానిని -

నీయందుగల అభిమానంచేత తెలియజేస్తాను! నీ వ్యధయావత్తూ - దాని నివారణకూడా మానవలోకంనుండి వచ్చిన నారదమహర్షిద్వారా నాకు తెలిసింది.

నీ అభీష్టసిద్ధికై చతురాననుడు నాకు దయతో చెప్పిన సంకష్టచతుర్థీ వ్రతం నీకు తెల్పుతాను అంటూ ఆ వ్రతనియమాలు తాను వ్రాసుకున్న పుస్తకాన్ని చేతికిచ్చి :

"ఇందులో చెప్పినట్లుగా సంవత్సరకాలం ఈ చతుర్థీవ్రతాన్ని ఆచరించు. అలా ఆచరిస్తే సర్వ సంకష్టహరుడైన గజాననుని అనుగ్రహ విశేషంచేత నీ సకలదోషాలూ నశించి నీకు పుత్రసంతతి ప్రసాదింపబడు తుంది!" అంటూ స్వప్నంలో తెలిపి కృతవీర్యుని తండ్రి అదృశ్యుడైనాడు.

అప్పుడు కృతవీర్యుడు నిద్రనుంచి వెంటనే మేల్కొని స్వప్నంలోని విషయమంతా స్మరించుకుంటూ సంతోషం, దుఃఖము పెనవేసుకొనగా కన్నులనుండి అశ్రుధారలు విడుస్తూ, తన చేతులలోని పుస్తకాన్ని హృదయానికి హత్తుకుని ఉండగా మంత్రులు అతడిని సమీపించి ఊరడిస్తూ -

'ఓ రాజా! నీవీ దుఃఖాన్ని వీడి సావధానమనస్కుడవుకమ్ము! నీవెందులకు దుఃఖపడుతున్నావో ఆ కారణం మాకు చెప్పు. నీవిలా దుఃఖించటం చూస్తే మాకూ దుఃఖం కలుగుతోంది!' అనగానే కృతవీర్యుడు తన మంత్రులకిలా సమాధానం చెప్పాడు.

"మంత్రిపుంగవులారా! నాకీనాడు స్వప్నంలో స్వర్గస్థులైన నా పితృ దేవుల దర్శనమైంది. ఆయన సమస్త దుఃఖనివారకమూ, సత్సంతాన ప్రదాయకమూ ఐన సంకష్టచతుర్థీవ్రతాన్ని అనుష్టించమని నాకు ఉపదే

శించి, ఆ వ్రతవిధానం వ్రాయబడ్డ ఈ పుస్తకాన్ని నాచేతులో ఉంచి అదృశ్యులైనారు. ఆ భావోద్వేగంచేత నేను చేష్టలుడిగి ఉద్విగ్నుణ్ణైనాను! ఆయన వియోగదుఃఖాన్ని తట్టుకోలేక దుఃఖిస్తున్నాను."

ఆ మాటలకు మంత్రులిలా అన్నారు

"ప్రభూ! స్వప్నంలో మీకు మీపితృదేవుల రూపంలో దర్శనమిచ్చి చతుర్థీవ్రతాన్ని ఆచరించమని మీకు బాధా నివారణోపాయాన్ని తెలిపింది మరెవరోకాదు! సకలలోకాలకూ తండ్రియైన భక్తవత్సలుడు ఆ శ్రీగణేశుడే! ఆతడే మీ వంశవృద్ధికై తగిన ఉపాయాన్ని తెలిపాడు. అంతేకాదు! ఆ మహదనుగ్రహానికి ప్రత్యక్ష నిదర్శనంగా ఈ పుస్తకాన్ని నీకు అనుగ్రహించాడు! అలాకానిదే ఇట్టి దివ్యస్వప్నం కలగటం అసాధ్యం! కనుక మీరు తక్షణ కర్తవ్యాన్ని ఆలోచించవలసింది."

ఇంద్రుడిలా కొనసాగించాడు

'ఓ శూరసేనమహారాజా! ఈ విధంగా మంత్రుల సలహాను అనుసరించి వేదవేత్తలైన పండితులను తన సభాస్థలికి పిలిపించి తనకు లభించిన పుస్తకములోని విశేషాన్ని వివరించి చెప్పమని అర్థించాడు.

అప్పుడు ఆ వేదవిదులైన విప్రులా గ్రంధాన్ని పరిశీలించి

'ఓ కృతవీర్యమహారాజా! ఇందులో మీతండ్రిగారికీ చతుర్ముఖునికి జరిగిన సంవాదమూ, బ్రహ్మ ఆతడికి ఉపదేశించిన 'సంకష్ట చతుర్థీవ్రత విధానమూ', చంద్రోదయ సమయంలో చేయవలసిన గణేశపూజ, అంగారక చతుర్థీమహిమ వర్ణించబడిఉన్నది!

అంతేకాదు మహారాజా! ఇంకా చతుర్థీతిధికి, దేవతకు, చంద్రునికి

అర్ఘ్యప్రదానంచేసే విధానంకూడా వివరించబడివున్నది. దానితోపాటూ ఇరవైఒక్కమంది సద్విప్రులకు చేయవలసిన అన్నసంతర్పణ, పూజ, వాళ్ళ కీయవలసిన వివిధములైన దానముల గురించీ తెలుపబడింది.

విఘ్నేశ్వరునికి దూర్వాసమర్పణవల్ల కలిగే అనంతఫలమూ, అందునా శ్వేతదూర్వముయొక్క సమర్పణఫలం గురించి విడిగా తెలప టం జరిగింది. ఓ మహారాజా! ఈ వ్రతవిధానం నీకు సంప్రాప్తమవటం నీ అనంత పుణ్యఫలంగానేకాని వేరుకాదు! ఇలా సర్వులకూ బహుళార్థ ప్రదమైన వ్రతం ఇదివరకు ఎవ్వరూ కనీవినీ ఉండలేదు! దీన్ని వినటంవలన, స్మరించుటవలనా కూడా సకల సంకటనాశనం జరుగ గలదు!"

అన్న విజ్ఞుల శుభవచనాలను విన్న కృతవీర్యుడు అమిత సంతో షాన్ని పొందినవాడై వారిని ఉచితరీతిని సత్కరించి సంతుష్టులను కావిం చాడు. ఆ తరువాత తమ కులపురోహితుడైన అత్రిమహర్షిని పిలిపించి ఆతడిని యథావిధిగా పూజించి వారివద్దనుండి **ఏకాక్షరీగణపతి మహా మంత్రాన్ని** ఒక శుభముహూర్తంలో స్వీకరించి, ఆమంత్రానుష్టానాన్ని అనన్యభక్తితో చేస్తూ, ఇంద్రియములను జయించినవాడై తన సంకట నాశనంకొరకూ, ఆ సంకష్టహర చతుర్థీవ్రతాన్ని సంతానార్థియై అత్యంత భక్తిశ్రద్ధలతో ఆచరించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని

'**వ్రతనిరూపణం**' అనే 68-వ అధ్యాయం.



**69**

# సంకష్టగణపతి వ్రతకథనం

(మూలం)

## ఏకోనసప్తతితమో అధ్యాయః

సంకష్ట గణపతి వ్రతం

**శూరసేన ఉవాచ :**

బ్రహ్మణా కథమాదిష్టం కృతవీర్యాయ సిద్ధిదం ।
తన్మమాచక్ష్వ సంకష్ట చతుర్థీ వ్రతముత్తమం ॥ 1

**ఇంద్ర ఉవాచ :**

సత్యలోకే సుఖాసీనం సర్వజ్ఞం చతురాననం ।
కృతవీర్యపితా గత్వా పప్రచ్ఛ ప్రణతో నృపః ॥ 2

**కృతవీర్య ఉవాచ :**

దేవదేవ జగద్ధాత: ప్రణతార్తి నివారణ ।
వర్తతే హృదయేయన్మే పృచ్ఛామిత్వాం వదస్వ తత్ ॥ 3

ఆపత్సువర్తమానానాం నృణాంవ్యాకులచేతసాం ।
చింయావ్యగ్రమనసాం వియోగేసుహృదాంతథా ॥ 4

దుర్లభప్రాప్తయేన్నాణాం కార్యసిద్ధిః కథంభవేత్ ।
అర్థసిద్ధిః కథంనిత్యం పుత్రసౌభాగ్యసంపదః ॥ 5
సర్వసంకష్టనాశార్థం కార్యంకింమానవైః ప్రభో ।

బ్రహ్మోవాచ :

శృణురాజన్ ప్రవక్ష్యామి సర్వసిద్ధిప్రదంవ్రతం ॥ 6

యస్యానుష్ఠానమాత్రేణ చింతితంప్రాప్నుయాన్నరః ।
ఓషధీభిః శుక్లతిలైః దివాస్నాయాత్ప్రసన్నధీః ॥ 7

సంకల్పంకారయేత్సమ్యక్ ధ్యాత్వాదేవం గజాననం ॥
గణేశంపూజయేద్భక్త్యా మంత్రైరాగమసంభవైః 8

కృష్ణపక్షేచతుర్థ్యాంచ నిశిచంద్రోదయేపిచ ॥

నృప ఉవాచ :

కథంసంపూజయేద్బ్రహ్మ న్దేవదేవంగజాననం । 9
విస్తరేణమమబ్రూహి ప్రణయాత్పరిపృచ్ఛతే ॥

బ్రహ్మోవాచ :

నిత్యకర్మసమాప్యాథ నిశాయా ముదయేవిధోః ॥ 10

శుచౌ దేశే గోమయేన లిప్తే మండపికాన్వితే ।
తత్ర పీఠం గణేశస్య పూజయే త్కుంకుమాక్షతైః ॥ 11

స్థాపయేత్కలశం తత్ర పంచరత్న సమన్వితం ।
తస్యోపరి న్యసేత్పాత్రం సౌవర్ణం కలశాన్వితం ॥ 12

తదభావేతు రౌప్యంవా తామ్రం వైణవమేవ చ ।
తస్యోపరి న్యసేద్వస్త్రం క్షౌమం వా శక్తిసంయుతః ॥ 13

తస్యోపరి లిఖేద్యంత్రం ఆగమోక్త విధానతః ।
తత్ర మూర్తిం గణేశస్య సౌవర్ణీం లక్షణాన్వితాం ॥ 14

## ధ్యానం

ఏకదంతం మహాకాయం తప్తకాంచన సన్నిభం ।
లంబోదరం విశాలాక్షం జ్వలత్పావక లోచనం ॥ 15

ఆఖుపృష్ఠ సమారూఢం చామరైః వీజితం గణైః ।
శేష యజ్ఞోపవీతం చ చింతయేత్తం గజాననం ॥ 16

ఆగచ్ఛ దేవదేవేశ సంకటాన్మాం నివారయ ।
యావద్వ్రతం సమాప్యేత తావత్త్వం సన్నిధౌ భవ ॥
**"వహ్నిప్రశీతి"** ఆవాహనం ॥ 17

గణాధీశ నమస్తేఽస్తు సర్వసిద్ధి ప్రదాయక
ఆసనం గృహ్యతాం దేవ సంకటాన్మాం నివారయ ॥
**"పురుష ఏవేదం"** – ఇత్యాసనం ॥ 18

ఉమాపుత్ర నమస్తేస్తు నమస్తే మోదకప్రియ
పాద్యం గృహాణ దేవేశ సంకటం మే నివారయ ॥
**"ఏతావానస్యేతి"** – పాద్యం । 19

లంబోదర నమస్తేస్తు రత్నయుక్తం ఫలాన్వితం ।
అర్ఘ్యం గృహాణ దేవేశ సంకటం మే నివారయ ॥
**"త్రిపాదూర్ధ్వ"** – త్యర్ఘ్యం॥ 20

గంగాది సర్వతీర్థేభ్యః ఆహృతం తోయముత్తమం ।
గృహాణాచమనీయార్థం సంకటం మే నివారయ॥
**"తస్మాద్విరాడి"** – ఇత్యాచమనం । 21

పయో దధిఘృతం చైవ శర్కరా మధుసంయుతం ।
పంచామృతం గృహాణేదం సంకటం మే నివారయ ॥
పురుషసూక్త మంత్రైః పంచామృత స్నానం॥ 22

నర్మదా చంద్రభాగాచ గంగా సంగమజైర్జలైః ।
స్నాపితోసి మయా భక్త్యా సంకటం మేనివారయ ।
**"యత్పురుషేణ"** – తి స్నానం ॥ 23

ఇభవక్త్ర నమస్తుభ్యం గృహాణ పరమేశ్వరః
వస్త్రయుగ్మం గణాధ్యక్ష సంకటం మే నివారయ ॥
**"తంయజ్ఞం"** – ఇతివస్త్రం ॥ 24

వినాయక నమస్తుభ్యం నమః పరశుధారిణే!
ఉపవీతం గృహాణేదం సంకటాన్మే నివారయ॥
**"తస్మాద్యజ్ఞాత్"** – ఇతి యజ్ఞోపవీతం ॥ 25

ఈశపుత్ర నమస్తుభ్యం నమో మూషక వాహన ।
చందనం గృహ్యతాం దేవ సంకటం మే నివారయ ॥
"**తస్మాద్యజ్ఞా**" ఇతి గంధం 26

ఘృత కుంకుమ సంయుక్తా స్తండులాః సుమనోహరాః
అక్షతాస్తే నమస్తుభ్యం సంకటం మే నివారయ ॥అక్షతాః॥ 27

చంపకం మల్లికాదూర్వా పుష్పజాతీరనేకశః ।
గృహాణత్వం గణాధ్యక్ష సంకటం మే నివారయ
"**తస్మాదశ్వేతి**" పుష్పం 28

లంబోదర మహాకాయ ధూమ్రకేతో సువాసితం ।
ధూపం గృహాణ దేవేశ సంకటం మే నివారయ ॥
"**యత్పురుష**" మితిధూపం 29

విఘ్నాంధకార సంహార కారకత్రిదశాధిప ।
దీపం గృహాణదేవేశ సంకటం మేనివారయ ॥
"**బ్రాహ్మణోస్య**" ఇతిదీపం 30

మోదకాపూప లడ్డూక పాయసం శర్కరాన్వితం ।
పక్వాన్నం సఘృతం దేవ నైవేద్యం ప్రతిగృహ్యతాం ॥
"**చంద్రమా**" ఇతినైవేద్యం 31

నారికేళఫలంద్రాక్షా రసాలం దాడిమం శుభం ॥
ఫలం గృహాణ దేవేశ సంకటాన్మేనివారయ ॥
"**నాభ్యాఅసీ**" దితిఫలం 32

క్రముకైలా లవంగాది నాగవల్లీ దళానిచ
తాంబూలం గృహ్యతాం దేవ సంకటం మే వినాశయ ॥ 33

ఇతి **"తాంబూలం"**

సర్వప్రీతికరందేవ హిరణ్యంసర్వసిద్ధిదం ।
దక్షిణార్థంగృహాణేదం సంకటం మేవినాశయ ॥

**"వస్త్రాస్యావన్ని"** తి దక్షిణాం 34

తతో దూర్వాంకురాన్సృహ్య వింశత్యేకం చ భక్తితః ।
ఏభిర్నామ పదైర్దేవమర్చయే త్సుసమాహితః ॥ 35

1) గణాధిపాయ నమః
2) ఉమాపుత్రాయ నమః
3) అఘనాశ నాయ నమః
4) ఏకదంతాయ నమః
5) ఇభవక్త్రాయ నమః
6) మూషకవాహనాయ నమః
7) వినాయకాయ నమః
8) ఈశపుత్రాయ నమః
9) సర్వసిద్ధి ప్రదాయకాయ నమః
10) లంబోదరాయ నమః
11) వక్రతుండాయ నమః
12) మోదకప్రియాయ నమః
13) విఘ్నవిధ్వంసకర్త్రై నమః
14) విశ్వవంద్యాయ నమః
15) అమరేశాయ నమః
16) గజ కర్ణాయ నమః
17) నాగయజ్ఞోపవీతినే నమః
18) ఫాలచంద్రాయ నమః
19) పరశుధారిణే నమః
20) విఘ్నాధిపాయ నమః

21) విద్యాప్రదాయనమః – ఇతి **"ఏకవింశతిపత్ర పూజా"**

కర్పూరానల సంయుక్తం శేషాయేఘవినాశం ।
నీరాజనం గృహాణేదం సంకటాన్మాం విమోచయ ॥

ఇతి **"నీరాజనం"**

చంపకాశోక వకుళ పారిజాత భవైశ్శుభైః పుష్పాంజలిం ।
గృహాణేమాం సంకటాన్మాం విమోచయ

యజ్ఞేనే ఇతి **పుష్పాంజలి**

త్వమేవ విశ్వం సృజసి భవక్త్రత్వమేవవిశ్వం పరిపాసిదేవ ।
త్వమేవవిశ్వం హరసేఖిలేశ త్వమేవవిశ్వాత్మక ఆవిభాసి ॥

ఇతి **"స్తుతిః"** 38

నమామి దేవం గణనాథమీశం విఘ్నేశ్వరం విశ్వనిధాన దక్షం ।
భక్తార్తిహరం భక్తవిమోక్ష దక్షం విద్యాప్రదం వేదనిధానమాద్యం ॥

ఇతి **"నమస్కారః"** 39

ఏవం స్తువీతవిధివత్ ప్రణమేత పునఃపునః ।
ప్రదక్షిణాం ప్రకుర్వీత యథాశక్త్యైకవింశతిం ॥ 40

యేత్వామ సంపూజ్య గణేశనూనం వాంఛంతిమూఢావిహితార్థసిద్ధం ।
తవనష్టానియతంహిలోకే జ్ఞాతో మయాతేసకలః ప్రభావః ॥

**ప్రార్థనా** 41

ఆచార్యస్త్వం ద్విజాధ్యక్ష సర్వసిద్ధి ప్రదాయక ।
దాయనం గృహ్యతాంబ్రహ్మన్ సంకటాన్మాంనివారయ ॥ 42

ఫలపుష్పాక్షతైర్యుక్త్యం జలంతే దక్షిణాన్వితం ।
విశేషార్ఘ్యం మయాదత్తం సంకటాన్మాం నివారయ ॥ 43

ఇతి షోడశోపచారై ర్మంత్రేణానేన పూజయేత్ ।

ఓం నమోహేరంబ మదమోదితః మమ సంకటం నివారయ, స్వాహా
ఇంద్రాది లోకపాలాంశ్చ సమంతా త్పూజయేత్సుధీః ॥ 44

పక్వముద్గ తిలైర్యుక్తాన్మోదకాన్ ఘృత పాచితాన్ ।
భక్ష్యాన్యన్యాని తాంబూలం యథాశక్తి ప్రకల్పయేత్ 45

తతో దూర్వాంకురాన్ గృహ్య వింశత్యేకం చ భక్తితః ।
ఏభి ర్నామపదై ర్దేవం అర్చయే త్సుసమాహితః ॥ 46

గణాధిప నమస్తుభ్యం ఉమాపుత్రా భయప్రద ।
ఏకదంతేభ వక్త్రేతి తథామూషకవాహనః ॥ 47

వినాయకేశపుత్రేతి సర్వసిద్ధి ప్రదాయక ।
లంబోదర నమస్తుభ్యం వక్రతుండాఘనాశన ॥ 48

విఘ్న విధ్వంసకర్త్రేతి విశ్వవంద్యామలేశ్వర ।
గజవక్త్ర నమస్తుభ్యం నాగయజ్ఞోపవీతినే ॥ 49

ఫాలచంద్ర నమస్తుభ్యం నమః పరశుధారిణే ।
విఘ్నాధిప నమస్తుభ్యం సర్వవిద్యాప్రదాయక ॥ 50

ఏవం సంపూజయేద్దేవం దూర్వాభిశ్చ పృథక్పృథక్ ।
యదుద్దిశ్య కృతం సత్యుగ్యథాశక్తి ప్రపూజనం ॥ 51

తేనతుష్టో భవాశుత్వం హృత్వాన్ కామాన్ ప్రపూరయ ।
విఘ్నాన్నాశయ మేసర్వాన్ దుష్టాంశ్చాప్య వస్థితాన్ ॥ 52

త్వత్ప్రసాదేన సర్వాణి కార్యాణీహ కరోమ్యహం ।
శత్రూణాం బుద్ధినాశంచ మిత్రాణా ముదయం కురు ॥ 53

ఇతి విజ్ఞాప్య దేవేశం ప్రణిపత్య పునఃపునః ।
తతో హోతుంప్రకుర్వీత శతమష్టోత్తరం ప్రతీ ॥ 54

మోదకైర్వాయనం కార్యం వ్రతసంపూర్ణ హేతవే ।
లడ్డుకై ర్వటకాద్యైర్వా త్రిసప్తఫల సంయుతం ॥ 55

రక్తవస్త్రేణ సంఛాద్య స్వాచార్యాయ నివేదయేత్ ।
గణాధిప నమస్తుభ్యం సర్వసంకల్ప సిద్ధిద ॥ 56

వాయనస్య ప్రదానేన సంకటాన్మాంనివారయ - ఇతి వాయనమంత్రః ।
కథాంశ్రుత్వా తతః పుణ్యాం దద్యాదర్ఘ్యం సమాహితః ॥ 57

తిథీనా ముత్తమే దేవి గణేశప్రియవల్లభే సంకటం హరమే దేవి ।
గృహాణార్ఘ్యం నమోస్తుతే। ఇథ్యర్ఘ్యంః ॥ 58

లంబోదర నమస్తుభ్యం సతతం మోదక ప్రియ ।
సంకటం హరమేదేవ గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥
ఇతి దేవాయ అర్ఘ్యః ॥ 59

చంద్రాయ సప్తవారంతు మంత్రేణానేన పార్థివ ।
క్షీరోదార్ణవ సంభూత అత్రిగోత్ర సముద్భవ ।
గృహాణార్ఘ్యం మయాదత్తం । రోహిణ్యా సహిత శ్శశిన్ ॥
।చంద్రార్ఘ్య మంత్రః। 60

తతః క్షమాపయేద్దేవం తతో విప్రాంశ్చ భోజయేత్ ।
స్వయం భుంజీత తచ్ఛేషం బ్రాహ్మణేభ్యో యదర్పితం । 61

సప్తగ్రాసా న్మౌనసంయుక్తో యథాశక్త్యా యథా సుఖం ।
ఇత్థం కుర్యాత్తుమాసేషు చతుర్ష్వపి విధానతః ॥ 62

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే సంకష్టగణపతి వ్రతకథనం నామ ఏకోన సప్తతితమో అధ్యాయః ॥**



# 69-వ అధ్యాయము

# సంకష్ట చతుర్థీవ్రతము

శూరసేనుడు అడుగుతున్నాడు : "బ్రహ్మదేవునిచేత కృతవీర్యునకు సర్వసిద్ధులూ అనుగ్రహించగల ఏ సంకష్టచతుర్థీవ్రతం చెప్పబడిందో దానిని నాకు సవిస్తరంగా ఉపదేశించండి బ్రహ్మన్!"

ఇంద్రుడు : "సత్యలోకంలో సుఖంగా ఆసీనుడైన చతుర్ముఖ బ్రహ్మను కృతవీర్యుని తండ్రి సాష్టాంగనమస్కారంతో శరణుపొంది ఈ విధంగా ప్రశ్నించాడు :

"ఓ దేవదేవా! జగత్తుకు సృష్టివిధాతా! ఆశ్రయించినవారికి బాధలను నివారణచేసే దేవా! నా హృదయంలో గాఢంగా నెలకొనివున్న సందేహాన్ని అడుగుతున్నాను. దయచేసి దానికి సమాధానం ప్రసా దించండి!

ఆపదలచే కొట్టుమిట్టాడుతూవున్న మానవులకు, చింతలూ, దుఃఖాలూ సమస్యలతో గల్లంతుకాబడ్డ హృదయంగల ఆర్తులకూ, ఆప్తుల వియోగంతో, దగ్గరమిత్రుల చిరకాల వేర్పాటుతో బాధపడుతూన్న మానవులకు వారి సంకటములను నివారించే ఉపాయమేది? ధన దారిద్ర్యంతో బాధపడే దురదృష్టవంతులకు సంపదలనిచ్చి సౌభాగ్యమూ, మంచి సంతతినీ యిచ్చి, సకల సంకటములను నశింపచేసే ఉపాయం మానవులకు ఏమికలదో ఉపదేశించండి దయతో!"

బ్రహ్మదేవుడు చెబుతున్నాడు : "ఓ రాజా! నీవడిగినది చెబుతున్నాను! శ్రద్ధగా విను! మానవులకు సకల సిద్ధులనూ ప్రసాదించేదీ కేవలం ఈ వ్రతాన్ని అనుష్ఠించిన మాత్రంచేతనే కోరినవాటినన్నిటినీ ప్రసాదించగలట్టి సర్వసిద్ధిప్రదమైన "సంకష్టగణపతివ్రతాన్ని" నీకు ఉపదేశిస్తున్నాను.

బ్రహ్మముహూర్తంలోనే స్నానముచేసి శుచియై తెల్లనువ్వులూ మంత్రౌషధులూ సంపాదించుకొని ప్రాణాయామ, ధ్యానసహితంగా విఘ్నహరుడగు గణపతిని ధ్యానించి వ్రతసంకల్పం చేసుకోవాలి! ఆపైన పరమభక్తితో గణేశభగవానుని ఆగమశాస్త్ర విధానపూర్వకమైన మంత్రములతో యధావిధిగా పూజించాలి! ముఖ్యంగా ఈ వ్రతాన్ని కృష్ణపక్షంలో చవితినాడు రాత్రిపూట చంద్రుడుదయించేవేళ ఆచరించాలి!"

రాజు యిలా ప్రశ్నించాడు : "ఓ బ్రహ్మన్! దేవదేవుడైన గజాననుని ఏవిధంగా పూజించాలి? ఈ వ్రతాన్ని ఆచరించవలసిన క్రమం మరికొంత వివరంగా అర్థమయ్యేలాగ ఉపదేశించండి నాయందు దయతో!"

బ్రహ్మదేవుడు చెబుతున్నాడు : "ఉదయమే లేచి కాలకృత్యాలనూ నిత్యకర్మలూ పూర్తిచేసుకొని సాయంకాలం చంద్రోదయమయ్యే సమయం దాకా నిరీక్షించాలి! సరిగ్గా చంద్రోదయ సమయానికి ముందే శుచియైన ప్రదేశంలో పవిత్రమైన గోమయంతో అలికి పూజావేదికను నిర్మించు కోవాలి! సుద్ద, పసుపుకుంకుమలతో ముగ్గులుపెట్టి అలంకరించిన ఆ పూజావేదికపైన గణేశునికి పీఠం ఏర్పాటుచేయాలి! దానిపై ధాన్యమును గాని బియ్యమునుగాని పోసి పట్టువస్త్రము కప్పి అక్షతలతోనూ పుష్ప ములతోనూ పూజావిధానం ప్రకారం కలశస్థాపనచేసి కలశపూజను చేయాలి! ఆ కలశంలో యధాశక్తి పంచరత్నములు, పంచవల్లవములు, సువర్ణముతో కలిసిన పరిశుద్ధ జలాన్ని నింపాలి! బంగారం లభించకపోతే శుద్ధమైన వెండిగాని, దానికీ శక్తిలేకపోతే రూపాయినాణెంగాని వేసి కలశం పైన నూతనవస్త్రం, టెంకాయ, పల్లవములతో, తెల్లని పట్టువస్త్రంతో శిఖరాన్నిపెట్టి ఆ కలశంక్రింద బియ్యంపై ఆగమశాస్త్ర విధానం ప్రకారం గణేశయంత్రాన్ని నిర్మించాలి!

ఆ మహాగణపతి యంత్రంపైన గణేశుని మూర్తిని బంగారుతోగాని, వెండితోగాని సర్వలక్షణ సమన్వితమైన విగ్రహాన్ని స్థాపించాలి! ఆ విధంగా 'ఏకదంతుడు, మహాకాయుడు, కరిగించిన బంగారువంటి శరీరవన్నె కలిగిన విశాలాక్షుడు, మండుతున్న అగ్నిహోత్రంవంటి తేజోవంతమైన నేత్రములు గలవాడిని, పూర్ణకుంభంవంటి లంబోదరము కలిగి ఒకే దంతముతో మూషికవాహనుడైన గణపతిదేవునిమూర్తిని, శేషుడు యజ్ఞోపవీతంగా కల్గిన, దేవతలు చామరములతో సేవిస్తున్న గజాననుని' ధ్యానించాలి!

అలా మనోమయమైన గణేశమూర్తిని తన భావనలోనే దర్శిస్తూ 'ఓ దేవదేవేశా! దయచేయండి! నా సంకటములను నివారించుము. కృపతో నా వ్రతసమాప్తి అయ్యేదాకా ఈ పీఠమున ఆసీనుడవుకమ్ము! ఇదిగో ఆసనము, ఆవాహనము, అర్ఘ్యపాద్యములు సమర్పిస్తున్నాను!' అంటూ "సహస్రశీర్షాపురుషః" అన్న పురుషసూక్తమంత్రంతో ఆవాహన చేయాలి!

★ గణాధీశా! నీకు నమస్కారం! సర్వసిద్ధిప్రదాయకా! ఆసనము స్వీకరించి నా సంకటములను నివారించు.

– "పురుష ఏవేదగ్ం సర్వం" అన్న మంత్రంతో ఆసనం సమర్పించాలి!

★ ఓ ఉమాపుత్రుడా! నమస్తే నమస్తే! కుడుములు భక్ష్యములు ప్రీతితో ఆరగించుస్వామీ! అర్ఘ్యపాద్యములు స్వీకరించి నా సంకటములు నివారించు.

– "ఏతావానస్య మహిమా" అని పాద్యము

★ ఓ లంబోదరా! నమస్తే నమస్తే! నవరత్నములు ఫలములతో కూడిన అర్ఘ్యమును స్వీకరించి దయతో నా సంకటములను నివారించు.

– "త్రిపాదూర్ధ్వః ఉదైత్పురుషః" మంత్రంతో అర్ఘ్యము సమర్పించాలి

★ గంగాజలముతో పవిత్రం చేయబడిన, సర్వతీర్థములలో

సేకరించిన ఆచమనీయమును స్వీకరించు! దయతో నా సంకటములను నివారించు.

- "తస్మాత్ విరాడజాయత" అన్న మంత్రంతో ఆచమనం

★ పంచామృతములైన పాలు, పెరుగు, తేనే, నేయి, చక్కెర కలిపిన పంచామృతములను స్వీకరించు గణేశప్రభూ! నా సంకటములను నివారించు అని.

- "యత్పురుషేణ హవిషా" అన్న మంత్రంతో పంచామృతస్నానం సమర్పించాలి

★ నర్మద, చంద్రభాగా, గంగానదీ జలముల స్నానమును ఔప చారిక స్నానంగా సమర్పించాలి.

- "సప్తాశ్యాసన్ పరిధయః" అన్న మంత్రంతో శుద్ధోదకస్నానం సమర్పించాలి!

★ ఓ గజాననా! నాచే సమర్పితమైన ఈ నూతన వస్త్రముల చాపును స్వీకరించి నా సంకటములను నివారింపుము! అని చెప్పి

- "తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్" అని వస్త్రయుగ్మం సమర్పించాలి.

★ ఓ వినాయకుడా! నమస్కారం! పరశుధారీ దయతో ఈ యజ్ఞోపవీతాన్ని స్వీకరించి నా సంకటములను నివారించు!

- "తస్మాద్యజ్ఞా సర్వహుతః" అని యజ్ఞోపవీతం సమర్పించాలి.

★ ఈశపుత్రా నమోనమః! మూషికవాహనా నమస్తే! దయతో నేను సమర్పించు చందనం స్వీకరించి ఈ శీతలోపచారముతో నా సంకటములను నివారించు.

– "తస్మాద్యజ్ఞా సర్వహుతః" అను మంత్రముతో చందనం సమర్పించాలి!

★ పవిత్రమైన ధాన్యంతో క్రొత్తగా తయారుచేయబడిన అక్షతలను సమర్పిస్తూ నేయి, కుంకుమలతో కలిపిన అక్షతలను, సంపెంగ, మల్లె, దర్భలు, పారిజాతము వంటి అనేక పుష్పాలను

– "తస్మాదశ్వా అజాయత" అన్న మంత్రంతో పుష్పాక్షతలను సమర్పించాలి!

★ లంబోదర, మహాకాయ, ధూమకేతుడా! సుగంధ పరిమళ భూయిష్టమైన ఈ చందన, సాంబ్రాణి ధూపమును స్వీకరించి నా సంకటములను నివారించు!

– "యత్పురుషం వ్యదధుః" అన్న మంత్రంతో ధూపం సమర్పించాలి!

★ విఘ్నాంధకార వినాశకుడా! దేవతాధిపా! దేవదేవా! ఈ దీపాన్ని సమర్పిస్తున్నాను. ఈ సంకటములనుండి దారిచూపి నా కష్టములను నివారించు! అని

– "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" అన్న మంత్రంతో దీపం సమర్పించాలి!

★ పిండివంటలు, కుడుములు, లడ్లు, అప్పములు, పాయ సము, చక్కెర, చక్కగా వండిన సిద్ధాన్నం నేతితో అభికారం చేసి నైవేద్యం సమర్పిస్తున్నాను దేవా! దయతో స్వీకరించు! అని దయతో స్వీకరించు! అని ప్రార్థిస్తూ

– "చంద్రమా మనసోజాతః" అన్న మంత్రంతో నైవేద్యం సమర్పించాలి!

★ టెంకాయఫలము, ద్రాక్షలు, దానిమ్మ, మామిడి వంటి రుచి కరములైన శుభఫలములను సమర్పిస్తున్నాను. ఓ దేవదేవా! నా సంకటములను నివారించుము! అని

– "నాభ్యా ఆసీదంతరిక్షం" అన్న మంత్రంతో ఫలసమర్పణ

'ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము, జాపత్రి, జాజి కాయ వంటి సుగంధద్రవ్యములతో చేరిన తాంబూలమును స్వీకరించి నా సంకటములను నివారించుమోదేవా!' అని తాంబూలము సమర్పణ చేయాలి!

★ ఈ విధంగా షోడశోపచారములు సమర్పించి దక్షిణ రూపము లో 'హిరణ్యము' అనగా రూపాయినాణెము లేక సువర్ణ మును యథాశక్తిగా సమర్పించి

– "సప్తాశ్వాసన్" మంత్రంతో

దక్షిణను విఘ్నేశ్వరునికి నివేదించాలి!

ఈ విధంగా షోడశోపచారముల పూజను పూర్తిచేసి, గరికచిగుళ్ళతో

కలిసిన ఏకవింశతి పత్రములను గణపతియొక్క ఇరవైఒక్క నామము లతో పూజిస్తూ సమర్పించాలి! ఏకాగ్రమనస్సు కలిగి గణేశుని ఈక్రింద చూపబడిన నామములతో జపిస్తూ పత్రములను సమర్పించాలి!

1. ఓం సుముఖాయ నమః మాలతీపత్రం పూజయామి
2. ఓం గణాధిపాయ నమః బృహతీపత్రం పూజయామి
3. ఓం ఉమాపుత్రాయ నమః బిల్వపత్రం పూజయామి
4. ఓం గజాననాయ నమః దూర్వాయుగ్మం పూజయామి
5. ఓం హరసూనవే నమః దత్తూరపత్రం పూజయామి
6. ఓం లంబోదరాయ నమః బదరీపత్రం పూజయామి
7. ఓం గుహాగ్రజాయ నమః అపామార్గపత్రం పూజయామి
8. ఓం గజకర్ణాయ నమః జంబూపత్రం పూజయామి
9. ఓం ఏకదంతాయ నమః చూతపత్రం పూజయామి
10. ఓం వికటాయ నమః కరవీరపత్రం పూజయామి
11. ఓం భిన్నదంతాయ నమః విష్ణుక్రాంతపత్రం పూజయామి
12. ఓం వటవేనమః దాడిమీపత్రం పూజయామి
13. ఓం సర్వేశ్వరాయ నమః దేవదారుపత్రం పూజయామి
14. ఓం ఫాలచంద్రాయ నమః మరువకపత్రం పూజయామి
15. ఓం హేరంబాయ నమః సింధువారపత్రం పూజయామి
16. ఓం శూర్పకర్ణాయ నమః జాజీపత్రం పూజయామి
17. ఓం సురాగ్రజాయ నమః గణ్డకీపత్రం పూజయామి
18. ఓం ఇభవక్త్రాయ నమః శమీపత్రం పూజయామి
19. ఓం వినాయకాయ నమః అశ్వత్థపత్రం పూజయామి
20. ఓం సురసేవితాయ నమః అర్జునపత్రం పూజయామి
21. ఓం కపిలాయనమః అర్కపత్రం పూజయామి

శ్రీ గణాధిపతయేనమః ఏకవింశతిపత్రాణి పూజయామి

అంటూ ఈ విధంగా ఇరవైఒక్క నామాలతోనూ "ఏకవింశతి పత్రి పూజ"ను చేసి కర్పూరనీరాజనమును గణేశ భగవానునకు సమర్పించాలి! "దేవా నా సంకటములను నివారించుము" అన్న ప్రార్థనతో!

సుగంధముగల్గిన పారిజాత, మందార, తామరపుష్పాలతో "పుష్పాంజలి"ని భక్తితో సమర్పించాలి!

"యజ్ఞేన..." అన్న మంత్రంతో పుష్పాంజలినిచ్చి

"ఓ గణేశదేవా! ఈ పుష్పాంజలి స్వీకరించి, ఈ సంకటములనుండి నన్ను విముక్తునిచేయి!" అంటూ పుష్పాంజలిని సమర్పించాలి! ఆ తరువాత గణేశుని ఈవిధంగా ప్రార్థించాలి :

"దేవా! నీవే ఈ విశ్వాన్ని సృష్టించేవాడివి! పరిరక్షించేవాడివి! గజాననా! నీవీ విశ్వసృష్టికి స్థితిసంహారకుడవు! ఈ విశ్వవిశ్వాత్మకుడవు నీవే! అట్టి నీకు, దేవదేవుడైన గజాననునకు, గణనాధునకు, విఘ్నాలను హరించే విశ్వరక్షకునకు, నాకు ఏకైక దిక్కైన భక్తుల బాధలు నివారించే వేదవేద్యా! నమస్కారం! ప్రణవస్వరూపా! నమోవాకములు! భక్తార్తిహరుడా శరణుశరణు! వేదపురుషుడా నమస్కారం నమోనమః!"

అంటూ విధివత్తుగా గణేశుని ప్రార్థించి పునఃపునః మళ్ళీమళ్ళీ నమస్కరించి ప్రదక్షిణపూర్వకంగా నమస్కారములు 21 సార్లు సమర్పించాలి! ఈ విధంగా విశ్వవంద్యుడైన గజాననునికి నమస్కరించి, నాగయజ్ఞోపవీతిధారి, ఫాలచంద్రునితో పరశువును ధరించిన సర్వ విద్యాప్రదాయకుడైన విఘ్నపతిని పూజించి గరికచిగుళ్ళతో సంకటములు పోవలెనని సంకల్పించి అర్చన చేయాలి!

ఈ విధంగా పూజిస్తే తక్షణమే గణపతి అనుగ్రహించి దుష్కరము లైన కోరికలను కూడా సిద్ధింపచేసి, విఘ్నములను నశింపచేసి దుష్ట పీడను నివారించగలడు. గణపతి అనుగ్రహంచేత సర్వకార్యసిద్ధి కలుగ వలెనని, శత్రువులకు శత్రుబుద్ధి నశించాలని, మిత్రభావం కలగాలని సాష్టాంగ నమస్కారం చేస్తూ పునఃపునః స్తుతించాలి.

ఆ తరువాత హోమముచేసి అష్టోత్తర శతార్చనకాగానే పిండి వంటలు, లడ్లు, కుడుములు, పాయసము, ఇరవైఒక్క రకముల ఫలములు గణపతిస్వామికి నైవేద్యమివ్వాలి! ఆ తరువాత విధివత్తుగా వాయనమును ఎఱ్ఱని రక్తవస్త్రముతో (ఎఱ్ఱని పట్టువస్త్రముతో) తన గురుదేవునకు గణపతి స్వరూపునిగా నిమంత్రణచేసి సర్వసంకల్పసిద్ధికై వాయనమివ్వాలి!

"సంకటాం మాం నివారయ" (సంకటములనుండి నన్ను విముక్తుని చేయుము) అన్న వాయనమునిచ్చి గణేశునికథను, పుణ్యప్రదమైన పురాణశ్రవణమును శ్రద్ధగా విని స్వామికి పునః అర్ఘ్యపాద్యములు సమర్పించాలి! ఓరాజా! ఈ విధంగా చతుర్థీ మంగళవారంనాడు బహుళ పక్షంలో వచ్చే 'సంకష్టహర చతుర్థీ' పర్వదినంనాడు –

"ఓ గణేశప్రియవల్లభా! నాచే సమర్పించబడు అర్ఘ్యములను స్వీకరించి నా సంకటములను నివారణచేయి!" అని నివేదించాలి! సంకటహరగణపతిని నిమంత్రించి మోదకప్రియుడైన సంకటహర గణపతికి అర్ఘ్యమివ్వాలి! ఈ క్రిందివిధంగా చంద్రునకు ఏడుసార్లు అర్ఘ్యమివ్వాలి! రోహిణీనక్షత్రం కలిసిన శుభదినంనాడు –

"క్షీరోదార్ణవ సంభూత!
అత్రిగోత్ర సముద్భవ!
గృహాణార్ఘ్యం మయాదత్తం
రోహిణ్యా సహితశ్శశి"

అన్న చంద్రార్ఘ్య సమర్పణ మంత్రంతో అర్ఘ్యమివ్వాలి!

ఆ తరువాత అపరాధక్షమాపణ మంత్రంచెప్పి వేదపండితులైన బ్రాహ్మణులకు భోజనంపెట్టాలి! వారి భుక్తశేషాన్ని ప్రసాదంగా తాను భుజించి మౌనంగా నియమవంతుడై విశ్రమించాలి! బంధుజనులతో ప్రసాదమును భుజించి యిట్లుచేసిన వ్రతము శీఘ్రంగానే ఫలసిద్ధిని కలిగించి సమస్త కోరికలను సిద్ధింపచేయును. వేయేల? ఇంతకన్నా సంకటముల నివారణకు, సంకల్పసిద్ధికీ వేరుమంత్రం లేనేలేదు!'' అని ఈ విధంగా బ్రహ్మదేవుడు రాజునకు ఉపదేశించగా, ఆ రాజు శ్రద్ధగా సంకష్ట గణపతీవ్రత మహిమను విని తరువాతి అధ్యాయంలో చెప్పిన విధానంలో ఆచరించి సర్వసుఖాలను పొందాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'సంకష్ట చతుర్థీవ్రతం' అనే 69-వ అధ్యాయం.



70

# చతుర్థీ వ్రతోపాఖ్యానం

(మూలం)

## సప్తతితమో అధ్యాయః

**రాజోవాచ :**

వ్రతం పురాకృతం కేన భువి కేనప్రకాశితం ।
కింపుణ్యం కింఫలంచాస్య కరణాద్వదమే ప్రభో ॥ 1

**బ్రహ్మోవాచ :**

పురా స్కందేగతేచైవ పార్వత్యైవ కృతంవ్రతం ।
చతుర్థ్యపిచ మాసేషు శివవాక్యేన పార్థివ ॥ 2

పంచమేమాసి దృష్టస్తు కార్తికేయో హ్యపర్ణయా ।
అగస్త్యేన కృతం పూర్వం సముద్రం పాతుమిచ్ఛతా ॥ 3

త్రిషు మాసేషు విఘ్నేశ ప్రసాదాత్పీతవానముం ।
షణ్మాసావధి రాజేంద్ర దమయంత్యా పురాకృతం ॥ 4

నలమన్వేషయంత్యా తు తతోదృష్టో నలస్త్రయా ।
ప్రద్యుమ్నస్య సుతంరాజన్ చిత్రలేఖా నయత్పురా । 5

క్వగతః కేన నీతోవా ఇతి శోచంత మాకులం ।
ప్రద్యుమ్నం పుత్రశోకార్తం రుక్మిణీ ప్రత్యభాషత । 6

శృణు పుత్రప్రవక్ష్యామి యద్ర్వతం స్వస్య మందిరే ।
శంబరేణ పురానీతే బాలకే త్వయిషడ్డి నే ॥ 7

త్వద్వియోగజ దుఃఖేన హృదయం మేవ్యదూయత ।
కదా ద్రక్ష్యామ్యహం పుత్రం అపూర్వ మతిసుందరం । 8

అన్యస్త్రీణాం సుతం దృష్ట్వా మమచేతసి జాయతే ।
మమాపి పుత్రోభవితా సావనేనప్రమాణతః ॥ 9

ఇతి చింతాకులా యామేగతాన్యబ్దాని భూరిశః ।
తతో మే దైవయోగాత్తు లోమశో మునిరాగతః ॥ 10

తేనోపదిష్టం సంకష్టచతుర్థీ వ్రతముత్తమం ।
సర్వచింతాహరం పుత్ర చతుర్వారం కృతం మయా ॥ 11

తత్ప్రసాదా త్త్వమాయతో హత్వా శంబరమాహవే ।
త్వమప్యేతత్కురు వ్రతం తతోజ్ఞాస్యసి తంసుతం ॥ 12

బ్రహ్మోవాచ :

ప్రద్యుమ్నేన కృతం పూర్వం గణనాథ సుతోషకం ।
కృతో బాణాసురపురే అనిరుద్ధో నారదాత్పురా ॥ 13

ఉద్ధవస్యాజ్ఞయా కృష్ణః కృతవాన్ వ్రతముత్తమం ।
భీతీశ్వర సంగ్రామాదేకవారం యథావిధి ॥ 14

గత్వాస శోణితపురం జిత్వా బాణాసురం యుద్ధే ।
ఆనీయాత్ ఉషయాసార్థం అనిరుద్ధః క్షన్నృప ॥ 15

మయాపి సృష్టికామేన కృతమేత న్నృపోత్తమః ।
కృతా నానావిధా సృష్టిః వ్రతస్యాస్య ప్రభావతః ॥ 16

అన్యైర్దేవాసుర నరైః కృతం విఘ్నోప శాంతయే ।
ఋషిభి ర్ధానవైర్యక్షైః కిన్నరోరగ రాక్షసైః ॥ 17

ఆపద్యపి చ కష్టాయాం క్షుర్యాత్తచ్ఛాంతయే వ్రతం ।
నానేన సదృశం లోకే సర్వసిద్ధికరం వ్రతం ॥ 18

తపో దానం జపస్తీర్థం మంత్రో విద్యానచ క్వచిత్ ।
ఇమాం శ్రుత్వా కథాంరాజన్ స్వయం భుంజీత వాగ్యతః 19

జానుమధ్యే కరంకృత్వా గణేశం హృది చింతయేత్ ।
ద్విజాతీనాం చ యచ్ఛేషం భోక్తవ్యం సహ బాంధవైః । 20

కార్యం బహ్వాల్పమాసైస్తు సిధ్యతే నాత్ర సంశయః ।
బహూనాత్ర కిముక్తేన నాన్యత్స్ శీఘ్రసిద్ధిదం ॥ 21

నోపదేశ్య మభక్తాయ నాస్తికాయ శఠాయ చ ।
దేయం పుత్రాయశిష్యాయ భక్తియుక్తాయ సాధవే ॥ 22

మమప్రియోసి రాజేంద్ర ధర్మిష్ఠః క్షత్రియ ర్షభః ।
కార్యకర్తాసి లోకానాం ఉపదిష్ట మథోవ్రతం ॥ 23

తస్మా త్సర్వవ్రతేష్వేతత్ కర్తవ్యం ప్రథమం త్వయా ।
సిద్ధిం యాస్యంతి కార్యాణి నాన్యథా భషితంతు యా ॥ 24

యదా యదా పశ్యతికార్యముద్యతం నారీ నరోవా విదధాతు తద్వ్రతం ।
సిధ్యంతి కార్యాణి మనీషితాని కిం దుర్లభం విఘ్నహరే ప్రసన్నే ॥ 25

**సూత ఉవాచ :**

ఇద్ధం సకృత్వావిధివ న్నృపోత్తమో వ్రతం చకారాఖిల దుఃఖశాంతయే
వ్రతప్రభావా జ్జితవాన్ సవైరిణో బుభోజ రాజ్యం ససుతై రకంటకం। 26

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే చతుర్థీ వ్రతోపాఖ్యానం నామ సప్తతితమో అధ్యాయః ॥**



# 70-వ అధ్యాయము

# సంకష్టచతుర్థీ వ్రతోపాఖ్యానం-I

పూర్వము శ్రీకృష్ణపుత్రుడైన ప్రద్యుమ్నుడు తన కుమారుని జాడ కానరాక చింతాజలధిలో మునిగిఉండగా అతని తల్లియైన రుక్మిణీదేవి అతనికి ఇలా సలహాయిచ్చింది

'నాయనా! పూర్వం నీవు ఆరురోజుల వయసుగల బాలకుడవై ఉండగా శంబరాసురుడు నిన్ను నా పొత్తిళ్ళలోంచి అపహరించాడు. అప్పుడు నీ వియోగదుఃఖముచేత నాహృదయం ఎంతగానో తల్లడిల్లింది. ఇతరుల పిల్లలను చూసినప్పుడల్లా 'నాపిల్లవాడుకూడా యింతే వయసులో వుండేవాడుకదా' అని అనిపించి గుండెల్ని పిండివేసినంత బాధ కలిగేది. ఇలా చాలాకాలం గడిచింది. ఒకసారి భగవత్కృపావిశేషంచేత లోమశుడనే ముని రావటం తటస్థించింది. ఆయన నాపై దయపూని నాకు మనోభీష్టం నెరవేరడానికై 'సంకష్టచతుర్థీవ్రతాన్ని' ఉపదేశించాడు.

దానిని నేను శ్రద్ధాభక్తులతో నాల్గుపర్యాయములు ఆచరించాను. అప్పుడు ఆ దేవదేవుని అనుగ్రహంవల్ల నీవు శంబరాసురుణ్ణి వధించి తిరిగివచ్చావు! కనుక కుమారా! నీవుకూడ ఆ వ్రతాన్ని ఆచరించు! అలా చేసినట్లైతే నీవు తప్పక నీకుమారునిజాడ తెలుసుకొనగలవు!''

బ్రహ్మ యిలా చెబుతున్నాడు. 'ఓరాజా! అప్పుడు ప్రద్యుమ్నుడు కూడా గణనాధునికి అత్యంత ప్రీతిపాత్రమైన ఈ వ్రతాన్ని ఆచరించాడు. అప్పుడు గణేశుని అనుగ్రహంవలన తన కుమారుడు బాణాసురునియొక్క అంతఃపురంలో బందీగాఉన్నట్లు తెలుసుకోగలిగాడు. ఈ విషయాన్ని త్రైలోక్యసంచారియైన నారదునివద్ద తెలుసుకొని, బాణాసురునికి పరమ శివుని అండదండలున్నాయి గనుక ఆతడిని జయించటం చాలాకష్టమని గ్రహించి శ్రీకృష్ణుడు ఆ కార్యసిద్ధికని ఉద్ధవుని సలహామేరకు ఈ వ్రతాన్ని ఆచరించాడు.

ఫలితంగా భీకరసమరంలో బాణాసురుని సునాయాసంగా జయించి బాణుని కుమార్తెయైన ఉషాసమేతంగా అనిరుద్ధుని తిరిగి తీసుకుని వచ్చాడు. 'ఓ రాజా! పూర్వం సృష్టిరచనను చేయగోరి నేనుకూడా ఈ వ్రతాన్ని ఆచరించి ఆ గణేశానుగ్రహంచేతనే నానావిధ సృష్టినీ నిర్విఘ్నం గా సమర్థవంతంగా చేయగలిగాను. అంతేకాదు అనేక పర్యాయాలు దేవతలు, అసురులూ కూడా తమకు సంభవించిన విఘ్నముల ఉప శాంతికై ఈ వ్రతాన్ని ఆచరించారు. కనుక ఆపదలలోనూ, కష్టకాలము నందూ వాటి శాంతికి ఈ వ్రతాన్ని చేయాలి! ఈ వ్రతానికి ధీటైన సర్వసిద్ధికర వ్రతమింకొకటి ఎక్కడా కనపడదు. ఈ వ్రతముతో సమాన

మైన తపస్సుగాని, విద్యగాని, దానముగాని ఏమీలేదు. ఓ రాజా! ఈకథ నంతటిని విని రెండుచేతులనూ జోడించి

హృదయకమలంలో భక్తజనమందారుడైన విఘ్నహరుడిని స్మరిస్తూ మౌనంగా బ్రాహ్మణులు భుజించగా మిగిలిన శేషాన్ని బంధుజనంతో భుజించాలి! ఇలా నిష్ఠగాచేస్తే కొద్దినెలల్లోనే సిద్ధి తప్పక కలుగుతుంది! వేరే ఏ వ్రతమూ, నోమూ, కామ్యకర్మాకూడా ఇంత శీఘ్రంగా సిద్ధించదు! ఈ పరమ ప్రభావవంతమైన పవిత్రమైన వ్రతవిధానం అత్యంత గోప్యంగా ఉంచాలి. శ్రద్ధాళువులు కానివారికీ, నాస్తికులకూ భక్తిలేనివారికీ చెప్పరాదు. భక్తిగలవారైన కుమారులకు, శిష్యులకు, సాధువర్తనగలవారికి మాత్రమే చెప్పవచ్చు! ఇందులో ఉపదేశించిన ప్రకారం ఆచరిస్తే తప్పక సకల కార్యసిద్ధీ కలుగుతుంది! పురుషులైనా, స్త్రీలైనా ఉత్కృష్టమైన మహత్కార్యాలను చేయదలచినప్పుడు ఆ కార్యసిద్ధికై ఈ వ్రతాన్ని చేయాలి! అలా చేసినట్లైతే తమతమ మనోభీష్టములను అవశ్యం పొందగలరు! వారికి విఘ్నహరుని అనుగ్రహంచేత లోటేవుండదు!

'ఓ మహర్షులారా! ఈవిధంగా ఆరాజు చతురాననుడి వద్దనుండి చతుర్థీవ్రత విధానాన్ని పూర్తిగావిని, సమస్త దుఃఖశాంతికొరకూ అత్యంత ప్రీతితో ఈ వ్రతాన్ని ఆచరించి వ్రతప్రభావంచేత శత్రువులనందరినీ జయించి, దారాపుత్రులతో నిష్కంటకంగా రాజ్యభోగాలననుభవించాడు' అంటూ సూతమహర్షి ముగించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'చతుర్థీ వ్రతోపాఖ్యానం' అనే 70-వ అధ్యాయం.



71

# చతుర్థీ వ్రతోపాఖ్యానం

(మూలం)

## ఏకసప్తతితమో అధ్యాయః

ఉద్యాపనం కథం కార్యం వ్రతస్యాస్య మహామతే ।
తన్మే విస్తరతోబ్రూహి లోకానాం హితకామ్యయా ॥ 1

బ్రహ్మోవాచ :

ప్రథమేమాసి కర్తవ్యం పంచమే సప్తమేపి వా ।
ఉద్యాపనం మనుష్యేంద్ర వ్రత సంపూర్ణహేతవే ॥ 2

పూర్వోక్తేన విధానేన పూజయే ద్భక్తిమాన్నరః ।
పుష్పమంటపికాం కృత్వా నానా వస్త్రవిచిత్రితాం ॥ 3

కృత్వాతు సర్వతోభద్రం నానా రంగవిచిత్రితం ।
పూజయేత్తత్ర దేవేశం కలశోపరి పూర్వవత్ ॥ 4

చందనేన సుగంధేన పుష్పై ర్నానావిధైరపి ।
నారికేళ ఫలేనైవ దద్యా దర్ఘ్యం సమాహితః । 5

తిథీనాముత్తమే దేవి గణేశ ప్రియవల్లభే ।
సంకటం హరమే దేవి గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥ 6

లంబోదర నమస్తుభ్యం సతతం మోదకప్రియ ।
సంకష్టం హర మేదేవ గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥ 7

క్షీరోదార్ణవ సంభూత అత్రిగోత్ర సముద్భవ ।
గృహాణార్ఘ్యం మయాదత్తం రోహిణ్యా సహితశ్శశిన్ । 8

భోజ్యం భక్ష్యంచ లేహ్యంచ పేయం చోష్యం నివేదయేత్ ।
ఫలై రన్యైశ్చబహుభి స్తోషయే ద్గణనాయకం ॥ 9

అచార్యం వరయేత్తత్ర ఋత్విజ శ్చైకవింశతిం ।
గణానాంత్వా ఇతిమంత్రేణ అయుతం హోమమాచరేత్ ॥ 10

అథవా మూలమంత్రేణ సహస్రంవా తదర్ధకం ।
అష్టోత్తర శతంచాపి బలిదానం తతశ్చరేత్ ॥ 11

పూర్ణాహుతిం హునేత్పశ్చాత్ వసోర్ధారాం చ పాతయేత్ ।
హోమశేషం సమాప్యైవం బ్రాహ్మణా న్భోజయేత్తతః ॥ 12

వస్త్రయుగ్మంచ కలశాన్ దక్షిణాసన సంయుతాన్ ।
తేభ్యో దద్యాద్యథాశక్తి విత్తశాఠ్యం నకారయేత్ ॥ 13

ఆచార్యం పూజయేత్పశ్చాత్ వస్త్రాలంకరణాదిభిః ।
తస్మై భుక్తవతే దద్యా ద్వాయనం ఫలసంయుతం ః ॥ 14

శూర్పం పాయస సంపూర్ణం రక్తవస్త్రేణ వేష్టితం ।
సౌవర్ణం తంగణాధీశంతస్మై దద్యా త్సదక్షిణం ॥ 15

తిలానా మాఢకందద్యాద్ఘ్రత సంపూర్ణ హేతవే ।
తతో గాం కపిలాందద్యా త్సవత్సాం స విభూషణాం ॥ 16

తతః క్షమాపయేద్విప్రాన్ విఘ్నేశః ప్రీయతాదితి ।
వ్రతస్యోద్యాపనం కృత్వా హయమేధ ఫలం లభేత్ ॥ 17

**పితోవాచ :**

ఏవం మేబ్రహ్మణోపదిష్టం వ్రతం లోకోపకారకః ।
తదేత త్కథితం తేద్య కురుపుత్రార్ధ మాదరాత్ ॥ 18

**ఇంద్ర ఉవాచ :**

యథా యథా సమాదిష్టం పిత్రా తేనమహావ్రతం ।
తథా తథా కృతంతేన కార్తవీర్యేణ ధీమతా ॥ 19

వ్యాఖ్యాయ కథితం సమ్యక్ పండితై ర్వ్రతముత్తమం ।
సిద్ధి బుద్ధియుతాం మూర్తిం స్థాప్య కాంచన నిర్మితాం ॥ 20

మహామంటపికా మధ్యే బ్రాహ్మణైఃపఠ్యతే క్వచిత్ ।
క్వచిత్పురాణం పాండిత్యం క్వచిద్గాయన నర్తనే ॥ 21

నానా విధానాం వాద్యానాం ధ్వనయో నిర్గతాదివం ।
వివదంతే జనాః క్వాపి మధ్యస్థాః కేచనా భవన్ ॥ 22

స తురాజా మహాధీమాన్ జజాపపరమం మనుం ।
జప్త్వా హుత్వా పూజయిత్వా భోజయిత్వా ద్విజాన్ బహూన్ ॥ 23

గాం దదౌ అవయుతం తేభ్యో అలంకృతేభ్యో హ్యలంకృతాః ।
దీనాంధ కృపణేభ్యోన్నం దదౌ దానాన్యనేకశః ॥ 24

సంతుష్టానాం ససర్వేషాం పుత్రాశీ ర్భగృహే నృపః ।
తేషాంద్విజానాం తపతాం సర్వదా సత్యవాదినాం ॥ 25

ఆశీర్భిః స్వల్పకాలేన ససత్వా భూన్నృపాంగనా ।
సుషువే శుభవేళాయాం పుత్రం లక్షణ సంయుతం ॥ 26

దదౌ దానాన్యనేకాని పుత్రజన్మ ప్రహర్షితః ।
వ్రతబంధం వివాహంచ కాలే తస్యాకరోన్నృపః ॥ 27

జ్ఞాన విజ్ఞాన సంపన్నం పుత్రం రాజ్యేభిషించ్యచ ।
సత్పుత్రో భోగసంపన్నో జగామాంతే పదం విభోః ॥ 28

ఋత్విగ్భ్యః పండితై స్సార్థం ప్రేక్షకై స్వకలైరపి ।
తస్య పుణ్యేనతేసర్వే గాణేశం ధామచాగమన్ ॥ 29

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే సంకష్ట చతుర్థీ**
**వ్రతో ద్యాపనం నామ ఏక సప్తతితమో అధ్యాయః**



## 71-వ అధ్యాయము

# సంకష్టచతుర్థీ వ్రతోపాఖ్యానం-II

"ఓ చతురాననా! అనంత శుభఫలప్రదమైనట్టి ఈ సంకష్టచతుర్థీ వ్రతానికి ఉద్యాపనను ఎలాచేయాలి? ఆ వివరం విస్తరించి చెప్పు. లోకోపకారార్ధమే నీవంటివారు ఈ దివ్యకార్యములు నిర్వహిస్తారుకదా! అందుచేత లోకకళ్యాణంకూడా జరుగుతుంది!" అన్న సూతముని వాక్కులను విన్న బ్రహ్మ యిలా బదులుచెప్పాడు.

"ఓ మునీంద్రా! ఈ చతుర్థీవ్రతానికి ఉద్యాపనమును చైత్ర, శ్రావణ, అశ్వయుజ మాసాలలో ఎప్పుడైనా చేయవచ్చును. వ్రతంయొక్క పూర్తిఫలం పొందే నిమిత్తమే ఈ ఉద్యాపనం చేయాలి! పూజను ఇంతకు ముందు చెప్పిన విధంగానే ఆచరించాలి! **'సర్వతోభద్ర మంటపమును'** నానా వర్ణములతోనూ నిర్మించి దానిపై కలశమును స్థాపించాలి! ఆ కలశాన్ని వస్త్రముచేత, ఆభరణములతోనూ అలంకరించి ఆ తరువాత గణపతి యొక్క మూర్తిని స్థాపించాలి. షోడశోపచారములతో ఆ గణేశుని

మూర్తిని పూజించి తరువాత చతుర్థీ తిథికి, దేవతకు, చంద్రునకు ఇంతకుముందే చెప్పబడినరీతిలో అర్ఘ్యము నివ్వాలి! ఆ తరువాత నానావిధమైన ఉపహార ములతో మహానివేదనచేసి గణపతిని సంతృప్తుని గావించి ఆచార్యుని ఋత్విక్కులను సంభావించి వారి ఆధ్వర్యంలో 'గణానాంత్వా' అనే వైదిక మంత్రముతోగాని, మూలమంత్రముతోగాని వెయ్యి లేదా పదివేలు లేదా నూటఎనిమిదిసార్లు హోమంచెయ్యాలి!

ఆ తరువాత పూర్ణాహుతిని చేసి 'వసోర్ధార'నుకూడా నిర్వర్తించాక హోమాన్ని పరిసమాప్తిచేయాలి! వేదవిదులైన సద్విప్రులకు షడ్రసోపేతమైన భోజనంపెట్టి వారిని చందన, వస్త్ర, తాంబూలాదులతో సత్కరించాలి! అనంతరం ఆచార్యుని పూజించి వారికి వస్త్రాలంకారాలను యిచ్చి ఫలములతో వాయనమివ్వాలి! పాయసంతో నిండిన పాత్రను ఎఱ్ఱటి వస్త్రంతో అలంకరించి, దానిపైన బంగారు గణేశమూర్తిని ఉంచి దక్షిణతో కలిపియివ్వాలి! ఈ వ్రతం సంపూర్తికావడానికి కుంచెడు నువ్వులనుకూడా ఇచ్చి, ఆ తరువాత దూడతోకూడిన కపిలగోవుకు సకలమైన అలంకార ములూ చేసి ఆచార్యునకు అర్పించాలి! ఆ తరువాత బ్రాహ్మణులు, గణేశుడు తృప్తినొందుగాక అనిచెప్పి క్షమాపణ వేడుకోవాలి!

ఈ విధంగా వ్రతోద్యాపన చేయటంవలన అశ్వమేధక్రతువు చేసి నంతటి ఫలం లభిస్తుంది!" అంటూ వివరాలన్నీ చెప్పి కృతవీర్యునితో ఆతడి తండ్రి యిలాఅన్నాడు

"నాయనా! లోకోపకారార్థమై ఈ వ్రతవిధానాన్నంతటినీ బ్రహ్మ నాకు వివరించిచెప్పాడు! ఆ విశేషములన్నీ నీకు తెలిపాను! సంతానాన్ని కోరినవాడవు గనుక ఈ వ్రతాన్ని యథావిధిగా ఆచరించు!" అంటూ

స్వప్నంలోనే తన కుమారుని ఆశీర్వదించి అదృశ్యుడైనాడు.

అప్పుడా కృతవీర్యుడు తనకు తండ్రి స్వప్నంలో ఉపదేశించిన రీతిగా ఈ వ్రతాన్ని అనుష్టించాడు. ముందుగా సిద్ధి, బుద్ధులతో కూడినట్టి గజాననుని బంగారు ప్రతిమను చేయించి, దానిని పూవులతో నిర్మింప బడిన ఒక పుష్పమంటపంలో ఉంచి పురాణపఠనం, శాస్త్రచర్చలు, గాన నృత్యాదికములలో సకల వాదిత్ర ధ్వనులు మారుమ్రోగగా, సకల వైభవ ములతో మహోత్సవాలు నిర్వహించి, తాను గణేశమంత్రాన్ని అమిత శ్రద్ధాభక్తులతో జపించి, విధివత్తుగా హోమముచేసి ఆ తరువాత, బ్రాహ్మ ణులకు అన్నసమారాధనను జరిపి, వారినికూడా సంతుష్టులనుచేసి సత్సంతాన ప్రాప్తికై వారి ఆశీస్సులను బడసినాడు. ఈ రకంగా తపోనిష్ట లైన సద్విప్రుల ఆశీఃఫలంగా ఆతడి భార్య స్వల్పకాలంలోనే గర్భం ధరించింది. శుభసమయంలో సకల శుభలక్షణోపేతుడైనట్టి కుమారుడిని ప్రసవించింది. ఆ సమయంలో రాజు అనేకములైన దానధర్మాలను చేశాడు.

ఆ తరువాత రాజు కుమారునికి సకాలంలో శాస్త్రోక్తరీతిని ఉపనయనాదికాలు, వివాహాది సంస్కారములూ జరిపి, విద్యావంతుడూ జ్ఞానసంప న్నుడైన ఆతనికి రాజ్యపట్టాభిషేకం జరిపాడు. ఆ కృతవీర్యుడు ఇహ లోకంలో అనంతమైన భోగభాగ్యాలను అనుభవించి, చివరకు గణేశాను గ్రహంచేత గణేశపదమును పొందాడు. అతని పుణ్యమువలన ఋత్వి క్కులు, పండితులు, ప్రజలు అందరూ సద్గతిని పొందారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'సంకష్టచతుర్థీ వ్రతోద్యాపనం' అనే 71-వ అధ్యాయం.

72

# దత్తాత్రేయానుగ్రహం

(మూలం)

## ద్విసప్తతితమో అధ్యాయః

**శూరసేన ఉవాచ :**

వ్రతే జాతే కథమభూ త్త్రయోః పుత్రః శతక్రతో ।
తత్సర్వం మేవద విభో విస్తరాత్పరిపృచ్ఛతః ॥ 1

**ఇంద్ర ఉవాచ :**

కిం కిం నజాయతే రాజన్ పరితుష్టే గజాననే ।
ప్రసాదాత్తస్య సారాజ్ఞీ గర్భంధత్తే నృపస్యయత్ ॥ 2

ప్రసూతా నవమే మాసి మంగళం పుత్రమైక్షత ।
ద్విస్కంధం చారువదనం బాహూ హస్తవివర్జితం ॥ 3

సునాసం పద్మనయనం ఊరుజాను వివర్జితం ।
జంఘా పాదవిహీనంతం దృష్ట్వామాతా రురోదహ ॥ 4

సోవాచ :

దుర్భగాయాః కథమభూత్ ఈదృశో బాలకో మమ ।
కర పాద విహీనోయం కథం దత్తో గజానన ॥ 5

ఆసం శుభాహం వంధ్యైవ కిమీదృక్పుత్రవత్యహం ।
కథం నజాతో నాశోమే పూర్వజన్మ కృతైనసః ॥ 6

కథం ప్రసాదః ఫలిత స్తవాపి ద్విరదానన ।
కథం బ్రాహ్మణవాక్యాని నిష్ఫలానీదృశాని యే ॥ 7

పాణిభ్యాం నిఘ్నతీవక్షో లలాటం చ ముహుర్ముహుః ।
తస్యాం రుదంత్యాం సర్వాస్తా రురుదుస్తత్ర యాస్థితాః ॥ 8

తాసాం కోలాహలం శృత్వా నృపోపి తత్ర చాగమత్ ।
తస్యాపి రుదితం శృత్వా ప్రధానా అపిచాగమన్ । 9

తేషాంచ రుదితం శృత్వా నాగరా రురుదుస్తదా ॥ 10

రాజోవాచ :

కథం దీనానుకంపిత్వం తవదేవ గజానన ।
కథం దయా కృతాతేద్య మహ్యమేవం ప్రదర్శితా ॥ 11

కథం స్మరణ మాత్రేణ పాపాని హరసేనఘ ।
జప స్తపః స్మృతి ర్ధానం పూజనం ద్విజతర్పణం ॥ 12

అనుష్టానం తదా హోమః సర్వం వ్యర్ధం గతం మమ ।
తస్మాద్దైవంహి బలవాన్ ప్రయత్నస్తు నిరర్ధకః । 13

న జ్ఞాయతే కర్మగతిః కదా కింవా భవిష్యతి ।
మూషకః ప్రాప్యతే యద్వ త్పర్వతస్య విదారణాత్ ॥ 14

తథామే జనిపుత్రోయమాజన్మ కృత యత్నతః ।
తత ఊచుః ప్రకృతయో నృపం శోకాకులం తదా ॥ 15

ప్రధానాః ఊచుః :

అలం శోకేన భూపాల కథం భావ్యనథాభవేత్ ।
రామః కిం న మృగం వేద తత్పృష్టం గత ఏవ సః ॥ 16

ధర్మరాజో న కిం వేద నిషిద్ధం దూత కర్మతత్ ।
తథాపి సగతో రంతుం సర్వం హిత్వా వనం గతః । 17

చారుతానభవేదస్య భృశ మాక్రందితే సతి ।
అదృష్టం చేద్భవే త్సమ్యగగ్రే చారురయం భవేత్ ॥ 18

పుష్పం ఫలంవా కారేన యథాయాతి మహీరుహాం ।
తథా కాలేన భవితా సమ్యక్ప పృథివీపతిః ॥ 19

ఇంద్ర ఉవాచ :

ఇత్యమాత్యవచ శ్రుత్వా సావధానో భవన్నృపః ।
ఉవాచ నృపపత్నీం తాముత్తిష్ఠో త్తిష్ఠ మాశుచః ॥ 20

స్వయంచ సుమనా రాజా సమాహూయ ద్విజోత్తమాన్ ।
గణేశ పూజనం చక్రే స్వస్తివాచన మేవ చ ॥ 21

కృత్వా భ్యుదయికం శ్రాద్ధం దదౌ దానాన్యనేకశః ।
మాల్యాలంకార వాసాంసి గవో రత్నాన్యనేకశః ॥ 22

సుహృత్సబంధి భృత్యేభ్యో వస్త్రాణి వివిధాని సః ।
నానా వాదిత్ర జీవేభ్యో దదౌ రాజా యథార్హతః ॥ 23

వంది చారణ దీనాంధ కృపణేభ్యశ్చ సర్వశః ।
గృహే గృహేచ తాంబూల శర్కరా దాప యచ్చసః ॥ 24

కార్తవీర్యే తినామాస్య చకారైకాదశే హని ।
భోజయామాస నగరం మహోత్సాహ పురస్సరం ॥ 25

తతో ద్వాదశవర్షాణి వ్యతీతాని సుతస్యహ ।
అయయౌ స్వేచ్ఛయాతస్య దత్తాత్రేయ స్తదాగృహం ॥ 26

పాదయోః స్వశిరః స్థాప్య కృతవీర్యో ననామ తం ।
ఆలిలింగ మునిః స్తం సఉద్ధాప్య నృపసత్తమం ॥ 27

ఉపవిశ్యాసనే రమ్యే పూజయామాస సాదరం ।
విష్టరం పాద్యమర్ఘ్యం చ గాంచ వస్త్రోపవీతకం ॥ 28

దదౌ ధూపంచ దీపంచ నైవేద్యం వివిధం ఫలం ॥
ఉద్వర్తనం చ తాంబూలం రత్నకాంచన దక్షిణాం ॥ 29

సుప్రసన్నం సుఖాసీనం పాద సంవాహనాదిభిః ।
రాజా సమ్యక్తం దత్తాత్రేయం మహామునిం ॥ 30

రాజా ఉవాచ :

జన్మజన్మాంతరీయం మేపుణ్యం ఫలితమద్యవై ।
యచ్ఛర్మ చక్షుషాం జాతం సాక్షాత్తే దర్శనం మునే ॥ 31

అగ్రే శుభతలంభావి ప్రసాదాత్తవ సువ్రత ।
యతో భవాదృశాంనైవ దర్శనం పాపకర్మణాం ॥ 32

కృతవీర్య వచః శృత్వా దత్తాత్రేయ స్త మబ్రవీత్ ।
అపూర్వం తనయంతే ద్యద్రష్టుకామో హమాగతః । 33

తతానందయుక్తో సౌనృపః ప్రాహ మునిం పునః ।

నృప ఉవాచ :

అనుష్ఠానం తపోదానం వృధా మమగతం వ్రతం ॥ 34

జగదీశేన దత్తోయం పుత్రో హృచ్ఛల్య ఏవసః ।
అనేనాదర్శనీయేన గతశ్చాదర్శనీయతాం ॥ 35

ఇంద్ర ఉవాచ :

ఆనీయ బాలకంతస్మై మునయే దర్శయన్నృపః ।
ఆచ్ఛాదయన్ న్నేత్రకంజే తత్సుతం వీక్ష్యతన్మునిః ॥ 36

జ్ఞాత్వా ధ్యానేన తత్కర్మ మునిస్తం పునరబ్రవీత్ ।
అయమేవ సుతోరాజన్ కర్తా సర్వాన్ విజిత్యహ ॥ 37

నాచాంతోసి విజృభ్యత్వం సంకష్టివ్రత జాగరే ।
నిందితో వ్రతరాజస్తు సర్వసంకష్ట నాశనః ॥ 38

అంగహీనః సుతోజాతః ఉపాయాత్సాంగతా మియాత్ ॥

రాజోవాచ :

ఋతముక్తం త్వయా స్వామిన్ కృపాంకృత్వా వదస్వమే ॥ 39
యేనోపాయేన సాంగోమే త్వత్ప్రసాదాత్సుతో భవేత్ ।

ఇంద్ర ఉవాచ :

మునిః సకృపయా విష్టస్తత్సుతాయ తదాబ్రవీత్ ॥ 40

మంత్రమేకాక్షరం సాంగం తతఊచేపునశ్చ తం ।
ఆరాధనం గణేశస్య మంత్రేణానేన భక్తితః ॥ 41

ఉపవాసైక భక్తానాం నియమాన్ కురుసువ్రత ।
ద్వాదశాబ్దం తతస్తుభ్యం దర్శనం సచ దాస్యతి । 42

తద్దృష్టిపాత మాత్రేణ దివ్యదేహో భవిష్యసి ।
ఇత్యుక్త్వా నృపమామంత్ర్య పిదధే మునిపుంగవః ॥ 43

గతే మునౌ తతః పుత్రః పాదహీనో మహామనాః ।
జగాద కృతవీర్యం స గహనం ప్రాపయస్వ మాం ॥ 44

గజానన ప్రసాదార్థం అనుష్ఠానం కరోమ్యహం ।
రుదిత్వా పితరౌ తస్య శృత్వావాణీం తదీరితాం ॥ 45

అప్రేషయద్వనం చారు నరయానేన తం పితా ।
భృత్యాః పర్ణకుటీ మధ్యే సంస్థాప్య నగరం యయుః ॥ 46

తస్థౌ తత్ర స్వయం సమ్యక్తపసే కృతనిశ్చయః ॥ 47

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే దత్తాత్రేయానుగ్రహ నామ ద్విసప్తతితమో అధ్యాయః**



# 72-వ అధ్యాయము

# కార్తవీర్య చరిత్ర

ఆతరువాత శూరసేనమహారాజు శచీపతియైన ఇంద్రుణ్ణిలా ప్రశ్నించాడు 'ఓ దేవేంద్రా! చతుర్థీవ్రత మాచరించిన ఫలితంగా రాజైన కృతవీర్యునికి ఎలాంటి కుమారుడు జన్మించాడు? ఆ వివరమంతా దయతో నాకు విస్తారంగా తెలుపు!' అంటూ ప్రార్థించగా సహస్రాక్షుడైన ఇంద్రుడు ఆతనితో యిలా బదులుచెప్పాడు.

"ఓ రాజా! భక్తానుగ్రహప్రదుడైన ఆ గజాననుడు ప్రసన్నుడైవుండగా ఏదిమాత్రం అలభ్యం? అట్టివానికి సకలమూ సులభంగా సిద్ధిస్తాయి. పరమ దయానిధియైన గజాననుని అనుగ్రహవిశేషంచేత ఆ రాణి గర్భం దాల్చి తొమ్మిదవనెలలో ఓ కుమారుని కన్నది. విధివశాత్తూ ఆ బాలునికి రెండుమెడలుగల సుందరమైన ముఖము, చక్కని ముక్కు నేత్రములు

కలిగి కాళ్ళుచేతులు లేనట్టి, తొడలు మోకాళ్ళతో, పాదవిహీనమైవున్న ఆ శిశువును చూసిన ఆ తల్లి దుఃఖమునకు మేరయే లేకుండా పోయింది.

గుండెలవిసేలా రోదిస్తూ "అయ్యో దైవమా? ఏమి నా దుర దృష్టము? నాకిలాంటి అంగహీనుడైన కుమారుడేల జన్మించాడు? గజా ననుడికి నాపై దయ ఏల సన్నగిల్లింది? ఇటువంటి సంతానమును కనటంకంటే గొడ్రాలిగా మిగిలివున్నా బాగుండేది! నాకింకా ఎటువంటి దుష్కర్మ అనుభవానికై మిగిలివున్నదో? ఆఖరుకు మరణంకూడా నన్ను చూసి దూరంగా పారిపోతున్నదే!

వేదవేత్తలైన విప్రుల ఆశీస్సులన్నీ నిష్ఫలమేనా? గజాననునికి నాపై యింకాఏల దయకలుగలేదు?" అంటూ గుండెలు మోదుకుంటూ ఏడ్వ సాగింది. ఆమెను చూసిన అంతఃపుర స్త్రీలు సైతం భోరుమంటూ విలపించసాగారు. అంతఃపురంలోంచి వినవచ్చిన ఈ కోలాహలం విని రాజు అక్కడికి వచ్చినాడు. రాణి రోదనము విన్న మంత్రులుకూడా అక్కడకి విచ్చేశారు. అప్పుడు ఆ రాజు దైవాన్ని సంబోధిస్తూ యిలా పలికాడు.

"ఓ గజాననా! దీనజనార్తిహరుడవే! భక్తులమనోభీష్టాలన్నీ యిట్టే ఈడేర్చగలవాడవే! నిన్ను కేవలం మనసులో ఒక్కసారి స్మరించినంత మాత్రానే సకలపాపములూ హరింపబడతాయే! ఎంతో భక్తిప్రపత్తులతో అంతులేని విశ్వాసంతో నీకు నేను సమర్పించిన పూజ, అనుష్ఠానము హోమాదికము నిరర్థకమైనదే! ఏనాటికేమి జరుగునో ఎవ్వరికీ తెలియదు

కదా! కొండని త్రవ్వి ఎలుకని పట్టినట్లు ఆజన్మకృత ప్రయత్నఫలంగా యిటువంటి కుమారుడు కలిగాడే!" అంటూ దుఃఖపడుతున్న రాజును చూచి మంత్రులిలా హితోపదేశము గావించారు.

"ఓ ప్రభూ! వృథాగా తమరు దుఃఖించుట తగనిపని! విధివిధానమును ఎవరూ తప్పించలేరు. కర్మయొక్క గతులగురించి తెలియటం అసాధ్యం! మహామహులకే కర్మానుభవం తప్పలేదు. బంగారులేడి సృష్టిలో అసహజమని తెలిసీ శ్రీరాముడు దాన్ని సాధించటానికై వేటకి వెళ్ళాడు! ద్యూతం నింద్యమని, అర్యులకు కూడనిదని పాండవాగ్రజుడైన ధర్మరాజు ఎరిగీ ద్యూతక్రీడలో పాల్గొని తన సర్వస్వాన్నీ కోల్పోయి చివరికి భార్యనే పందెంఒడ్డాడు. నీవిలా ఎంతకాలం శోకించినా పరిపూర్ణతను ఈ బాలకుడు పొందలేడు. కాలానుగుణ్యంగా లోకములో ఫలాలు పక్వమైనట్లుగా తగిన కాలానికి అన్నీ సమకూరతాయి!"

ఈ విధంగా మంత్రుల హితవాక్యములు విన్న రాజు స్వస్థచిత్తుడై తన భార్యతో యిలాఅన్నాడు 'ఓ దేవీ! వృథాగా దుఃఖించుటవలన ఏమీ ప్రయోజనముండబోదు!' అంటూ ఊరడించి బ్రాహ్మణులను పిలిపించి సౌమనస్యంతో పుణ్యాహవచనము అభ్యుదయిక శ్రాద్ధములను చేసి, అనేకమైన మాన్యములు, అలంకారములు, వస్త్రాదులు, గోవులు, రత్నములను దానంచేశాడు. తరువాత బంధుమిత్రులను, సేవకులను యధోచితరీతిని సత్కరించాడు. వందిమాగధులకు, దీనులకు, అంధులకు అన్నవస్త్రాదికములు యిచ్చాడు. తరువాత నగరిలోని ప్రతియింటికీ శర్కర తాంబూలాదులను పంచిపెట్టాడు. ఈ విధంగా పదకొండు

రోజులు గడిచాక ఆ బాలునికి 'కార్తవీర్యు'డని నామకరణం చేశాడు.

ఆ తరువాత పురవాసులందరికీ మహోత్సాహంతో భోజనసమా రాధన గావించాడు. ఇలా పన్నెండు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు అనుకో కుండా తలవని తలంపుగా దత్తాత్రేయమహర్షి రాజభవనానికి విచ్చేశాడు. అప్పుడు కృతవీర్యుడు సాదరంగా ఎదురేగి ఆహ్వానించి సాష్టాంగనమస్కారం చేశాడు. భగవానుడైన దత్తమూర్తి ఆతడిని లేవనెత్తి గాఢాలింగనం చేసుకున్నాడు. ఆ మునికి సకలోపచారములూ సమర్పించి, సుఖాసీనుడైనాక ఆతడికి పాదసేవ (కాళ్ళుపట్టి) చేసి యిలాఅన్నాడు. "ఓమునివర్యా! మీరాకచేత మా అంతఃపురము, రాజ్యము పావన మైనాయి. ఎన్నోజన్మల పుణ్యఫలానకాని తమవంటి మహనీయుల దర్శన మవటం దుర్లభం! నా చర్మచక్షువులతో యోగిజనదుర్లభమైన మీ అద్భుత మహిమాన్వితమైన రూపును దర్శించగలిగాను. మీ అనుగ్రహవిశేషంచేత నా భవిష్యత్తు శుభప్రదం కాగలదు!" అంటూ మృదుమధురంగా వినయా న్వితుడై పలుకుతున్న ఆ రాజుతో దత్తమునీంద్రుడు ఇలాఅన్నాడు.

'ఓరాజా! నీయొక్క అపూర్వ కుమారుని చూడాలన్న ఇచ్ఛతో వచ్చాను.' ఆ మాటలకు కృపాసముద్రుడైన దత్తుని కరుణకు కన్నులలో నీరు చిప్పిల్లగా తన కుమారునికై కబురుపంపి దత్తాత్రేయునితో యిలా అన్నాడు. 'ఓ మునిసత్తమా! సంతానానికై చిరకాలము పరితపించి ఘోర మైన తపస్సు అనుష్ఠానము ఆచరించగా, ఆ జగదీశ్వరుడైన గణేశుని వరప్రసాదిగా ఈ వైకల్యంగల తనయుడిని పొందాను! నా దురదృష్టము నేమని వర్ణించను? చూడటానికి సైతం ఎబ్బెట్టుగా కనపడే ఈ దురదృష్ట

వంతుడివల్ల నేనుకూడా అనర్హుడినైనాను!' అంటూ ఆ బాలకుడిని తెచ్చి మునికి కనపరిచాడు!

అప్పుడా దత్తమూర్తి ధ్యాననిమీలిత నేత్రుడై ఆ బాలకునివైపు కరుణాభరితమైన దృష్టిని సారించి ఆ బాలకుడియొక్క పూర్వకర్మనంతా తెలుసుకొని ఆరాజుతో యిలాఅన్నాడు. "ఓరాజా! ఈ బాలుడు మహా బలశాలియై, సర్వులనూ ఓడించి మహత్కర్మను చేయగలడు. నీవు చేసిన సంకష్టహర చతుర్థీవ్రతంలో రాత్రి చేసిన జాగరణ సందర్భంలో శుద్ధాచమనాది నియమాలను శ్రద్ధగా పాటించకపోవడంవలన ఆ వ్రతం లోపయుక్తమైనది. అందువలననే నీకుమారుడిలా అంగహీనుడైనాడు. అందుకని సరైన ఉపాయంవల్ల ఇతడు సకలాంగశోభితుడవ్వగలడు.

అప్పుడు ఆ రాజు మునితో "ఓ మునివర్యా! మీరు వచించిన దంతా అక్షరసత్యం! కనుక తాము దయవహించి ఈ కష్టనివారణ కలిగి నా కుమారుడు ఏ విధంగా సంపూర్ణావయవ సంపన్నుడౌతాడో అట్టి ఉపాయాన్ని చెప్పవలసింది!" అంటూ ప్రార్థించగా ఆ దత్తమూర్తి కృపా విష్టుడై ఆ బాలకుని దగ్గర కూర్చుండచేసుకొని సాంగోపాంగముగా ఏకాక్షర గణపతీమంత్రాన్ని అతడికి ఉపదేశించాడు. ఆ తరువాత అతడితో

"నాయనా! ఈ మంత్రరాజమును భక్తిగా నిష్టతో జపిస్తూ గణేశుని ఆరాధించు! ఉపవాసనియమం పాటిస్తూగాని, ఏకభుక్త నియమంతోగాని పన్నెండు సంవత్సరాలు చేసినట్లైతే ఆ తరువాత దేవదేవుడైన గజాననుడు నీకు సాక్షాత్కరిస్తాడు. ఆయనయొక్క దివ్యదృష్టి నీమీద ప్రసరించగానే

నీవు వికృతాకృతిని వీడి దివ్యదేహుడవవుతావు! శుభమస్తు!" అంటూ దీవించి రాజువద్ద సెలవుపుచ్చుకుని వెళ్ళిపోయాడా దత్తమూర్తి!!

అలా ముని అంతర్హితుడైనాక బాలుడైన కార్తవీర్యుడు తండ్రివద్ద అనుష్టానానికై అనుమతిబడసి అరణ్యాలకు తపస్సు నిమిత్తమై వెళ్ళి పోయాడు. ఆతనివెంట కూడావెళ్ళిన సేవకులు ఆతడికో పర్ణకుటీరం నిర్మించి, ఆతడిని అందులోవుంచి నగరానికి మరలివచ్చారు. అప్పుడా బాలకుడు స్థిరసంకల్పుడై తపశ్చర్యకు ఉపక్రమించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని
'కార్తవీర్యచరిత్ర' అనే 72-వ అధ్యాయం.



73

# చతుర్థీవ్రత మహాత్మ్యం

(మూలం)

## త్రిసప్తతితమో అధ్యాయః

**ఇంద్ర ఉవాచ :**

గురూపదిష్టం తం మంత్రం జజాప నియమేన సః ।
ధ్యాయన్ గజాననం దేవం నిష్ఠామాస్థాయ నైష్ఠికీం ॥ 1

వాయుభక్షో నిరాహారో లోష్ట పాషాణ సన్నిభః ।
ఏవం ద్వాదశవర్షాణి వ్యతీతాని తపస్యతః ॥ 2

హస్తపాద విహీనస్య బాలకస్య మహాత్మనః ।
నిర్వాణం తస్యతద్దృష్ట్వా ద్వాదశాబ్దం గజాననః ॥ 3

తదాగమథాయదుత్తస్థౌ ప్రవాలమయమూర్తిగః ।
ఉవాచ సంముఖోభూత్వా నిష్ఠాభక్తింసుతోషితః ॥ 4

**గణేశ ఉవాచ :**

నిర్జనేస్మి స్వనే యస్మాత్సింహ వ్యాఘ్ర నిషేవితే ।
నికుంజ బహుళే తిష్ఠద్యతో ద్వాదశవార్షికం ॥ 5

అతస్తేహం వరం దాస్యే వృణు యత్తే మనోగతం ।
శృత్వా వాణీం తదుదితాం ఆస్థితో దేహ భావనాం । 6

కృతవీర్య సుతోనత్వా ప్రోవాచ ద్విరదాననం ।
శృణ్వత్సు సర్వమునిషు విమానస్థేషు భూరిశః । 7

**పుత్ర ఉవాచ :**

త్వత్పాదయుగళే దేవ భక్తిరవ్యభిచారిణీ ।
అస్తుమే సతతం నాన్యదుత్సాహో మే ప్రయాచితుం ॥ 8

తథాపి యాచే దేవేశ పిత్రోః సంతోష హేతవే ।
శరీరే చారుతాం దేహి సర్వసంతోష కారిణీం ॥ 9

**ఇంద్ర ఉవాచ :**

శృత్వా వాక్యం తదీయం తు మాయావీ స గజాననః
అణిమానం సమాస్థాయ వివేశోదర మాదరాత్ ॥ 10

తస్మిన్ప్రవిష్టే పుత్రోసౌ దివ్యదేహో భవన్నృప ।
సహస్ర భుజవాన్ జాతః కృతవీర్యాత్మజ స్తదా ॥ 11

ఋజు పాదద్వయ యుతః స్థితః పర్వత సన్నిభః ।
వవర్షుః పుష్పవర్షాణి దేవా దేవర్షయోపి చ ॥ 12

తుష్టువు స్తంచ దేవంచ గీతవాదిత్ర నిస్స్వనైః ।
జగర్జ కార్తవీర్యోసౌ సహస్ర భుజమండితః ॥ 13

తస్య శబ్దం సమాకర్ణ్య ఘన గర్జిత సన్నిభం ।
సమవర్తీ భృశం త్రస్తః పరేషాం గణానాకుతః ॥ 14

పృధివ్యాం సర్వరాజానః సమకంపంత తద్భయాత్ ।
అయం పంచశతం బాణాన్ సంగ్రామే మోచయేదితి ॥ 15

బ్రహ్మాదయస్తతో యానాదుత్తీర్యాథ తమబ్రువన్ ।
స్మరణా త్తవ దేవానాం ప్రాప్తిస్స్యాద్గతవస్తునః ॥ 16

హృదిస్థం సర్వలోకానా మామయం స్త్వంవినేష్యసి ।
యతస్సాక్షాద్విష్ణురూపః సహస్రార్జున సంజ్ఞయా ॥ 17

త్రిషు లోకేషు విఖ్యాతో యావత్కల్పం భవిష్యసి ।
సాధుత్రాణే నిరతః శరణాగత పాలకః ॥ 18

విజేతా సర్వశత్రూణాం పృధివీ మండలాధిపః ।
ఇతి నానావరాన్దత్వా పిదధుర్దేవతా గణాః ॥ 19

హస్త్యశ్వ నరయానాని ఛత్ర చామర దీపికాః ।
రధానుపాయయనాన్యన్యాన్యా జహ్రు రఖిలాన్నృపాః ॥ 20

తతః సంస్థాపయామాస మహాప్రాసాద మధ్యగాం ।
ప్రావాలీం గణనాధస్య మూర్తిం ద్విజపురస్సరః ॥ 21

ప్రవాళ గణపశ్చేతి తస్య నామ దధుర్ద్విజాః ।
దదౌగ్రామాన్ బ్రాహ్మణేభ్యః పూజాయై స్థాపితాశ్చయే ॥ 22

ప్రవాళ క్షేత్రమితి తత్ పప్రథే భువిసిద్ధిదం ।
తత్రశేషో ధరాంధర్తు మనుష్ఠానపరో భవత్ ॥ 23

ప్రాప తస్మాద్గణేశాత్తు వరాన్బహుతరానపి ।
ధరాధరణ సామర్థ్యం సర్వజ్ఞత్వం తథైవచ ॥ 24

మూర్ధ్నాం సహస్రం శ్రైష్ట్యంచ నవ నాగకులేష్వపి ।
అతిసంతుష్ట మనసా తేన యత్ స్థాపితం పురా ॥ 25

ధరణే ధరిత్యేవం ద్వితీయం నామపప్రథే ।
స్మరతాం శ్రుణ్వతాం చాపి సర్వకామ ఫలప్రదం ॥ 26

సంపూజ్య సర్వాన్ ద్విజపుంగవాంస్తాన్ రాజ్ఞశ్చ సర్వానను
పృచ్ఛ్యచైతాన్।
సహస్రబాహు ర్నగరం స్వకీయం ద్రష్టుం స్వమాతా
పిత రావధాగాత్ ॥ 27

జహర్షతుస్తౌ తం దృష్ట్వానగరం చ తథావిధం ।
దదతు ర్ద్విజముఖ్యేభ్యో నానాదానాని సర్వశః ॥ 28

**ఇంద్ర ఉవాచ :**

అభ్యధాయితు సంకష్టచతుర్థీ మహిమాద్భుతః ।
కృతవీర్య సుతాచ్ఛయం మృత్యులోకం గతశ్శుభః ॥ 29

అనుభూత స్సురగణైః చంద్రసేనాదిభి ర్న్పపైః ।
అతిపుణ్యయుతమశ్చాయం స్మరణాదపి సిద్ధిదః । 30

ఏతత్ప్రసాదాత్సంప్రాప్తా రావణేనా ఖిలజ్ఞతా ।
ఏతత్ప్రసాదా త్సంప్రాప్తం పురా రాజ్యంచ పాండవైః ॥ 31

ఏతద్ర్వతస్య యత్పుణ్యం హస్తే మేదీయతే యది ।
తదైవ తద్విమానంతు ప్రచలేదమరావతీం ॥ 32

క ఉవాచ :

ఇతి శక్రముఖాత్తస్య వ్రతస్య మహిమా శృతః ।
శూరసేనేన భూపేన స్వానందాబ్ధౌ నిమజ్జతా । 33

వందితే పాద కమలే శక్రస్య ప్రతిగర్వితా ।
తమువాచ తతః ప్రీతః శూరసేనో నృపోత్తమః । 34

శృత్వా కథాం దివ్యరూపం చతుర్థీ వ్రతసంభవాం ।

స ఉవాచ :

ఫలితం పూర్వపుణ్యం మే యేనా శ్రావీద్రుశం వ్రతం ॥ 35

నహ్యేతస్మా త్పుణ్యతరం త్రిషు లోకేషు కించన ।
ఇత్యుక్త్వా శక్రమారేభే వ్రతం కర్తుం స్వయం తతః ॥ 36

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే చతుర్థీవ్రత మహాత్మ్యం నామ త్రిసప్తతితమో అధ్యాయ ః**



# 73-వ అధ్యాయము

# చతుర్థీవ్రత మహాత్మ్యం-I

దేవేంద్రుడు ఆ తరువాతి కథాక్రమాన్ని శూరసేనుడితో యిలా చెప్ప సాగాడు : 'ఓ శూరసేనమహారాజా! అప్పుడు కార్యవీర్యుడు లోకగురువైన దత్తాత్రేయుడు ఉపదేశించిన రీతిలో నిరహారుడై, కేవలము వాయువును మాత్రం భక్షిస్తూ నిశ్చలమైన మనస్సుతో, తదేకదీక్షతో గజాననుని ధ్యానం చేస్తూ స్థాణువులానిలచి తపస్సు ఒనరించాడు.

ఆ ఘోరమైన తపస్సుకి అమిత ప్రసన్నుడైన గజాననుడు అతడు తపస్సుచేస్తున్న ప్రదేశానికి ఎదురుగాఉన్న తటాకములోనుండి ఆవిర్భ వించాడు. ఎఱ్ఱటి పగడపువర్ణములో ప్రత్యక్షమైన ఆ భక్తాభీష్టప్రదుడైన కరివదనుడు మేఘగంభీరస్వరముతో యిలా పలికాడు.

"ఓ బాలకా! కఠోరమైన నీ నియమనిష్టలకు సంతుష్టుడనైనాను. ఘోరమైన క్రూరమృగాలు విచ్చలవిడిగా చరించే ఈ ఘోరారణ్యంలో పన్నెండు సంవత్సరాలకాలం అఖండమైన తపోనిష్టనుపూని నన్ను అనన్య భక్తితో ధ్యానించావు! కనుక సంతుష్టుడనై నీకు వరములివ్వదలచి

వచ్చాను. నీ మనోభీష్టాన్ని తప్పక నెరవేర్చగలను. నీ మనోవాంఛితాన్ని కోరుకో!"

ఈ మాటలకు గాఢమైన ధ్యానసమాధిలో నిష్ఠుడైవున్న కార్తవీర్యుడు దేహభావాన్నిపొంది గజాననుని చరణకమలాలకు సాష్టాంగవందన మాచ రించి, సిద్ధసాధ్య దేవతాగణాలు తమతమ దివ్యవిమానాలలోంచి విను చుండగా యిలా పలికాడు.

"ఓ దేవా! మంగళప్రదములైన నీ పాదపద్మములయందు నిరూఢ మైన భక్తిని నాకనుగ్రహించు! నాకింకే యితర కోరికాలేదు! ఐనప్పటికీ నీ ఆదేశంమేరకు నా తలితండ్రుల సంతోషంకోసం ఒకటి కోరదలిచాను. అదేమిటంటే సర్వులకూ ఆహ్లాదం కలిగించేటటువంటి దేహసౌందర్యాన్ని నాకు అనుగ్రహించు!" అని వేడుకొనగా గజాననుడు తన మాయా విభవముచేత సూక్ష్మరూపాన్నిదాల్చి కార్తవీర్యుని ఉదరంలో ప్రవేశించాడు. ఏ క్షణాన్నైతే విఘ్నేశ్వరుడు కార్తవీర్యుని శరీరంలోకి ప్రవేశించాడో అప్పుడే ఆ బాలకుడు దివ్యదేహాన్ని దాల్చాడు. అతనికి వేయిబాహువులు సంప్రాప్త మైనాయి. చక్కటి పాదద్వయంకూడా అమరింది. పర్వతాకారుడై నిలచిన ఆ కార్తవీర్యునిపైన దేవతలు, దేవఋషులు పుష్పవర్షాన్ని కురిపించారు. గంధర్వులు తమ అద్భుతగానంతోనూ, అప్సరసలు తమ మంజుల నాట్యంతోనూ గజాననుని, కార్తవీర్యుడిని అలరించారు. సహస్రబాహువు లతో అనంతమైన బలసమన్వితుడైన కార్తవీర్యుడు దిక్కులన్నీ పిక్క టిల్లేలా సింహగర్జనం చేశాడు!

ఆ ధ్వనికి సమస్త దేశాల రాజులూ భీతిచెంది గడగడా వణికారు! ఒక్కసారిగా అయిదువందల బాణాలను యుద్ధభూమిలో సంధించి

వదలగల సామర్థ్యం అతడిని శత్రుదుర్భేద్యుడిగా, అపరాజితుడిగా చేసింది!

అప్పుడు బ్రహ్మాది దేవతలు తమ దివ్యవిమానాలనుంచి దిగి 'ఓయీ! కేవలం నిన్ను స్మరించినంతమాత్రాన్నే దేవతలకు నష్టవస్తుప్రాప్తి కల్గుతుంది! సర్వలోకాలలోని ప్రజల హృదయాలలోగల బాధను తొలగించగల సామర్థ్యం నీకు సంప్రాప్తిస్తుంది!

ఈ కల్పాంతంవరకూ మూడులోకాలలోనూ చిరకీర్తివై వర్ధిల్లగలవు! శరణువేడినవారికి అభయప్రదాతవై, శత్రువులకు సింహస్వప్నమువై అజరామరమైన ఘనకీర్తి గడించగలవు!'' అంటూ ఆతడిని దీవించి తమతమ లోకాలకు వెళ్ళిపోయారు!

అప్పుడు సమస్త దేశాల ప్రభువులు ఆతడిని చక్రవర్తిగా అంగీక రించి అనేక అమూల్య వస్తువులను కానుకలుగా సమర్పించారు. ఆ తరువాత కార్తవీర్యుడు ఒక మహాప్రాసాదాన్ని నిర్మించి, అక్కడ పగడపు వినాయకమూర్తిని స్థాపించి సకల బ్రాహ్మణలోకమూ వేదఘోషలు సల్పు తుండగా ఆ మూర్తికి 'ప్రవాళగణపతి' అన్న నామకరణంచేసి, ఆ కార్య క్రమంలో పాల్గొన్న విప్రోత్తములకు అనేక గ్రామాలను బహూకరించి వారి ఆశీర్వచనాన్ని పొందాడు.

ఆనాటినుంచి ఆ క్షేత్రము ప్రవాళక్షేత్రమన్న పేరుతో ప్రసిద్ధి చెందింది. ఈ క్షేత్రమున సలిపే తపశ్చర్య సకల సిద్ధులను ప్రసాదించ గలదు. ఈ క్షేత్రంలోనే సహస్రఫణుడైన ఆదిశేషుడు భూభారమును మ్రోయగల సామర్థ్యంకోసమని తపస్సుచేసి గణేశానుగ్రహంవల్ల అనేక వరాలను పొందాడు. అక్కడే సర్వజ్ఞత్వాన్నీ, వేయిశిరస్సులనూ, నవ

నాగులలో అధిక్యమునూ సర్పాలలో శ్రేష్టత్వాన్నీ పొందాడు

ఆ క్షేత్రములో తనకు లభించిన ఇష్టసిద్ధిచేత సంతుష్టుడైన శేషుడు కూడా ఒక గణేశమూర్తిని స్థాపించి ఆ మూర్తికి 'ధరణీధరుడు' అన్న నామం ఉంచాడు. ఈ ధరణీధరమూర్తిని స్మరించేవారికి సర్వకామ్య సిద్ధి కలుగుతుంది!

ఆ తరువాత కార్తవీర్యుడు తన సామంతులనందరిని రావించి, వారిని యధోచితంగా గౌరవించి బ్రాహ్మణులకు భూరిగా సమస్త దానాలనూచేసి అందరి ఆశీస్సులనూ పొంది తన తలిదండ్రులను దర్శించటానికై తన సహస్ర బాహువులతోనూ పురమునకు తరలివెళ్ళాడు! అతడిని చూచిన ఆతని తలిదండ్రులు, పురజనులు అమిత సంతోషం పొందారు. అప్పుడా కార్తవీర్యుడికి సకల బ్రాహ్మణాశీర్వచనం లభించింది!

అప్పుడు ఇంద్రుడిలా అన్నాడు "ఓ శూరసేనమహారాజా! సంకష్ట చతుర్థీవ్రతమహిమను నీకోరికమేరకు వర్ణించి చెప్పాను. ఈ వ్రతం కృతవీర్యునికి సంతానప్రాప్తి నిమిత్తమై ఈ భూలోకానికి తేబడింది. దీని ఫలితాన్ని ఇదివరలో దేవతాగణములు, చంద్రసేనుడు మొదలైన రాజులు అనుభవించారు. ఈ వ్రతం అతిపావనమైనది. కేవలం ఈ వ్రతాన్ని స్మరించినంతమాత్రాన్నే సకలసిద్ధులూ సంప్రాప్తమౌతాయి! ఈ వ్రతప్రభావంచేత రావణుడు సర్వమూ ఎరిగినవాడైనాడు. ఈ వ్రతం యొక్క ప్రభావంచేతనే పాండవులు తాము కోల్పోయిన రాజ్యాన్ని తిరిగి పొందారు!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండంలోని

**'చతుర్థీవ్రత మహాత్మ్యం' అనే 73-వ అధ్యాయం.**

74

# చతుర్థీవ్రత మహాత్మ్యం

(మూలం)

## చతుస్సప్తతితమో అధ్యాయః

**వ్యాస ఉవాచ :**

బ్రహ్మన్ కథం కృతం తేన శూరసేనేన భూభుజా ।
సేతిహాసం శక్రముఖాత్ కృత్వా సాదరముత్తమం ॥ 1

**బ్రహ్మోవాచ :**

తతః స్వదూతాన్ ప్రాహేదం గచ్ఛంతు నగరంప్రతి ।
స ఆనేయస్తు సంకష్టచతుర్థీ వ్రతకారకః ॥ 2

తేదూతా స్త్వరయా యాతాః పప్రచ్ఛుస్తే గృహం గృహం ।
దదృశు ర్భ్రమమాణాస్తే విమానం సుందరం శుభం ॥ 3

యా భవద్దుష్టచాండాలీ గలత్కుష్టా స్రవన్ముఖా ।
యక్షికా కృమిభారేణ దుర్గంధేన సమావృతా॥ 4

శుష్కోదరీ దీర్ఘకేశా శుష్కదంతాక్షి నాసికా ।
అత్యంత మలినా దీర్ఘా శ్రోత్రరంధ్రా ఘనస్వనా ॥ 5

నేతుంతామే దృశైర్దూతై రానీతాం గణపస్యహి ।
అత్యాశ్చర్యమిదమితి రాజ దూతాః ప్రణమ్యతాం ॥ 6

ఊచుస్తే దేవదూతాం స్తాన్ గణనాధస్య కింకరాన్ ।
అత్యంతం కుత్సితా జాత్యాహీనేయం స్వర్గగా కథం ॥ 7

కేయమాసీ త్పురాదూతాః కథమీదృ కృభూవచ ।
కేన పుణ్యేన యుష్మాభిః స్వర్గంతు నీయతే కథం ॥ 8

ఏతద్వదంతు సర్వం నో యది వక్తుం క్షమం భవేత్।

**దేవదూతా ఊచుః :**

ఆసీ ద్వంగాలవిషయే సారంగధర నామతః ।
క్షత్రియస్తస్య కన్యేయం సుందరా నామ సుందరీ ॥ 9

పికకంతా శశిముఖీ రతిలావణ్య జిత్వరా ॥ 10

యద్వాస్య కరణే నార్యాః ప్రసిద్ధా అష్టనాయికాః ।
యోగినామపి యాచేతః కటాక్షేణ విమోహయేత్ । 11

యువానో ముముచుః శుక్రం కేచిత్తద్రూప వీక్షణాత్ ।
జారమార్గేషు నిరతా సాభవ ద్విశ్వమోహినీ ॥ 12

మహార్హ వస్త్రాలంకారా నానా విషయభోగినీ ।
బంగాల నగరేఖ్యాతా వేశ్యేవాసీ ద్గతత్రపా ॥ 13

భర్తారం చిత్ర నామానం పంచయత్యేవ సర్వదా ।
వ్యయాదసంఖ్య ద్రవ్యస్య పిత్రా సంపాదితం పురా ॥ 14

కదా చిచ్ఛయనేతం సా హిత్వా సుందర వేషభృత్ ।
నిశీథే చలితాతేన హస్తే ధారి రుషావశాత్ ॥ 15

ఉవాచ భర్త్సయం స్తాంచ చిత్రనామా పతిస్తదా ।
ధిక్త్వాం పాప సమాచారే యా జారే నిరతానిశం ॥ 16

తద్వాక్యమిద్ధమాకర్ణ్య శాంతకోపా భవత్తదా ।
అభక్ష్య భక్షణేనాసౌ మత్తా లవత్ భృశం ॥ 17

అంధే తమసి సంగృహ్య శస్త్రికాందక్షహస్తతః ।
తయా తదుదరం భిత్వా చిత్రనామ పతేస్తదా ॥ 18

గతా తం పురుషం రంతుం యో జారోమనసిస్థితః ।
యావత్సారమతే తత్ర తావత్పర్యం తవాసినా ॥ 20

జా గతాచరితం తస్యా జ్ఞాత్వా రాజ్ఞైనివేదితం ।
తద్దూతా స్తమసిస్థిత్వా తావత్సా గృహమాగతా ॥ 21

దధుస్తాం రాజదూతాస్తే నిన్యూ రాజసమీపతః ।
నిజఘ్నుస్తాం బహిరీత్వా దూతా రాజాజ్ఞయా తదా ॥ 22

సానీతా నరకే ఘోరే యమదూతై స్తదాజ్ఞయా ।
అధోముఖీ స్థితా తత్ర సందష్టా క్రిమిభిర్భృశం ॥ 23

అత్యంతం బుభుజే దుఃఖం స్మరంతీ పూర్వచేష్టితం ।
కల్పాంతే మృత్యులోకే భూచ్చాండాలీ దుర్భగా భ్రుశం ॥ 24

ఏకదామదిరాం పీత్వా మత్తా సుప్తాదివైవసా ।
నిశాయాం ప్రథమేయామే ప్రబుద్ధా క్షుధితాభ్రుశం । 25

తదైవ భిక్షితుంయాతా గృహంసా వ్రతకారిణః ।
తేన అమస్మైదత్తం యత్తయా భుక్తం విధూదయే ॥ 26

గణేశేతి చజల్పంత్యాః స్వేచ్ఛయా దైవయోగతః ।
తదైవ గణనాథేన విమానం ప్రేషితం భ్రుశం ॥ 27

బ్రహ్మోవాచ :

దేవదూత వచశ్రుత్వా పునరూచు ర్నమస్యతే ।

రాజదూతా ఊచుః

ఇదమత్యద్భుతందృష్టం అస్మాభిర్కార్యకారిభిః ॥ 28

రాజ్ఞా యదుపదిష్టం గ్వేవాక్యమేతన్నిబోధత
శక్రో గృత్సమదం ద్రష్టుం విమాన వరమాస్థితః ॥ 29

భ్రుశుండిమాయయౌ దేవై ర్దృష్ట్వానత్వా ప్రపూజ్యతం ।
తదనుజ్ఞాం చ పూజాంచ గృహీత్వా స్వాంపురీం యయౌ ॥ 30

గచ్ఛత స్తస్యయానంత చ్ఛూరసేన పురే పతత్ ।
కుష్ఠినో వైశ్యపుత్రస్య దృష్టిపాతేన తత్క్షణాత్ ॥ 31

శూరసేనో గతస్తత్ర నమస్కృత్య ప్రపూజ్య తం ।
విమాన పతనే పృచ్ఛ దుపాయం గమనేపిచ ॥ 32

ఇంద్రేణోక్తం తు సంకష్టచతుర్థీ వ్రత సంభవాత్ ।
పుణ్యా తీప్రస్థాస్య తేయానం తదర్థే యత్నమాచర । 33

వయం తదాజ్ఞయాదూతాః తం గవేషితుమాగతాః ।
అనయాచేద్వ్రతమిదం దేవదుతాఃవృతం యది 34

తర్హీయం నయతాం శూరసేనం భూమిపతిం ప్రతి ।
శ్రేయోదాస్యతి ఛాండాలీ సంకష్టీవ్రత సంభవం ॥ 35

పునర్ద్విగుణ పుణ్యేయం విమానం ప్రతియాస్యతి ।
విమానమపి శక్రస్య స్వపురీ మాగమిష్యతి ॥ 36

యుష్మాకమస్యా అస్మాకం కార్యం రాజ్ఞఃశచీపతే ।
ఏవంకృతేతు భవితా క్రియతాం యది రోచతే ॥ 37

ఇతి తద్వచనం శృత్వాభిదధుర్దేవ సేవకాః ।
ఆజ్ఞానో నోగణేశ స్యాస్తీమాం దాతుం పరస్యహి ॥ 38

ఇత్యుక్త్వా తాం సముద్ధాయ విమానే నిదధుస్త్వరా ।
తదైవ సాదివ్యకాంతి ర్దివ్యవస్త్రాంగ భూషణా ॥ 39

దేవదూతైస్తు సానీతా దివ్యవాదిత్ర నిస్స్వనైః ।
గజానన సమీపేసా రాజదూతా యథాగతం ॥ 40

యయుస్తే శూరసేనం తం వృత్తాంతం సమనుబ్రువన్ ।
బ్రువత్సుత్రేషు తద్యానం చాండాల్యా సహసం వ్రజత్ ॥ 41

దదృశుస్తే దీప్యమానం భాసయంతీ ప్రదిశోదిశః
తస్యాష్టి ర్నిపతితా తస్మియ్యా నేశచేపతేః । 42

విమాన వాయుసంస్పర్శా ద్వీమానమూర్ధ్వమాయయౌ ।
పశ్యత్సు సర్వలోకేషు విస్మితేషు సవర్షిషు ॥ 42

స్వంస్వం స్థానం యయుస్సర్వే శక్రేయాతేऽమరావతీం ।
సాపి వైనాయకం ధామ సంప్రాప్తా దివ్యదేహభాక్ ॥ 43

పాపం హిత్వాతు సంకష్టచతుర్థీ వ్రతపుణ్యతః ।

ఇదం యశ్శృణుయాత్సమ్యక్ శ్రావయేద్వా ప్రయత్నతః ।
ప్రాప్నుయా త్సకలాన్కామాన్ సంకష్టనాశనం నరః ॥ 44

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే చతుర్థీవ్రత మహాత్మ్యం నామ చతుష్షష్టితమో అధ్యాయః**



# 74-వ అధ్యాయము

# చతుర్థీవ్రత మహాత్మ్యం-II

ఆ విధంగా ఇంద్రుడు శూరసేనమహారాజుకు చతుర్థీవ్రత కథనాన్ని ఇతిహాసంతోపాటు వివరించాక ఎంతో శ్రద్ధతో ఆలకించిన ఆ శూర సేనుడు తన దూతలను పిలిచి యిలా ఆజ్ఞాపించాడు.

"ఓ దూతలారా! మీరు వెంటనే నగరంలోకి వెళ్ళి సంకష్టచతుర్థీ వ్రతాన్ని ఎవరైనా పుణ్యపురుషుడు ఆచరించివున్నట్లైతే ఆతడిని ఉన్న ఫళంగా మీవెంట తీసుకొనిరండి!"

ఈ మాటలు విన్న రాజదూతలు వెంటనే నగరిలోకి వెళ్ళి ప్రతి యింటికీ వెళ్ళి 'ఆ యింట్లో చతుర్థీవ్రతాన్ని ఆచరించినవారెవరైనా ఉన్నారా?' అంటూ ప్రశ్నించసాగారు. ఇలా తిరుగుతూన్న వారు ఒకచోట ఆగివున్న ఒక దివ్యవిమానాన్ని చూశారు. ఆయింట్లో ఒక దుష్టఛండాలస్త్రీ

కుష్టువ్యాధితో బాధపడుతూ, శరీరపు గాయాలనుండి రసి స్రవిస్తూండగా ఈగలు దోమలు ముసురుతూన్న కృశించిన దేహంతో ఉన్నది. ఆమెను తీసుకువెళ్ళడానికై ఒక దివ్యవిమానం వచ్చి ఆగింది. అందులోంచి గణేశదూతలు దిగుతూండగా, ఆ రాజభటులు వారినిలా ప్రశ్నించారు.

"ఓ దూతలారా! ఈమెను చూడటానికే ఏవగింపు కలిగేంత జుగుప్సాకరంగా ఉన్నది. పైగా ఛండాల కులములో పుట్టినట్టిదికూడాను! ఇంతటి పాపి స్వర్గములోకి ఎలా వెళ్ళగలదు? ఈమె ఇంతకు పూర్వ మెవరు? ఈ దుస్థితి ఈమెకెందువల్ల కల్గింది? ఈమె స్వర్గవాసానికి వెళ్ళడానికి ఏపుణ్యం కారణమైనది? ఈ వృత్తాంతాన్ని మాకు వివరించండి!" అంటూ ప్రశ్నించిన వారితో గణేశభటులు యిలా బదులిచ్చారు.

"ఓ రాజభటులారా! బంగాళాదేశంలో సారంగధరుడనే పేరుగల క్షత్రియ ప్రముఖుడుండేవాడు! ఈమె ఆతని కుమార్తె సుందరి అన్న నామధేయముగలది! మహాసౌందర్యంతో మహాతపస్వుల చిత్తాలను సైతం మోహింపచేయగల సామర్థ్యం గలది. జాణతనంలో దిట్ట! జారత్వంతో అందరినీ వివశులను చేస్తూ, యువకులను బ్రహ్మచర్యంనుంచి పతితులను చేస్తూ సంచరిస్తూండేది! విలువైన దుస్తులను ధరించి, సకలాలంకరణములను ధరించి విషయభోగములననుభవిస్తూ, సిగ్గూ లజ్జలను విడిచి వేశ్యవలె బంగాళానగరంలో సంచరించేది 'చిత్రుడు' అన్న యువకుడిని వివాహమాడినా విశృంఖలత్వంతో అతడినికూడా మోసగిస్తూ, ఆతడి ద్రవ్యాన్ని అంతటినీ కర్పూరంలా హారతిగా వెలిగించింది.

ఇలాఉండగా ఒకనాడు తనయింట భర్త శయనించిఉండగా, మంచంనుండి దిగి సకల అలంకారములు చేసుకొని తన విటునివద్దకు పోతూండగా భర్తకు మెలకువవచ్చి ఆమె చేయిపట్టి, కొట్టితిడుతూ

"ఓసి దౌర్భాగ్యురాలా! ఉచ్చనీచాలను వీడి కట్టుకున్నవాణ్ణి ఏమార్చి విటుడికై అంగలారుస్తున్నావే? నీపాపం పండకపోతుందా?" అంటూ మందలించాడు.

ఇలా అన్న భర్త వాక్యాలకు ఆమె పుండుపై కారం చల్లినట్లైంది, తాత్కాలికంలో కోపాన్ని దిగమ్రింగుకుని ఒక అర్ధరాత్రి సమయంలో పదునైన ఖడ్గం చేతబూని తన భర్తను దారుణంగా పొడిచివైచింది. ఆ తరువాత తన జారునితో రమింపటానికి పారిపోయింది. ఆమె అలా రమిస్తూండగా యిరుగుపొరుగులవారీ వృత్తాంతాన్నంతటినీ తెలుసుకొని ఆ దేశపు రాజువద్ద ఫిర్యాదుచేశారు! అప్పుడు ఆ రాజాజ్ఞ మేరకు రాజదూతలు పొంచి వుండి ఆమెను ఇంటికివెళ్ళే మార్గంలో పట్టుకొని బంధించి ఆమెను రాజసన్నిధికి ఈడ్చుకొనిపోయారు!

అప్పుడు రాజు ఆమెకు మరణశిక్ష విధించగా ఆ భటులామెను ఊరివెలుపలికి తీసుకువెళ్ళి మరణదండనను అమలుజరిపారు. శరీరం విడిచీ విడవగానే యమదూతలు ఆమెను ఈడ్చుకొని వెళ్ళి ఘోరనరకములను పొందింపచేశారు. ఆ నరకాలలో క్రిములచేత పీకబడుతూ తన దుష్కృత్యాలను గుర్తుచేసుకొని అధోముఖియై ఎంతగానో లజ్జ నొందుతూ మహావేదనల ననుభవించి, ఈ రకంగా కల్పాంతంవరకూ గడిపి చాండాలస్త్రీయై దుష్టమైన వ్యాధితో జన్మించింది. ఒకనాడామె

మద్యం పూర్తిగా సేవించి మతిభ్రమించగా రాత్రి ప్రథమయామంలో లేచి ఆకలి తీర్చుకోడానికై భిక్షాటన నిమిత్తం దైవవశాన ఒకానొక సంకష్ట చతుర్థీ వ్రతకారకుని ఇల్లు చేరుకున్నది! వారుపెట్టిన అన్నాన్ని చంద్రోదయ సమయంలో భుజించింది! గజాననుని నామాన్నికూడా మనసారా స్మరించింది. ఆ పుణ్యవిశేషంచేత తక్షణమే గజాననుని దూతలు విమానం కొనివచ్చారు. సంకష్టచతుర్థీవ్రత దివసాన్న చంద్రోదయ కాలంలో గజాననుని స్మరిస్తూ ప్రసాదాన్ని భుజించిన కారణంగా ఈమెకు ఇంతటి భాగ్యమబ్బింది!''

ఈ మాటలను వింటూన్న రాజభటులిలా అన్నారు : 'ఓ గణేశ దూతలారా! కార్యార్థులమై వెళ్తున్న మాకు యిది ఒక మహాద్భుతంగా తటస్థమైనది! మా రాజు చెప్పిన వాక్యాన్ని మీకు తెలియజేస్తాము ఆలకించండి.

'దేవతల రేడైన ఇంద్రుడు గృత్సమదుని దర్శించుకోగోరి, ఆ మార్గ మధ్యంలో భ్రుశుండిమహర్షి ఆశ్రమంలో ఆతడినికూడా దర్శించి ఆయన పూజను గ్రహించి అనుజ్ఞను బడసి, తిరుగుప్రయాణంలో అమరావతికి వెళుతూండగా ఈ శూరసేనపురంలోని ఒక వైశ్యుని దృష్టిసోకడంచేత ఆతడి విమానం నేలబడింది! ఆ విషయం విన్న శూరసేనుడు అక్కడికి వెళ్ళి ఇంద్రుని పూజించి, ఆతడి విమానం పతనమవడానికిగల కారణ మడిగాడు.

అప్పుడు ఇంద్రుడా కారణాన్ని సంగ్రహంగా అతడికి వివరించి, తిరిగి తన విమానం యధాప్రకారం నింగికెగరాలంటే అది కేవలం

సంకష్టచతుర్థీవ్రత సంభవమైన పుణ్యప్రభావం వల్లనే జరుగుతుందనీ, అటువంటి వారిని అన్వేషించమనీ పురికొల్పగా, మా రాజాజ్ఞను అనుస రించి అటువంటి వ్రతానుష్టానం చేసిన వ్యక్తికై వెదుకుతూ యిలా వచ్చాము. గనుక ఓ గణేశ దూతలారా! ఈమె గనుక ఆ సంకష్టచతుర్థీ వ్రతాన్ని అనుష్టించినట్లైతే ఈమెను మాతో మాప్రభువు శూరసేనులవారి సన్నిధికి తీసుకొనిరండి! ఈమె తన పుణ్యం ధారపోసి ఇంద్రుని విమానాన్ని తిరిగి మింటినంటేలా చేయగలదు! దేవతాధిపతియైన ఇంద్రుడు సకలురచే వందనీయుడవటంచేత ఇంద్రుని కార్యము నెరవేర టానికై మనముభయులమూ రాజాజ్ఞ పాటించవలసిందే! మీకు ఈమాట నచ్చితే ఆ ప్రకారం చేయండి!"

ఈ మాటలకు గణేశదూతలు యిలా బదులిచ్చారు : 'ఓ రాజ భటులారా! మాకు ఈమెనివ్వటానికి గణేశుని ఆజ్ఞ ఎంతమాత్రమూలేదు! అంటూ ఆ చండాలస్త్రీని విమానంపైకి ఎక్కించారు. అలా ఆదివ్య విమానాన్ని అధిరోహించటంతోనే ఆమెకు దివ్యదేహం సంప్రాప్తమైనది. దివ్యమైన శరీరపు కాంతితో శుభంగా దివ్యాలంకారాలను మేన ధరించి సుందర వస్త్రాలతో అలంకరించుకుని సమస్త వాద్యఘోషలతో దేవ దూతలు వెంటరాగా, గజాననుని సముఖానికి తీసుకుపోబడింది.

ఈ విషయాన్నంతటినీ రాజుకు భటులు విన్నవించగా, అతడు నాల్గుదిక్కులా కాంతిని ప్రసరింపచేస్తూన్న ఆ దివ్యవిమానాన్ని పరివార సమేతంగా దర్శించాడు. అలా దివ్యవిమానంలో వెడుతూన్న ఆ చాండాలి దృష్టి సోకడంచేత ఇంద్రుని విమానంకూడా నింగికెగసింది. ఈ దృశ్యాన్ని

చూస్తున్న సర్వులూ ఆశ్చర్యచకితులైయారు. ఇంద్రుడు తన నిజలోకానికి వెళ్ళిపోగానే అందరూ తమతమ నెలవులకు మరలివెళ్ళారు. ఆ చాండాలి కూడా దివ్యదేహాన్ని ధరించినదై వైనాయక ధామాన్ని చేరుకున్నది. సంకష్ట చతుర్థీవ్రత పుణ్యవిశేషంచేత ఆమెయొక్క సకల పాపాలూ పరిహరింప బడి గణేశ సామీప్యాన్ని పొందింది. ఈ ఉపాఖ్యానాన్ని ఎవరైతే భక్తిశ్రద్ధ **లతో పఠిస్తారో, వింటారో వారు సకల కష్టములనుండీ విడివడి తమ సకలాభీష్టములను పొందగలరు.**

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'చతుర్థీవ్రతమహాత్మ్యం'** అనే 74-వ అధ్యాయం.



75

# చతుర్థీవ్రత మహాత్మ్యం

(మూలం)

## పంచసప్తతితమో అధ్యాయః

**క ఉవాచ :**

శ్రుత్వా దృష్ట్వా శూరసేనో మహిమానం వ్రతోద్భవం ।
స్వయం కర్తుమనాః ప్రాహ వసిష్ఠం మునిపుంగవం ॥ 1

**రాజోవాచ :**

ముహూర్తం వద సంకష్టచతుర్థీ వ్రతహేతవే ।
వ్రతంకర్తు మిహేచ్ఛామి సద్యః ప్రత్యయకారకం ॥ 2

**వశిష్ఠ ఉవాచ :**

మాఘే కృష్ణే భౌమవారే కురుష్వ వ్రతముత్తమం ।
సర్వసిద్ధికరం సర్వకామదం రాజసత్తమ ॥ 3

బ్రహ్మోవాచ :

రాజా సంభ్రుత సంభారః సపత్నీకో అతిభక్తితః ।
పూజయిత్వా వశిష్ఠం సతతోనుజ్ఞాం సమాప్యచ ॥ 4

గణేశే మన అధాయ తన్నామ జపతత్పరః ।
ఏకాంగుష్ఠ స్థితస్తావ ద్యావదస్తమియా ద్రవిః ॥ 5

పునః స్నానం చకారాశు సాయంసంధ్యా ముపాస్య చ ।
ప్రారభత్పూజనం సమ్యగ్వశిష్ఠేన సమన్వితః ॥ 6

మహామంటపికాం కృత్వా కదలీ స్థంభ మండితం ।
నానాలంకార వస్త్రాఢ్యాం ఛత్రచామర శోభితాం ॥ 7

ఆదర్శ పంక్తిరచితాం పుష్పమాలా విభూషితాం ।
నానామణి ప్రభాయుక్తాం దీపమాలావిరాజితాం ॥ 8

తన్మధ్యే స్వర్ణకలశే స్థాపయిత్వా గజాననీం ।
సౌవర్ణీం ప్రతిమాం చారు సర్వావయవ సంయుతాం ॥ 9

నానాలంకార రుచిరాం నానారత్న విభూషితాం ।
పఠత్సు ద్విజముఖ్యేషు గాయత్సు గాయకేషుచ ॥ 10

నదత్సు సర్వతూర్యేషు నృత్యత్సు నర్తకేషుచ ।
వైదికైశ్చైవ పౌరాణైస్తాం మూర్తిం సమపూజయత్ ॥ 11

ఉపచారైష్షోడశభిః పంచామృత పురస్సరం ।
మోదకాపూప లడ్డూక పాయసాన్నం స శర్కరః ॥ 12

నానావ్యంజన శోభాఢ్యం పంచామృత సమన్వితం ।
నైవేద్యం పురతః స్థాప్య జలంచ చారుగంధయుక్ ॥ 13

సమర్పయామాస నృపో గజానన సుతుష్టయే ।
ఫలాని పూగ తాంబూలం దక్షిణాం రత్నకాంచనీం ॥ 14

దూర్వా నీరాజనం మంత్రపుష్పాంజలీ రనేకథా ।
తిథయే గణనాథాయ చంద్రాయార్ఘ్యం దదావథ ॥ 15

బ్రాహ్మణా న్పూజయామాస సాదరం చాప్యభూభుజత్ ।
ఆయుతంగా దదౌ తేభ్యో వస్త్రాలంకార దక్షిణాః ॥ 16

తతః సుహృద్బంధుయుతః స్వయంచ బుభుజే నృపః ।
రాత్రౌ జాగరణం చక్రే గీతవాద్య కథాదిభిః ॥ 17

ప్రభాతే విమలేస్నాత్వా పునః సంపూజ్య పూర్వవత్ ।
మూర్తిం తాం గణనాథస్య వశిష్ఠాయ సదక్షిణాం । 18

సోపస్కరాం దదౌ రాజా తతస్తుష్టో గజాననః ।
విమానం ప్రేషయామాస సర్వ సంపద్విరాజితం ॥ 19

తద్వారైస్థాపితస్తత్ర గజానన స్వరూపవాన్ ।
పశ్యతాం సర్వలోకానాం మన ఆనందయన్ ముహుః ॥ 20

చలితో దేవలోకాయ రాజ్ఞః పుణ్యప్రభావతః ।
తమూచుర్దేవదూతాస్తే గజానన స్వరూపిణః । 21

నానాలంకార శోభాఢ్యా మకుటాక్రాంతమస్తకాః ।
వినాయకేన తుష్టేన విమానం ప్రేషితంతవ ॥ 22

త్వద్దర్శనౌత్సుక్యవతా తతో వయముపాగతాః ।
ఇతి తద్వచనం శృత్వా ముమోచాశ్రూణి భూమిపః ॥ 23

జగాద గద్గదగిరా రోమాంచాంచిత విగ్రహః ।
తానువాచ తతోరాజా శూరసేనః స్మయన్నివ ॥ 24

అవ్యక్తస్యాప్రమేయస్య నిత్యస్య జగదీశితుః ।
వాఙ్మనోఽగోచరస్యాపి నహేతు ర్మమదర్శనే ॥ 25

న సమర్థాశ్చయంవేదాః శాస్త్రాణిచ నిరూపితుం ।
యంచ స్మరంతి సతతం కేశవాద్యా దేవతా గణాః ॥ 26

తేనాహం చేత్త్స్మృతోదూతా తర్హి భాగ్యం మహన్మమ ।
ఇత్యాకర్ణ్యతు తద్వాక్యం దూతా ఊచుఃపునర్నృపం ॥ 27

నజానీమో వయంరాజన్ భక్తానాం మహిమా కథం ।
నిర్గుణం యన్నిరాకారం యేన సాకారతా మియాత్ ॥ 28

రాజోవాచ :

ఏకా మేమహతీ వాంఛా తుష్టేదేవే భవత్సుచ ।
తుష్టేషు నగరీం హిత్వా కథంయాయాం గజానన ॥ 29

న భక్షితం వినాప్యేతై ర్మయా హాలాహలం క్వచిత్ ।
సకథం పరమానందం భోక్ష్యఏతై ర్వినానఘాః ॥ 30

పునరూచుశ్చ తం దూతాః స్త్వదిచ్ఛా పరిపూర్యతాం ।
నచే ద్గజాననఃక్రోధా త్తాడయిష్యతి నోఖిలాన్ ॥ 31

బ్రహ్మోవాచ :

తతఃసర్వజనం నేతుం విమానే నిదధుఃక్షణాత్ ।
చతురా కరజా బ్రహ్మన్ న్నిక్షిప్తాః సర్వజంతవః ॥ 32

సర్వే దివ్యాంబరా దివ్యవస్త్రాలంకార శోభినః ।
ఊచుః పరస్పరం సర్వే కిమేతదద్భుతం మహత్ ॥ 33

అస్మాభిర్నకృతం పుణ్యంవిమానం కథమీదృశం ।
అపరేచాబ్రువంస్తత్ర రాజపుణ్యా బలాదితం ॥ 34

యధా నిధి బలాద్ధాతుమాత్రస్య హాటకం భవేత్ ।
అతి పాపో యధాసాధు వచసా సిద్ధిమాప్నుయాత్ ॥ 35

తథైవ రాజపుణ్యేన వయంసర్వే సముద్ధృతాః ।
తతోవై నాయకా దూతా గతిమూర్ధ్వామకల్పయత్ ॥ 36

జడీభూతం విమానం తన్నోదతి స్థన్మహీతలాత్ ।
తతః సంశయితం సర్వం కథమేతద్దివం వ్రజేత్ ॥ 37

ఊచుః పరస్పరం లోకాః నిర్దైవస్య నిధిఃకుతః ।
అరు రుక్షేత్కథం భిక్షాపాత్రం శక్యం మహత్తరం ॥ 38

దదృశుః సర్వతః కేచిత్ కుష్ఠీదృష్టిపథం గతః ।
ఉవాచ కశ్చిద్రాజానం కుష్ఠినం త్వమిమం త్యజ ॥ 39

అస్మిన్నధోగతే యానమూర్ధ్వమేత ద్గమిష్యతి ।
శూరసేన ఉవాచైతాన్ దూతాం స్తంత్యక్తుమిచ్ఛతః ॥ 40

అహం పాపసమాచార స్త్యాజ్యోనేయా ఇమేఖిలాః ।
అథవా కథ్యతామస్య పూర్వపాపంచ జన్మచ ॥ 41

మత్స్నేహాత్సర్వ మేత్రుత్వా దుపాయం కృపయాపిచ । 42

**దూతా ఊచుః :**

న కార్యా నృపతే చింతా వదిష్యామో వయంతవ ।
జన్మపాప ముపాయంచ కుష్ఠినో దుష్టకర్మచ ॥ 43

**ఇతి శ్రీగణేశపురాణే ఉపాసనాఖండే చతుర్థీవ్రత మహాత్మ్యం నామ పంచసప్తతితమో అధ్యాయః**



# 75-వ అధ్యాయము

# చతుర్థీవ్రత మహాత్మ్యం-III

"ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా సంకష్టచతుర్థీ వ్రతమహాత్మ్యాన్ని కన్నులారా గాంచిన శూరసేనమహారాజు ఆ తరువాత ఏంచేశాడో ఆ వృత్తాంతాన్ని యావత్తూ తెలియజేస్తాను విను!" అంటూ చెప్పసాగాడు చతుర్ముఖుడు.

కన్నులరమోడ్పులవగా భక్తివినమ్రభావాలు మదిని ముప్పిరిగొనగా శ్రద్ధగా ఆలకిస్తున్న కృష్ణద్వైపాయనుడితో చతుర్ముఖుడిలా కథనాన్ని కొనసాగించాడు. "ఈ వ్రతవైభవాన్నీ, మహిమనూ కళ్ళారా చూసిన ఆ శూరసేనమహారాజు వశిష్ఠమహామునిని యిలా ప్రార్థించాడు.

"ఓ మహానుభావా! ఈ మంగళప్రదమైన సకలాభీష్టప్రదమూ, సకలారిష్ట నివారకమూయైన సంకష్టచతుర్థీవ్రతాన్ని అనుష్ఠించడానికి తగిన

ముహూర్తాన్ని నిర్ణయించండి! సద్యఃఫలితాన్నివ్వగల ఈ మహోత్కృష్ట వ్రతాన్ని ఆచరించాలని నిశ్చయించుకున్నాను! తమ అనుజ్ఞను ఆశీస్సులనూ అర్థిస్తున్నాను!" అంటూ చేతులుమోడ్చి ప్రార్థించిన శూరసేనుడితో చిరుదరహాసం మోమున విరియగా వశిష్టమహర్షి తన ప్రశాంత గంభీర స్వరంతో.

"ఓ శూరసేనా! మాఘమాసంలోని బహుళపక్షంలో మంగళవారం నాడువచ్చే చతుర్థీతిథి ఈ వ్రతానుష్ఠానానికి అత్యంత అనువైన సమయం! ఆ రోజున ఆచరించిన వ్రతం సర్వసిద్ధికరమూ సర్వకామ ప్రదమూను! అందుచేత ఆనాడు నీవీవ్రతాన్ని అనుష్ఠించు!" అంటూ శుభముహూర్తం నిర్ణయించగా ఆ శూరసేనుడు వ్రతాన్ని ఆచరించటానికి సంబారాలన్నీ సమకూర్చుకుని భార్యసమేతుడై, అత్యంత భక్తిశ్రద్ధలతో వశిష్టుని అనుజ్ఞను గైకొని సంకష్టచతుర్థీవ్రతాన్ని ఆచరించాడు.

ఆ తరువాత భక్తాభీష్టప్రదుడైన గణేశునియందు తన మనస్సును లగ్నంచేసి, తన ఎడమకాలి బొటనవ్రేలుపైన నిలచి గణేశుని దివ్య మంత్రాన్ని సూర్యాస్తమయమయ్యేంతవరకూ జపించాడు. ఆ సాయంత్రం తిరిగి స్నానసంధ్యానుష్టానములను నిర్వర్తించుకొని, పురోహితులు కూడిరాగా వ్రతాన్ని చేయనారంభించాడు.

ఒక దివ్యమైన మంటపాన్ని అరటిస్థంభాలతో అలంకరింపచేసి శుభ్రమైన వస్త్రాలంకారములతోనూ ఛత్రచామరాలతోనూ పుష్పమాలలతోనూ దీపమాలలతోనూ దానిని అలంకరింపచేసి, మణికాంతులతో విలసిల్లుతూన్న ఆ మంటపంలో సర్వకలశద్వయాన్ని ఉంచి, వాటిపై

సర్వావయవ సంపూర్ణమైన బంగారు గణేశ ప్రతిమను ఉంచి, ఆ ప్రతిమనుకూడా అలంకరించి బ్రాహ్మణుల స్వస్తివచనాలతోనూ, గాయకుల గాత్రంతోనూ మారుమ్రోగుతూండగా మంగళతూర్యారవములు మ్రోగుతూండగా, భోగంవారు నృత్యంచేస్తూండగా, వైదిక పౌరాణిక మంత్రాలతో ఆ మూర్తిని చక్కగా పూజించినాడు.

షోడశోపచారములు సమర్పించి, పంచామృతములనూ, గణేశునికి అత్యంత ప్రీతిపాత్రములైన మోదకములు (ఉండ్రాళ్ళు), అప్పాలు, లడ్లు, శర్కరతో కూడిన పాయసము, అనేకరకాల పచ్చళ్ళనూ నైవేద్యంగా ఆ దేవదేవునికి సమర్పించి, ఆచమనానికి చల్లటి పరిమళభరిత పానీయా లను, గజాననుని సంతుష్టికై ఫలతాంబూలాలనూ సమర్పించాడు. ఆ తరువాత సువర్ణ మంత్రపుష్పాన్నీ, దూర్వాంకురములనూ సమర్పించి, నీరాజనమిచ్చి, తిథికి, గజాననునికీ, చంద్రునికీ అర్ఘ్యప్రదానం చేశాడు.

బ్రాహ్మణభోజనాదికములు ముగిశాక వారిని శాస్త్రోక్తరీతిన సత్క రించి, అప్పుడు తానుకూడా భుజించాడు. బ్రాహ్మణులకు పదివేల గోవు లను దానమిచ్చి వస్త్రాలంకరణాదులతో తృప్తిపరచాడు. ఆ రాత్రి శేషకాలమంతా — నృత్యగీత వాద్యాదికములతో జాగరణసలిపాడు. ప్రాతఃకాలాన్నే స్నానసంధ్యాదుల అనంతరం గణేశుని మరలా పూజించి, ఆ మూర్తిని పరికరములన్నిటితోసహా వశిష్ఠమునికి వాయనముగా సమర్పించాడు.

అప్పుడు గజాననుడు సంతుష్టుడై తక్షణమే అతడికై దివ్య విమానాన్ని పంపించాడు. ఆ విమానాన్ని అధిరోహించిన శూరసేనుడు

వినాయకునితో సారూప్యాన్ని పొంది ప్రజలందరూ ఆనందంతో వీక్షి స్తూండగా తన పుణ్యప్రభావంచేత గణేశధామాన్ని చేరుకున్నాడు.

అక్కడికి చేరుకున్న శూరసేనుడితో ఆ గణేశదూతలిలా అన్నారు. ఓ రాజా! నీ భక్తిశ్రద్ధలకు సంతుష్టుడైన వినాయకుడు నిన్ను చూడగోరి వెంట తీసుకురమ్మని మమ్మల్ని పంపించాడు." ఈ మాటలకు రాజు విచలితుడై ఆనందబాష్పములు కన్నులువెంటరాలగా - గద్గద స్వరము తో యిలా అన్నాడు.

"ఓ దూతలారా! నిర్గుణ పరబ్రహ్మయూ, అవ్యక్తరూపుడు, అపరిచ్ఛి న్నుడు నిత్యుడు అవాఙ్మానస గోచరుండును ఐన ఆపరమాత్మునికి నా దర్శనంవల్ల కలిగే ప్రయోజనమేమిటి? వేదాలు సహితం ఎవరిని వర్ణించలేక మౌనం వహించాయో, సకల దేవతాగణములచే ఆరాధ్యుడైన ఆ దేవదేవుడైన ఆ గజాననునిచేత అనుగ్రహపూర్వకంగా నేను స్మరించ బడినట్లైతే - నా జన్మ ధన్యమైనది!" అంటూ పరవశించిపోయాడు.

"ఓ రాజా! భక్తియొక్క ప్రభావమెంతైనదీ, ఆ భక్తులయొక్క మహిమ లనూ వర్ణించడం మాతరంకాదు! ఆ భక్తియొక్క విశిష్టతవల్లనే నిర్గుణ నిరాకారుడైన పరమాత్మ సగుణత్వమును పొందాడు. అదంతా భక్తుల మహిమయే!" అన్న గణేశదూతలతో శూరసేనుడిలా అన్నాడు.

"ఓదూతలారా! ఆ గజాననుడూ, మీరు ఉభయులూ సంతుష్టు లైతే నాకో కోరికయున్నది. దాన్ని నెరవేర్చగోర్తాను. నా కన్నబిడ్డలపైకన్నా ప్రజలయందు నాకెంతో వాత్సల్యం! నేను లేకుండా నా ప్రజలు కనీసం భోజనంకూడా చేయరు! ప్రేమతో నేను హాలహలం భుజించమన్నా -

నామాట జవదాటక యిట్టే స్వీకరిస్తారు. అటువంటివారిని విడిచి నేను ఒక్కడినే స్వార్థపూరితుడినై ఆనందాన్నెలా పొందగలను?"

"ఓ శూరసేనమహారాజా! సరే, అయితే నీ అభీష్టప్రకారమే నీ వాంఛా పరిపూర్తిచేస్తాము! లేకపోతే మా ప్రభువు మాపై అగ్రహించ గలడు!" అంటూ "ఓ వ్యాసమునీంద్రా! ఆ గణేశదూతలు రాజుయొక్క అభీష్టంమేరకు ప్రజలందరినీకూడా విమానంపైకి ఎక్కించారు!

ఆ దివ్యవిమానం అధిరోహించగానే దాని దివ్య ప్రభావంచేత ప్రజలందరూ దివ్యమైన వస్త్రాలనూ, అలంకారాలనూ పొందారు! 'అహా! ఏమి మన భాగ్యం! ఇంతటి దివ్యానుగ్రహాన్ని పొందటానికి మనమేమి పుణ్యం చేసుకున్నామో! కాదుకాదు! ఇదంతా మన రాజుయొక్క పుణ్య విశేషమే! సాధువుల సాంగత్యం అతిదురాత్ములనైనా పునీతులను చేసినట్లు, పరశువేదిసోకిన ఇనుముకూడా బంగారంగా మారినట్లు, ఆతని రాజ్యంలో ఉన్న కారణంచేత, ఆ మహనీయుడి పుణ్యవిశేషంచేత మన అదృష్టం పండింది!' యిలా అనుకుంటూ ఉండగా గణేశదూతలచేత ఆ విమానం పైకెగిర్చేందుకై ప్రయత్నించారు. విమానం మాత్రం ఏమాత్రం భూమిపైనుంచి ఒక్క అంగుళం ఎత్తుకుకూడా లేవలేదు! అప్పుడు ఆ విమానం ఎక్కికూర్చున్న ప్రజలు అందుకు కారణమేమిటా? అని అన్వేషించగా అందులో ఒక కుష్టురోగి కనిపించాడు. ఆ ప్రజలు ఆ కుష్టురోగిని విమానంలోనుండి దింపివేయమనీ అలా చేస్తే నిరాటం కంగా ఆ దివ్యవిమానం పైకెగరగలదనీ రాజును అభ్యర్థించారు. దూతలుకూడా అలాగే అతడిని దింపివేయబోగా రాజు వారితో యిలా అన్నాడు :

"ఈ దీనుణ్ణి వదిలి మీతో స్వర్గలోకానికి రావడం నాకెంత మాత్రమూ అంగీకారయోగ్యం కాదు! అందుకని నన్ను వదిలి మిగతా ప్రజలందరినీ మీతో కొనిపొండి! అలా వీలుపడదంటే - ఈ కుష్టురోగి యొక్క పూర్వజన్మ కర్మవృత్తాంతాన్ని నాకు తెలిపి, అట్టి దుష్కర్మకు నివారణోపాయాన్నికూడా చెప్పండి!"

అప్పుడా గణేశదూతలు యిలా బదులుచెప్పారు : 'ఓ శూరసేన మహారాజా! నీవు విచారించకు! నీకు ఈ కుష్టురోగియొక్క పూర్వజన్మ కృతకర్మనూ ఆ పాపపరిహారానికి సరైన ఉపాయాన్నీ చెబుతాము!"

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'చతుర్థీవ్రతమహాత్మ్యం'** అనే 75-వ అధ్యాయం.



76

# చతుర్థీవ్రత మహాత్మ్యం

(మూలం)

## షట్సప్తతితమో అధ్యాయః

గౌడేతు విషయే గౌడనగరే భూత్పురా ద్విజః 1

తపస్వీ మానవాన్ప్రాజ్ఞో దేవబ్రాహ్మణ పూజకః ।
తస్యపుత్రోయ మజని జననీచాస్య శాకినీ । 2

తస్యపత్నీతు సావిత్రీ సావిత్రీవ పతివ్రతా ।
ఏకపుత్ర స్నేహవశా దలంకారై రలంకృతః ।

అత్యంత సుందరతరో రతిభర్తేవ శోభతే ।
తన్మాతాపితరౌ తస్య వియోగం నేచ్ఛతఃక్షణం ॥ 3

సతు యౌవ్వనమాపన్నో నిజభార్యాం విహాయతాం ।
పరదార రతోనిత్యం పరనిందా పరాయణః ॥ 4

అభవ త్పాపనిష్టశ్చ పితృవాక్యా వమర్ధనః ।
ఏకదా నగరే తస్మిన్వేశ్యా నరవి మోహిన్ ।  5

ఆగతా తద్గతమనాయచ్చక్రే సౌ శృణుష్వతత
స్వాలంకారా న్వేటికాయాం నిష్కాస్యాస్థాపయద్బలాత్ ॥  6

మాతా పిత్రోః సమక్షంచ పశ్చాచ్చౌర్య పునశ్చతాన్ ।
వేశ్యాయై ప్రతిపాద్యైతాం శ్చిక్రీడ సుభ్రుశం తయా ॥  7

హిత్వేంద్రియార్థాన్ సుగంధద్రవ్య సయుతం ।
తదేక నిష్టస్సంజాతో యోగీ బ్రహ్మపరో యథా ॥  8

కామాగ్ని విహ్వలశ్చా సీదతీవ మద్యబలాద్యథా ।
పితాతు ఖేదసంపన్నః క్షుత్తృభ్యాం పరివర్జితః ॥  9

విలోక క్షయామాస సుతం నగరే ప్రతిమందిరం ।
అలబ్ధ దర్శనస్తస్య శ్చాశోచ్చ్వాస పరాయణః ॥  10

నిశీథే స్వప్రియాంప్రాహ బుధం పుత్రో గతఃక్వను ।
వినాతేన వృథాగేహం వినా దీపం యథానిశీ ॥  11

వినా జలంయథావాపీ వినా పత్యం యథాబలా ।
కదాను దర్శనం తస్య భవితా ప్రాణ రక్షకం ॥  12

శాకిన్యువాచ :

క్షుధా తృషాపరిశ్రాంతా చింతాశోక సమన్వితా ।
తిష్ఠామి నాథనోజానే క్వగతః ప్రియబాలకః ॥ 13

యదిమే దర్శనంతస్య స్యాజ్జీవామి నచాన్యథా ।
పునశ్చచాల (దూరస) దూర్వ స్సయష్టమాదాయ ముష్టనా ॥ 14

యం యం పశ్యతి మార్గేస్మిం స్తంతం పృచ్ఛతి చాత్మజం ।
యదాశ్రాంతః క్షుధాక్రాంతస్తదా భ్రాంతశ్చ్య సౌభవత్ ॥ 15

అతివృద్ధో మహాభీమో నామ్నా భీమోంత్యవర్ణజః ।
సతేన పృష్టస్తనయం తేనాప్యుక్తం పరంస్ఫూటం ః 16

భీమ ఉవాచ :

వేశ్యాగృహే తే తనయో బుధోసౌ బుధస్సుఖం క్రీడతి కామసక్తః ।
కస్యాత్మజోవా జననీ పితావా వృథైవఖేదం కురుషే ద్విజేంద్ర ॥ 17

దూర్వా ఉవాచ :

కథం మమసుతో జాతో వేశ్యాయాం నిరతోబుధః ।

తస్యాగృహం జగామాశు దృష్టవాంస్తత్ర తంసుతం । 18
ఉన్మత్తం మదిరా రక్తనయనం మదవిహ్వలం ।

పితా దధారతం హస్తే రూషా శిక్షాపయత్సుతం ।
కథం మమకులే జాతో విధావంకో యథాధమః ॥ 19

తత్రకంటక వృక్షోయం పాషాణోవా మతోధికం ।
కథంన త్యజసే ప్రాణాన్ కింస్యాత్తే జీవితంఖల ॥ 20

బ్రహ్మోవాచ :

పితృవాక్యం సమాకర్ణ్య రోషావిష్టో బుధస్సుతః ।
తలప్రహారం తుండేస్య దత్తవాన్ పితురేవ సః ॥ 21

ఉక్తవాన్ క్రిమికీటాది సాధారణముఖేకథం ।
కృతవానసి మే విఘ్నం క్రీడాకాలే నరాధమ ॥ 22

అకస్మా త్కాకస్య శకృ త్పతితం మయివా కథం ।
పునర్లత్తాలప్రహారేణ ప్రాణాంస్తస్య గృహీతవాన్ ॥ 23

పిత్రా ప్రాణేషు త్యక్తేషు హరేశ్వరేతి సోవదత్ ।
ననంద ససుతః పాదే బధ్వాతం దూరతో క్షిపత్ ॥ 24

మధుపీత్వా పునారేమే వేశ్యయా సహ యథేచ్ఛకం ।
ప్రాతర్జగామ స్వగృహం దదర్శ జననీచ తం ॥ 25

ఆలిలింగ సుతం హర్షాత్ స్నేహస్నుత పయోధరా ।
బభాష క్వగతశ్చాసి క్వస్థితః కింకృతం త్వయా॥ 26

వదమే విస్తరాద్వత్స పితా తే దుఃఖితో భృశం ।
అహం చాపి నిరాహారా నిశ్చలా నిశిజాగ్రతీ ॥ 27

ప్రతీక్షమాణా వత్సత్వాం పిత్వాన్వేష్టుం గతశ్చిరాత్ ।
గచ్ఛత్వం పితరం ద్రష్టుం ఇత్యువాచ పునః పునః ॥ 28

తయాజ్ఞప్త మితిక్రోధా చ్ఛుష్కకాష్టేన తాంసుతః ।
తాడయామాస శిరసి పతితా సాధరాతతే ॥ 29

నిశ్చేతనాం పరిజ్ఞాయ బద్ధ్వాపాదే క్షిపద్బహిః ।
స్వయం వేశ్యాగృహం గత్వాచిక్రీడ భ్రుశహర్షితః ॥ 30

దదహంస్తే జనాస్సంతో దంపతీ స్వస్వకాష్ఠతః ।
నశాస్తి రాజదండ్యం తం బ్రాహ్మణత్వా ద్ద్విజాధమం ॥ 31

పునర్గృహాగతం తంతు పత్నీవాక్యం శనైర్జగౌ ।

సావిత్ర్యువాచ :

ప్రాణనాథ వదామ్యేకం తచ్ఛృణుష్వ మహామతే ॥ 32

అతిఖ్యాతేతి విదులే వర్ణే జన్మభవాదృశాం ।
ఆచారశ్చాన్యథా దుషత్యక్తవ్యః స వివేకతః ॥ 33

ఇహలోకే తు తత్కార్యం యేన సౌఖ్యం పరేభవేత్ ।
పూర్వేవయసి తత్కార్యం యేనశం వార్ధకే భవేత్ ॥ 34

అష్టమాసేషు తత్కుర్యాద్యేన వర్షాసు శంభవేత్ ।
దివసే కర్మ తత్కార్యం యేన రాత్రౌ సుఖం భవేత్ ॥ 35

పితుః ప్రియత్వాద్రాణాపి బ్రాహ్మణత్వాత్తమచ్ఛసౌ ।
సర్వావయవ సంపూర్ణాం సుందరా మనుసారిణీం ॥ 36

త్యక్త్వామాం ధర్మపత్నీం త్వం వేశ్యాయాం నిరతః కథం ।
లోకో నిందతి సర్వత్ర భయాత్వాం నవదత్యసౌ ॥ 37

సమాం జనః ప్రతిబ్రూతే పతిస్త్రేకేద్భృశశుభే ।
లజ్జయాధోముకీ ప్రాణాంస్త్యక్తు మీహే తద్రైవచ ॥ 38

యథేష్టంచే న్మయాసార్థం రమతేఽ హర్నిశం పతే ।
నకోపి కించిత్ బ్రూయాత్వాం దోషివాన భవేన్మహాన్ । 39

హితంచే త్కురుమద్వాక్యం త్యక్త్వా తాం స్వవివేకతః ।
అజ్ఞానాద్వా ప్రమాదాద్వా కృతం కర్మ త్యజేద్బుధః ॥ 40

ఇదం కృతం మమైవస్యాదిష్టం నైవ కృతం యది ।
అనిష్ట స్సర్వదామేస్యాత్తన్న కార్యం వినిశ్చయాత్ ॥ 41

అన్యథా కుర్వతః పుంసః ఇహలోకో నవాపరః ।
ఇతి స్త్రియావాక్య బాణైర్భుధో విద్ధోధమర్మసు ॥ 42

రోషావిష్టో మహాక్రూరో జగాద ప్రజ్వలన్నివ ।

**బుధ ఉవాచ :**

నిర్లజ్జే నిష్ఠురే ప్రౌఢే దుష్టే రుష్టే మయిస్ఫుటం । 43
గమిష్యతి గతిం తాం త్వం యథా తౌపితరౌ గతౌ ।

**సావిత్ర్యువాచ :**

యేన పిత్రోర్న్నమర్యాదా శిక్షిత్రోశ్చ స్వతంత్రయోః ॥ 44

రక్షితా తద్విపరీతాం నమాం త్రాతా కథం భవేత్ ।
భర్తృహస్తాన్మృతిః శ్రేయః పరత్రేహచ సత్ స్త్రియాః ॥ 45

**బ్రహ్మోవాచ :**

ఏవం బ్రువంత్యాం పత్న్యాం సధమ్మిల్లం సహసాగ్రహీత్ ।
కాష్ఠైర్లోష్ఠైర్ముష్టిభిశ్చ పాషాణై స్తామతాడయత్ ॥ 46

సా రామం భర్తృరూపేణ సస్మార పూర్వపుణ్యత ।
ప్రాణాం స్తత్యాజ సహసా భిన్నా మర్మసుతే నహ ॥ 47

స్వర్గం గత్వా దివ్యదేహా బుభుజే పరమం సుఖం ।
ఆకృష్య చరణేతాం స చిక్షేప దూరతో నిశి ॥ 48

నిరంకుశో హర్షయుతో రేమే వేశ్యాసమన్వితః ।
త్వదర్థం నాశితాస్సర్వే బుధస్తామితి సోఽబ్రవీత్ ॥ 49

తతో బహుగతే కాలే బుధోగాత్కాలభే ర్గృహం ।
తస్మిన్ స్నాతుం గతే దుష్టో భార్యాం తం స్యాగ్రహీత్కచే ॥ 50

అత్యంతం సుందరతరా మాలిలింగ చుచుంబచ ।
నిశ్శంకం శయనే నీత్వా మమర్ధ కుచమండలీం ॥ 51

రేమే తయా యథేష్టం స తతః సా తం శశాపహ ।

సులభోవాచ :

కథంనామ కృతం దుష్టం పితృభ్యా సులభేతి మే । 52

అహం తేసులభా జాతా దుష్టబుద్ధే నరాధమ ।
స్నాతుం గతేభర్తరిమే కాలభౌ మునిపుంగవే ॥ 53

బలాత్కారో మయికృతో దుష్టః కుష్ఠీ భవిష్యసి ।
జాన్మాంతరే తేనామాపి నగృహ్ణీయా జ్జనః క్వచిత్ ॥ 54

బ్రహ్మోవాచ :

తతో భీతో యయౌ వేశ్యా గృహమేవ బుధఃపునః
రేమే తయా సురాం పీత్వా నకించిదపి చింతయన్ ॥ 55

ఏవం దుష్టాని కర్మాణి వక్తవ్యాని కథం మయా ।
పుణ్యక్షయో భవేత్తస్య పరదోషం య ఈరయేత్ ॥ 56

సకాలా న్నిధనం ప్రాప్తో దూతైర్నీతో యమాలయం ।
యమే నోక్తం కిమానీతో నీయతాం నరకేష్వయం ॥ 57

యమవాక్యం సమాకర్ణ్య దూతా న్న్యస్తదైవతం ।
చిక్షిపు ర్నరకే తావద్యావదా భూత సంప్లవం ॥ 58

భుక్తభోగః సవైశ్యస్య గృహే జన్మసమాప్తవాన్ ।
ఋషిపత్న్యాః స శాపేన కుష్ఠీ జాతో భ్రుశం తదా ॥ 59

పితృహా మాతృమాస్త్రీహ మద్యపీ గురుతల్పగః ।
తస్య సంస్పర్శనాదేవ సచేలం స్నానమాచరేత్ ।  60

నామాప్యేతస్య నగ్రాహ్యం మహాదోషకరం యతః ।
ఏతాదృశోయం దుష్టాత్మా యదా త్యక్తఇత స్తదా ॥  61

విమానం యాస్యతే చోర్ధ్వం నూనంనాస్త్యత్ర సంశయః ॥  62

బ్రహ్మోవాచ :

శృత్వేద్ధం వచనం తేషాం దూతానాం భ్రుశకంపితః ॥  63

శూరసేన ఉవాచైతాన్న మయా జ్ఞాయిదుష్కృతం ॥
పునరుద్ధాయ రాజాసౌ ప్రణనామ భ్రుశాతురః ॥  64

ప్రాహ తాన్ దేవదూతాన్ సకృపాంకృత్వా వదంతు మే ।
ఉపాయమస్య దుష్టస్య సర్వదోషాపనుత్తయే ॥  65

దూతా ఊచుః :

ఉత్తిష్ఠోత్తిష్ఠ నృపతే బ్రూమో దోషాపనుత్తయే ।
ఉపాయం రాజశార్దూల శృణుష్వైకమనా భవ ॥  66

గణేశస్య భవేన్నామ యత్ఖ్యాతం చతురక్షరం ।
జపతత్కర్ణరంధ్రేస్య సర్వదోష క్షయోభవేత్ ॥  67

ఉదయే దిననాధస్యయధా సర్వేతమః క్షయః ।
నాన్యోప్యధికారోస్య యతో నామైవ జప్యతాం ॥  68

బ్రహ్మోవాచ :

శూరసేనో దూతవాక్యజ్జయ పూర్వం జజాప హ ।
త్రివారం వైశ్యకర్ణేతు నామ యత్ చతురక్షరం ॥ 69

గజాననేతి శృత్వైవ దివ్యదేహో భవచ్ఛసః ।
భాసయం స్తేజసాసర్వ మరుణో భువనం యథా ॥ 70

సధర్వపాపక్షయే జాతే నామశ్రవణ మాత్రతః ।
దీపయన్ సర్వదిగ్దేశాన్ విమానం చాధ్యరోహిత ॥ 71

తద్విమానం క్షణాద్దూతైః సర్వలోక సమన్వితం ।
నీతంవైనాయకంధామ విఘ్నరాజస్యశాసనాత్ ॥ 72

ఇతి సర్వం సమాఖ్యాతం యద్యత్పృష్టం త్వయానఘ ॥ 73

మహాపుణ్యంచ సంకష్ట చతుర్థీవ్రత ముత్తమం ।
ధర్మ్యం యశస్య మాయుష్యం శ్రవణా త్సర్వసిద్ధిదం ॥ 74

సర్వపీడా ప్రశమనం సర్వవిఘ్న వినాశనం ।
దూర్వా నామప్రభావశ్చ కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి ॥ 75

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే చతుర్థీవ్రత మహాత్మ్యం నామ షట్సప్తతితమో అధ్యాయః**



# 76-వ అధ్యాయము

# వ్యాధిగస్త వైశ్య పూర్వజన్మ వృత్తాంతం

ఓ రాజా! పూర్వజన్మలో ఈ వైశ్యుడు గౌడదేశములోని గౌడనగర నివాసియైన ఒక సద్బ్రాహ్మణుడి యింట జన్మించాడు. ఈతడి తల్లిపేరు శాకిని. ఈతడికి యుక్తవయస్సురాగానే సావిత్రి అనే సర్వాంగ సుందరు రాలైన కన్యనిచ్చి వివాహం కావించారు. ఒక్కగానొక్క పుత్రుడవటంచేత మిక్కిలి గారాబంతో పెంచి ఎంతో అపురూపంగా చూచుకునేవారు. క్షణ కాలమైనా యితడి వియోగం ఆ తలిదండ్రులకు అత్యంత దుస్సహంగా ఉండేది.

అమిత గారాబం ఫలితంగా పెడత్రోవపట్టిన బుద్ధితో యౌవనవతి యైన భార్యను యింటవిడిచి, జారత్వము, చోరత్వములను అలవర్చు

కున్నాడు. దుస్సావాస ఫలితంగా దారితప్పిన ఈతడు వేశ్యారతుడై రేయిం బవళ్ళు ఆమెతోటిదే లోకంగా గడుపుతూ ఉండేవాడు.

తన సమస్త అభరణాలనూ, విలువైన అనేక రత్నాలను రహస్యం గా ఆ వేశ్యకు సమర్పించి ఆమెతో రతిక్రీడలో మగ్నుడై సురాపానము చేస్తూ భ్రష్టుడై మైమరచి తిరుగుతూండేవాడు! అప్పుడీ పాతకుడి తల్లి దండ్రులు వీనిజాడ తెలియక మమతాపాశబద్ధులై నిద్రాహారాలను మాని వీడికై అన్వేషించసాగారు. కుమారుడు లేని ఆ యింటిలో ఉండలేక ఆ బ్రాహ్మణ దంపతులైన దూర్వుడు, శాకిని చేతిలో కఱ్ఱను తీసుకుని కొడుకుకై గాలిస్తూ బైలుదేరారు.

అలా దారినపోయే ప్రతివారినీ తమ కుమారుడి జాడ ఏమైనా ఎరుగుదురా? అని ప్రశ్నిస్తూ - తమ ఆకలిదప్పులకోర్చుకోలేక మధ్య మధ్య స్పృహను కోల్పోతూ, తిరిగి అంతలోనే తెప్పరిల్లి తమ కుమారుడికై అన్వేషణను కొనసాగించేవారు. ఇలా ఉండగా వారికి దారిలో భీముడు అనే అంత్యజుడు ఎదురై, వారికి తమ కుమారుని జాడ యిలా తెలిపాడు.

"మీ కుమారుడైన బుధుడు దురాచారియై, వేశ్యారతుడై, వేశ్యా గృహంలో ఉన్నాడు. సర్వమూ మరచి ఆనందాన్ని పొందగోరుతూన్న అతడినిగూర్చి మీరెందుకు దుఃఖించటం?"

ఈ మాటలు చెవిన పడటంతోనే ఆ దూర్వుడనే బ్రాహ్మణునికి నెత్తిన పిడుగుబడినట్లైంది. ఉండబట్టుకోలేక తీవ్రమైన ఆవేదనతో ఆ వేశ్యయొక్క ఇంటికివెళ్ళి అక్కడ మదవిహ్వాలుడై, సురాపానమత్తుడైన

తన కుమారుణ్ణి కనుగొన్నాడు. ఆవేశం ముప్పిరికొనగా,

'ఓరీ! దుర్మార్గుడా! చంద్రునిలో మచ్చలా యిటువంటి దుష్టత్వం తో నీవు నా వంశంలో ఎలా జన్మించావురా? నీవల్ల కలిగిన ఈ కళంకం ఎలాపోతుంది నాకు? యిటువంటి పాపపు పనులు చేస్తూకూడా యింకా ఆ పాపఫలం పొందకుండా ఎలా తప్పించుకోగల్గుతున్నావు? నీకు చావైనా రాదే!" అంటూ ఆక్రోశించాడు.

"ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా తండ్రి మందలించగా రోషావేశ పరవశుడై, ఆ బుధుడు తన రతిక్రీడకు కలిగిన విఘ్నానికి క్రుద్ధుడై, రౌద్రావతారం దాల్చి, చేత దుడ్డుకఱ్ఱను పూని తండ్రి తలపై మోదాడు! అలా మరణించిన తండ్రి శవాన్ని దూరంగా కాలుపట్టి ఈడ్చి పొదలలో పారేసి తిరిగి మద్యంసేవించి మత్తెక్కి ఆ వేశ్యతోనే విహరించసాగాడు.

ఆ మర్నాడు తాను ఉండే యింటికి వెళ్ళి ప్రేమగా తన క్షేమ సమాచారాలడిగిన కన్నతల్లినికూడా దుడ్డుకఱ్ఱతోమోది, ఆమె నిశ్చేష్టురా లయ్యాక ఆమెనుకూడా కాలికి తాడుకట్టి దూరంగా పొదలలోకి ఈడ్చి వేశాడు. అప్పుడా ఊరివారు పూనుకొని ఆ బ్రాహ్మణదంపతులకు అంతిమసంస్కారాలను చేశారు! ఈ బుధుడు బ్రాహ్మణుడైన కారణంచేత రాజు వానిని శిక్షించకుండా - తీవ్రంగా మందలించి వదిలివేశాడు. ఆ దుష్టుడు అప్పటికీ తన ప్రవర్తనను మార్చుకొనక ఆ మరునాడు ఇంటికి చేరాడు. అతడి భార్య ఎంతో అణకువతోను ఆదరణతోనూ దరిచేరి ఇలా హితవుచెప్పింది.

"నాథా! చక్కటి సద్వంశంలోపుట్టి సకలశాస్త్రాలను అధ్యయనం

చేసినవాడవు! బహుదుర్లభమైన ఈ విప్రజన్మము ఎంతో పుణ్యఫలంగా గాని లభించదు! వివేకహీనుడైన మానవుడు పశువుకన్నా హీనం! యిక నైనా ఈ దుష్ప్రవర్తనను విడనాడి సన్మార్గవర్గనుడివిగా మెలుగు! సదాచారి యైన మనుజుడికి ఇహపరాలు రెండూ కరతలామలకములౌతాయి. యౌవనంలో కార్యశూరుడైనవాడు వృద్ధాప్యంలో ప్రశాంతంగా గడపగలడు. రాత్రి సుఖంగా గడవాలంటే పగలు శ్రమించినట్లు, వర్షాకాలం ఆనందం గా గడపాలంటే సంవత్సరంలో మిగతా ఎనిమిదినెలలూ కష్టపడాల్సి వచ్చినట్లే, వార్ధక్యం సుఖవంతంగా గడపగోరేవాడు. యౌవనాన్ని దుర్వినియోగం చేయకూడదు!

ధర్మబద్ధంగా వివాహమాడిన భార్యను, సర్వాంగసుందరినైన నేను ఇంటనుండగా, నన్ను విడచి వేశ్యారతుడవైనావని లోకులంతా నిన్ను నిందిస్తున్నారు! నీ భర్త ఇటువంటి దుష్టుడైనాడే! అంటూ లోకులు నిందిస్తూంటే సిగ్గుతో చితికిపోతున్నాను. నాతో నీవు అహర్నిశలూ రమించినా ఎవ్వరూ తప్పుపట్టరు! కనుక నీకు కీర్తికలిగేలాగా నాకు ప్రీతిపాత్రుడ వయ్యేలా – ఆ వేశ్యను పరిత్యజించు! ఇందుకు భిన్నంగా చరిస్తే ఇహపరాలకు నీవు దూరమవటమేకాక అసౌఖ్యానికీ లోకనిందకూ గురౌతావు!"

"ఓసి పాపాత్మురాలా! సిగ్గులేకుండా నాకే నీతులు చెప్పేటంతటి దానవైనావా! ఎంతకు తెగించావు? నా తలిదండ్రులకు పట్టించిన గతే నీకూ పట్టిస్తాను" అన్న ఆ బుధుడి మాటలకు ఆ సాధ్వి యిలా అన్నది : "నిన్ను సరిదిద్దపూనిన సర్వవిధాలా అర్హులైన తలిదండ్రులనే అవమానించిన నీవు నన్నుమాత్రం ఎలా రక్షిస్తావనుకుంటాను? నీచేతిలో

చావే రాసిపెట్టివుంటే అలాగేకానీ! - స్త్రీకి పునిస్త్రీగా భర్తచేతిలో మరణించటమే అనంతమైన పుణ్యాన్ని ఇహపరాల్ని ప్రసాదిస్తుంది!"

ఇలా అంటూన్న ఆ సావిత్రిమీదకు ఉగ్రుడై దూసుకువెళ్ళి, ఆమెను కొప్పుపట్టి బరబరా లాక్కొనివచ్చి, ఆమెను పిడిగుద్దులతోనూ కఱ్ఱతోనూ మోదగా ఆమెమాత్రం తన భర్తనే సాక్షాత్తూ శ్రీరామచంద్రుని రూపంగా భావిస్తూ ప్రాణంవిడిచింది! ఆ వెంటనే పార్థివశరీరాన్ని వీడి దివ్యమైన దేహాన్ని పొంది స్వర్గలోకానికి వెళ్ళిపోయింది!

ఆమె శవాన్నికూడా కాలుపట్టి పొదలలోకి ఈడ్చివేసి తిరిగి ఆ వేశ్యాగృహానికే వెళ్ళి అక్కడ ఆమెతో విషయలోలుడై గడపసాగాడు! అంతేకాక ఇంకా చాలాకాలం గడిచినతరువాత ఈ బుధుడియొక్క దుష్టత్వం శ్రుతిమించిరాగాన పడ్డదన్నట్లు కాలభుడనే ఋష్యాశ్రమంలోకి చొరబడి ఆయన నిత్యానుష్టానానికై నదీతీరానికి వెళ్ళిన సమయంలో ఆ మహర్షి భార్యను బలాత్కారంగా ఎత్తుకొచ్చి రమించాడు. ఆమె వివశురాలై తన నిస్సహాయతనూ క్రోధాన్నీ ఆక్రోశాన్నీ వెలిబుచ్చుతూ యిలా శపించింది. "ఓరీ దుర్మార్గుడా! నాభర్త యింటలేని సమయంలో అసహాయురాలై ఒంటరిగా ఉన్న నన్ను నికృష్టుడివై బలాత్కరించావు. గనుక జన్మాంతరంలో కుష్ఠురోగివై జన్మింతువుగాక" అంటూ మూర్ఛిల్లింది.

భీతుడైన బుధుడు తిరిగి వేశ్యాగృహంజొచ్చి ఆమెతోడిదే లోకమన్నట్లుగా మద్యంత్రావుతూ రమింపసాగాడు. ఓ రాజా! ఈరకంగా వాడు చేసిన అకృత్యాలెన్నో నేను నానోటితో చెప్పలేను. ఎందుకంటే

ఇతరుల దోషములను ఎంచినట్లయితే స్వపుణ్యక్షయమౌతుంది!

ఆ తరువాత కొంతకాలానికి బుధుడు అనే ఆ బ్రాహ్మణ యువకుడు మరణించాడు. అప్పుడతడిని యమదూతలు యమధర్మ రాజువద్దకు తీసుకువెళ్ళగా యముడు అతడికి నరకయాతనలను శిక్షగా విధించాడు. అప్పుడు యమదూతలు ఆ ఆజ్ఞానుసారం ప్రళయపర్యంతం నరకాలలో పడవేశారు. అలా నరకబాధల ననుభవించి ఇప్పుడీ వైశ్యజన్మ మెత్తాడు. ఋషిపత్నియొక్క శాపంవల్ల కుష్టురోగియైనాడు. వీడు మహాపాపి! చేసిన అకృత్యాలు లెక్కలేనన్ని. ఇట్టి మనుజుడిని స్పృశిస్తే సచేలస్నానం చేయాలి. ఇట్టివాడి పేరును స్మరించటంకూడా మహా పాపమే! గనుక వీడిని వెంటనే ఈ విమానంనుండి దించివేయి! అలా చేసిన తక్షణమే విమానం యధారీతిగా పైకి ఎగయగలదు. దీనికి ఎట్టి సంశయమూ లేదు!"

ఈ మాటలు విన్న శూరసేనుడు భయంతో విస్తుపోయి ఆ దూతలనిలా అభ్యర్థించాడు. "ఓ దూతలారా! నాపై దయఉంచి ఈ దుష్టునియొక్క సర్వదోష పరిహారానికీ ఉపాయాన్ని సెలవివ్వండి!" అప్పుడు ఆ గణేశదూతలు "ఓ రాజా! లెమ్ము! నీమాట తీసివేయ లేకున్నాము. వాడి పాపవిమోచనానికి ఒక్కటే మార్గాంతరం ఉంది. అదేమిటంటే గణేశునికిగల సుప్రసిద్ధమైన నాలుగక్షరాల నామాన్ని వాడి కర్ణరంధ్రములో జపిస్తే సూర్యోదయమవగానే అంధకారం నశించినట్లుగా సకల పాపములూ నశిస్తాయి! ఇంక వేరే ఏ ఉపాయం వలనా ప్రయోజనం శూన్యం సుమా!"

ఓ వ్యాసమహర్షీ! ఆ గణేశదూతల వాక్యాన్ని అనుసరించి 'గజానన' అనే నామమంత్రాన్ని జయశబ్దంతో కలిపి ఆ వైశ్యుని చెవిలో ముమ్మారు జపించాడు. ఆ మంత్రంయొక్క మహాప్రభావ విశేషంచేత ఆ కుష్టురోగియైన వైశ్యుడియొక్క దుష్కృతమంతా పటాపంచలై దివ్య దేహాన్ని ధరించాడు. దివ్యమైన శరీరకాంతితో అనూరుడు సూర్య రథసారథిగా భువనములనంతనూ ప్రకాశింపచేసినట్లుగా దిక్కులను ప్రకాశింపచేస్తూ గణేశుని దివ్యవిమానాన్ని తిరిగి అధిష్టించాడు. అప్పుడు ఆ గణేశదూతలచే ప్రేరేపించబడిన దివ్యవిమానం విఘ్నరాజుయొక్క ఆదేశానుసారం గణేశలోకానికి వెళ్ళింది! అంటూ బ్రహ్మ యిలాఅన్నాడు. "నీ సందేహాన్ని అంతటినీ నివృత్తిచేశాను. అంతే కాకుండా సంకష్టచతుర్థీ వ్రతమును గురించికూడా తెలిపాను. ఇది మహత్తరపుణ్యాన్ని ప్రసాదిస్తుంది! ఈ చరిత్రను వినటంవల్ల, చదవటం వల్ల ధర్మవృద్ధి, యశోవృద్ధి, ఆయుర్వృద్ధి కలుగుతాయి. సకలసిద్ధులూ సంప్రాప్తమవటంతోపాటూ సర్వవిఘ్నములు తొలగిపోయి సకలపీడలూ నశిస్తాయి!"

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని

'వైశ్యపూర్వజన్మ వృత్తాంతం' అనే 76-వ అధ్యాయం.



77

# చతుర్ధీవ్రత మహాత్మ్యం

(మూలం)

## సప్తసప్తతితమో అధ్యాయః

## కార్తవీర్య వధాదికం

**వ్యాస ఉవాచ :**

అన్యేనా కారికేనేదం వదతత్కౌతుకం మహత్ ॥

**బ్రహ్మోవాచ :**

జామదగ్న్యేన రామేణ వ్రతమేత త్పురాకృతం ।
సోపి కీర్తింజయంజ్ఞాన మాయుర్దీర్ఘంచ లబ్ధంవాన్ ॥ 1

**వ్యాస ఉవాచ :**

రామః కథం సముత్పన్నః కస్మాత్కస్యాం పితామహ ।
ఏతత్సర్వం సువిస్తార్యం బ్రూహి త్వం మమ పృచ్ఛతః । 2

బ్రహ్మోవాచ :

శ్వేతద్వీపే అతి విఖ్యాతో జమదగ్నిర్మహామునిః । 3

మనసా సృష్టి సంహారా న్నిగ్రహానుగ్రహానపి ।
యఃకరోతి త్రికాలజ్ఞ స్తతో దేవాశ్చకంపిరే ॥ 4

యస్యాసీ త్పత్న్యపి తథ్యా రేణుకా నామ నామతః ।
యస్యా లావణ్య గుంజాపి పత్న్యాః కామస్య నాభవత్ ॥ 5

రతి రిత్యేవ లోకేషు విఖ్యాతా అభూత్తతస్తు సా।
యయా సంమోహ్యితే సర్వం క్షమస్త ద్వర్ణనేతు కః ॥ 6

యన్నేత్రశోభా సంప్రాప్త్యై రాజలవాసినః ।
హరిణాశ్చ తపశ్చేరు ర్వనే ఛంద తృణాశినః ॥ 7

యదాస్యశోభా సంప్రాప్త్యై సేవతే చంద్ర ఈశ్వరం ।
అనాది నిధనా దేవీ మూలప్రకృతి రీశ్వరీ ॥ 8

తస్యా మజని రామోసౌ విష్ణర్యోగేశ్వరోయథా ।
జమదగ్నే ర్మహాభాగా త్సాక్షాదీశ్వర రూపిణః ॥ 9

అతిసుందరా గాత్రోసౌ సాక్షాన్మన్మథ మన్మథః ।
మాతా పితృ వచః కర్తా విఖ్యాత బలపౌరుషః ॥ 10

దేవ ద్విజగురు ప్రాజ్ఞో బోధిపూజనే రతః ।
వేద వేదాంగ శాస్త్రాణాం స్మృతీనా మపి పాఠకః ॥ 11

వాక్యే బృహస్పతి సమః క్షమయా పృధివీసమః ।
గాంభీర్యేబ్ధి సమోయస్తు పిత్రోర్వాక్యపరాయణః । 12

పిత్రోరాజ్ఞాం గృహిత్వా స నిమేషా రణ్యమాయయౌ ।
అనేక విద్యాభ్యసనే మతింకృత్వా పరాం స్థిరాం ॥ 13

తస్మిన్గతే తదా రాజా కార్తవీర్యో మహాబలః ।
యస్యవ్రతా పాదభవద్వశ్యం భూమండలం సదా ॥ 14

యస్మిన్ లక్ష్మీః స్థిరా విష్ణో రంశభూతే ఖిలార్థదే ।
ఆజౌ పంచశతం బాణాన్ సృజతే రిపుఘాతకాన్ । 15

ఇంద్రాది బృందసేవ్యో సౌ విఖ్యాత బలపౌరుషః
అసంఖ్యాతా గజాయస్య రథవాజి పదాతయః ॥ 16

యస్య నిర్గమనే సైన్యా శ్ఛాదయంతి మహీతలం ।
వర్షాకాలే యథామేఘా ధారాభిర్వ్యోమమండలం ॥ 17

యస్య కంబు స్వనంశృత్వా ద్విషోయాంతి దిశో దశ ।
యథా సింహరవం శృత్వా మత్తమాతంగ కోటయః ॥ 18

యథాతాలీ పంచశతం స్వేచ్ఛయా కురుతే నృప: ।
తదా సనాదం బ్రహ్మాండం కంపతే మునిసత్తమ ॥ 19

అసౌ యదృచ్ఛయా యత్ర చ్చతురంగ బలాన్వితః ।
నీలవస్త్ర ధరో నీలఛత్ర స్తాదృశ సైనికః । 20

వనాని సరితో దుర్గాన్ పర్వతాంశ్చ విలోడయన్ ।
నానా మృగగణాన్వీక్ష్య వినిఘ్నన్నపి కాంశ్చన ॥ 21

తత స్సహ్యాద్రి శిఖరే పశ్యదాశ్రమ ముత్తమం ।
యథా కైలాసశిఖరే గిరీశాలయ ముత్తమం ॥ 22

అపృచ్ఛ త్సేవకాన్ రాజా కస్యేద ముత్తమం స్థలం ॥ 23

**భృత్యు ఉవాచ :**

జమదగ్నిరితి ఖ్యాతః సాక్షాత్సూర్య ఇవాపరః ।
మునిరాస్తే మహాభాగ శాపానుగ్రహకారకః ॥ 24

యస్య దర్శనతః పాప కోటయో యాంతి సంక్షయం ।
ఇచ్ఛాచే త్తత్రగంతవ్యం దర్శనం తే భవిష్యతి ॥ 25

తవ ప్రసాదా త్వర్వేషా ముపకారో భవిష్యతి ॥

**బ్రహ్మోవాచ :**

ఇతి తద్వచనం శ్రుత్వా గమనాయోద్యతోనృపః ॥ 26

న్యషేధయత్సర్వబిలం శ్రేష్ఠానాదాయ తత్ క్షణాత్ ।
యయౌ తం మునిశార్దూలం జమదగ్నిం తపోనిధిం ॥ 27

దదర్శ తం కుశాసీనం జ్వలంత మివ పావకం ।
ప్రణనామస సాష్టాంగతే సర్వే సహయాయినః ॥ 28

నానా విశాల సాలసుకుంజ వృక్షావలీషు చ ।
నిషేదు స్సైనికాస్తేతు రాజా తస్థౌమునేః పురః ॥ 29

ఆసనే మునినా దిష్టే చతుర్భిః పరివారితః ।
నిషసాద తదా రాజా కృతవీర్యసుతో బలీ॥ 30

అపూజయత తాన్సర్వాన్ పాద్యార్ఘ్య నివరాదిభిః ।
స మునిః ప్రదదౌ గాశ్చ శిష్యైః సర్వానపూజయత్ ॥ 31

నానా సరోవర జలే నిర్మలే చారు శీతలే ।
అమజ్జంత తదా సర్వే సైనికాః మృగయార్దితాః ॥ 32

శృణ్వాన్ వేద నినాదాంశ్చ శాస్త్ర శబ్దాంశ్చ పుష్కలాన్ ।
అభితో వాదశబ్దాంశ్చ తచ్ఛిష్యైః సముదీరితాన్ ॥ 33

అబ్రవీ న్మునిముఖ్యం తం రాజా రాజీవలోచనః ।
అద్యమే పితరౌ ధన్యౌ జన్మజ్ఞానం తథా తపః ॥ 34

పుణ్యవృక్షో ద్యఫలితో యజ్ఞాతం తవదర్శనం ।
అద్యమే సంపదో ధన్యాః కులం ధన్యం యశోఽపి మే ॥ 35

పరబ్రహ్మేతి యత్ప్రోక్తం తదైవ త్వం న సంశయం ।
అతిథ్యం తవ దృష్ట్వైవం పరితుష్టం మనో మమ ॥ 36

ఇతి శృత్వాతు తద్బ్రాహ్మీం స్మయన్నివ ప్రసన్నధీః ।
కోసి కస్యాసి కింనామ కిం కార్యం తవ వర్తతే ॥ 37

ఇతి తం పరిపప్రచ్ఛ జానన్నపి మునిస్తదా ।

**రాజోవాచ :**

రాజ్ఞాం స్వకార్య కర్తౄణాం భవాదృశ నిరీక్షణాత్ ॥ 38
నాన్యత్ప్రయోజన మురుశ్రేయసాఽజని తత్స్ఫుటం ।

కృతవీర్యసుతో హంచ కార్తవీర్య ఇతి శృతః ॥ 39
అనుజ్ఞాతో గమిష్యామి తతోహం నగరం ప్రతి ।

**మునిరువాచ :**

మయాశ్రావి మహాకీర్తి స్తవ రాజన్యసత్తమ ॥ 40

ఆసీత్త్వద్దర్శనాకాంక్షా జాతా పుణ్యేన సత్ఫలా ।
దేహ ఆత్మా తపోజ్ఞాన మాశ్రమో మమ సాంప్రతం ॥ 41

అభూ త్త్వదాగమాద్రాజన్ సార్థకాః సర్వసంపదః ।
ఆకృత్వా భోజనం కించిత్ కథం త్వం గంతుమర్హసి ॥ 42

మమ శ్లాఘాభవేల్లోకే న్యూనం కిం తవవిద్యతే ।
కించిత్ భుక్త్వా వ్రజవిభో సనాథంకురు మాం ప్రభో ॥ 43

రాజోవాచ :

సత్యం భోజనకాలోస్తి భో క్తవ్యంచ తవాజ్ఞయా ।
అన్నాభావే శ్రోత్రియాణాం జలం యాచ్య పిబేదపి ॥ 44

తథాప్యేతా న్విహాయాహం సైనికాన్ గణనాతిగాన్ ।
జలం పాతుం నశక్నోమి కథ భోక్తుం సముత్సహే ॥ 45

జానేహం మనసాబ్రహ్మన్ నశక్తిః సర్వభోజనే ।
భవద్దర్శన మాత్రేణ కృతకృత్యో వ్రజే ధునా ॥ 46

మునిరువాచ :

చింతాం మాకురు రాజర్షే భోజయిష్యే ససైనికం ।
చతుర్విధేన చాన్నేన కిమసాధ్యం తపస్వినాం ॥ 47

గృహే తేవాహినీయాస్యాత్త్రామ ప్యాకారయప్రభో ॥
క్షణం విశ్రామ్యతాం తీరే నద్యో శ్చారుతరే శుభే ॥ 48

యావత్సిద్ధం భవేదన్నం పశ్చాద్రక్ష్యసి కౌతుకం ।

క ఉవాచ :

అంతః స విస్మయా విష్టో జగామ కృతవీర్యజః ॥ 49

వాక్య మాకర్ణ్యతు మునే ర్నదీతీరం సుశోభనం ।
మునిఃపత్నీం సమాహరాయ వృత్తాంతం తం జగాదతాం ॥ 50

ఆహూయ కామధేనుం తౌ పుపూజతుః క్షణేన తాం ।
ప్రార్థయామాసతురుభౌ లజ్జాంనౌరక్ష ధేనుకే ॥ 51

అసంఖ్యాత బలోరాజా భోజనాయ నిమంత్రితః ।
యథా రుచిభవేత్తస్య ససైన్యస్య భుజిశ్చుభే ॥ 52

తథాకురు క్షణేన త్వం నోచేత్సత్యం లయంవ్రజేత్ ।
అకీర్తిశ్చ భవేల్లోకే యథేచ్ఛసి తథాకురు ॥ 53

ఏవం సంప్రార్థితా తాభ్యాం కామధేను ర్మహోపురం ।
నిర్మాయ స్వప్రభావేన నానామందిర సుందరం ॥ 54

నానారత్నమయ స్తంభ శోభి నానా సభాగృహం ।
నానా పుష్ప లతాచారు వాటికా రామమండితం ॥ 55

నానాధ్వజ పతాకాఢ్యం నానా వాదిత్ర నిస్స్వనం ।
అష్టాపదానాం భాండానా నానా పంక్తి విరాజితం ॥ 56

చతుర్విధాన్న సంపన్నం నానా భోజనం పంక్తిమత్ ।
మహాతోరణ శోభాఢ్యం పరిఖా వలయాంకితం ॥ 56

అనేక దాసదాసీభి ర్విలసచ్చారు వేదికం ।
నివారయంతి లోకాంశ్చ యత్రతస్థితా నరాః ॥ 57

పురో గంతుంనచాజ్ఞాస్తి జమదగ్ని మునేరితి ।
పరివిష్టేషు పాత్రేషు సంఖ్యాతీతేషు సర్వతః ॥ 58

దీపప్రభా భానురేషు నానా వ్యంజన శాలిషు ।
సూప పాయస పక్వాన్న పంచామృత యుతేషుచ ॥ 59

స ఖాద్యలేహ్యచోష్యాది పేయ పంక్తి విరాజిషు ।

సాముద్ర పక్వనింబా మ్రామృత బిల్వాది శాలిషు
చంద్రైలా హింగు మారీచ క్వధికా పాత్రశాలిషు ॥ 60

సిద్ధేషు పాత్రేషు మునిస్తదా సావాకారయచ్ఛిష్యగణం తదానీం ।
శ్రీకామధేనోః పరిపూర్ణ తోషాద్భోక్తుం ససైన్యం కృతవీర్య పుత్రం॥ 61

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే చతుర్థీవ్రత మహాత్మ్యం నామ సప్తసప్తతితమో అధ్యాయః**



# 77-వ అధ్యాయము

# కార్తవీర్యోపాఖ్యానం-I

"ఓ వ్యాసమునీంద్రా! నీవు కోరినట్లుగా దూర్వామహాత్మ్యము, నామప్రభావము వివరించాను. నీవింకా ఏమి వినగోరుతున్నావో చెప్ప వలసింది" అన్న చతురాననుడి ప్రశ్నకు పరాశరనందనుడిలా అన్నాడు.

"ఓ పరమేష్టీ! సకల శుభకరమైన ఈ సంకష్ట చతుర్థీవ్రతాన్ని ఎవరు ఆచరించారు? ఏయే ఫలాలను పొందారు? దయతో ఆ విశేషాలన్నీ వర్ణించవలసింది!"

"గతంలో జమదగ్ని మహర్షి ప్రియసుతుడైన రాముడు ఈ వ్రతాన్ని ఆచరించి శత్రునిర్మూలనా సామర్థ్యాన్ని, విజయాన్ని 'జ్ఞానమును' దీర్ఘా యువునూ కూడా పొందాడు!" అనగానే

"ఓ చతురాననా! ఈ రాముడెవరు? ఎలా ఉద్భవించాడు? అతడి

తలిదండ్రులెవరు? అతని వృత్తాంతాన్నంతటినీ విస్తారంగా తెలుపవలసింది!" అంటూ కోరిన వ్యాసమునీంద్రునితో చతురాననుడిలా అన్నాడు.

"శ్వేతద్వీపంలో మహాతపశ్శాలియైన జమదగ్ని అనే ప్రఖ్యాతుడైన మహర్షి ఉండేవాడు. ఆయన కేవలం సంకల్పమాత్రంచేతనే సృష్టి స్థితి లయములు కావించగలిగినంతటి సమర్థుడు. నిగ్రహానుగ్రహ సమర్థుడూ త్రికాలవేదీను! అత్యద్భుత సౌందర్యరాశియైన రేణుకాదేవి అతడి ధర్మపత్ని. ఈ పుణ్యదంపతుల గర్భాన విష్ణ్వంశ సంభూతుడైనట్టి రాముడు జన్మించాడు.

రాముడుకూడా మన్మధుడిని తలదన్నేటంతటి సౌందర్యంతో, అమితమైన తపశ్శక్తితో 'మరోసూర్యుడా' అనేటంత ప్రకాశమానుడై దేవతలను, ద్విజులను గురువులను గో అశ్వర్థములను అమిత భక్తిశ్రద్ధలతో పూజించి ప్రణతులర్పించేవాడు. అతడు భాషిస్తూంటే దేవతాగురువైన బృహస్పతి స్ఫురించేవాడు. పితృవాక్యపాలనా తత్పరుడు. మిక్కిలి ఓర్పు కలిగి గాంభీర్యంతో ఉండేవాడు. ఇటువంటి సద్గుణసంపన్నుడైన రాముడు ఒకనాడు తండ్రియొక్క ఆజ్ఞానుసారం యజ్ఞకర్మకు సమిధలను సేకరించేందుకని అరణ్యానికి వెళ్ళాడు!

ఆ సమయంలో అమిత బలపరాక్రమోపేతుడు ఒక్కసారిగా అయిదువందల బాణములు విడువగలవాడు, అత్యంత బలపౌరుషాలతో ఇంద్రాది దిక్పాలకులచే సేవించబడుతున్నవాడూ, అపారమైన చతురంగబలోపేతుడూ, కేవలం తన శంఖధ్వనిచేతనే శత్రు సేనావార

ముల గుండెలవియచేసేవాడూ ఐన కార్తవీర్యుడు వేటకని అడవికి విచ్చేసి తనతో చతురంగబలాలు వెంటరాగా, నీలమైన వస్త్రాన్ని ధరించి నీలఛత్ర పతాకంతో శోభితుడై, సైనికులు వెంటరాగా వేటాడుతూ సహ్యాద్రిపైనున్న ఒకానొక ముని ఆశ్రమ సమీపానికి చేరుకున్నాడు. 'ఇది ఎవరి ఆశ్రమము?' అంటూ సేవకులను ప్రశ్నించగా

"ప్రభూ! మహాతపస్వి, అగ్రహానుగ్రహసమర్థుడూ యైనట్టి జమదగ్ని మునియొక్క దివ్యతపోభూమి యిది! కేవలం ఆ పుణ్యపురుషుని సందర్శించటం చేతనే సకలపాపములూ పటాపంచలైపోగలవు! నీవు తప్పక అతడి దర్శనం చేసుకోవలసింది! మహాత్ముల దర్శనంచేత నీవూ, నీవల్ల మేమూ ఉపకారం పొందగలము". అన్న దూతవాక్కులు విన్న కార్తవీర్యుడు తన అపార సేనావాహినిని అక్కడే విడిదిచేయించి కొద్దిమంది ముఖ్యులు వెంటరాగా ఆ జమదగ్నిముని ఆశ్రమంలోకి వెళ్ళాడు. అక్కడ దర్భాసనంపైన కూర్చుని ప్రజ్వరిల్లే అగ్నిలా ప్రకాశిస్తున్న మునిపుంగవుని చూచి తన సహచరులతో సాష్టాంగ దండప్రణామాలు ఆచరించాడు.

ఆ జమదగ్ని మహర్షి రాజుతో కూడావచ్చిన వారికి ఆదరంతో యధోచితరీతిన ఆతిధ్యమిచ్చి గౌరవించాడు. రాజుతోకూడా వచ్చిన పరివారమంతా, అక్కడి సరోవరంలోని నిర్మలజలాలలో స్నానంచేసి, సేదతీరి ఆ ఆశ్రమంలోనే మునియొక్క శిష్యులు చేసే వేదఘోషలను వింటూ, శాస్త్రచర్చలను సైతం శ్రద్ధగా ఆలకించారు. అప్పుడు ఆ రాజు మునియొక్క ఆతిధ్యానికీ సత్కారాలకూ సంతసించి యిలా అన్నాడు :

“ఓ మునిసత్తమా! తమ సందర్శనభాగ్యంచేత నేటికి నా తపో వృక్షము ఫలించింది! నా జన్మ, పూర్వీకులైన పితరులూ ధన్యమైనారు. శ్రుతులలో ఏదైతే పరబ్రహ్మమని చెప్పబడుతున్నదో ఆ మంగళకర స్వరూపమే తమది! నీయొక్క అతిథిసత్కారంచేత అత్యంత సంతుష్టుడ నైనాను!” అన్న రాజు మాటలకు ఆ మహర్షి చిరుదరహాసంచేస్తూ సర్వజ్ఞుడై వుండికూడా ప్రసన్నచిత్తంతో యిలా ప్రశ్నించాడు.

“ఓ రాజా! నీవెవరవు? ఎవరి కుమారుడవు? ఏంపని మీద యిటుగా వచ్చావు?” దానికి ఆరాజు యిలా బదులిచ్చాడు.

“ఓ మహాత్మా! నా పూర్వజన్మ పుణ్యపరిపాకంవల్ల మీ సందర్శన భాగ్యం నేడు మాకు కలిగింది! నేను కృతవీర్యుని పుత్రుడను. కార్తవీర్యు డన్న నామధేయం నాది! ఇక మాకు సెలవైతే నగరుకు తిరిగివెళ్ళ గలము!” అప్పుడా గౌతమముని

“ఓ రాజా! నీ ఖ్యాతిని నేనూ ఇదివరలో వినేవున్నాను! నిన్ను చూడాలన్న నా ఆకాంక్ష నాకూ ఎంతోకాలంగావున్నా అది నేటికి ఫలిం చింది! నీవు యిలా నా ఆశ్రమానికి విచ్చేయటంవల్ల నా దేహము, అంతరాత్మజ్ఞానము, ఆశ్రమము, సంపదలూ సర్వమూ సార్థకములైనాయి! అతిథివై వచ్చిన నీవు ఏమీ భుజింపకుండా ఎలా వెళ్ళగలవు? నీకిచట కొదవేమీలేదు! నీవంటి అతిలోక పరాక్రమవంతునికి ఆతిథ్యమిచ్చిన ఖ్యాతి నాకూ లోకంలో కలుగనియ్యి! కనుక కొంచెం తడవాగి భోజనం చేసివెళ్ళు!” అన్నాడు.

అప్పుడా కార్తవీర్యుడు “ఓమునివర్యా! ఇప్పుడు భోజనసమయం

కనుక తమ ఆజ్ఞమేరకు తప్పక భుజించగలను! శ్రోత్రీయులైన వారి యింట అన్నము లేకపోయినా జలాన్ని యాచించైనాసరే త్రాగమనికదా శాస్త్ర వచనం? అలా ఐనప్పటికీ నాతోకూడా వచ్చిన పరివారాన్నంతటినీ వదలి నేనొక్కణ్ణీ కేవలం నీళ్ళైనాసరే త్రాగ నిచ్చగించను. మా సిబ్బంది కందరికీ భోజనం పెట్టగల శక్తి తమకు లేదని నాకూ తెలుసు! కనుక నాకు సెలవిప్పిస్తే పోయివస్తాను!" అన్నాడు

"ఓ కార్తవీర్యమహారాజా! నేనెట్లా యింతమంది పరివారానికీ ఆతిధ్యమివ్వగలనా అన్న ఫందేహం నీకు వద్దు! ససైన్యంగా నాల్గువిధాల భక్షభోజ్యచోష్యలేహ్యాదులతో అందరికీ భోజనపు ఏర్పాటుచేస్తాను. తపస్సు వల్ల సాధించలేనిదేదీ లేదుకదా! కనుక నీవు నీ సందేహాన్నివీడి, వదలివచ్చిన సిబ్బందినందరినీ కూడా రప్పించు! ఈ సుందర నదీ తీరంలో క్షణకాలం విశ్రమించు. భోజన పదార్థములన్నీ సిద్ధమయ్యాక సంతోషంతో వాటిని వీక్షిద్దువు గాని!" అన్న జమదగ్నిముని వాక్యాలకు మనస్సులోనే ఆశ్చర్యపోతూ ఆ రాజు నదీతీరానికి వెళ్ళాడు.

అప్పుడా ముని తన పత్నిని పిలిచి ఈ వృత్తాంతాన్నంతా చెప్పాడు. ఆ యిరువురూ దేవలోకంలోని కామధేనువును స్మరించి, పూజించారు. 'ఓ ధేనుశ్రేష్టమా! మా ఆతిధ్యంలో ఎటువంటి కొరతా కలుగనీయక మా మానం కాపాడు. అసంఖ్యాకమైన పరివారమంతటితోనూ రాజును ఆతిధ్యానికి ఆహ్వానించాము. సైన్యసహితంగాఉన్న ఆ రాజుకు తృప్తి కలిగేలా, రుచ్యమైన సకల ఆహారపదార్థాలను శీఘ్రముగా సమకూర్చ వలసింది. లోకంలో సత్యం నిలిచేలా, నాకు అపకీర్తి కలుగకుండేలా,

అతిధులను ఆదరించకపోయిన అసంతృప్తి నాకు కలుగనీయక నా ప్రార్ధన నాలకించి నీకు తోచినట్లు చేయి!"

మునిదంపతుల ప్రార్ధనను ఆలకించిన కామధేనువు తన మహా ప్రభావంచేత క్షణకాలంలో రాజోచితమైన నగరును నిర్మించింది. రమ్యమైన, సుందర ఉద్యానవనాలతోనూ, రత్న ఖచిత దివ్యమందిరాలతో సర్వాంగసుందరంగా అలంకరించబడి రాజోచిత భోగాలన్నీ కలిగి, విశాలమైన భవంతులను, కొలువుతీరేందుకు అనువైన సభామంటపాలనూ కలిగిన ఆ భవంతి అనేకములైన ధ్వజములు, పతాకములతో శోభిల్లుతూ ఉంది. మంగళవాయిద్యాలు కర్ణపేయంగా వీనులవిందు చేస్తుండగా అతిధుల విందుకు తగిన భోజనపదార్ధాలన్నీ భోజనశాలలతోసహా అమర్చింది.

ఏర్పాట్లన్నీ సరిగ్గా ఉన్నాయని సంతృప్తిచెందిన జమదగ్నిముని కార్తవీర్యమహారాజును భోజనానికి పరివారసమేతంగా రావలసిందని కబురుపంపి సకల పదార్ధములను వడ్డింపచేశాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'కార్తవీర్యోపాఖ్యానం' అనే 77-వ అధ్యాయం.



78

# కార్తవీర్యోపాఖ్యానం

(మూలం)

## అష్టసప్తతితమో అధ్యాయః

**ఈ ఉవాచ :**

తతో మునిః శిష్యగణమువాచ త్వరయావ్రజ ।
ఆకారయితుం నృపతిం నదీతీర నివాసినం ॥ 1

తే శిష్యాస్తం నృపంగత్వా గృహ్యతత్ర్పణతిం పురా ।
దత్వాశీర్వచనం తస్మై మునే రాజ్ఞః తథాబ్రువన్ ॥ 2

చలరాజన్నవహితో భోజనాయ ససైనికః ।
పాత్రాణి పరినిష్ఠాని సంఖ్యాతీతాని షడ్రసైః ॥ 3

**ఈ ఉవాచ :**

తత ఉద్ధాయ రాజాసౌ సమాహూయ ససైనికాన్ ।
సుస్నాతః సర్వసైన్యేన కార్తవీర్యో నృపో యయౌ ॥ 4

ముని వేశ్మతతో పశ్య న్నదృష్టం నచవ శృతం ।
ఏతాదృశం త్రిలోకేషు కార్తవీర్యో నృపోయయౌ 5

స నిషిద్ధో వేత్రధరైః ముని సంకేత కాముకైః ।
తేనిషిద్ధాః శిష్యగణై స్తతోగా ద్భోజనాలయం ॥ 6

స్థిత్వామధ్యే పశ్యతిస్మ రాజాసౌ సంపదం మునేః ।
అమన్యత తదాస్వాంతే నేదృశీ శ్రీః హరౌ హరె ॥ 7

పాలకేఽపాలకే స్రష్టర్యపి బ్రహ్మాణి నేదృశీ తతోమునిః ।
పురోభూత్వా ప్రతిపాత్రే న్యవేశయత్ ॥ 8

రాజానుమతి మాజ్ఞాయ పంక్త్యౌ పంక్త్యౌ ససైనికాన్ ।
దాపయామాస త్రాణి యే బహిర్భోజినశ్చ తాన్ ॥ 9

ఉపవిష్టే సర్వేషు రాజాన ముపవేశయత్ ।
బుభుజుస్తే తదా వాద్యే వాదితే సర్వ ఏవహి ॥ 10

అదృష్ట పూర్వాణ్యన్నాని స్వాదుమూల ఫలాని చ ।
పరస్పరంచ పప్రచ్ఛుః కిమిదం కిమిదం త్వితి ॥ 11

ఆశ్చర్యం మేనిరే సర్వే యామేనేద్ధం కథంకృతం ।
యథేష్టం భుంజతే సర్వే తృప్తాశ్చాన్నాని తత్యజుః ॥ 12

తే ప్రక్షాళన పాత్రాణి ప్రతిపాత్రే న్యవేదయన్ ।
మునిశిష్యా జలంచాపి శలాకా అపిచారవః ॥ 13

గజాశ్వ వృష బృందేభ్యః శిష్యాః శేషాన్న మర్పయన్ ।
తతో అన్యస్మిన్ గృహే సర్వే విస్తీర్ణే కృతసంస్తరే ॥ 14

ఇక్షు ద్రాక్షామ్ర పనస దాడిమా నిబభక్షిరే ।
ఏలా లవంగ కర్పూర చూర్ణఖాదిర పూగకాన్ ॥ 15

జగృహుర్ముని దత్తాంస్తే నాగవల్లీ దళైర్యుతాన్ ।
తతో దదావలంకారాన్ వాసాంసిచ ముదా మునిః ॥ 16

తేభ్యో యథార్హం సర్వేభ్యో రాజ్ఞేనర్ఘ్యతరాణి చ ।

**మునిరువాచ :**

కిం మయా భోజనం దేయం మునినా వన్యవృత్తినా ॥ 17

అవాప్త సర్వకామాయ రాజ్ఞేణేతే విష్ణురూపిణే ।
యశోకారి త్రిలోకేమే త్వయా మద్వాక్యకారిణా ॥ 18

జమదగ్నేర్గృహే రాజ్ఞా ససైన్యేన భుజి కృతా ।
అతిపుణ్యవతో లోకే సాధుశబ్దః ప్రయుజ్యతే ॥ 19

మహాన్ క్షుద్రస్య వాక్యం చేత్ కురుతే సోఽపి సాధుతాం ।
ప్రాప్నోతి సర్వలోకేషు కీర్తిం స్థితాం సముత్కటాం ॥ 20

మద్వాక్య కరణేనేపి దూరే రిష్టంగతం మహత్ ।

బ్రహ్మోవాచ :

ఇతి వాణీం సమాకర్ణ్య జమదగ్ని సమీరితాం ॥ 21
పప్రచ్ఛ రాజా తం తత్ర విస్మయావిష్ట మానసః ।

రాజోవాచ :

నాదర్శి ప్రథమా కించిదిదం కిం మాయయా కృతం ॥ 22
తపఃప్రభావాద్వాకారి సత్యం మే వద సువ్రత ।

మునిరువాచ :

అనృతం నోక్తపూర్వం మే పరిహాసేపివా నృప ॥ 23
అతః సత్యం బ్రవీమిత్వాం కామధేన్వాఖిలం కృతం ।

బ్రహ్మోవాచ :

కుమతి స్తస్యభవతి యస్యదైవ మదక్షిణం । 24
అనిష్టం బలవద్భావి దుష్టగ్రహకృతం మునే ॥

భుక్త్వా తృప్తేపి రాజాసౌ సమ్యక్సబలవాహనః ।
ఆదానే కామధేనోః సమతిం చక్రే అబ్రవీదిదం ॥ 25

రాజోవాచ :

మునీనాం శాంతచిత్తానాం కందమూల ఫలాశినాం ॥ 26

మనసా సృష్టిసంహార కర్త్రూణాం అస్పృహా వతాం ।
జితేంద్రియాణాం విజ్ఞానాం నేక్షే ధేన్వా ప్రయోజనం ॥ 27

వన్య మారుత భక్ష్యాణాం మోక్షసాధన కారిణాం ।
వేదాభ్యాసన శీలానాం సంపదా కిం ప్రయోజనం ॥ 28

శాస్త్ర పాఠనశీలానాం ధర్మశాస్త్రార్థ వేదినాం ।
యోగాభ్యాసరతానాంచ కామధేనోః కిం ప్రయోజనం ॥ 29

కార్యాయ మహతేస్యాత్తు మహద్వస్తు మహద్గతం ।
అరణ్యవాసినే తుభ్యం మహద్రత్నంచ నోచితం 30

తస్మాద్దేయం కామధేను ర్మమ బ్రహ్మన్ముదా త్వయా ।
మయిస్థితా తవైవాస్తి చేతసి త్వితిధార్యతాం ॥ 31

మర్యాదాం రక్షతాం బ్రహ్మన్ న్నుక్తమేవం పురస్తవ ।
నోచేద్రాజ్ఞాం కిమగ్రాహ్యం లోకేషు బలశాలినాం ॥ 32

స్వరాష్ట్రే పర రాష్ట్రే వా చతురంగ బలైస్సహ ।

బ్రహ్మోవాచ :

శ్రుత్వైవం వచనం తస్య కార్తవీర్యస్య దుర్మతేః ॥ 33

ప్రతి జజ్వాల రోషేణ జమదగ్ని ర్మహామునిః ।
సర్పిషా బహుళేనైవ జాతవేదా యథాద్విజః ॥ 33

ఉవాచారక్త నయనః శిక్షయన్నివ భూమిపం ॥

**మునిరువాచ :**

సాధుః శుద్ధో మహాన్ రాజా ప్రార్థితో భోజనాయ హి । 34

కౌటిల్యంత వనజ్ఞాతం బకస్యేవ హృదిస్థితం ।
యధా దా కోకిలా కాకభా పుష్ణాతి మాయయా ॥ 35

అంతే తత్కాకభావేన భష్యా భక్ష్య రతిం వ్రజేత్ ।
అహమేవాభవం భ్రాంతో య ఇమాం రాజ మిత్రతాం ॥ 36

నదృష్టాం న శృతాం లోకే నానుభూతాంచకే నచిత్ ॥ 37

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే కార్తవీర్యోపాఖ్యానం నామ అష్టసప్తతితమో అధ్యాయః**



# 78-వ అధ్యాయము

# కార్తవీర్యోపాఖ్యానం-II

## జమదగ్ని - కార్తవీర్య సంవాదం

నదీతీరంలో విడిదిచేసిన పరివారాన్నంతటినీ ఆహ్వానించి, ఆ శిష్యులు జమదగ్ని చెప్పిన మాటలను ఆ రాజుతో యిలా విన్నవించారు.

"ఓ రాజా! ససైన్యంతో మీరు భోజనానికి విచ్చేసి, తమకు అన్ని విధాల తగినట్టి విందును ఆరగించగలరు!" అప్పుడు ఆ రాజు స్నాన పానాదులు పూర్తిచేసుకుని భోజనానికి సైనికులతోసహా బయలుదేరాడు.

అంతకు ముందెన్నడూ కనీవినీ ఎరగని రీతిలో నిర్మితమైన భవన సముదాయాన్ని చూసి చకితుడై, తన పరివారమంతటితోనూ ఆ భవంతి లోకి ప్రవేశించాడు. ఆ భవంతి మధ్యలోకి చేరుకొని ఆ వైభవాన్నిచూసి నిర్ఘాంతపోయి తనలో తానిలా అనుకున్నాడు.

'ఆహా! ఈ మునియొక్క అపూర్వవైభవం యింతకుముందెన్నడూ కనీవినీ ఎరుగను! హరిహరాదులకుగాని, సృష్టికర్తయైన బ్రహ్మదేవునికి గాని, లోకపాలకులకుకూడా ఇట్టి ఐశ్వర్యమూ, యిటువంటి సంపదా ఉన్నట్లు వినలేదే! ఒక తాపసికింతటి భోగమా?'

అనుకుంటూవుండగా ముని వారిని ఎదుర్కొని వారందరిని వారి వారి అర్హతలననుసరించి కూర్చుండచేసి, అంతటా మంగళతూర్యాలు మ్రోగుతుండగా వారందరినీ తృప్తులయ్యేలా భుజింపచేశాడు. ఆ పదార్థ ముల రుచి, సువాసనలు చూచేవారికి నోరూరేలాఉండి, సైనికులు తనివితీరా భుజిస్తూ 'ఒక్క యామమాత్రంలో ఈ ఏర్పాట్లన్నీ ముని ఒక్కడే ఎలా చేయగలిగాడా?' అని ఆశ్చర్యం చెందసాగారు.

భుక్తాయాసంతో భుజించినవారు తమ చేతులను కూడా ఆ ప్రక్కనే కడుగుకునే ఏర్పాట్లను - ప్రక్షాళనకై పాత్రలను సమకూర్చడం ద్వారా చేశారు ఆముని శిష్యులు.

ఇక పరివారంతోపాటూ విచ్చేసిన ఏనుగులు, అశ్వములు, వృష భములకు శేషాన్నము, గుగ్గిళ్ళుపెట్టి, వాటినీ తృప్తిపరచారు. అలా భోజనాదికములు ముగించి వారందరూ వేరొక భవంతిలోకి తీసుకు వెళ్ళబడ్డారు. అక్కడ చెఱకు, ద్రాక్ష, పనస, దాడిమ మొదలైన ఫలాలను భక్షించి, ఆ తరువాత మునిచే సమర్పించబడిన ఏలకులు, లవంగపువ్వు పచ్చకర్పూరంతోనూ మిశ్రితమైన తాంబూలాదులను సేవించారు. ఆ తరువాత జమదగ్నిముని అందరికీ నానావిధములైన అలంకారములనూ, నూతన వస్త్రాలనూ యిచ్చి గౌరవించాడు. ఆ రాజుకు కూడా ఎంతో

విలువైన వలువలను కానుకగా యిచ్చి ఘనంగా సత్కరించాడు. అప్పుడా ముని రాజుతో యిలా అన్నాడు.

'ఓ రాజా! 'నా విష్ణుః పృధివీపతి' అన్న సూక్తిప్రకారం విష్ణువు యొక్క అంశచేతనే రాజు పరిపాలన చేయగల్గుతున్నాడు. సకలమూ నీ పాదాల చెంతకు తమంతతామే వచ్చి చేరే నీకు, అడవిలో ఒకమూల తపస్సు చేసుకునే నేను ఏంభోజనం పెట్టగలను? ఐనా నామాటను తీసివేయకుండా వచ్చి నా ఆతిధ్యాన్ని అంగీకరించి నాకు తృప్తినీ, అజరామరమైన కీర్తినీ ఒన గూడేలా చేశావు! నీ ఈ మహోదారకార్యంచేత మూడులోకాలలోనూ నా కీర్తి వ్యాపించింది. నాకు నీవు కల్గించిన తృప్తికి ప్రతిగా నేటితో నీ సకల అరిష్టములు తొలగిపోతాయి!' అన్న జమదగ్ని మాటలకు కార్తవీర్యుడిలా అన్నాడు :

"ఓ మునివర్యా! నేనింతకు పూర్వం వచ్చినప్పుడు ఈ భవనాలు కాని, భోజనపదార్థాలుకాని ఏవీ కనబడలేదే? ఇవన్నీ నీ మాయవల్ల కల్పించావా ఏమి? లేక ఇదంతా నీ అమోఘమైన తపఃశ్శక్తి ప్రభావమా? నిజంచెప్పు!" అంటూ వేడగా

"ఓ రాజా! నేనెన్నడూ - చివరికి పరిహాసానికైనా సరే అసత్య మాడను! అందుకని నీవడిగావు గనుక సత్యమునే వచిస్తాను! ఇదంతా కామధేనువు యొక్క అనుగ్రహంవల్ల కల్పించబడింది!' అనిచెప్పాడు.

రాజు ససైన్యంగా భుజించి, తీరిన ఆకలిచేత తృప్తుడైనప్పటికీ - దురాశచెంది, ఆ కామధేనువును తనవెంట తీసుకొనిపోదలిచాడు. ఎవనిపట్ల దైవానికి దయాదాక్షిణ్యాలు కొరవడతాయో అట్టివానికే బుద్ధి

పెడత్రోవ పట్టడం  జరుగుతుంది! దుష్కర్మవైపు మనస్సు ప్రకోపింపబడి, అది భవిష్యత్తులో వాడికి అరిష్టాన్ని కొనితెస్తుంది. ఆ కార్తవీర్యునికికూడా ఆ సమయంలో అటువంటి దుర్బుద్ధే పొడమింది! అప్పుడాతడు శాంత చిత్తుడైన జమదగ్నితో యిలాఅన్నాడు.

"ఓ తాపసోత్తమా! సకల మనోవృత్తులూ ఉడిగి, కోరికలన్నీ నశిం చినవారు, కేవలం కందమూలాదులను భక్షించి కాలంగడిపేవారూ, నివృత్తిమార్గంలో మనోవాసనలన్నీ లయమై, కేవలం సంకల్పమాత్రం చేతనే సృష్టిని సంహరించగలిగినట్టి ప్రతిభాశాలురూ, ఇంద్రియాలన్నీ నిగ్రహించి విజ్ఞానగనులైన మీవంటివారికి కామధేనువుతో పనిఏమి? ఈ ఐశ్వర్యాలూ ఆడంబరాలు మీకు నిష్ప్రయోజనములూ, అవి రాజోచి తములూ! ఇట్టిది నావద్ద ఉంటే అనేక మహత్తర కార్యములకు ఉపక రిస్తుంది. ఇది శ్రేష్టమైన వస్తువు కాబట్టి శ్రేష్ఠుడనైన నావద్ద ఉండటమే ఉచితం! అరణ్యములో నివసించే నీవద్ద ఇటువంటి విలువైన మహ ద్రత్నము ఉండతగదు! కనుక ఓమునిశ్రేష్టా! నీవు సంతోషపూర్వకంగా ఈ ధేనువును నాకు సమర్పించుకో! నా దగ్గర ఉంటే నీవద్ద ఉన్నట్లే అని భావించి సరిపెట్టుకో. నా మాటను మన్నించి, నీ గౌరవాన్ని కాపాడుకో! లేదా అతులిత బలపరాక్రమ సంపన్నుడనైన నాకు అసాధ్య మేమున్నది?"

"నాయనా, సత్యవతీనందనా? ఈవిధంగా భయపెడుతున్నట్లుగా పలికిన ఆ మాటలకు జమదగ్నిముని ఆగ్రహోదగ్రుడై మండిపడుతూ కన్నుల్లో నిప్పులు కురవగా యిలాఅన్నాడు.

"ఓయీ! రాజా! నీవు సత్పురుషుడవని, పరిశుద్ధమనస్సు కలవాడ వన్న ఉద్దేశ్యంతో నిన్ను భోజనానికి అతిథిగా ఆహ్వానించాను. కొంగలా నీవు కపటివైనావు. నీమనస్సులోని కపటాన్ని గ్రహించలేకపోయాను!

ఈ లోకంలో కోకిల, కాకి రెండూ నల్లగానే కనబడతాయి! కోకిల తనపిల్లగా కాకిపిల్లను భావించి అమాయకంగా తన ఆహారాన్ని పెట్టి పోషిస్తుంది. ఐనా ఆ కాకికి జన్మనైజంవల్ల ఇది భక్ష్యము (తినదగినది) ఇది అభక్ష్యము (తినకూడనిది) అన్న విచక్షణ లేకుండా అన్నిటియందు ఆసక్తి కలిగినట్లుగా, నేనే నీవు సత్పురుషుడవన్న భ్రాంతితో నీవంటి రాజుతో స్నేహము గరపాను. ఇటువంటి దుర్బుద్ధిగల మిత్రుడిని ఎవ్వరూ కనీవినీ ఉండలేదు!" అంటూ పరుషంగా నిందించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'కార్తవీర్యోపాఖ్యానం' అనే 78-వ అధ్యాయం.



79

# కార్తవీర్యోపాఖ్యానం

(మూలం)

## ఏకోనాశీతితమో అధ్యాయః

**మునిరువాచ :**

ఉపకార స్వయారంభి సాదు వృత్యానుసారిణా ।
ఆత్మఘాతం పుర స్కృత్వా కామధేనుం త్వమిచ్ఛసి ॥ 1

భ్రాంతోసి నృప సత్యం త్వం అప్రాప్యం యోభివాంఛసి ।
త్రైలోక్య నాశజం పాపం తవ మూర్ధ్ని పతిష్యతి ॥ 2

**బ్రహ్మోవాచ :**

ఇతివాక్య శర విద్ధోసౌ ప్రళయానిల సన్నిభః ।
రాజా బభూవ రోషేణ ముఖా దనలముద్వమన్ ॥ 3

ఉవాచ పరమక్రుద్ధో జమదగ్నిం మునిం తదా ।

**రాజోవాచ :**

సమయం దుష్టవచనం కస్యాపి శ్రూయతే శఠ ॥ 4

కింకరోమి ద్విజోపిత్వం ఇతి క్లాంతం వచః కటు ।

**శ ఉవాచ :**

తత ఉద్ధాయ రాజాసౌ దూరానాజ్ఞాప్య సత్వరం 5

ముక్త్వా కీలాత్కామధేనుం శీఘ్రం యాంతు మమాంతికం ।

అవేష్టయం స్తదా దూతాః కామధేనుం తదాజ్ఞయా ॥ 6

పూత్కారేణైవ తస్యాస్తే త్యక్త్వా ప్రాణాన్ దివం యయుః ।

అన్యాన్ క్రోధాన తేనాసౌ రాజ దూతాన్ దదాహ చ ॥ 7

శ్వాస మారుత వేగేన వ్యోమ్ని వీరాః పరే భ్రమన్ ।

ఆచ్ఛేద్య మండలం భానోర్నప్రాజ్ఞాయత కించన ॥ 8

దిశః స తిమిరాజాతాః వ్యోమాపి నచ భాసతే ।

ధరా కంపః సమభవద్వృక్షాః పేతుః ప్రకంపితాః ॥ 9

సైనికాశ్చ తతో భీతాః యాంతి సర్వేదిశో దశ ।

కేన చిత్త్రాతాసౌగౌః కశాఘాతేన దూరతః ॥ 10

ఉడ్డీయోడ్డీయ సాధేనుః ధావత్సైన్య మేవతత్ ।

గజబృందం యథా సింహో గరుత్మానురగా ఇవ । 11

హాహాకారో మహానాసీ ద్వీరాణాం తత్ర ధావతాం ।
అనువాచనభిః కార్యా కార్తవీర్యో మహాబలీ ॥ 12

మయాద్మాతేముదాంశంఖే భీతాయాస్యతి మందిరం ।
కామధేనుః కియచ్ఛాస్తి పశ్యంతు కౌతుకం మమ ॥ 13

తతోధధ్మౌ మహాశంఖం త్రైలోక్యం పూరయన్నవైః ।
న బిభ్యత్కామధేనుస్తాం తాడయామాసు రోజసా ॥ 14

యష్టిభి ర్లోహనిచయైః సర్వేతే రాజసేవకాః ।
యత్ర యత్ర ప్రహారోస్యాః శరీరే జాయాతే తతః ॥ 15

సన్నద్ధా స్సర్వశస్త్రాఢ్యా నానా వీరా వినిస్సృతాః ।
శకాశ్చ బర్బరా అసన్ తస్యాః కేశసముద్భవాః ॥ 16

పటచ్చరాః పాదదేశా దేవం సర్వేప్రజజ్ఞిరే ।
నానా యవనజాతీయా నానావీరా స్తథాపరే ॥ 17

వాజి వారణ సంఘాశ్చ రథినో బలవత్తరాః ।
తేచైవ యుయుధు స్తత్ర కార్తవీర్యస్య సైనికైః ॥ 18

న్యపత న్కార్తవీర్యస్య సైనికాస్తైః ప్రహారితాః ।
అపరే మిలితాస్తత్ర నిశి వృక్షేపతంగ వత్ ॥ 19

పరస్పరా ఘాతహతా నిపేతుః శతశోనరాః।
భంక్త్వా శస్త్రైశ్చ శస్త్రాణి మల్లయుద్ధం ప్రచక్రిరే ॥ 20

ఏవం సుతుములే జన్యే శస్త్రౌఘ నిపతత్సుచ ।
స్వీయో వా పరకీయోవా నప్రాజ్ఞాయత కించన ॥ 21

రజసా చ్ఛాదితే సూర్యే జఘ్ను రేవం పరస్పరం ।
కోలాహలో మహానాసీ ద్ధన్యతాం పాన్యతామితి ॥ 22

హేషితై ర్బృంహితైః క్ష్వేడై ర్నిబిడో రథనేమిభిః ।
మృదంగ తాల వేణూనాం భేరీణాం నినదైరపి ॥ 23

ఏవం గవ్యైఃకార్తవీర్యై రథ్యశ్వ గజపత్తిభిః ।
అభవత్సు మహద్యుద్ధం భూతరాక్షస భీతిదం ॥ 24

పక్షి జంబూక సుఖదం వీరపత్నీ భయప్రదం ।
కేషాంచి జ్జానునీ భగ్నే కేషాంచి చ్ఛిరాంసిచ ॥ 25

ఖడ్గ ఖేటక భల్లానాం శరాణాం ధనుషా అపి ।
భగ్నానాం నచసంఖ్యాస్తి వీరణాం రథినామపి ॥ 26

ప్రపేతుః కార్తవీర్యస్య శేషా యే సైనికాస్తదా ।
పృష్ఠలగ్నాయ యుర్గవ్యాః హసంతో నచజఘ్నిరే ॥ 27

వినిందు ర్మునివా కింవో నిష్ట కృత మితీహితే ।
పూర్వదోష ప్రసంగేన రాజ్ఞో జాతా సుదుర్మతిః ।   28

ఏవం ప్రభగ్నే సైన్యే సదత్తస్థో కృతవీర్యజః ।
హస్తయోర్జగృహే పంచశతం బాణాన్ ధనూంషి చ ॥   29

దత్వా భూమౌ వామజానుం ధనూం ష్యాకృష్య వేగవాన్ ।
చిక్షేప శరజాలం స గవ్యేసైన్యే మహాభుజః ॥   30

ఫలహీన మభూత్తస్య శరజాలం నృపస్య తత్ ।
అనీతైః శ్చరితం తద్వ ద్వంధ్యాయాః సురతం యథా ॥   31

పునః పునర్వ హౌబాణాంస్తావతో రాజసత్తమః ।
కామధేనోః నచైకోపి వీరోభగ్నో భవత్తథా ॥   32

శరజాలే వృథాయాతే సంతప్తో భూన్నృపస్తదా ।
క్వగతం మమసామర్థ్య మితి చింతాతురో భవత్ ॥   33

వ్యాకులేన ప్రహర్తవ్య మితి సర్వేయయుర్దివం ।
కామధేను ర్మదాయుక్తా కిం యుద్ధం లఘునా సహ ॥   34

గతాయాం కామధేనౌ స కార్తవీర్యో మునిం యయౌ।
రోషేణోవాచ తేబ్రహ్మన్ కాపట్యంవిదితం మయా ॥   35

న సవిప్రో భిమంతవో యస్యస్యాత్కపటం హృది ।
ఇత్యేకం బాణమాదాయ వివ్యాధ ద్విజపుంగవం ॥ 36

లగ్నేహృది మహాబాణే ప్రాణత్యాగం చకారసః ।
రేణుకా తం నృపంప్రాహ బ్రహ్మహత్యా వృథాకృతా ॥ 37

స ఊచే రక్తనయనః క్రోధావిష్టో నృపశ్చ తాం ।
తూష్ణీం తిష్ఠ నచేద్ధన్మి త్వామపీహ మునిప్రియే ॥ 38

ఏకవింశతి బాణైస్తాం దుష్టో రాజా హనద్రుషా ।
సస్మార మనసా సాపి జమదగ్నిం మునిం తదా ॥ 39

పశ్చాదువాచ నృపతిం దుష్ట ఛాండాల కిం కృతం ।
అపరాధం వినాకస్మా దావాం నిహతవానసి ॥ 40

తవాపి భవితా నాభోభుజానం నాత్రసంశయః ।
శృత్వేద్థం వచనం తస్యా స్తతోయాతో నృపస్తదా ॥ 41

అల్పావశిష్ఠ సైన్యేన చింతాక్రాంతో యయౌ పురీం ।
వినిందన్ హృది చాత్మానం శోచంశ్చ మృతఖనికాన్ ॥ 42

నిరుత్సాహో నిరుద్యోగో వివేశ నిజమందిరం ॥ 43

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే కార్తవీర్యోపాఖ్యానం నామ ఏకోనాశీతితమో అధ్యాయః**



## 79-వ అధ్యాయము

# కార్తవీర్యుడు జమదగ్నిమహర్షిని సంహరించుట

జమదగ్నిముని యింకా యిలాఅన్నాడు :

"ఓ రాజా! నీవో మేకవన్నె పులిలాగా, గోముఖవ్యాఘ్రంలాగా మొదట్లో సాధువువలే, సాధుజనులకు ఉపకారివిలా కనబడి ఇప్పుడు నీ నైజాన్ని వెలిబుచ్చావు! దురాశతో అనవసరమైన భ్రాంతిలో చిక్కు కున్నట్లున్నావు! ఈ పవిత్రమైన కామధేనువు ఎవరికీ పొందశక్యం కానిది! దీనిని అపేక్షించావా - మూడులోకాలనూ నాశనమొనర్చినంతటి పాపం నీపై బడుతుందిసుమా!" అంటూ చేసిన హితోక్తులను చెవినిబెట్టక కోపంతో త్రాచుపాములా బుసలుకొడుతూ కార్తవీర్యుడు ఆ మునిని ఉద్దేశించి యిలా అన్నాడు.

"ఓయీ దుర్మార్గా! ఇంతవరకూ నేనెవ్వరివీ పరుషవాక్యాలు విని వుండలేదు! ఐనా బ్రాహ్మణువన్న గౌరవంతో యింతవరకూ నీ దుర్భాషలను సహించాను!" అంటూ తన కన్నుల్లో నిప్పుకణాలను కురిపించాడు.

"ఓ వ్యాసమునీంద్రా! అప్పుడు ఆ కార్తవీర్యుడు వెంటనే తాను కూర్చున్న ఆసనంపైనుండి దిగ్గునలేచి దూతలతో 'మీరు శీఘ్రముగా పోయి ఆ ధేనువును బంధమువిప్పి నావద్దకు తీసుకునిరండి!" అంటూ ఆజ్ఞాపించాడు. ఆ దూతలు రాజుయొక్క అప్రతిహతమైన ఆజ్ఞను పాటించేందుకు ఆ గోవును చుట్టుముట్టారు. ఆ ధేనువు చేసిన ఫూత్కారము మాత్రంచేతనే అందరూ తమ అసువులను కోల్పోయారు. ఆ తరువాత చుట్టుముట్టిన సకల సైన్యాన్నీ ఆ కామధేనువు తన క్రోధాగ్ని జ్వాలలచే భస్మం కావించింది! అది ముక్కుపుటాలగుండా విసరిన శ్వాసవాయువుయొక్క వేగానికే కొందరు ఆకాశంలోకి విసరివేయబడ్డారు! అది గిట్టలతో రేపినధూళి ఆకాశాన్నంతటినీ అలముకొని చీకట్లు నలు దెసలా క్రమ్ముకున్నాయి. అప్పుడు భూమికూడా కంపించింది. వృక్షాలన్నీ సుడిగాలికి పెకలించబడ్డాయి! ఆ రాజసైనికులు దాంతో భయభ్రాంతులై నాలుగు దిక్కులకూ పారిపోయారు! ఒకని బల్లెపుపోటుకు ఆగ్రహించిన ఆ ధేనువు ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగిరి ఏనుగుపైకి లంఘించే మృగరాజులా, నాగులపైకి దూకే గరుత్మంతుడిలా సైన్యాలపై పడింది! అప్పుడు సైన్యమంతా హాహాకారాలు చేస్తూ చెల్లాచెదరైపోయింది! అప్పుడు వారందరినీ ఉత్సాహపరుస్తూ

"భయపడకండి! నేనుండగా మీకెట్టి ఆపదా కలుగదు! నా శంఖపు ధ్వని చెవులబడటంతోటే సమస్త శత్రువుల గుండెలూ అవిసిపోతాయి!

ఇక నా పౌరుషముందర ఈ ధేనువెంత?" అంటూ మూడులోకాలు పిక్కటిల్లేలా శంఖాన్ని పూరించాడు కార్తవీర్యుడు. ఐనా ఆ ధేనువిదేమీ లెక్కచేయలేదు!

అప్పుడు ఆ రాజుయొక్క సైనికులు విజృంభించి ఆ ధేనువును కఱ్ఱలతోనూ, లోహపుఆయుధాలతోనూ కొట్టసాగారు! ఒక్కొకదెబ్బ ఆ ధేనువు శరీరంపై పడినప్పుడల్లా - అక్కడక్కడనుంచి సర్వశస్త్రాలనూ ధరించిన భటులు బయల్వెడలి ఈ కార్తవీర్యుని సేనావాహినిని వధించ సాగారు! ఆ కామధేనువుయొక్క రోమకూపాలలోంచి శకులు, బర్బరులు బయలుదేరారు! పాదాలలోంచి పటచ్చరులనేవారు ఇంకా నానావిధము లైన యవనజాతులూ ఉత్పన్నమైనారు! వీరంతాకూడా కార్తవీర్యుని సేనలపైబడి వారిని చావమోదారు! లెక్కలేనంతమంది సైనికులు ఆ దాడిలో మరణించారు! కొందరు యద్ధభూమిలో చనిపోయిన వారివలే భయంతో బిగుసుకుని పడుకుంటే, మరికొందరు శస్త్రాలను శస్త్రాలతో నరికి బాహాబాహీగా మల్లయుద్ధానికి తలపడ్డారు! ఇలా సంకుల సమరం కొనసాగింది. శస్త్రాస్త్రాలన్నీ గుట్టలుగా నేలపై పేరుకోసాగాయి. ఆ ధూళి ఆకాశానికంటి ఎవరు తమవారో ఎవరు శత్రువులో తెలుసుకోవడం గగనమైంది. ఒకరి నొకరు కనబడ్డవాడినల్లా తెగనరుక్కుంటూ భీతావ హంగా పోరాడసాగారు! మృతసైనికుల కళేబరాలకై కాచుకుకూర్చున్న గద్దలకు, రాబందులకు ఈపోరు ఎంతో సంతోషాన్ని కల్గించింది. వీరపత్నులకుమాత్రం భయావహమైంది! లెక్కలేనన్ని రథాలు, సైనికులు నేలకూలారు. ఈవిధంగా చచ్చినవారు యుద్ధంలో సమసిపోగా కొందరు మాత్రం తమకాళ్ళకు బుద్ధిచెప్పి శక్తికొద్దీ పారిపోసాగారు.

'మన రాజుకేదో పోగాలము దాపురించే అకారణంగా తాపసియైన ఆ మునితో వైరం కొనితెచ్చుకున్నాడు. ముని మనకెలాంటి హానీ చేయ లేదు సరిగదా చక్కటి ఆతిధ్యంకూడా యిచ్చాడు. మనరాజుయొక్క దురాశ ఫలితమే ఈ ఉపద్రవం!' అనుకుంటూ బ్రతికుంటే బలుసాకు తినవచ్చు అనుకొని సైన్యం చెల్లాచెదురుగా పారిపోయారు.

"ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా తనసైన్యం యావత్తూ కకావిక లవటం చూసిన కార్తవీర్యుడు దిగ్గునలేచి తన ఐదువందల బాణాలనూ ఎక్కుపెట్టి శరజాలములను ఆ ధేనువు సృజించిన సైనికులపై ప్రయో గించాడు. అలా ఎన్నిసార్లు శక్తికొద్దీ బాణవర్షం కురిపించినా ఒక్క గో సైనికుడుకూడా మరణించలేదు! ఈ రకంగా తన బాణాలన్నీ వృధాగా పోగా అతడు చింతాక్రాంతుడై 'ఆహా నేడు నాసామర్థ్యమంతా మొక్క వోయిందే! ఇంక నాకేది దారి?' అంటూ వ్యాకులపడసాగాడు. ఇట్టి వీనితో యుద్ధమెందుకని ధేనువు తన సైన్యంతోసహా దేవలోకానికి తరలిపోయింది.

అలా కామధేనువు స్వర్గలోకానికి వెళ్ళిపోయాక కార్తవీర్యుడు తిరిగి జమదగ్నిముని సన్నిధికివెళ్ళి ఉక్రోషంతో "ఓయీ! కపటబ్రాహ్మణా! నీ హృదయంలో యింతటి కాపట్యముంచుకొని నన్ను మభ్యపెట్ట బోయావా? ఎవని హృదయంలో కాపట్యముంటుందో అతడు బ్రాహ్మ ణుడు కానేకాడు!" అంటూ ఆ ముని హృదయంలో నాటుకునేలా ఒక వాడిబాణాన్ని ప్రయోగించాడు. - దాంతో ఆ ముని వెంటనే మరణించాడు. అప్పుడా జమదగ్ని మునిపత్నియైన రేణుకాదేవి క్రోధంతో ఉడికిపోతూ

"ఓరి దౌర్భాగ్యుడా! అకారణంగా నీవు బ్రహ్మహత్యకు పూను కున్నావే! నీకీ మహర్షి ఏమి అపకారంచేశాడు?" అంటూ ఆక్రోశించింది. అందుకు కార్తవీర్యుడు అగ్గిమీద గుగ్గిలమే అయ్యాడు.

'నీవు తక్షణం నోరుమూసుకో! లేదా నిన్నూ సంహరిస్తాను!' అంటూ రోషంతో తన ఎక్కుపెట్టిన విల్లుతో ఇరవైఒక్క బాణాలను ఆమెపై ప్రయోగించాడు.

అలా ఆ కార్తవీర్యుని బాణములచే గ్రుచ్చబడి నేలకూలిన ఆ సాధ్వీమణియైన రేణుకామాత తన భర్తను మనసారా స్మరించింది. ఆ తరువాత ఆ రాజును యిలా శపించింది.

'ఓరీ దుర్మార్గుడా! నీకే బలమున్నదని గర్వంతో విర్రవీగుతూ అకారణంగా మమ్మల్ని వధిస్తున్నావు. నీకూ అనతికాలంలోనే చేటు మూడుతుంది. నీవు నీ సహస్రబాహువులతోనూ నశించే వినాశం వస్తుంది! దీనికెంత మాత్రమూ సందేహంలేదు! ఇది యదార్థంగా జరిగి తీరుతుంది!"

ఈ మాటలు తననెంతో బాధించగా ఆ కార్తవీర్యుడు శేషమైన పరివారంతో, నిరుత్సాహంతో - ఏపని చేయటానికీ ఉత్సాహంలేక తన అకృత్యానికి తనను నిందించుకుంటూ తన మందిరానికి చేరుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'జమదగ్ని సంహారం' అనే 79-వ అధ్యాయం.



# 80

# రామోపాఖ్యానం

(మూలం)

## అశీతితమో అధ్యాయః

**క ఉవాచ :**

రేణుకాతు గతే తస్మిన్ శుశోచ భ్రుశ విహ్వాలా ।
క్వగతా మమ పుత్రాస్తే సంహారే స్మిన్నుపస్థితే ॥ 1

మృతే భర్తరి కింకుర్యాం భాణజాల సమావృతా ।
క్వగతో సౌ మహాక్రోధీ రామో మేప్రియబాలకః ॥ 2

తస్మిన్నష్టే మమ ప్రాణాః గమిష్యంతి సురాలయం ।
స్మృతమాత్ర స్తయా రామో యయౌమంతు స్తదాంతికం ॥ 3

బాణజాల చితాంతాం తు పితరం మృతమైక్షత ।
కార్తవీర్యేణ దుష్టేన దృఢబాణ హతం హృది ॥ 4

పపాత మూర్ఛయా భూమౌ వాతభగ్న ఇవద్రుమః ।
పితరం మాతరం చైవ రురోద భ్రుశదుఃఖితః ॥ 5

**రామ ఉవాచ :**

అద్యాంధకార స్సర్వత్ర అద్యశూన్యా దిశోదశ ।
మేరుహీనా యథా పృథ్వీ శక్రహీనాఽమరావతీ ॥ 6

నాశ్రమః శోభతే తద్వత్ పిత్రా హీనోయ మద్యమే ।

త్రిలోకే గంగయా హీనా తద్వ దాశ్రమమండలే ।
నశోభతే రేణుకయా హీనాస్యాశ్రమమండలం ॥ 7

గతం భయంతు దేవానాం మునయోద్య నిరీశ్వరాః ।
యదాసీ త్తపసా చాస్య కిమయం వాగ్గృహీష్యతి ॥ 8

ఏవం బహువిధాకారం చక్రే ఆక్రందనం తు సః ।
అచేష్టత భ్రుశం రామో మత్స్యో నీరంవినా యథా ॥ 9

తతః పునర్మాతరం సరుదన్నేవ సమాయయౌ ।
నిష్కాశయామాస శరానంకే కృత్వా శిరోధరాం ॥ 10

చక్రంద చ పునః రామో మాతృదుఃఖేన దుఃఖితః ।
త్రైలోక్యం భస్మసాత్కర్తుం యాక్షమా జననీ మమ ॥ 11

సా కథం పతిజా భూమౌ దుష్టబాణ ప్రపీడితా ।
న విస్మరసి మాం నిత్యం క్షణం క్రీడాగతం పురా ॥ 12

త్యక్త్వా మాం కథమద్యత్వం కుత్రవా గంతు మద్యతా ।
దదాసి మే పయో భూరి వస్త్రాణ్యన్నాని శోభనే ॥ 13

ఫలమూలాని చారూణి యాసి త్యక్త్వా కథంను సా ।
మాతాపితృభ్యాం హీనస్య దిక్షే జీవితమధ్యమే ॥ 14

బ్రహ్మోవాచ :

ఇతి పుత్రవచశ్శ్రుత్వా రేణుకా భ్రుశదుఃఖితా ।
ప్రమృజ్యా శ్రూణీ పుత్రస్య జగాద భ్రుశ విహ్వలా ॥ 15

అహం తేనికటే స్థాస్యే నశోకం కర్తుమర్హసి ।
శృణు వార్తాం పురావృత్తాం రాజాసౌ కృతవీర్యజః । 16

మధ్యాహ్నే సహ సైన్యేన ప్రాప్త ఆశ్రమమండలం ।
పిత్రా తే మానిత స్సమ్యగ్భోజితో బలసంయుతః ॥ 17

కామధేనోః ప్రసాదేన భుక్త్వా యాచత ధేనుకాం ।
తూష్ణింభూతే మునౌ కోటిల్ కామదేనుం ముమోచ సః ॥ 18

స్పృష్టా మాత్రా చ సా ధేనుః ససర్జ బలముత్కటం ।
చతురంగం తతో యుద్ధ మభవద్రాజ సైనికైః ॥ 19

భగ్నాస్తే వ్యపలన్సర్వే రాజా యుద్ధమథాకరోత్ ।
సచ పంచశతం బాణాన్ వారం వారమథాసృజత్ ॥ 20

సోపిభగ్నో గృహంయాతః కామధేను ర్దివంగతా ।
పునరాగత్య దుష్టోసౌ బాణేనైకేన వక్షసి ॥ 21

జఘాన పితరం కోపా దేకవింశతి సాయకైః ।
అపరాధం వవినామాంచ తాడయిత్వా గతఃఖలః ॥ 22

తస్మా త్త్వయాద్య దుష్టస్య నాశః శీఘ్రం విధీయతా ।
ఏకవింశతి వారం చ కురు నిఃక్షత్రియాం ధరాం ॥ 23

ఏకవింశతి బాణామే దేహేతేన యతోర్పితాః ।
అన్యదేకం వదేపుత్ర తత్కురుష్వ వచోమమ ॥ 24

సంస్కారం కురునౌ తత్ర యత్రకోఽపిన దాహితః ।
దత్తాత్రేయం మునివర మాకార్య సర్వవేదినం ॥ 25

కురుకర్మంతరం నౌత్వం త్రయోదశదినావధి ।
తదైవ గతిమాప్స్యావో నాన్యేవక్తాస్తి తాదృశః ॥ 26

ఇత్యుక్త్వా రేణుకా దేహంత్త్యక్తా ధామాప దుర్గమం ।
రామస్తత్సర్వమకరోత్త యాదిష్టం మహామనాః ॥ 37

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే రామోపాఖ్యానం నామ**
**అశీతితమో అధ్యాయః**



# 80-వ అధ్యాయము

# రామోపాఖ్యానం-I

ఆ తరువాత జరిగిన కథనాన్ని బ్రహ్మ యిలా వివరించాడు. "ఓ వ్యాసమునీంద్రా! అలా ఆ కార్తవీర్యుడు భీభత్సము భయానకము ఐన వాతావరణాన్ని సృష్టించి వెళ్ళిపోయాక, జమదగ్ని పత్నియైన రేణుక దుఃఖంతో వివశురాలై 'అహా! నేడు ఎంతటి దుస్థితి దాపరించింది? ఇటువంటి ఆపత్సమయాలలో నా కుమారులెక్కడికి వెళ్ళారోకదా? మహా రోషవంతుడూ పరాక్రమీయైన నా రాముడు ఎక్కడికి వెళ్ళాడో? అత్యంత ప్రేమాస్పదుడైన వానికేమైనా జరిగితే ఉత్తరక్షణంలో నా ప్రాణాలుకూడా విశ్వవాయువుల్లో కలిసిపోగలవు!' అని అనుకుంటూండగా ఆమె స్మరించి నంతనే రాముడామెవద్దకు వచ్చాడు. బాణాలతో నాటబడిన తనతల్లిని, మృతుడైన తండ్రి జమదగ్నినీ చూడగానే మొదలునరికిన చెట్టులా నేలకూలి, ఆ బాధతో మూర్ఛిల్లాడు! కాస్సేపటికి స్పృహరాగానే తలిదండ్రుల గురించి ఎంతగానో పరితపిస్తూ – 'అహో! ఇప్పుడంతా

అంధకారం అలుముకున్నట్లుగా ఉన్నదే? ప్రపంచమంతా శూన్యమై వెలవెలపోతోందే? ఇంద్రుడులేని అమరావతి, మేరుపర్వతంలేని భూమి ఎలా కాంతివిహీనమై నిస్తేజములౌతాయో, అలాగే నా తండ్రిలేని ఆశ్రమంకూడా ఎంతో చిన్నబోయింది! పరమపావనియైన గంగానది లేకపోతే మూడులోకాలూ ఎలావుంటాయో అట్లాగే నా జనని రేణుకాదేవి నడయాడని ఆశ్రమం అలా శూన్యంగా గోచరిస్తోంది! అమిత తపోనిష్ఠకు అలవాలమైన ఈ తపోనిధిపై అతడెలా ఆయుధప్రహారం చేయగలిగాడు?' అనుకుని పరిపరివిధాల తన మాతాపితరులను తలచుకొని విలపించసాగాడు. ఆ దుఃఖభారానికి మూర్ఛిల్లి తిరిగి కొంచెంసేపైన తరువాత లేచి ఏడుస్తూ తల్లివద్దకు వెళ్ళి ఆమె తలను తన వడిలో ఉంచుకొని ఆమెను నాటిన బాణాలను లాగివైచాడు. అప్పుడు తల్లిలేని వియోగం గుండెల్ని కలచివేయగా మళ్ళా దుఃఖితుడై ఇలా అనుకున్నాడు :

మూడులోకాలను సైతం తన పాతివ్రత్య పరాకాష్ఠచేత భస్మం చేయగలిగినట్టి సామర్థ్యంవున్న నా మాతృమూర్తి ఈ దుష్టబాణాల బారిన పడి ఇలా పడివున్నదెందుకని?' ఓ తల్లీ! నేను అటలకు వెళ్ళినా క్షణ కాలం గూడా నన్ను విడిచివుండేదానవుకాదు! ఇప్పుడు నన్నిలా అనాధను చేసి ఎక్కడికిపోదల్చావు? నాకు ఆకలితీర్చే సమృద్ధైన భోజనాన్నీ, పాలను మంచి వస్త్రాలనూ ప్రేమతో నాకు యిచ్చేదానివే? ఎంతో కష్టపడి మీకై నేతెచ్చిన కందమూలాలన్నీ విడిచి ఎక్కడికి పోయావమ్మా? ఇక తలిదండ్రులు లేని నా జన్మ వ్యర్థమైంది!" అంటూ రోదించాడు.

ఆ రాముడి గుండెలవిసేలా చేసే రోదనను విని మాతృమూర్తి

యైన రేణుకాదేవి ఆ హృదయవిదారక దృశ్యాన్ని చూడలేక అతడి కళ్ళు తుడిచి, నాయనా! శోకించకు! నేను నీవద్దనే ఎప్పటికీ ఉంటాను. నిన్ను వీడివెళ్ళను. జరిగిన వృత్తాంతాన్ని యావత్తూ తెలుపుతాను విను! నీవు ఈ మధ్యాహ్నం అరణ్యాలకు కందమూలాలను సేకరించడానికి వెళ్ళినప్పుడు ఈ నగరానికి రాజైన కృతవీర్యుని కుమారుడైన కార్తవీర్యుడు సేనాసమేతుడై మన ఆశ్రమానికి వచ్చాడు.

యధోచితరీతిన గౌరవించి, భోజనానికి బలవంతంగానే ఒప్పించాడు నీతండ్రి! సమస్త రాజలాంఛనాలతోనూ రాజోచిత వైభవాలతో ఆ రాజును భుజింపచేశాము. కామధేనువును ప్రార్థించి ఆమెయొక్క విశేషానుగ్రహం చేత సర్వమూ సమకూర్చుకుని యధావిధిగా అతిథి సత్కారాలను జరిపాము. ఆ రకంగా భోజనంచేశాక దురాశాపూరితుడై ఆ ధేనువును తనకు సమర్పించమని నీ తండ్రిని యాచించాడు. ఉదాసీనతవహించినట్టి నీ తండ్రిపై పట్టరాని ఆగ్రహం క్రమ్ముకొనిరాగా ఆ ధేనువును బలాత్కారంగా తరలించదలచి ఆమెకు కట్లువిప్పాడు. అలా శత్రుస్పర్శ కల్గినమాత్రంచేతనే ఆ ధేనువు అపారమైన చతురంగ బలాలను నిర్మించింది! ఆ రాజసైనికులకూ, ధేనువుచే సృష్టించబడిన సైనికులకూ మధ్య జరిగిన ఘోరమైన పోరులో రాజుయొక్క సైన్యం చెల్లాచెదురై పారిపోయారు!

అప్పుడా కార్తవీర్యుడు స్వయంగా తానే పూనుకొని యుద్ధంచేశాడు! ప్రతీసారీ ఐదువందల బాణాలను గుప్పిస్తూ యుద్ధంచేసినా ఏమాత్రం ప్రయోజనం లేకపోయింది! ఖిన్నుడై విగతశస్త్రుడైన ఆతడితో పోరును విరమించి ఆ కామధేనువు తిరిగి స్వర్గానికి వెళ్ళిపోయింది! తిరిగి

వచ్చి నీతండ్రి సముఖంలో ఆతడిని నిందిస్తూ ఆ దుష్టుడు నీతండ్రి వక్షస్థలంపై వాడియైన ఒక బాణాన్ని నాటాడు! ఏరకంగానూ అతడికి అపకారంచేయని నన్నుకూడా ఇరవైఒక్క వాడి బాణాలతో గుచ్చి బాధించాడు. ఆ దుర్మార్గుడు అలా లేవలేని స్థితిలోఉన్న మమ్మల్ని విడిచి వెళ్ళిపోయాడు! ఓ రామా! నీవు వెంటనే ఆ దుష్టుని సంహరించు! అంతేకాదు దుర్మదాంధుడై నాపై ఇరవైఒక్క బాణాలు గ్రుచ్చాడు గనుక నీవూ ఇరవైఒక్కసార్లు క్షత్రియ వంశాలనన్నింటినీ నాశనంచేసి మా ఆత్మకు శాంతిని కూర్చు! అంతేకాదు! నీవింకొక పనికూడా చేయి! ఎవరినీ ఎన్నడూ దహింపచేయని ప్రదేశంలో మాకు అగ్నిసంస్కారాలు నెరవేర్చు! నీకు పురోహితునిగా అనసూయాసుతుడైన దత్తాత్రేయుని ఆహ్వానించి పదమూడోరోజువరకూ మాకు అపరకర్మలు నిర్వహించు! ఆ విధంగా చేసినట్లయితే మేము ఉత్తమగతులను పొందగలము! అలా దత్తునివల్ల నిర్వహింపచేయబడ్డ ఉత్తరక్రియలు సార్థకములౌతాయి. అతనికంటే సమర్థుడు వేరెవరూ లేరు!'' అంటూ ఆ రేణుకాదేవి తన తనయుడైన రాముని ఒడిలో తలఉంచి ప్రాణములు విడిచింది. ఆ తరువాత జమదగ్ని సుతుడైన రాముడు తనతల్లి చెప్పిన విధానంలో కర్మకాండనంతా యథావిధిగా పూర్తిచేశాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'రామోపాఖ్యానము'** అనే 80-వ అధ్యాయం.



81

# రామోపాఖ్యానం

(మూలం)

## ఏకాశీతితమో అధ్యాయః

శ ఉవాచ :

రామస్తు వపనంకృత్వా స్నాత్వా సమ్యద్విధానతః ।
ఉద్ధానశ్రాద్ధ మకరో ద్బ్రాహ్మణైః కథితంయథా ॥ 1

విశ్రాంతి శ్రార్ధమారభ్య మంత్రాగ్నిముఖయో రదాత్ ।
తద్దైవ త్రయయౌ తంతు దత్తాత్రేయం మునిం ప్రతి ॥ 2

కువేషం శిష్య సహితం శ్వహిస్తం మలినం కృశం ।
ధ్యానేనాలోక్యతం రామో ననామ మునిపుంగవం ॥ 3

బద్ధాంజలిపుటో తిష్ఠద్యామార్థం తత్పురోద్విజః ।
దత్తాత్రేయోపి సర్వజ్ఞో బుధ్వాతస్యాశ్రయం మునిః ॥ 4

ఉవాచ రామమామంత్ర్య జ్ఞాతం తవప్రయోజనం ।
అధిపప్పృచ్ఛే విజ్ఞాతుం కిమర్థం త్వమిహాగతః ॥ 5

**క ఉవాచ :**

స ఉవాచ తతోరామో వృత్తాంత మాదితః స్ఫుటం ।

**రామ ఉవాచ :**

కృతవీర్యాత్మజో రాజా పితురాశ్రమ మాగతః ॥ 6

భోజితః పరమాన్నేన నానా పక్వాన్నశాలినా ।
భుక్తః ససేనయాసార్థం కామధేను మయాచత ॥ 7

యదా నదత్తా పిత్రామే బలాన్నేతుం మనోధదే ।
సాతాడితాథ సుషువే సైనికానాం గణాన్ బహూన్ ॥ 8

తైర్భగ్నా బలిభిరాజా ససైన్యో గాన్నిజాలయం ।
కామధేను ర్గతాస్స్వర్గం తతోరాజా రుషాన్వితః ॥ 9

జమదగ్నే ర్ఘృదిశరం అహనద్దృఢ మోజసా ।
ఏకవింశతికాన్ బాణాన్ మాతురంగే హనద్రుషా ॥ 10

నాహం తత్రస్థితో బ్రహ్మన్ పశ్చాదాగత్య దృష్టవాన్ ।
మంత్రాగ్ని నాతుదగౌతౌ మాతుర్వాక్యా దిహాగతః । 11

దత్తాత్రేయం వినానాన్యే వక్తాకార్యోత్ర కర్మణి ।
కృతే కర్మణి సర్వ స్మింస్త్రయో దశ దినావధి ॥ 12

పశ్చాద్రాజా నిహంతవ్యః కృతవీర్యాత్మజో బలీ ।
ఏకవింశతి వారంచ కార్యాన్నిః క్షత్రియా మహీ ॥ 13

ఇద్ధమాజ్ఞపయన్మహ్యాం జననీ రేణుకా మమ ।
ఇత్యర్థ మిహసంప్రాప్త స్తస్మాత్కురు కృపాం మయి ॥ 14

**బ్రహ్మోవాచ :**

ఇతి రామవచఃశ్రుత్వా రేణుకాయాః సఖామునిః ।
శోక సంవిగ్నహృదయో రామమూచే ఇతంవచః ॥ 15

**దత్తాత్రేయ ఉవాచ :**

యద్గృహే భుక్తమత్యంతం తేన నేష్టావిరోధితా ।
యది దుష్టేన సాకారి ద్రష్టా తత్ఫలమచిరాత్ ॥ 16

ఇదానీంతు తయోస్సమ్య దౌర్ధ్వదైహిక మాచర ।

**బ్రహ్మోవాచ :**

తత ఆశ్రమమాగత్య దత్తాత్రేయ యుతస్తుసః ॥ 17

రామశ్చకార భక్త్యైవపిత్రో రుత్తర కర్మతత్ ।
దత్తాత్రేయో క్తమంత్రైః స్సద్వితీయ దివసావధి ॥ 18

సమాప్తే కర్మణిమునిః గంతుం కోల్హాపురంమనః
చక్రే తదాబ్రవీద్రామః కదాయాతి భవాన్మునః ॥ 19

మునిః ప్రోచే యదాత్వం మే స్మరణం వై కరిష్యసి ।
ఏహి దత్తాత్రేయ ఇతితదా మాంద్రక్ష్యసే నఘు ॥ 20

కృత్వా కర్మవ్రజత్యేవ భిక్షితుం సదినేదినే ।
అశౌచినో నభోక్తవ్య మన్నమిత్యభిచింతయన్ ॥ 21

పంచమే దివసేకర్మ సమాప్య మునిపుంగవః ।
గృహీత్వాజ్ఞాం గతో యావత్తావద్వ్యాఘ్రః సమాయయౌ ॥ 22

మాత ర్మాతః క్వయా మ్యద్యే త్యేవం చుక్రోశ తద్భయాత్ ।
ఆవిరాభూత్త దామాతా రేణుకా రామవాక్యతః ॥ 23

అసంపూర్ణ శిరోమాత్రా పుత్రస్నేహ వశేనహి ।
యది ద్వాదశరాత్రా త్సాహూతా స్యాద్భార్గవేణతు ॥ 24

ఆగతా స్యాత్సాసంపూర్ణా సర్వావయవ శోభినీ ।
ఉవాచ తంకిమాహూ తావదబాల ప్రయోజనం ॥ 25

ఆలిలింగ తదాస్నేహా ద్రామం స్నుత పయోధరా ।
దత్తాత్రేయః పునరగాత్షష్ఠేథ దివసే మునిః ॥ :26

అపశ్యద్రేణుకాం తత్ర తాదృశీం రామమబ్రవీత్ ।
మధ్య ఏవకీ మాహూతా న్యూనదేహా సమాగతా ॥ 27

సపిండీకరణాదూర్థ్వం యద్యాహూతా తదాఖిలా ।
ఆగతాస్యా ద్రేణుకే యం తవ స్నేహాద్విజర్షభ ॥ 28

**రామ ఉవాచ :**

బాలభావాద్భయా ద్బ్రహ్మన్ స్వభావా న్మాతరిత్యహం ।
ఉక్తవాన్ మునిశార్దూల దృష్టవానీ దృశీ మిమాం ॥ 29

వృషోత్సర్గం చకృతవానే కాదశ దినేద్విజః ।
సపిండీ కరణంచైవ ద్వాదశేకృ తవాన్ ద్వయోః ॥ 30

తతః పరేహ్ని పాథేయం శ్రాద్ధాం పుణ్యాహ వాచనం ।
దదౌ దావాన్యనేకాని బ్రాహ్మణేభ్యో యధార్హతః ॥ 31

జమదగ్ని ర్దివ్యదేహో బ్రహ్మలోక యధాగమత్ ।
తస్థౌ సారేణుకా భూమౌ స్థానే స్థానే చతాదృశీ ॥ 32

పూరయత్యఖిలాన్ కామాన్ జనానాం భక్తికారిణాం ।
మహాత్మ్యం విస్తృతం తస్యాః స్కాందే ప్రోక్తం విశేషతః ॥ 33

అతి విస్తరభీత్యా త్రన ప్రోక్తంముని సత్తమ ॥ 34

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే రామోపాఖ్యానం నామ**
**ఏకాశీతితమో అధ్యాయః**



# 81-వ అధ్యాయము

# రామోపాఖ్యానం-II

**రాముడు "జమదగ్ని-రేణుకాదేవి"ల కర్మసంస్కారము చేయుట :**

అప్పుడా చతురాస్యుడు వ్యాసమునీంద్రునితో యిలా అన్నాడు.

"ఓ వ్యాసమునీంద్రా! ఆ తరువాత రాముడు తలనీలాలను తీసివైచి, శుద్ధిస్నానంచేసి స్మార్తవిధానం ప్రకారం సంచయనాది కర్మనంతటినీ యధావిధిగా నెరవేర్చి, మంత్రాగ్నిని ప్రజ్వరిల్లజేసి తలిదండ్రులిద్దరికీ విశ్రాంతి శ్రాద్ధమునూ ఆ తరువాతి సంస్కారాలనూ చేసి, ఆతరువాత దత్తాత్రేయుని సన్నిధికి వెళ్ళాడు. మాయాస్వరూపియైన ఆ దత్తాత్రేయుడు కుత్సితునిలా వేషంధరించి, శిష్యులు తనను కుక్కలై అనుసరించగా కుక్కలమెడలో త్రాటిని వైచి ఆ త్రాళ్ళు చేతిలోపట్టుకొని కృశించిన మలినరూపిగా దర్శనమిచ్చాడు. ఆ మునీంద్రుని నిజస్వరూపాన్ని తన ధ్యానంద్వారా గ్రహించిన రాముడు నమస్కరించి దోసిలియొగ్గి ఎదుట నిలిచాడు. సర్వజ్ఞుడైనప్పటికీ యోగీశ్వరేశ్వరుడైన ఆ దత్తమూర్తి అతడి మనోభీష్టాన్ని గ్రహించదలిచి. అందుకనే జమదగ్ని సుతునితో యిలా అన్నాడు.

"ఓ రామా! నీ మనోభీష్టము అర్థమైనది. అయినా నీవేకార్యార్థివై ఇటకు వచ్చావో చెప్పు!" అనగా అప్పుడు ఆ రాముడిలా అన్నాడు.

"ఓ యోగిరాజా! కృతవీర్యుని కుమారుడైన కార్తవీర్యుడు నేను ఆశ్రమంలో లేని సమయంలో వేటకని వచ్చి మాతండ్రి జమదగ్నిమహర్షి యిచ్చిన అతిథ్యాన్ని స్వీకరించి, దురాశాపరుడై, ఆ ఏర్పాట్లు ఒనరించిన కామధేనువును బలాత్కారంగా తోలుకొని పోజూశాడు. దైవబలంగల ఆ ధేనువు ధాటికి ఆతడి సైన్యమంతా కకావికలై చెల్లాచెదరైపోయింది. ఆ ధేనువు దేవలోకానికి వెళ్ళిపోగా, క్రుద్ధుడై అవమానభారంతో మా తండ్రిపై అకారణవైరం పూని తన తీవ్ర శరాఘాతంతో దాడిచేసి వధించాడు. అది చాలదన్నట్లు మందలించపోయిన అసహాయురాలైన నా మాతృదేవిపైకూడా ఇరవైఒక్క శరాలు గుప్పించాడు! ఆమె నేను తిరిగివచ్చేదాకా కొనఊపిరితో ఉండి ఈ అకృత్యాన్ని నాకు వివరించి తమకు అపరకర్మలు నిర్వర్తించేందుకు మిమ్మల్ని పురోహితునిగా అభ్యర్థించమని ఆదేశించి, తన తనువు చాలించింది! ఆ అపరకర్మల నిర్వహణలో మీ సహాయాన్ని అర్థించడానికై మీ చెంతకు వచ్చాను. ఈ కర్మ తంత్రంలో మీకు సాటైనవారెవరూ లేరని, ఆ కర్మ ముగించి ఇరవైఒక్కమార్లు క్షత్రియులనెల్లా పరిమార్చి ధరను క్షత్రియులబారినుండి కాపాడమని మాతల్లి ఆదేశం! అందువల్ల ఓ మహాత్మా! నాపై దయ యుంచి నాతోకూడా దయచేయవలసింది!" అంటూ ప్రార్థించగా కరుణాళువైన ఆ దత్తమూర్తి అడిని అనునయిస్తూ శోకార్తియైన రామునితో యిలాఅన్నాడు.

"ఓ రామా! కార్తవీర్యుడు క్షత్రీయుడెన్నడూ చేయకూడని అకృత్యాన్నే చేసి తీరనిపాపం మూటకట్టుకున్నాడు! ఎవరి యింటిలో తృప్తిగా భుజిం

చామో వారితో ఎన్నడూ విరోధం కూడదు! ఒకవేళ ఎవరైనా దుష్టత్వం వహించి అలా చేసినా, తగిన ఫలితం తప్పక అనుభవించి తీరతాడు! నీవు ఇప్పుడు నీమాతా పితరులిరువురికీ ఊర్ధ్వదైహికకర్మను యధావిధిగా ఆచరించవలసింది!"

"ఓ వ్యాసమునీంద్రా! ఆ విధంగా కర్తవ్యోన్ముఖుడైన రాముడు దత్తాత్రేయునితోకూడి తన ఆశ్రమానికివచ్చి దత్తాత్రేయుడు చెప్పిన ప్రకారమే సమంత్రకంగా రెండవరోజునుండి మొదలుపెట్టి భక్తిపూర్వకంగా ఉత్తర క్రియలు జరుపసాగాడు.

అలా రెండోరోజున కర్మకాండ పూర్తవగానే తాను కొల్హాపురం వెడతానని చెప్పగానే ఆ రాముడు 'ఓ మునీంద్రా! తిరిగి మీరెప్పుడు వస్తారు?' అని అడిగాడు.

అప్పుడు దత్తాత్రేయుడిలా బదులుచెప్పాడు. 'ఓ రామా! నీవెప్పుడు 'ఏహి దత్తాత్రేయా' అని స్మరిస్తావో ఆ క్షణంలోనే నన్ను చూడగలవు!' ఇలాగ దత్తాత్రేయుడు ప్రతిదినమూ కర్మకలాపాన్ని నిర్వహింపజేస్తూ అశౌచాన్నము అభోజ్యం కనుక, భిక్షాటన నిమిత్తమై వెళ్ళేవాడు! ఇలా ఒకనాడా దత్తాత్రేయ మునీంద్రుడు కొల్హాపురం వెళ్ళినప్పుడు రాముడు కర్మ చేస్తుండగా అకస్మాత్తుగా ఒకపులి అక్కడికి వచ్చింది! అప్పుడు రాముడు 'అమ్మో! అమ్మో! ఎక్కడికిపోను' అంటూ భయంతో అరచాడు. ఆ పిలుపులకు రాముడి తల్లియైన రేణుక అక్కడ ఆవిర్భవించింది. కర్మకాండ యింకా అసంపూర్తిగా కావడంతో ఆ దేహానికి శిరస్సుమాత్రం ఏర్పడలేదు! అలా పన్నెండవరోజున పిలచిఉంటే ఆమె సంపూర్ణ ఆకృతి తో వచ్చివుండేది! అప్పుడా రేణుకాదేవి యిలాఅన్నది.

"నాయనా! రామా! నన్నెందుకాహ్వానించావు?" అంటూ తన కుమారుడిని ఆలింగనం చేసుకున్నది. ఆరవరోజున దత్తాత్రేయుడు మరలి వచ్చి 'రామా! మధ్యలో ఆమెనెందుకు పిలిచావు? అసంపూర్ణదేహంతో వచ్చిందికదా! పిండీకరణ అయినాక పిలిస్తే సంపూర్ణ అవయవాలతో నీయందలి ప్రేమతో వచ్చివుండేది" ఆ మాటలకు జమదగ్నినందనుడు "ఓ మునీంద్రా! బాలభావంచేత పులికి భయపడి "మాతర్మాతః" అని అరచినాను! ఆ వెంటనే ఇట్టి స్వరూపాన్ని చూశాను!" అని బదులిచ్చాడు.

ఆ తరువాత రాముడు పదకొండోరోజున వృషోత్సర్జనంచేసి పన్నెండవ రోజున మాతాపితరుల కిరువురికీ సపిండీకరణ శ్రాద్ధమును ఆచరించాడు. ఆ మర్నాడు పాథేయశ్రాద్ధమును పుణ్యాహవచనమునూ చేసి బ్రాహ్మణులకు యథార్థముగా అనేక దానధర్మముల నాచరించాడు. అప్పుడు జమదగ్నిమహర్షి దివ్యదేహందాల్చి బ్రహ్మలోకానికి వెళ్ళాడు.

రేణుకాదేవిమాత్రము భూలోకంలోనే అసంపూర్ణదేహంతో తిరుగుతూ భక్తజనుల కోర్కెలనన్నీ తీరుస్తున్నది! "ఓ వ్యాసమునీంద్రా! ఈమె మహాత్మ్యం స్కాందపురాణంలో విస్తారంగా వర్ణించబడివున్నది. అందుచేత ఇక్కడ సంక్షేపంగా వివరించాను." అంటూ దరహాసం చిందించాడు చతురాననుడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'రామోపాఖ్యానము'** అనే 81-వ అధ్యాయం.



82

# రామ వరదానం

(మూలం)

## ద్వి అశీతితమో అధ్యాయః

**వ్యాస ఉవాచ :**

కథం రామో బాలఏవ కృతవీర్యసుతేన హ ।
ఏకాకీ బహుసైన్యేన సహస్ర భుజశాలినా ॥ 1

అజయత్తం మహావీరం తన్మే కథయ విస్తరాత్ ।

**క ఉవాచ :**

ఏకస్మిన్దివసే రామో మాతరం పరిపృష్టవాన్ ॥ 2

**రామఉవాచ :**

యస్మాదింద్రాదయో దేవా బిభ్యతి త్రాసకం పితాః ।
అనంతం యస్యసైన్యం తచ్చతురంగ సమన్వితం ॥ 3

కథం విజేష్యేతం మాత రుపాయం మేఖిలం వద ।
ఏకవింశతి వారంచ కథం నిక్షత్రియాం మహీం ॥ 4

కరిష్యే వదతత్సర్వం త్వత్ప్రసాదాజ్ఞయో భవేత్ ।
అతులా మమకీర్తిశ్చ సర్వలోకేషు విశ్రుతా ॥ 5

**మాతోవాచ :**

విజయస్తే భవేత్పుత్ర శంకరారాధనం కురు ।
తుష్టే తస్మిన్మహాదేవే సర్వం సేత్స్యతి వాంఛితం ॥ 6

ఇతి తద్వచనం శృత్వా రామ కైలాస మాయయౌ ।
ప్రణమ్య మాతృచరణౌ ఆశిషం ప్రతి గృహ్యాచ ॥ 7

తత్రాపశ్య న్మహాదేవం రత్నసింహాసనే స్థితం ।
బద్ధాంజలిపుటోరామో నత్వా తుష్టావ తంతదా ॥ 8

**రామ ఉవాచ :**

నమో దేవదేవేశ గౌరీశ శంభో నమో విశ్వకర్త్రే నమో విశ్వభర్త్రే ।
నమో విశ్వహర్త్రే నమో విశ్వామూర్తే నమో విశ్వధామ్నే నమ
శ్చంద్రధామ్నే ॥ 9

నమో నిర్గుణాయామల జ్ఞానహేతో నిరాకార సాకార నిత్యాయ తేస్తు ।
నమో వేదవేదాంత శాస్త్రాతిగాయ నమో వ్యక్తవ్యక్తాత్మనే సత్స్వరూప ॥ 10

గుణత్రయ ప్రబోధాయ గుణాతీతాయ తే నమః ।
నమఃప్రపంచ విదుషే ప్రపంచ రహితాయతే ॥ 11

ఈ ఉవాచ :

ఇతి స్తోత్రం సమాకర్ణ్య పరితుష్టో మహేశ్వరః ।
ఉవాచ రామమామంత్ర్య తృప్తో వాక్యామృతేన తే ॥ 12

వరం వృణీష్వ మత్తస్త్వం యంయం కామయసే హృది ।
జానామి జామదగ్న్యంత్వాం రేణుకాతనయం ద్విజ ॥ 13

రామ ఉవాచ :

కార్తవీర్యేణ దుష్టేన కామధేనుమపేక్షతా ।
జమదగ్నిర్హతోరోషా దపరాధం వినాప్రభో ॥ 14

రేణుకాతా డితాబాహ్యై స్సమంతా జ్జననీ మమ ।
ఏకవింశతి సంఖ్యాక్యై ర్భుక్త్వాపి సేనయాసహ ॥ 15

జహి తం దుష్ట నృపతిం ఇతిమాత్రా నియోజితః ।
త్వామహం శరణం యాతః ఉపాయం వద తద్వధే ॥ 16

త్రిస్సప్తకారం తేనైవకుర్యాం నిఃక్షత్రియాం మహీం ।

ఈ ఉవాచ :

ఏవం విదిత తత్వార్థో మహాదేవో జగాదతం ॥ 17

ఆలోక్య ప్రణిధానేన జయోపాయం సుఖావహం ।
షడక్షరం మహామంత్రం ద్విరదానన తోషకం ॥ 18

కథయామాస రామాయ జపం కురు ప్రయత్నతః ।
లక్షమాత్రంచ హోమంచ దశాంశేన సమాచర ॥ 19

తర్పణం తద్దశాంశేన తద్ధశాంశేన భోజనం ।
బ్రాహ్మణానాం మహాభక్త్యా ప్రసన్నా భవితా భువి ॥ 20

గజాననో దేవదేవో సర్వకార్యం కరిష్యతి ।
ఇతి తద్వచనం శృత్వా ప్రణమ్య భవమాదరాత్ ॥ 21

అజ్ఞాంగృహిత్వా రామో సౌ వచలాయాం భ్రమన్నృమన్ ।
కృష్ణాయా ఉత్తర దేశే పశ్యన్ స్థాన మనుత్తమం ॥ 22

నానావృక్ష లతాజాలై రభిరామం సుసిద్ధిధం ।
తత్రా కరోదనుష్ఠానం యథోక్తం తేన శంభునా ॥ 23

ఇంద్రియాణాంచ మనసో వృత్తిం సంస్థాప్య గజాననే ।
ఆవర్తయ న్మహామంత్రం ఏకాంగుష్ట స్థితోద్విజః ॥ 24

జుహావ తర్పయామాస భోజయామాస వై ద్విజాన్ ।
దశాంశేన దశాంశేన దశాంశేన యథా క్రమం ॥ 25

తతః ప్రసన్నో భగవానావిరాసీ ద్గజాననః ।
చతుర్భుజో మహాకాయో మహామాయో తిసుందరః ॥ 26

నాగయజ్ఞోపవీతీ చ నానాలంకార శోభితః ।
ముకుటీ కుండలీ భ్రాజ చ్చారు గండోలసన్ముఖః ॥ 27

ముక్తా ప్రవాళ మాలాభి ర్భ్రాజద్వక్షా మహాభుజః ।
పరశుం కమలం దంతం మోదకాంశ్చ దధద్భుజైః ॥ 28

పుష్కరం పుష్కరే ధృత్వా భ్రామయన్ స్వేచ్ఛయా విభుః ।
ప్రభయా భాసయన్ సర్వా దిశోవిదిశ ఏవచ ॥ 29

దదర్శ రామోకస్మాత్తం న్యమీలయత చాక్షిణీ ।
తత్తేజసా ప్రతిహతేత తస్తుష్టావ తంద్విజః । 30

**రామ ఉవాచ :**

సహస్రాదిత్య సంకాశ నమస్తే పరమేశ్వర
నమస్తే సర్వవిద్యేశ సర్వసిద్ధి ప్రదాయక ॥ 31

విఘ్నానాం పతయే తుభ్యం నమో విఘ్ననివారణ ।
సర్వాంతర్యామిణే తుభ్యం నమ స్సర్వప్రియంకర ॥ 32

భక్తప్రియాయ దేవాయ నమో జ్ఞానస్వరూపిణే ।
నమో విశ్వస్య కర్త్రేతే నమస్తత్పాలకాయచ ॥ 33

నివారయ మహావిఘ్నం తపో నాశకరం మమ ।

**క ఉవాచ :**

ఇతి స్తుతిర సమాకర్ణ్య సౌమ్యతేజా గజాననః । 34
ఉవాచ రామం సంభ్రాంతం స్వస్యైవ తిగ్మతేజసా ॥

**గణేశ ఉవాచ :**

యం ధ్యాయసి దివారాత్రౌ మంత్రం జప్త్వా షడక్షరం ॥ 35

వరం దాతుం సమాయాతః సోహం రామతవా ధునా ।
వరం వృణీష్వ మత్తస్త్వం యద్యద్వాంఛసి చేతసా । 36

బ్రహ్మాండా నామనేకానాం స్రష్టాపాతాపహారకః ।
నైవ జానంతి మేరూపం బ్రహ్మాద్యా మునయో పిచ । 37

రాజర్షయశ్చ సర్వేపి సోహంతే దర్శనం గతః ।

**రామ ఉవాచ :**

యో ప్రయేయోఖిలాధారః సృష్టిసంహార కారకః ॥ 38

యో నవేదైర్న తపసా నయజ్ఞై ర్వ్రతసంచయైః ।
నదానై ర్ధ్యానయోగైశ్చ జనానాం దృష్టిగోచరః ॥ 39

సోహం త్వంహి మయా దృష్టోనుగ్రహాత్తవ విఘ్నపః ।
కిమన్యద్వరయే దేవ భక్తిందేహి నిజాం దృఢాం । 40

**గణేశ ఉవాచ :**

భవితా మమభక్తిస్తే దృఢా రామ ద్విజోత్తమ ।
ప్రలోభితస్యాపి వరైః నతేబుద్ధిః సువిహ్వలా ॥ 41

పరశుం యే గృహాణ త్వం సర్వశత్రు నిబర్హణం ।
నామతే పరశురామేతి త్రైలోక్యే ఖ్యాతిమేష్యతి ॥ 42

**త ఉవాచ :**

ఏవం తస్మై వరందత్వా పరశుం చ గజాననః ।
పశ్యతాం సర్వలోకానాం అంతర్ధానం యయౌ తదా ॥ 43

రామోపి స్థాపయామాస మహాగణపతిం తదా ।

బ్రాహ్మణై ర్వేదవేదాంగ శాస్త్ర విద్భిస్సమం ముదా ।
బ్రాహ్మణాన్ భోజయామాస దత్వా దానాన్యనేకశః ॥ 44

ప్రాసాదం కారయామాస రత్నస్తంభ యుతం దృఢం ।
సంపూజ్య తం పరిక్రమ్య ప్రణిపత్య గజాననం ॥ 45

రామః ప్రసన్న మనసా ప్రయయౌ నిజమందిరం ।
తతోరామోజుహాతోచ్చైః కార్తవీర్యం ధరాపతిం ॥ 46

యుద్ధేతుపాతయామాస రాజ్ఞో బాహూ సహస్రకం ।
నిఃక్షత్రియాం చ పృథివీం చక్రే త్రిస్సప్తవారతః ॥ 47

బ్రాహ్మణేభ్యో దదౌపృధ్వీం యజ్ఞం కృత్వా సదక్షిణం ।
పుపుజ స్తం తదా లోకా జ్ఞాత్వా విష్ణుం తమీశ్వరం । 48

దృష్ట్వా పరాక్రమం తస్య సర్వదేవాతిగం దృఢం ।
ఏవం నానావిధో బ్రహ్మన్ మహిమా తే నిరూపితః ॥ 49

గజాననస్య దేవస్య సంక్షేపేణ మయా సుత ।
నిఖిలేన నశేషోపి క్షమో వక్తుం మునీశ్వర ॥ 50

ఉపాసనాఖండ మిదం శృణుయా న్మానవో భువి ।
సర్వాన్కామా నవాప్నోతి గణేశంధామ చాప్నుయాత్ ॥ 51

యథేష్టం రమతే తత్ర యావదాభూత సంప్లవం ॥ 52

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే రామవరదానం నామ ద్వ్యశీతితమో అధ్యాయః**



# 82-వ అధ్యాయము

# రామవరదానం

ఆ తరువాత వ్యాసమునీంద్రుడు ఇలా ప్రశ్నించాడు. "ఓ చతురాననా! రాముడా బాల్యం వీడనివాడు. అతడు ఒక్కడైవుండి అనంత పరాక్రమోపేతుడు, సహస్రబాహుయుతుడు, చతురంగ బలోపేతుడైన కార్తవీర్యుడిని ఎలా జయించాడు? ఆ గాథను విస్తారంగా తెలుపవలసింది!" బ్రహ్మయిలా బదులిచ్చాడు. "ఓ మునీంద్రా! బాలుడైన రాముడు ఒకనాడు తన తల్లియైన రేణుకామాతనిలా ప్రశ్నించాడు : 'అమ్మా! ఎవరి పరాక్రమంచూసి ఇంద్రాది దేవతలంతా భయంతో గడగడ వణుకుతారో, చతురంగబలాలు ఎవని వెన్నుకాస్తున్నాయో అటువంటి కార్తవీర్యుడిని జయించే ఉపాయం నాకు తెలుపు! నీకోరికమేరకు ధరాతలాన్ని ఇరవైఒక్క పర్యాయాలు ఆ క్షత్రీయాధములపై దండెత్తి 'నిక్షత్రీయ' (క్షత్రీయులే లేకుండా) చేయగల సమర్థత నాకెలా లభ్యమౌతుంది? దీనికిగాను నాకు కర్తవ్యాన్ని ఉద్బోధించు!'

అప్పుడా మాతృమూర్తి వాత్సల్యం ముప్పిరికొనగా ప్రేమతో తన తనయుడి తల నిమురుతూ యిలాఅన్నది : 'నాయనా నీ సంకల్పం నెరవేరటానికి అఘోరరుద్రుని అనుగ్రహం నీకెంతైనా అవసరం! అందు కని నీ పరాక్రమం యినుమడించడానికి నీవు ఆ శివుని ఆరాధించి ప్రసన్నుడిని చేసుకో! ఆ మహాదేవుడు తృప్తిచెందితే నీయొక్క సకల మనోభీష్టాలూ సునాయాసంగా నెరవేరతాయి! నీకు శుభమవుగాక!' అంటూ ఆశీర్వదించి పంపింది. అప్పుడు తనతల్లికి నమస్కరించి ఆమె వద్ద సెలవుతీసుకొని వెంటనే కైలాసానికి ప్రయాణమై వెళ్ళాడు.

## శంకరుడిని రాముడు స్తుతించటం

కైలాసగిరిని చేరుకున్న రాముడు రత్నసింహాసనాసీనుడైన శంకరుని చూచి సాష్టాంగ దండప్రణామాలు ఆచరించి, అంజలియొగ్గి యిలా ప్రార్థించాడు :

"ఓ దేవాధిదేవా! గౌరీమనోహరా! శివశంకరా! నీకిదే నాప్రణతి! విశ్వభర్తవూ విశ్వకర్తవూ ఐన నీకు నమస్కారము. విశ్వలయకర్తవైన నీకు నమస్కారము. విశ్వమే నీవుగా మూర్తీభవించిన ఓ విశ్వమూర్తీ నీకు నమస్కారము. విశ్వానికి ఆధారభూతుడవైన నీకు నమస్సులు! చంద్రకళను లలాటమున ధరించిన భక్తమనోహ్లాదకారీ ఓ బ్రహ్మజ్ఞాన హేతూ నీకు నమస్కారము! నిర్గుణనిరాకార స్వరూపుడవైన నీకు నా శరణాగతి! నీయొక్క మాయచేత సాకారము దాల్చేవాడవు. వేదము లెవ్వరినుండి వెలువడినవో, ఎవ్వరిని వర్ణింప అశక్యములో అట్టి పరమ పురుషుడవగు నీకు నమస్కారము. సత్యమే స్వరూపమైనట్టివాడా! సత్త్వ

రజస్తమోగుణాలకు అతీతుడవై వాటిని ప్రేరేపించు నీకు నమస్కారము. నిష్ప్రపంచ స్వరూపుడవూ సర్వవేత్తవూఐన నీకు మరీమరీ నమస్కారము" అంటూ ఓ వ్యాసమునీంద్రా! రాముడు చేసిన స్తుతికి శంకరుడు అమిత ప్రసన్నుడై 'ఓ రామా! నీవు రేణుకా తనయుడవని తెలుసుకున్నాను. అమృతఝరిలా సాగిన నీవాగ్ధాటికీ, స్తోత్రానికీ కడుంగడు సంతుష్టుడనైనాను. నీవేమి కోరివచ్చావో - చెప్పు!' అన్న భోళాశంకరునికి భక్తితో అంజలిఘటించి రాముడిలా అన్నాడు.

"ఓ దేవా! దుష్టుడైన కార్తవీర్యుడు కామధేనువును చెరపట్టబోగా అతడికి తగ్గశాస్తి జరిగింది! ఆ అవమానానికి కినిసి నాతండ్రియైన జమదగ్నిని నిరపరాధిని, ఒంటరి, బ్రాహ్మణుడూ, బ్రహ్మవేత్తా అనైనా చూడకుండా చంపివేశాడు. వారి ఆతిధ్యాన్ని స్వీకరించి, నిరపరాధియైన నా మాతృమూర్తిపైన నిర్దయతో ఇరవైఒక్క వాడిశరాలను నాటి ఆమెను విగతజీవురాలిని చేశాడు. అట్టి దోషిని దండించమని నా మాతృదేవి ఆన తిచ్చింది! అందుకనే నిన్ను శరణువేడాను. నా కార్యసిద్ధికి అనువైనట్టి ఉపాయం సెలవివ్వు! ఈ ధరామండలాన్ని యావత్తూ ఇరవైఒక్కమార్లు నిఃక్షాత్రముగా చేస్తాను!"

## రామునకు మంత్రోపదేశం

"ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా, జరిగిన విషయమంతా రామునివల్ల తెలుసుకున్న శంకరుడు అతడి విజయప్రాప్తికి అనువైన ఉపాయాన్ని యోచించి గజాననునికి అత్యంత ప్రీతిపాత్రమైనట్టి షడక్షర మహా మంత్రాన్ని ఆ జమదగ్ని సుతునికి ఉపదేశించి

"ఓ రామా! నీవు దీనిని ఉపాసించి నిరాటంకంగా కార్యసిద్ధి ప్రసాదించగల గణేశానుగ్రహాన్ని బడయవలసింది! ఒక లక్షసార్లు జపించి అందులో పదవవంతు హోమాన్ని, అందులో పదవవంతు తర్పణలను, అందులో పదోవంతు బ్రాహ్మణ భోజనాన్ని ఏర్పాటుచేయి! ఈ రకంగా భక్తితో చేసినట్లైతే వరప్రదుడైన గజాననుడు నీకు ప్రసన్నుడౌతాడు. నీ సకల కార్యములు నెరవేర్చగలడు!"

ఈ రకంగా జమదగ్ని నందనుడైన రాముడు శివుని వాక్యములు విని ఆ భవునికి మ్రొక్కి, అతడివద్ద అనుజ్ఞగైకొని, కృష్ణానదికి ఉత్తర దేశంలో తన తపస్సుకు అనువైన ప్రదేశానికై అన్వేషించి, సిద్ధిప్రదమైన నానాలతాకీర్ణమైనట్టి ప్రదేశంలో కూర్చుండి, శివుని ఆజ్ఞానుసారం అనుష్టానం చేశాడు. మనస్సును, ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును ఏకాగ్రపరచి గజాననుని దివ్యమంగళమూర్తిపై లగ్నంచేసి, పాదాంగుష్టంపై నిలిచి మంత్రావృత్తినిచేస్తూ జపించి, హోమ, తర్పణాదికములనూ, బ్రాహ్మణ భోజనాదికములు యధావిధిగా ఆచరించాడు!

అప్పుడు అమితమైన కాంతితో, అతిసుందరమైన ముగ్ధమోహనమైన ముఖముతో పెద్ద ఉదరమూ, నాల్గు బాహువులూ ధరించి, కిరీటము, హారకేయూరములను ధరించి, నాల్గుహస్తములలోనూ పరశువు, పద్మము, దంతము, మోదుకములను దాల్చి, సుందరమైనట్టి తన తొండమునూ అటూయిటూ త్రిప్పుతూ, నాల్గుదిక్కులనూ తన అద్భుతమైన కాంతితో ప్రకాశింపజేస్తూ, విఘ్నేశ్వరుడైన గజాననుడు రామునికి సాక్షాత్కరించాడు! కన్నులు మిరుమిట్లుకొలిపే దివ్యకాంతితో

కోటి సూర్యసమమైన ప్రకాశం కనబడటంతో కన్నులు మూసుకొని "ఓ మహనీయమూర్తీ నీకిదే నమస్కారం! అంటూ ఇలా స్తోత్రంచేశాడు. "సకలవిద్యాధీశుడవూ, సకలాభీష్ట ప్రదుడవై సకల యత్నకార్యములనూ సిద్ధింపచేయగల విఘ్నహరా! నీకు యిదే నా శరణాగతి! భక్తాభీష్ట ప్రదుడవూ భక్తులకిష్టుడవూ, జ్ఞానమే మూర్తికట్టినట్టి విఘ్నాధిపా! నీకు నా నమస్కారము! విఘ్నములకు ప్రభువువైన ఓ పరాత్పరా! తపోనాశ కరములైన సకల విఘ్నములబారినుండీ నన్ను రక్షించు!"

ఈ విధమైన స్తోత్రానికి సంతుష్టుడైన గణేశుడు తన తీక్షణ తేజస్సుచేత భ్రాంతచిత్తుడైన జమదగ్నినందనునితో మేఘగంభీరధ్వనితో యిలా అన్నాడు. "ఓ రామా! అహోరాత్రములు తదేకదీక్షతో నిష్ఠగా షడక్షరీమంత్రముతో నీవు ఎవరినైతే హృదంబుజములో ధ్యానిస్తున్నావో, ఆ మంత్రాధిష్టాన దేవతనైన నేను నిన్ననుగ్రహించతలచి వచ్చాను. నీకు కావలసిన వరముల నన్నిటినీ యధేచ్ఛగా కోరుకో! అఖిల బ్రహ్మాండములకు సృష్టిస్థితిలయ కారకుడనైన నా ఈ దివ్యరూపాన్ని బ్రహ్మాదిదేవతలుగాని, మునీశ్వరులుగాని రాజర్షులుగాని తెలియ్యలేరు. నీయందలి అనుగ్రహవిశేషంచేత నీకు నా సగుణ స్వరూప దివ్యదర్శ నాన్ని ప్రసాదించాను!"

"ఓ దేవాధిదేవా! సకల జగాలకూ ఆధారభూతుడవూ, ఈ యావత్ సృష్టికీ సృష్టి, స్థితి, లయకారకుడవూ, వేదములచేత్త యజ్ఞయాగాది కర్మలచేతా, యోగముచేతా కనుగొనబడజాలనివాడవూ ఐన నీవు నాయందలి యనుగ్రహవిశేషంచేత ఇప్పుడిలా సాక్షాత్కరించావు! నాకు

నీ చరణారవిందాలయెడ ధృఢమైన భక్తిని ప్రసాదించు!" అంటూ వేడుకొనగా వరప్రదుడైన గణపతి యిలాఅన్నాడు.

"ఓ రామా! నీకు నాయందు ధృఢమైన భక్తి కలుగగలదు! వరములనిస్తానని ప్రలోభపెట్టినా నీబుద్ధి అచంచలంగా నిలవటం కేవలానుగ్రహ విశేషమే! సర్వశత్రువులను నశింపచేసేటటువంటి నా 'పరశువు'ను నీకు ప్రసాదిస్తున్నాను. దీనివల్ల ఈనాటినుంచి నీపేరు **"పరశురాముడని"** జగద్విఖ్యాతమౌతుంది!" అంటూ మంగళప్రదమైన చిరునవ్వు ప్రసన్నంగా తన మోమున వెదజల్లుతూండగా ఆ గణేశుడు అంతర్ధానం చెందాడు.

అప్పుడు ఆ పరశువును గ్రహించి పరశురాముడై, ఆ జమదగ్ని నందనుడు వేదవేదాంగవిదులతో అక్కడనే గజాననుని మూర్తిని ప్రతిష్ఠించి రత్నస్థంభయుతమైన మంటపాన్ని, ఆలయప్రాసాదాన్ని నిర్మించి, ప్రదక్షిణ నమస్కారాదులను సమర్పించి, బ్రాహ్మణులకు భోజనాదులనుపెట్టి శ్రద్ధగా అనేక దానధర్మాలు చేశాడు. నిర్మలాంతఃకరణతో పరశురాముడు తన నిజమందిరానికి తిరిగి వెళ్ళాడు.

అనంతరం ఉచ్చైఃస్వరముతో కార్తవీర్యుడిని యుద్ధానికి కవ్విస్తూ ఆహ్వానించి, యుద్ధరంగంలో ఆతడి వేయి బాహువులను ఖండించి, ఇరవైఒక్కమారులు భూమిని నిఃక్షాత్రము చేశాడు. ఆ తరువాత యజ్ఞము నాచరించి భూమి నంతటినీ బ్రాహ్మణులకూ దక్షిణగా ఇచ్చివైచాడు. సర్వదేవతలు దిగ్భ్రాంతులయ్యేటంతటి ఆతడి పరాక్రమంచూసి ప్రజ

లందరూ అతడిని విష్ణ్వంశ గలవానిగా పూజించారు. ఓ వ్యాసమునీంద్రా! ఈవిధంగా గజాననుని నానావిధ అనుగ్రహవంతములైన మహిమలను సంక్షేపంగా వర్ణించిచెప్పాను. ఆ మహిమలను అంతా పూర్తిగా వర్ణించడం వేయినాల్కలుగల శేషునికికూడా తరం కాదు!

ఈ ఉపాసనాఖండమును ఏ మానవులైతే శ్రద్ధాభక్తులతో వింటారో, అట్టివారు ఇహలోకములో తమ సకల మనోభీష్టములనూ పొంది, అంత్యకాలములో గణేశలోకాన్ని పొందుతారు. ప్రళయకాల పర్యంతం ఆ లోకంలో యధేచ్ఛగా రమించగలరు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'రామవరదానం' అనే 82-వ అధ్యాయం.



# 83

# తారకోపాఖ్యానం

(మూలం)

### త్రి -అశీతితమో అధ్యాయః

**మునిరువాచ :**

కస్మిన్స్థానే తపో కారి రామేణ పరమాద్భుతం ।
తన్మే కథయ లోకేశ తృప్తిర్మే నాస్తి శృణ్వతః ।     1

**క ఉవాచ :**

మయూరేశ్వర నామా యత్ క్షేత్రం ఖ్యాతం చతుర్యుగే ।
యత్రావతీర్ణో దేవేశో మయూరారూఢ ఏవ సః ।     2

కమలాసుర నామానం అహిన ద్దైత్యపుంగవం ।
యస్మాన్మ యూర మారూఢో మయూరేశ ఇతి స్మృతం ॥     3

సంస్థుతో దేవ మునిభి ర్లోకే తాం ఖ్యాతి మాగమత్ ॥
తత్రానుష్ఠాన మకరో దవాప పరశుంతతః ॥     4

స్వయం - పరశురామో భూన్నామ్నా ఖ్యాత స్త్రీవిష్టపే ।
ఇతిహాసం ప్రవక్ష్యామి శృణు తం మునిసత్తమ ॥ 5

తారకో నామదైత్యో భూన్మహాబల పరాక్రమః ।
దివ్య వర్షసహస్రం స తపస్తేపే సుదారుణం ॥ 6

తతః ప్రసన్నో బ్రహ్మాస్మై దశాసర్వా భయం తదా ।
దేవర్షి యక్ష గంధర్వోరగ రాక్షస హస్తతః ॥ 7

తచ్ఛస్త్రాస్త్ర గణాన్మృత్యుః నతే క్వాపి భవేదితి ।
ఉత్పత్స్యతే యదాస్కంద స్తతస్తే మరణం భవేత్ ॥ 8

ఇతి తద్వరమాకర్ణ్య బలగర్వసమాయుతః ।
తారకో పీడయన్లోకాం స్త్రైలోక్యే వసతోమునే । 9

వేదాధ్యయన విష్టాంశ్చ తపోనుష్టాన కారిణః ।
అగ్నిహోత్ర రతా న్యన్యాన్కారాగారే క్షిప ద్విజాన్ ॥ 10

సర్వాన్ రాజ్ఞో ధనాగాంశ్చ వశేకృత్వా దివం యయౌ ।
ఇంద్రాదయ స్తదాదేవా హిమాచల గుహాంగతా ॥ 11

తద్భయాన్నో భవత్క్వాపి యజనం పూజనం తథా ।
అహమేవేశ్వరో దేవో బ్రాహ్మణః కులదేవతా॥ 12

అహం నమస్యః పూజ్యశ్చ నాన్యోజగతి వర్తతే ।
యశ్చాన్యానే ప్రణమేత్క్వాపి పూజయేద్వా కదాచన ॥ 13

సదండ్య స్త్రాడవీయస్యా ద్గచ్ఛేద్వా యమసాధనం ।
ఏవం సర్వేషు లోకేషు ఖ్యాపయామాస దూతతః ॥ 14

తత్పస్సర్వే జనారిక్తా జాతా సజ్జనవర్జితాః ।
నిస్స్వాధ్యాయ వషట్కారా యజ్ఞ దాన వివర్జితాః ॥ 15

ఉచ్ఛిన్న కులధర్మాశ్చ స్వాచార రహితాఃఖిలాః ।
మునయః సాధవస్సర్వే గిరిగహ్వర మాశ్రితాః ॥ 16

దేవం ప్రార్థయామాసుః కథం దైత్యో వివర్ధితః ।
వినా త్వాం శరణం శంభో యామః కం జగధీశ్వరం ॥ 17

నిర్మాతా రక్షితా ధాతా సంహర్తా జగతాం విభో ।
దావానలో వనమివ దహతే స్మాన్ సదర్పతః 18

యదితే సంజీహీర్షాస్యాత్సంహరస్వ స్వయం జగత్ ।
నోచేత్సంహర దైత్యం త్వం తారకం సర్వపీడకం ॥ 19

ఏవం సంప్రార్థ్యతేషు స్తే దుశ్చరం తప ఉత్తమం ।
పత్రభక్ష్యా వాయుభక్ష్యా నిరాహారా జలాశినః ॥ 20

ఏవం స్థితేషు మునిషుతే నాజ్ఞాతేషు దైత్యరాట్ ।
ఐంద్రం పదం సమాస్థాయ బ్రహ్మాణం సమతాడయత్ ॥ 21

విష్ణుస్తతో గమత్ క్షీర సాగరం నిద్రితుం మునే ।
త్యక్త్వా కైలాస మగమచ్ఛంకరో పి గుహాంతరం ॥ 22

దిక్పాలా దిగ్గజాశ్చాపి నానా గహ్వర మాశ్రితాః ।
తేషాం స్థానే స్థాపయత్స దైత్యా నన్యాంశ్చ దైత్యరాట్ ॥ 23

అచలా మచలస్తిష్టన్ పాలయామాస వై ప్రజాః ।
గర్జతే స్వస్వభావేన కంపతే థ త్రివిష్టపం ॥ 24

తత ఇంద్రాదయో దేవా స్తుష్టువు ర్గిరిగహ్వరే ।
గిరీశం గిరిజా నాథాం గిరా గంభీరయా ముదా ॥ 25

**దేవఊచుః :**

దేవాధి భూమి గగనే నశశిస్వరూప వాయ్వగ్ని ।
రూప యజమాన జలస్వరూప ।
త్వం స్థావరానథ చరాన్ సృజసేఽవంశీశ త్వం సర్వమేవ హరసే
నిజయేచ్ఛ యేశ ॥ 26

తన్నోచితం త్వయిపరే పర దుఃఖ హారిన్ స్వీయం యశః
పరగతం బహుధాద్య కర్తుం ।
తన్నాశయైన మధవా సకలాన్మునీంశ్చ దేవాన్త్వయోశ్చ
భజనే పరివిష్ట చిత్తాన్ ॥ 27

కంవా వ్రజేమ శరణం త్వదృతే గిరీశ కంభజేమ
భగవం స్త్వదృతే మహేశ ।
కంవా వదేమ వృజినార్ధన పార్వతీశ, కోవా వితుం
ప్రభవతి త్వదృతేఽ ఖిలేశ ॥ 28

శ్రీ శుక ఉవాచ :

ఏవం తుష్టువుర్యావచ్ఛుశ్రువుస్తావ దేవహిః
నభో వాణీం సర్వదేవా హరపుత్రో యదా భవేత్ ॥ 29

తదాస్య నాశో భవితా యత్నం కురుత తత్ర వై ।
నభోవాణీం సమాకర్ణ్య సర్వే హర్షసమన్వితాః ॥ 30

కైలాసం దేవనిలయమాపు రింద్రాదయ స్సురాః ।
నాపశ్యత్ శంకరం తత్ర దృశుః పురతో మరాః 31

మూలప్రకృతి రూపాం తా ముమాం సర్వే విజిజ్ఞపుః ।
తారకే తారక జ్ఞానప్రదే తారయ తారకాత్ ॥ 32

త్రైలోక్య పీడకాద్దుష్టాత్ పరభ్రష్టా న్మునీన్సురాన్ ।
తథా విచింత్య తాంశః తస్యనాశో భవేద్యథా ॥ 33

మాతస్త్వాం ప్రణమామ లోకజననీ త్రైలోక్య రక్షాకరే శర్వాణీ
త్రిపురే పరాత్పర తరే బ్రహ్మాదిభి స్సంస్తుతే ।
త్వం వేదై రనిరూపితే కురు జగత్కల్యాణ మీశప్రియే స్వేచ్ఛా
పాత్త సువిగ్రహే సురహరే విశ్వాధిభూతే నఘే ॥ 34

శ్రీ శుక ఉవాచ :

ఏవం సంప్రార్థితా దేవీ విశ్వమాతా జగాద తాన్ ।
నభోవాణీ మయాజ్ఞాతా శంకరః శంకరిష్యతి ॥ 35

సహైవ యాంతు సర్వేపి మయాయత్ర సశంకరః ।
పరం నియమమాసాయ కురుతే పరమం తపః ॥ 36

ఇత్త్యుక్త్వా సర్వదేవా న్స్వాభిల్లీ వేషమధారయత్ ।
యాం దృష్ట్వా పరమోయోగీ కామబాణార్దితా భవేత్ ॥ 37

దేవే అపి తదాకేచిజ్ఞాతా మదనవిహ్వలాః ।
ఊర్వశీ మేనకా రంభా పూర్వచిత్తే రతిస్తథా ॥ 38

లజ్జితా తాంనిరీక్ష్యేవ సర్వావయవ సుందరాం ।
తేదేవాసాచ గిరిజాం ప్రాప బ్రహ్మన్ శివాంతికం ॥ 39

స్థాణుం తం స్థాణుభూతంచ ధ్యాననిశ్చల లోచనం ।
ధ్యాయంతం మనసాబ్రహ్మ జపంతం నిష్పరిగ్రహం ॥ 40

దదృశు స్సర్వదేవాస్తే భిల్లీ చాపిత్రిలోచనం ।
తత ఊచేఖిలాన్దేవా నుమో పాయం సుఖావహం ॥ 41

దేహాతీత ఇవాస్తేసౌ తపోనిష్ఠః సదాశివః ।
ఏతస్య దేహభావార్థం కామం విజ్ఞాపయంతు చ ॥ 42

తేనేషుణా యదావిద్ధ ఏకనిష్ఠః సదాశివః ।
యాస్యతే దేహభావం స తదాకార్యం భవిష్యతి ॥ 43

తతో దేవాః సర్వఏవ కామం సస్మరురుత్కటం ।
సమాగతం తమూచుస్తే స్వకార్య కృతనిశ్చయాః ॥ 44

ప్రార్థయామాసు రపరే స్వకార్యాయ మనోభవం ।
విభుస్త్వమసి లోకానాం చరేషు స్థావరేషు చ ॥ 45

త్వయైవ జాయతే సృష్టి స్త్వయావ్యాప్త మిదంజగత్ ।
అబలాః కామినస్సర్వే త్వయైవ బలవత్తరాః ॥ 46

త్వయావినా వృథాసర్వం జగస్థావర జంగమం ।
అతస్త్వయై కర్తవ్యం సర్వేషాం కార్యముత్కటం ॥ 47

**కామ ఉవాచ :**

యద్యప్యహం విసామగ్రి స్తథా యుష్మత్ప్రసాదతః ॥
కరిష్యామి వచఃకార్య మాదేహపతనావధి ॥ 48

సుమం ధనుర్మరాలాజ్యేషుః కాటాక్షో థయోషితః ॥
విజేష్యేథిపి సకలా నమరా న్సంకరావధి ॥ 49

వసంతం ప్రతి లబ్ధ్యైవ సహాయం సకలం సురాః ।

**క ఉవాచ :**

ఏవముక్త్వా గతఃకామః యత్రాస్తేసౌ సదాశివః ।
మోహితుం శంకరం దేవం దేవానాం కార్యసిద్ధయే ॥ 50

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే తారకోపాఖ్యానం**
**నామ త్ర్యశీతితమో అధ్యాయః**



## 83-వ అధ్యాయము

# తారకోపాఖ్యానం

అనంతరం వ్యాసమునీంద్రుడు చతురాననుని ఇలా ప్రశ్నించాడు. "ఓ చతురాననా! జమదగ్నినందనుడైన పరశురాముడు అద్భుతమైన తన తపస్సును ఎక్కడ ఎలా ఆచరించాడో, చివరకు గణేశుని ఎలా ప్రసన్నుని చేసుకోగలిగాడో ఆ వృత్తాంతమును నాకు విస్తారంగా చెప్ప వలసింది!"

అప్పుడు చతురాస్యుడిలా చెప్పాడు : "ఓ వ్యాసమునీంద్రా! పరశువును సాధించుకున్న ఆ రాముడు తన తపశ్చర్యను మయూరేశ్వ రంలో చేశాడు. మయూరేశ్వరుడు ఈ క్షేత్రానికధిపతి! ఈ మయూరేశ్వరం లోనే ఆతడు కమలాసురుడనే రాక్షసునికూడా వధించాడు. అక్కడే మయూరాన్ని వాహనంగా అధిష్టించాడు. ఆ కార్యం దిగ్విజయంగా

పూర్తిచేసుకుని దేవతాగణములచేత మునులచేతా కొనియాడబడినాడు. ఆ మయూరక్షేత్రంలోనే అనుష్ఠానంచేసి రేణుకాతనయుడు గణేశానుగ్ర హాన్నీ తద్వారా పరశువునూ ఆయుధంగానూ పొందాడు. ఆనాటినుంచీ ఆతడు 'పరశు రాము'డన్న పేరుతో ఖ్యాతిగాంచాడు.

ఈ విషయమై నీకో ఇతిహాసాన్ని చెబుతాను విను! పూర్వం తారకుడనే మహాబలసంపన్నుడైన రాక్షసుడుండేవాడు. వాడు రెండువేల దివ్య సంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై "ఓ తారకా! నీకు దేవర్షి, యక్ష, గంధర్వ జాతులవల్లకాని, సర్పముల వల్లకాని, రాక్షసులవల్లగాని వారి శస్త్రాస్త్రములవల్లగాని మృత్యువు లేకుండుగాక!" అంటూ వరాన్నిచ్చాడు. ఇలా బ్రహ్మనుండి పొందిన వరముచేత గర్వితుడై ఆ తారకుడు మూడులోకాలవారినీ పీడించ సాగాడు. సాధువులను వేదాధ్యయనపరులను, తపోనిష్ఠాగరిష్ఠులైన మహర్షులను వేధించసాగాడు. వారిని తన కారాగృహములో బంధించి హింసించసాగాడు. పాతాళ, నాగలోకాలనూ, మర్త్యలోకాన్నీ బలంతో స్వాధీనంచేసుకుని స్వర్గలోకానికి కూడా దాడికివెళ్ళాడు. వాడికి భయపడి శచీపతి మొదలైన దేవతలు స్వర్గంనుండి పారిపోయి హిమ వత్పర్వత గుహలలో తలదాచుకున్నారు.

ఆ తారకుడికి భీతిల్లి సర్వత్రా యజ్ఞయాగాదులు, దేవతాపూజలు నిలిపివేశారు. ఆ తారకుడు సైతం అహంకరించి "నేనే బ్రాహ్మణులకు అర్చనీయుడిని! నేనే పూజనీయుడను! సకల జనములచేత నమస్కరింప బడ తగినవాణ్ణి! ఇంకెవరినైనా పూజించినా, అర్చించినా అలా అర్చించి

పూజించినవారు దండింపబడతారు!" అంటూ సకల లోకాలలోనూ ప్రక టింపచేశాడు.

అప్పట్నుంచీ అంతటా జనులు స్వాధ్యాయాన్ని, యజ్ఞయాగాదికా లను వర్జించి, వ్యర్థులైపోయారు. కులధర్మములన్నీ విచ్ఛిన్నమైనాయి. సాంప్రదాయాన్ని వదలుకోలేని సదాచారపరాయణులు, మునులు, సాధు వులు పర్వతగుహలలో దాగికొని యిలా దేవతాప్రార్థనలు చేయసాగారు.

'ఓ శంకరా! భక్తవశంకరా! ఈ ఘోరరాక్షసుడివల్ల ఈ బాధలేమిటి ప్రభూ? వీడు యిలా విచ్చలవిడిగా అడ్డూఅపూ లేకుండా ప్రాణికోటిని క్షోభింపచేస్తున్నా చూస్తూ ఊరుకున్నావేమి స్వామీ! నీకన్నా మరిమాకు దిక్కెవరు? ఎవరిని మేము శరణువేడము? నీకు మాపై సంహారేచ్ఛ కలిగితే అలాగేకానీ! లేదా సర్వులనూ పీడిస్తున్న ఈ తారకుడిని సంహ రించి వాడి పీడనుండి మాకు విముక్తి కలిగించు!" అంటూ దేవతా గణాలు ఆర్తితో ప్రార్థిస్తూ దుష్కరమైనట్టి ఘోరతపస్సును చేయసాగారు. కేవలము గాలినే భక్షిస్తూ తపస్సు చేస్తూండగా, ఆ తారకుడు మళ్ళీ వారిపై విజృంభించి అమరావతిపై దండెత్తి ఇంద్రపదాన్ని ఆక్రమించాడు. బ్రహ్మలోకంపైకి దండెత్తివెళ్ళి బ్రహ్మనూ చావమోదాడు. వైకుంఠానికి దాడికెళ్ళగా శ్రీమహావిష్ణువు క్షీరసాగరంలోకి నిద్రలోకి వెళ్ళిపోయాడు. అప్పుడు కైలాసంపైకికూడా దండెత్తగా శంకరుడుసైతం కైలాసంవీడి గుహాంతరములో తలదాచుకున్నాడు. దిక్పాలకులు దిగ్గజములు కూడా స్థానభ్రష్టులై పర్వతగుహల నాశ్రయించారు. వారి స్థానాలలో దైత్యులను నియమించాడు తారకాసురుడు! భూమండలాన్ని యావత్తూ నిష్కంట

కంగా పరిపాలించసాగాడు. ఇంద్రాది సకలదేవతలు గంభీరంగా గుహ లలో నుండే ఉమానాధుని స్తుతించసాగారు.

## దేవతాగణముల శివస్తుతి :

"ఓ గిరిజారమణా! భూమ్యాకాశములూ, సూర్యచంద్రులు, ఆపస్సు అగ్ని, వాయువు, యజమానుడు అనే ఎనిమిదిరూపాల్లో విస్తరించిన అష్టమూర్తి స్వరూపుడవు!

స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తునకు సృష్టి స్థితి లయకర్తవూ నీవే! ఓ పరాత్పరా! భక్తపరాధీనుడవు, భక్తార్తిహరుడవన్న నీ చిరకీర్తి అపహసించబడరాదు! కనుక నీవే పూనుకొని ఈ దుష్టదానవుడి వినాశం కావించు! మా ఆర్తిని తొలగించు. దుఃఖంతో వికలచిత్తులమైన మాకు స్వస్థచిత్తాన్ని కలిగేలా మమ్మలను రక్షించు! అన్యధాశరణం నాస్తి! త్వమేవ శరణం మమ!" అంటూ పరిపరి విధాల ప్రార్థించినా ఫలితం లేకపోవటంతో తమ ఎదుటేఉన్న మూలప్రకృతి స్వరూపిణియైన జగన్మాతతో తమ కష్టాలను విన్నవించుకున్నారు.

## దేవీస్తుతి :

"ఓ జగన్మాతా! భక్త ఆపన్నివారిణీ! జ్ఞానప్రదాయినీ! భవతారిణీ! ఈ దుష్టతారకుని బారినుండి మమ్మలను కాపాడు! దేవతలపాలిట శాపంవలే సంప్రాప్తమైన ఈ పీడాకారునివల్ల పదభ్రష్టులమై అరణ్యాల పాలయ్యాము. ఓకరుణామయీ! జగజ్జననీ! త్రైలోక్యరక్షాకరీ! శర్వాణీ! చిత్కళారూపిణీ! నీకు నమస్కారము! బ్రహ్మాది దేవతలచే నిత్యం కొనియాడబడే దానవు! వేదాలకు సైతం కనుగొనజాలని ఉన్నతస్థితి

యందుండే ఓ ఈశ్వర ప్రియపత్నీ! దివ్యమంగళరూపిణివీ అసుర సంహారిణివీ నీవే దయతో పూనుకొని జగత్తుకు అభయాన్ననుగ్రహించు. జగత్కళ్యాణాన్ని చేయి." అంటూ చేసిన దేవతల ప్రార్థనను ఆలకించి జగన్మాతయైన పరాశక్తి యిలా పలికింది!

"ఓ దేవతలారా! ఈ విషయమై ఆకాశవాణి చెప్పినది నేనెరుగుదును. మీకు భక్తార్తిహరుడైన శంకరుడే సుఖాన్ని కలుగజేయగలడు! ప్రస్తుతం విరాగియై యోగంలో నిర్వికల్పసమాధిస్థితుడై ఉన్నాడు. మనమందరమూ ఆయన సన్నిధికి తరలి వెళదాముురండి!" అంటూ ఆ జగన్మాత పరమసుందరమైనట్టి 'భిల్లి' వేషమును దాల్చింది! శంకరుడినే మోహింప చేయదలచి, పరమ సుందరరూపాన్ని దాల్చిన ఆ శర్వాణి అందానికి అప్సరసలు సిగ్గుచెందారు.

ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా దేవతలందరూ ఆ జగన్మాతతో కలిసి శివసన్నిధిని చేరుకున్నారు. నిశ్చలంగా స్థాణువై పరబ్రహ్మను ధ్యానిస్తున్న యోగీశ్వరుడైన శంకరుడిని చూచారు. అప్పుడా దేవతల నుద్దేశించి దేవి ఇలాఅంది :

"ఓ దేవతలారా! దేహాతీతస్థితిలో నిర్వికల్ప సమాధిస్థితుడై ఉన్న ఈ శంకరుడికి దేహభావం కల్గిస్తేనే మీకార్యం నెరవేరుతుంది. అందుకుగాను మీకో ఉపాయం చెబుతాను!

పంచశరుడైన మన్మధుడిని ముందుగా మీరు ఆశ్రయించండి! అతని శరముతో కొట్టబడి వికల్పం చెందితేనే శివుడు దేహభావాన్ని పొందతాడు. అప్పుడే మీకార్యం నెరవేరుతుంది!" అనగానే దేవతలు

వెంటనే మనస్సులో మన్మధుణ్ణి స్మరించారు.

"ఓ మన్మధా! ఈ సృష్టినంతటినీ నిర్విఘ్నంగా నడిపిస్తున్నది నీవే! నీవే ఈ జగత్తంతాకూడా వ్యాపించిఉన్నావు! నీయొక్క ప్రభావంచేతనే స్త్రీలు, కామినులు బలవత్తరులౌతున్నారు. నీవులేనిదే స్థావరజంగమాత్మక మైన ఈ జగత్తంతా వృధా! కనుక నీవే మాకార్యాన్ని నెరవేర్చగల సమర్ధుడవు! దేవకార్యాన్ని నీవే పూనుకొని నిర్వహించు!" అంటూ ప్రార్ధించారు.

"ఓ దేవతలారా! నావద్ద ఈకార్యాన్ని సాధించటానికీ ఏరకమైన సాధనాసంపత్తీ లేదు! ఐనప్పటికీ 'మీ అనుగ్రహంమేరకు, నాశరీరం ఉన్నంతవరకూ మీకార్యసాధనకై పాటుపడతాను. పుష్పధనుస్సు, మరాళ ములనే నారి, స్త్రీల క్రీగంటిచూపులనే బాణాలతో శంకరునేకాదు సమస్త దేవతలనీకూడా వసంతుని సహాయంగా గైకొని సర్వమునూ జయింప గలను."

అంటూ ఓ వ్యాసమునీంద్రా! ఈ రకంగా శంకరుని మోహింప జేయ సంకల్పించిన మన్మధుడు దేవతాకార్యసిద్ధికై శంకరుడు తపస్సు చేసు కుంటున్న తపోవనాన్ని చేరుకున్నాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'తారకోపాఖ్యానం' అనే 83-వ అధ్యాయం.



84

# కామదహనం

(మూలం)

## చతురశీతితమో అధ్యాయః

## కామ తపోవన ప్రవేశం

**త ఉవాచ :**

ఏవముక్త్వా గతః కామః సురకార్యార్థ సిద్ధయే ।
అపశ్యచ్ఛంకరం స్థానం వృక్షవల్లీ సమాకులం ॥ 1

సింహ శార్దూలజుష్టంచ పక్షి శ్వాపద సంయుతం ।
స్వయంచ నిర్మయే మాయావాటికాం తత్ క్షణేనసః ॥ 2

సరోవరాణి భూరీణి సుధారూప జలాని చ ।
అనేక కుసుమాన్వృక్షా నాగవ్యాతి సుగంధిభిః ॥ 3

జంబ్వామ్ర బదరీవృక్షాన్ సుపక్వ ఫలశాలినః ।
తథైవ రంభాపనసా నారికేళీ స్సఖర్జూరీః ॥ 4

ఏలా లవంగ మారీచ వృక్ష్యా నన్యానవేకశః ।
అగృహ్యమాణే గంధోసౌ హర నాసాపుటం యయౌ ॥ 5

ఉషః కాలే హరోపశ్య జ్యోత్స్నాజల మనోహరం ।
అనేక ఫల పుష్పాఢ్యం కామకానన మద్భుతం ॥ 6

తద్రైవ భేదయామాస మానసం శూలినస్తతః ।
స్వీయామశోకవనికాం ధిక్చక్రే మనసా శివః ॥ 7

దేహభావం గతోదేవ శ్చింతయామాస కారణం ।
కృతం కేన తపోవిఘ్నం కృతమేతద్వనం శుభం ॥ 8

అకస్మాద్రచితం కేన దుష్టేనేదం గతాయుషా ।
అబధ్య భ్రుకుటీ రోషాదా రక్తనయనోదరః ॥ 9

కామస్తు భయసంక్రస్తో లీనః క్వాపినగృహ్యేతే ।
ఇంద్రాదీన్సస్మార స్మృతాస్తే నాత్రతే యయుః ॥ 10

విమానాని సమారూఢాః కార్యసిద్ధీచ్ఛయాసురాః ।
శివేన దదృశే తావ న్మదనేతి లఘుఃకృశః ॥ 11

ఉద్ఘాటయం స్తృతీయం సనేత్రం దగ్ధం మనోభవం ।
చకంపే పృథివీ సర్వా స్వర్గః పాతాళ మేవచ ॥ 12

మా జహీతి బ్రువన్దేవా యావత్తా వత్సనేత్రజః ।
చకార భస్మసా త్కామం భస్మమాత్రావ శేషితం ॥ 13

తతో భిల్లీ మహేశానం ప్రార్ధయామాస సాదరం ।
నమస్కృత్వాంజలిం బధ్వా త్రైలోక్య హితకామ్యయా ॥ 14

త్రైలోక్యదాహకం వహ్ని ముపసంహర శంకర ।
బ్రహ్మా లబ్ధవరో దైత్య స్తారకేతి మహాబలీ ॥ 15

అక్రాంతం తేన త్రైలోక్యం నిస్స్వాధ్యాయం నిరాహుతి ।
స్థానచ్యుతాః సురాస్సర్వే త్వాం దృష్ట్వా తపసిస్థితం ॥ 16

త్వరయా కామమా మంత్ర్య దేహభావాయ తేనఘ ।
అప్రేషయన్ సవై భస్మజాతః శ్రేష్టాపరాధతః ॥ 17

ఇదానీం దేవరక్షాస్మాం స్త్వామేప శరణం గతాన్ ।
విఖ్యాత స్త్రిషులోకేషు శరణాగత పాలకః ॥ 18

క్షమస్వ కృపణానాం త్వం దేవానాం శరణైషిణాం ।
అపరాధం మహాదేవ కరుణాకర శంకర ॥ 19

**త ఉవాచ :**

ఇతి తస్యావచశ్శ్రుత్వా స్వాంఘ్రిస్థ శిరసోమునే ॥
జగాద హాస్యవదనో వహ్నిం సంహృత్య శంకరః ॥ 20

ఉత్తిష్ఠోత్తిష్ఠ దేవానాం రక్షణం కృతమద్యయే ।
పాదయోః పతితాయాస్తే వచసా ప్రణయేనచ ॥ 21

తత ఆలింగ్యసహసా ఖిల్లీ మంకమథానయత్ ।
వృషమారుహ్యచ తయా సార్ధం కైలాసమాగమత్ ॥ 22

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే కామదహనో నామ**
**చతురశీతితమో అధ్యాయః**



## 84-వ అధ్యాయము

# కామదహనం

"ఓ వ్యాసమునీంద్రా! ఆ విధంగా మన్మధుడు సింహశార్దూలాది క్రూరజంతువులతోకూడి, నానావృక్షములతోనూ, లతలతోనూ దట్టంగా అల్లుకున్నట్టి శంకరుని తపఃస్థానాన్ని చూసి తానుకూడా ఒక మాయా వాటికను నిర్మించాడు. అందులో మధురమైన జలాలతో నిండిన సరో వరాలతోనూ, దివ్యమైన సుమసౌరభాన్ని ఒక క్రోసెడు దూరంవరకు వెదజల్లే నానా పుష్పవృక్షాలతోనూ, మామిడి, పనస, అరటి, ఖర్జూరము వంటి ఫలవృక్షాలతోనూ ఉన్న ఒక సుందర వనాన్ని నిర్మించాడు. ఆ పుష్పముల దివ్యసుగంధం ఘోరతపోనిష్ఠలోవున్న శంకరుని నాసికాపుటా లలో దూరింది! సూర్యోదయ కాలాన మనోహరమైన జలమును, అనేక ఫలపుష్పాలతో ఒప్పే ఆ మదనునిచే నిర్మితమైన కామోద్యానమును

చూడగానే శివుని మనస్సు చలించింది. తన తపోవనాన్ని అలా పేలవంగా ఉన్నందుకు నిందించాడు. అనుకోకుండా ఈ విధంగా అకస్మాత్తుగా దేహభావాన్ని పొందిన శంకరుడు 'ఈ వికల్పానికి కారణమేమిటా?' అని యోచించాడు.

"ఇలా నా తపస్సుకు విఘ్నం కల్గించటానికి సాహసించిన వాడెవ్వరు? ఈ మన్మోహనకరమైన అరణ్యం ఎవరిచే నిర్మించబడింది? ఎవడికి యిటువంటి పోగాలము దాపురించింది?" అనుకుంటూ శంకరుడు క్రోధపరవశుడైనాడు. కోపంతో ముడివడిన కనుబొమ్మలతోను, ఎఱ్ఱబారిన విశాల నేత్రములతోనూ ఉన్న శంకరుడి రౌద్రరూపానికి భీతిల్లిన మన్మధుడు భయంతో వణికిపోతూ, తనని కాపాడేందుకై ఇంద్రాదులను స్మరించినా వారెవరూ రాలేదు! మిగతా దేవతలంతా తమతమ దివ్యవిమానాలను అధిరోహించి స్వర్గంలోనుండి వీక్షించ సాగారు.

"భయంతో కృంగి కృశించిన, మన్మధుడు శంకరుడి కంటబడ్డాడు! ఆగ్రహోదగ్రుడై పరమశివుడు అతడిని భస్మీకరించతలచి మూడోకన్ను తెరవగా, సకలలోకాలూ భయంతో కంపించాయి. అంతరిక్షానఉన్న దేవతలు మన్మధుని చంపవద్దు 'మాజహి!' అంటూ అరిచేలోగానే మన్మధుడిని భస్మంగావించాడు.

అప్పుడు భిల్లయువతి రూపంలోవున్న పార్వతి తన అంజలియొగ్గి భక్తితో ఇలా ప్రార్థించింది.

"ఓ శంకరా! నీ ఈ మూడోకన్నునుంచి వెలువడే క్రోధాగ్నిజ్వాల

క్షణంలో ముల్లోకాలనూ భస్మీపటలం కావించగలదు! అందుచేత ఆ దారుణమైన క్రోధాగ్నిని ఉపసంహరించవలసింది! బ్రహ్మయొక్క వరాలను పొందిన తారకుడనే రాక్షసుడు మూడులోకాలనూ తన వరగర్వంచేత వశపరచుకున్నాడు. స్వాధ్యాయము, యజ్ఞయాగాదికాలు అన్నీ నశించాయి. దేవతలంతా తమ నెలవులు వీడి స్థానభ్రష్టులైనారు. లోకపాలనకై సమాధి స్థితుడవైన నీకు దేహభావం కల్పించుటకు దేవతలు శీఘ్రముగా మన్మథుని పిలిచి పంపారు. శ్రేష్టాపరాధంవలన మన్మథుడు భస్మమైనాడు.

"ఓ దేవా! నీ శరణుపొందిన మమ్ము రక్షించు! ముల్లోకాలలోనూ శరణాగతులను రక్షించేవాడవన్న కీర్తి కలిగినవాడవు! ఓ దేవా! దీనులైన శరణార్థులైన, దేవతల అపరాధాన్ని క్షమించు!" అంటూ వేడిన భిల్లి యొక్క వాక్యములు విని క్రోధాగ్నిని ఉపసంహరించి చిరునవ్వు మోముతో యిలా అభయప్రదానం చేశాడు.

"ఓ ప్రియురాలా! లెమ్ములెమ్ము! నీవు పూనుకొని దేవతారక్షణను చేశావు. నా పాదములపైబడి వేడినట్టి నీవాక్యంచేతా, నీయందలి అను రాగంచేతా వీరందరినీ కాపాడాను!" అంటూ ఆమెను ఆలింగనం చేసుకొని తన తొడపై కూర్చుండపెట్టుకున్నాడు. అనంతరం వారిరువురూ వృషభ వాహనాన్ని అధిరోహించి కైలాసానికి వెళ్ళారు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'కామదహనం' అనే 84-వ అధ్యాయం.



# 85

# స్కందోపాఖ్యానం

(మూలం)

## పంచాశీతితమో అధ్యాయః

**క ఉవాచ :**

శివస్యాలింగనాద్భిల్లీ మదనానల దీపితా ।
నాపక్వాపి సుఖం దేవీనిర్దలేశ ఫరీయధా ॥ 1

పతితా జలమధ్యేసా శీతలోశీర శాలినీ ।
నశర్మలేభే తత్రాపిస్థలే నిద్రాంచ నాలభత్ ॥ 2

కర్పూర చందనం తస్యా అధికం తాపమాదధే ।
నాశీతల పదార్థోస్యాః కోపి సంతోషమాదధే ॥ 3

ఏవం భిల్లికాభూతే సాస్థిచర్మావ శేషితా ।
తతో గిశమాగమ్య గిరిజా గిరమబ్రవీత్ ॥ 4

నత్వంమ్మృశోసి మాందేవ కామావస్థాంగతాస్మిహ ।
దగ్ధోపి మదనోమహ్యాం అత్యంతం పీడయత్యహో ॥ 5

నానోపాయాఃకృతా స్తస్య శాంతయే నచసాభవత్ ।
యేనోపాయేన శాంతిస్స్యాత్స తంకురు మమప్రభో ॥ 6

ఇతివాక్యం సమాకర్ణ్య ప్రియాయాః ప్రియకృద్ధరః ।
రహస్యే తాం కరేధృత్వా పర్యంకే పర్యవేశయత్ ॥ 7

రేమే తయా యథేష్టంస మదనేన వశీకృతః ।
మృతేనాపి కృత మహత్కార్యం సురేరితం ॥ 8

అనంగేన సమోనైవ ధన్వీతి యశఆప్తవాన్ ।
తయోస్తుక్రీడతో యాతాః షష్టిసాహస్ర వత్సరాః ॥ 9

భ్రష్టస్థానా మునిసురాః శృత్వామదన చేష్టితం ।
కైలాసం పునరాయాతాస్తత్ర క్రీడారతం హరం ॥ 10

జ్ఞాత్వాతూష్ణీంస్థితాస్తత్ర చింతా వ్యాకులచేతసః ।
తారకాసుర భీతాస్తే పునర్గహ్వారమాగతాః ॥ 11

కదా వధోభవేదస్య కదా స్థానాని యామచ ।
కరిష్యతి కదాశంభుః అస్మాకం దుఃఖనాశనం ॥ 12

ఇతి చింతార్ణవే మగ్నాః యావద్బృహ్మోదయ స్సురాః ॥
తావదూచే సురాచార్యో వాక్యం మే శృణుతానఘాః ॥ 13

ప్రేషయం త్వఖిలావహ్నిం రూపాంతర ధరంహరం ।
స హరం బోధయిత్వాశు భవత్కార్యం భవిష్యతి ॥ 14

తతస్తే వహ్నిమాకార్య తుష్టువు ర్వివిదవత్‌స్తవైః ॥

దేవా ఊచుః :

త్వత్తో యజ్ఞక్రియాబ్రహ్మన్ సంస్కారాః సర్వఏవహి । 15

అపాం త్వమసిహేతుశ్చ దేవానాం ముఖమేవ చ ।
అగ్నిహోత్ర ప్రణేతాత్వం గార్హపత్యాది నామభిః ॥ 16

త్వమేవ పిబసీశాబ్ధివారి నిత్యం మహత్తరం ।
త్వమేవ పచసేన్నాణాం జఠరే షడ్రసానపి ॥ 17

త్వమేవ సర్వ జంతూనాం సంధౌ సంధౌ విచేష్టసే ।
త్వయాత్యక్తం ప్రేతసంజ్ఞాం లభతే దహ్యతే త్వయా ॥ 18

హేతుస్త్వమసి దేవేశ జంతూనాం ప్రాణధారణే ।
త్వయాద్భిశ్చ వినానాన్నం వక్తుం శక్యం నచ క్వచిత్ ॥ 19

త్వమేవ బ్రహ్మో రుద్రశ్చ సూర్యశ్చానేక రూపధ్రుక్ ।

త్వమేవ జాయసే మూలం క్రోధస్య జగదీశ్వర ।
యత్ర యత్ర భవేత్తేజ స్తత్తద్రూపం తవైవచ ॥ 20

అతస్త్వాం ప్రార్థయామోద్య త్రిలోక్యా ఉపకారక ।
త్రైలోక్యాక్రమణం తేన తారకేణ కృతం విభో ॥ 21

జానాసి తాం నభోవాణీం కామస్యాపిచ తాంగతిం ।
పార్వతీ హరయోర్బోధం చిరం క్రీడానిమగ్నయోః ॥ 22

కురు గత్వాన్య రూపేణ భిక్షాం యాచస్వ తత్రవై ।
ఏవం కృతే జగత్కార్యం అస్మాకంచ భవిష్యతి ॥ 23

బ్రహ్మోవాచ :

ఇతి దేవవచః శృత్వా కాషాయ వసనో ద్విజః ।
భూత్వా శుష్మాయయా తత్ర యత్రాస్తాం పార్వతీహరౌ ॥ 24

క్రీడాసక్తౌ బహిస్థిత్వా భిక్షాందేహి త్యువాచ సః ।
త్రివారం ప్లుత శబ్దేన ద్వాభ్యామపి శృతః స్వనః ॥ 25

ఊచతు ర్విస్మితౌ తౌతు పరస్పర ముభౌవచః ।
పరిధత్తాంశుకే స్వేస్వే 'కుతో త్రాయం సమాగతః । 26

కిమస్మైచ ప్రదాతవ్య మితి చింతాంచ చక్రతుః ।
ఉమాం జలావధార్ధ్వైర్య మశక్తా తస్యధారణే ॥ 27

జానతీ భావినంచార్థం దదౌసా భిక్షుకా యతత్ ।
భూమౌ త్యక్తం దహేదేత త్రైలోక్యం స చరాచరం ॥ 28

హరవీర్య మెత్య పిబద్వహ్నిః శాపభయా త్రయోః ।
గర్భవా ననలోజాతో లజ్జావానపి తాపవాన్ । 29

యత్ర యత్ర యయౌ వహ్నిః శర్మ లేభేనతత్రవై ।
ఉషస్యుత్థాయ గంగాయాం తులాసంస్థే దివాకరే ॥ 30

స్నాతుం యావత్సశౌచాది కురుతే తావదేవ హ ।
ఆగతాః షట్ స్త్రియస్తత్ర స్నాతుమూర్జే సమాహితాః ॥ 31

అగ్నినా యత్సముత్సృష్టం గంగేయంచ హరప్రియా ।
ధారయిష్యతి శక్తాచే జ్జలరూపా సుశీతలా ॥ 32

శివ వీర్యంచ తత్తాభిః ప్రాశితం షడ్విభాగతః ।
తస్మిన్నేవ క్షణేసోగ్నిరంతర్ధిం సమవద్యత । 33

అంశుకానిచ యాతాని దూరదేశం గతేనలే ।
పరిధాయస్వ వస్త్రం తాస్తతో యాతా నిజం గృహం ॥ 34

దదృశుః పతయస్తాసాం ముఖా న్యత్యుజ్వలానిచ ।
గర్భిణ్య ఇతి తేజ్ఞాత్వా నదృష్ట్వా మునీశ్వరాః ॥ 35

బహిశ్చక్రుర్గృహాత్సర్వా నప్రదర్శ్యం ముఖం త్విదం ।
తా స్సమేత్య పునర్గంగాం తీరే శరసుశోభితే ॥ 36

ముముచుః స్వస్వ గర్భంతాః శుద్ధాః స్నాతాః గృహాస్యయుః ।
షట్సుతాను ప్రయాతాసు స్వంస్వం గర్భం విముచ్య వై॥ 37

షణ్ముఖో ద్వాదశభుజో బాలస్తత్ర వ్యజాయత ।
తస్య హుంకార మాత్రేణ నిపేతు ర్ధానిఖాత్ భువి॥ 38

చకంపే ధరణీ సర్వాశేషః పాతాల మేవచ ।
ద్రుమా ఉన్మీలితాః సూర్యో నీహారాచ్ఛాదితో భవత్ ॥ 39

ఏతస్మి న్నంతరే తత్ర నారదో దివ్య దర్శనః ।
కైలాసం గిరీశంద్రష్టుం గచ్ఛన్మార్గే దదర్శతం ॥ 40

అతి దీప్తతరం బాలం దుర్దర్శం బలవత్తరం ।
ప్రణిధానేన తంజ్ఞాత్వా తూష్ణీం కైలాస మాయయౌ ॥ 41

ఉవాచ పార్వతీంశంభుం వృత్తాంతం సర్వమేవచ ।
జహర్ష పృథివీ సర్వా జ్ఞాత్వా తం గిరిశాత్మజం ॥ 42

దేవదుందుభయోనే ధుర్గంధర్వాజగు రద్భుతం ।

**నారద ఉవాచ :**

ఆగచ్ఛేతా మయా దృష్టో గౌరి మార్గేతవాత్మజః ॥ 43

షణ్ముఖో ద్వాదశభుజో సూర్యకోటి సమప్రభః ।
గంగాతీరే నిపతిత స్త్యక్త్వస్తే షణ్ముఖోనుకిం ॥ 44

కోటి కందర్ప శోభాఢ్యో గర్వితక్షోభితాఖిలః ।
కథం నిష్టు రతాకారి గౌరి సుందర బాలకే ॥ 45

**క ఉవాచ :**

ఇత్యుక్త్వాంతర్హితే తస్మిన్ గౌరీ బాలక మభ్యగాత్ ।

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే స్కందోపాఖ్యానం నామ పంచాశీతితమో అధ్యాయః**



## 85-వ అధ్యాయము

# స్కందోత్పత్త్యుపాఖ్యానం-I

అలా ఆ శివపార్వతులు కైలాసానికి వృషభారూఢులై చేరుకున్న తరువాత "ఓ వ్యాసమునీంద్రా! ఆ భిల్లయువతి వేషంలోవున్న పార్వతి మదనతాపం చెందసాగింది! నీటిలోంచి ఒడ్డునపడిన చేపలా తీవ్ర విరహ బాధకు లోనయింది. శీతోపచారములుగాని, చందనం, పచ్చకర్పూరం మొదలైన లేపనాలేమీ ఆమెకు ఉపశమనాన్ని కల్గించలేకపోయాయి. పైగా అవి ఆమె తాపాన్ని మరింతగా పెంచాయి. ఇలా ఎంతోకాలము గడిచిన తరువాత శల్యావశిష్టయై కృశించింది. అప్పుడు ఆమె ఒకనాడు శంభుని సన్నిధికి చేరి యిలాఅన్నది.

"ఓ ప్రభూ! నీవెందుకనో ఈ మధ్యన నాపై శీతకన్ను వేశావు! సూర్యకిరణాలు సోకనిదే కమలం వికసించజాలనట్లు, నీ కరస్పర్శ

సోకని నామేను పొందే విరహం యింతింత అని వర్ణింపనలవికాకుండా వున్నది! ఎన్ని ఉపచారాలు చేసినా మదనాగ్నిచే కలిగే తాపం శాంతించ టంలేదు. దీనికేదైనా ప్రతిక్రియను సల్పి నా బాధను నివారించు!" అంటూ "ఈ మన్మధుడు నీచే భస్మీభూతుడైనా నన్ను నిలువనీయ కున్నాడు స్వామీ! నీ దయ, నీప్రేమా మాత్రమే నాకిక శరణ్యం" అంటూ క్రీగంట చూస్తూ తలవాల్చకుని నిలుచుని నర్మగర్భంగా పలికిన శర్వాణి మాటలువిన్న ఆ మదనాంతకుడైన శంకరుడు చిరునవ్వుతో ఆమె చేయందుకుని తన అక్కున చేర్చుకుని మదనునిచే వశీకృతుడై ఆమెను పర్యంకముపై పరుండపెట్టాడు. మదనప్రేరితుడైన ఆ శివుడు ఉమామనోహరుడై, పార్వతీప్రియుడై యథేచ్ఛగా రమించాడు.

అలా శివుని మూడోకంటిచే భస్మీకృతుడైనా దైవకార్యమైనట్టి శివ పార్వతుల సమాగమాన్ని ఏర్పాటుచేయటంలో కృతకృతుడైయ్యాడు రతీ పతియైన మన్మధుడు. ఇక భిల్లయువతిగా పార్వతి – ఆమెపతి ఒకరిలో ఒకరు లయమై, శృత్రీలయల్లా, పాలూ తేనెల్లా కలిసిపోయి సృష్టికే ఒక వినూత్నశోభను చేకూర్చారు. ఇలా దాదాపు అరవైవేల సంవత్సరాలు గడిచిపోయాయి! ఈ లోగా తారకాసురునిచేత స్థానభ్రష్టులైన దేవతలంతా మన్మధునికి కార్యసిద్ధియైన విషయం విని కైలాసం చేరుకున్నారు. ఐనప్పటికి ఏకాంతంలో ఉన్నట్టి ఆ ఉమాశంకరుల ఏకాంతా నికి భంగం చేయటానికి ఎవరూ సాహసం చేయలేకపోయారు. మూకీ భావంతో తలలుదించుకుని తారకాసురుని భీతిచేత తిరిగి పర్వతగుహ లకు వెళ్ళిపోయి తమ తలదాచుకున్నారు.

'ఆహా! ఈ దుష్టరాక్షసుని పీడ మనకు ఎప్పటికి విరగడవుతుందో

కదా! ఈ శంకరుడు తిరిగి మనకు ఎన్నటికి స్వస్థతను ప్రసాదిస్తాడోకదా!' అనుకుని వాపోతూ చింతాక్రాంతులై వుండగా, దేవగురువైన బృహస్పతి వారికి యిలా హితోక్తులను పలికాడు :

"ఓ దేవతలారా! దీనికి ఒక్కటే మార్గంవున్నది. రూపాంతరం చెందటంలో ప్రసిద్ధుడైనట్టి అగ్నిని శంకరునివద్దకు పంపించండి. అతడే శంకరుని ప్రబోధించగల సమర్థుడు. అప్పుడు మీకార్యం నెరవేరుతుంది."

ఆ మాటలు విన్న దేవతాగణముల హృదయాలపై పన్నీటిజల్లు కురిసినట్లయింది! వారంతా అగ్నిహోత్రుని ఆహ్వానించి యిలా స్తోత్రం చేశారు. "ఓ అగ్నిభట్టారకా! యజ్ఞయాగాది క్రతువులకూ, సమస్తమైనట్టి సంస్కారములకూ ఆధారమైనట్టి పరమపావనుడవు! నీవే దేవతలమైన మాకు ఆహారాన్ని ఆహుతులరూపంలో గ్రహించి అందించే వాహకుడవు. కనుకనే దేవతలకు ముఖమైనావు! బడబాగ్ని, దావానలాగ్ని ఇవన్నీ నీకు రూపాంత రాలే! పంచాగ్నివిద్యద్వారా ఉపాసించబడేవాడవూ నీవే! సూర్యాంతర్వర్తివై సముద్రములలోని జలాన్ని ఆవిరిచేసి మేఘాలుగా మార్చినా, జఠరాగ్నివై ప్రాణులుతిన్న ఆహారాన్ని జీర్ణింపచేసినా, ప్రాణాగ్ని స్వరూపివిగా జీవులకు శరీరంలో ప్రాణాలు నిలుచుటకు ఆధారుడవైనా, చివరకు నచికేతసాగ్నిగా శరీరాలను నీలో దగ్ధమొనర్చి వారిలోని పంచ భూతాలనూ వేటికవిగా విడిపోవటానికి దోహదకారుడవైనా - కామాగ్నిగా సృష్టికి ఆధారభూతమైన మైధునక్రియకు ప్రోద్బలంచేసి జీవులకు తిరిగి శరీరాలు ధరించేందుకు కారణమైనట్టి అ గణిత గుణములుకల మహా మహిమోపేతుడవు నీవే! నీకివే మా ప్రణామాలు! నీవే మూడులోకాలకూ

మేలుకలిగే కార్యాన్ని నిర్వహించగల్గిన సమర్థుడవు! ఈ తారకాసురుని బాధ మాకు విరగడ కావాలంటే - శివుడు ఉమా పరిష్వంగంనుండి వెలుపలికి వచ్చేలా ప్రబోధించాలి! నీవు మారువేషంలో కైలాసానికి వెళ్ళి భిక్షను యాచించవలసింది! అలాగనుక చేసినట్లైతే జగత్కళ్యాణము, దేవకార్యమూ సిద్ధిస్తాయి. కనుక వేగిర వెళ్ళి ఈ కార్యసాధనకై పూనుకో వలసింది!" అంటూ అర్థించిన దేవతల అభ్యర్థనను మన్నించి, అగ్ని దేవుడు కాషాయాంబరమును ధరించి యతివేషాన్ని దాల్చాడు. నేరుగా పార్వతీపరమేశ్వరులుండే తావునకువెళ్ళి - ద్వారంవద్ద నిలచి చిన్నగా "భిక్షాందేహి!" అంటూ ముమ్మారు అర్థించాడు. శివపార్వతులిద్దరూ ఆ శబ్దంవిని ఆశ్చర్యచకితులై ఈ భిక్షకునికి ఇవ్వదగినది తమవద్ద ఏమున్నదా అని యోచించారు. అప్పుడు శివుడు ఉమా యిరువురు వెంటనే వస్త్రధారులవ్వగా భిక్షకై ఉమాదేవియొక్క దోసిలిలో భవుడు తన వీర్యా న్నుంచాడు. ఆ పార్వతి దాన్ని ధరించుటకు అశక్తురాలై, శివుని భావాన్ని గ్రహించి ఆమె ఆ వీర్యాన్ని భిక్షుకునికి యిచ్చింది.

"ఓ భిక్షుకా! ఇది భూపతనమైతే మూడులోకాలనూ దహిస్తుంది సుమా!" అంటూ హెచ్చరించి లోనికి వెళ్ళిపోయింది. అప్పుడు అగ్ని క్రింద ఉంచజాలక శాపభయంచేత ఆ హరవీర్యాన్ని మ్రింగాడు. సిగ్గు పడుతూ లోపల భరింపరాని తాపంచెందుతూ ఒక సూర్యోదయకాలంలో సూర్యుడు తులారాశిలో ఉన్న సమయాన ఆ శివతేజస్సును శౌచ కృత్యాలు నిర్వహించే సమయంలో 'శివతేజస్సును ఆతడి జటాజూటం నుండి వెలువడ్డ ఆతడి ప్రియురాలైన గంగమాత్రమే భరించగలదు' అనుకుని గంగానదీజలములలో విడిచాడు.

అదే సమయానికి స్నానార్థమై కృత్తికలు ఆ గంగకి వచ్చారు. ఆ ఆరుగురూ ఆ శివతేజాన్ని పానంచేశారు. వివస్త్రలవటంచేత స్నానం పూర్తయ్యాక అగ్ని దూరంగా వెళ్ళేదాకా ఆగి తమ వస్త్రాలను ధరించి నిజగృహాలను చేరారు. వారి భర్తలు వారి ముఖాలు దేదీప్యమానంగా వెలుగుతున్న వారి ముఖాలనుచూసి తమ దివ్యదృష్టిద్వారా వారు గర్భిణులని గ్రహించారు. 'మీ ముఖాలను చూడటమే పాపం' అంటూ ఆ కృత్తికలను తమ యిళ్ళనుండి వెళ్లగొట్టారు. అప్పుడు ఆ కృత్తికలు ఆరుగురూ తిరిగి గంగాతీరం చేరుకుని అక్కడి గంగాతీరంలోవున్న రెల్లుదుబ్బులలో తమ గర్భములను జారవిడిచి శుచిస్నానం ఆచరించి తమ యింటికి వెళ్ళిపోయారు.

## కుమారస్వామి జననం :

అలా కృత్తికలు వెళ్ళిపోయిన తరువాత ఆ ఆరుగర్భాలు ఒకటిగా కూడి అందులోంచి ఆరుముఖాలు పన్నెండుచేతులు కలిగినట్టి అందమైన బాలుడు ఉద్భవించాడు. అతడు హుంకారం చేసినంత మాత్రాననే ఆకాశంలోంచి చుక్కలు రాలిపడ్డాయి. పాతాళము మొదలుగాగల పధ్నాలుగు లోకాలూ కంపించాయి. ప్రచండమైన వాయువువీచగా చెట్లన్నీ పెకలించబడ్డాయి. సహస్రకిరణుడైన సూర్యభగవానుడు సైతం మంచుతో కప్పబడ్డాడు.

అప్పుడు నారదమహర్షి ఆకాశమార్గంలో శంకరుని దర్శించుకునే నిమిత్తం వెళుతూ, మార్గమధ్యంలో దివ్యకాంతితో శోభిల్లుతూవున్న అమిత పరాక్రమోపేతుడైన ఆ బాలుని చూచి దివ్యదృష్టితో అతని వివరం

తెలుసుకున్నాడు. కైలాసానికి వెళ్ళి అక్కడఉన్న పార్వతీపరమేశ్వరులకు ఈ వృత్తాంతాన్ని తెలియజేసాడు. సకల లోకాలలోనివారూ ఆ దివ్య బాలకుడు శివాత్మజుడని ఎరిగి సంతుష్టులైనారు. దేవతలు దేవదుందుభులు మ్రోగించారు. అప్సరసలు నాట్యమాడారు! గంధర్వులు తమ దివ్యగానాన్ని ఆలపించారు.

అప్పుడు నారదుడు జగన్మాతయైన పార్వతీదేవి నుద్దేశించి యిలా అన్నాడు :

"జగన్మాతా! నేనీ కైలాసానికి వస్తూ మార్గమధ్యంలో నీ కుమారుణ్ణి చూశాను. ఆరుశిరస్సులతో పన్నెండు బాహువులను కలిగి కోటిసూర్యులకు సమానమైన కాంతితో ప్రకాశిస్తూన్నాడు! ఆతణ్ణి నీవుగాని గంగాతీరంలో విడిచావా ఏమి?

కోటిమన్మథులను మించిన దివ్యసౌందర్యంతో కేవలం హుంకార మాత్రం చేతనే బ్రహ్మాండాన్ని గడగడలాడించినట్టి ఆ సుందర బాలకుడిపై నీకీ కాఠిన్యం ఏలతల్లీ?" అంటూ నారదుడు అంతర్హితుడయ్యాడు. అప్పుడు గిరిరాజనందనయైన పార్వతి ఎంతో ఆత్రంగా తన కుమారుని చెంతకు పయనమై వెళ్ళింది.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'స్కందోత్పత్త్యుపాఖ్యానం' అనే 85-వ అధ్యాయం.



86

# స్కందోపాఖ్యానం

(మూలం)

## షడశీతితమో అధ్యాయః

**క ఉవాచ :**

దృష్ట్వా సా తాదృశం బాలం స్నేహస్నుత పయోధరా ।
ఆలిలింగ ముదాబాలం తద్ధష్టహృదయా సతీ ॥ 1

తామూచే మమబాలోయం గంగా గంభీరనిస్స్వనా ।
మమాయమితి తాంప్రాహ వహ్నిర్బాలో గిరేః సుతాం ॥ 2

కృత్తికాద్యాశ్చ తాం ప్రాహు రస్మజ్జాతో యమర్భకః ।
అస్మాకమేవబాలో యమితి చుక్రుశురాతురాః ॥ 3

ఏవం వివదమానాస్తా యాతా వహ్నిపురోగమాః ।
కైలాసే దేవనిలయే గిరిశం చంద్రశేఖరం ॥ 4

గౌరీ వివేశప్రథమం స్వకటీన్యస్త బాలకా ।
శివోగృహిత్వా తంస్వాంకే శిరస్యాఘ్రాయ మంత్రతః ॥ 5

రమయామాస పరయా ముదా దేవస్త్రిలోచనః ।
గంగా వహ్నిః షట్ స్త్రియస్తాః గృహంజగ్ముర్యథాగతం ॥ 6

తన్నామకరణార్థాయ బ్రహ్మాణంచ బృహస్పతిం ।
ఆహూయ శివఊచే తౌ నామాస్య క్రియతామితి ॥ 7

బ్రహ్మ-బృహాస్పతీ ఊచతుః :

కార్తికే మాసిజాతోయం కార్తికేయ ఇతిస్పుటం ।
నామాస్య ప్రథమం దేవ పార్వతీ నందనోపి చ ॥ 8

శర ద్వీపేయముత్పన్నః శరజన్మా తతోపి చ ।
కృత్తికాభ్యోపి జాతత్వాత్ కార్తికేయ ఇతిస్మృతః ॥ 9

యతో అస్యమాతరః షట్తాః స షాణ్మాతుర ఇత్యపి ।
అయం పుత్రస్తారకజి త్తారకంచ విజేష్యతి ॥ 10

దేవసేనాపతి ర్భావీ సేనానీ రితిశబ్దితః ।
తత ఏవమహాసేనః షణ్ముఖత్వాత్ షడాననః । 11

స్కన్నం త్రివారం రేతోయత్తేన స్కందోయ ముచ్యతే ।
తయోస్తు వదతోరేవం శక్రాద్యా ఆయయుస్సురాః ॥ 12

ఆననందుశ్చ నేముస్తం పుపూజు స్తుష్టువుర్జగుః ।
వ్యానశే రోదసీదివ్య వాద్యశబ్దో రసాతలం ॥ 13

తతస్తే ప్రార్థయామాసుః సేనాన్యం ప్రణిపత్య చ ।
త్రైలోక్యకంటకం దేవ జహి త్వం తారకాసురం ॥ 14

నానాభిషేక సంభారైః సేనాపత్యే అభిషిచ్యతం ।
వైదికైః స్తాంత్రికైర్మంత్రైః నానా మునిసమీరితైః ॥ 15

తతోఽనుజ్ఞాం గృహీత్వా తే దేవాః స్వస్థాన మాగమన్ ।
ఋషయోపి నిరుద్యోగా స్తపస్తేపు ర్యథాపురా ॥ 16

సేనాన్యం విద్యమానే నో నభయం విద్యతే క్వచిత్ ।
స బాలో వవృధేత్యంతం శుక్లపక్షే యథాశశీ ॥ 17

ఏకదా బాలభావాత్స ఉడ్డీయ శశినం యయౌ ।
గృహీతుం బ్రహ్మణాఽవారి నేదృశం సాహసంకురు ॥ 18

బుధ్వా బృహస్పతిం శక్త్యా జిగాయేంద్రంచ సోర్భకః ॥
ఏకదా సుఖమాసీనం పార్వత్యా సహితం శివం ॥ 19

ప్రణమ్య పరిపప్రచ్ఛ సర్వకామార్థ సిద్ధయే ।

**స్కంద ఉవాచ :**

పితర్మయా శ్రావిమహా కథా నానావిధాశ్శుభాః ॥ 20

సర్వసిద్ధికరం దేవ పుత్రసంపత్త్రివర్ధనం ।
సర్వ పాపహరంచైవ ధర్మార్థ కామమోక్షదం ॥ 21

త్రైలోక్యస్య గురోస్త్వత్తః తృప్తిర్నాస్తి తథాపి యే ।
వద మే సర్వశత్రూణాం జయకారి వ్రతం శుభం ॥ 22

**ఈశ్వర ఉవాచ :**

సమ్యక్ పృష్టం త్వయాస్కంద సర్వలోకోపకారకం ।
వ్రతం తే హం ప్రవక్ష్యామి సర్వసిద్ధికరం నృణాం ॥ 23

సర్వపాప క్షయకరం ధర్మార్థకామ మోక్షదం ।
సర్వ శత్రుక్షయకరం పుత్ర సంపత్త్రివర్ధనం ॥ 24

అలక్ష్మీ సంకటహారం గణనాథస్య తోషకృత్ ।
యః కరోతి నరోభక్త్యా సపూజ్య స్త్రిదశైరపి ॥ 25

ఇచ్ఛావిహారీ భవతి సృష్టి స్థిత్యంతకృచ్ఛ సః ।
దర్శనాత్తస్య చాన్యేషాం మహాపాపం లయంవ్రజేత్ ॥ 26

నాన్యేషాం స్కంద వరద చతుర్థీవ్రత సామ్యతా ।
ఏవమాకర్ణ్య వచనం సేనానీః శంకరేరితం ॥ 27

పునః పప్రచ్ఛ పితరం మహిమానం వ్రతస్య సః ।

**స్కంద ఉవాచ :**

విస్తరేణ మమబ్రూహి మహాత్మ్యం వ్రతసంభవం ॥ 28

కస్మిన్మాసి దినేచాస్య ప్రారంభః క్రియేతే హర ।
కోవిధిః కిం ఫలంచాస్య కస్యాభూ త్ప్రత్యయోస్య చ ॥ 29

ఏతన్మే సకలం బ్రూహి యది తుష్టోసి శంకర ।
సర్వలోకోపకారాయ వ్రతస్యాస్య ప్రసిద్ధయే ॥ 30

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే స్కందోపాఖ్యానే**
**షడశీతితమో అధ్యాయః**



# 86-వ అధ్యాయము

# స్కందోపాఖ్యానం

"ఓ మునీంద్రా! అలా ఆ పర్వతరాజనందనయైన పార్వతి గంగా తీరానికి వెంటనే చేరుకున్నది. అక్కడ ముద్దులు మూటగట్టే ఆ చిన్నారి బాలుడిని చూడగానే ఆమెకు స్తన్యం ధారగా స్రవించసాగింది. ఆతడిని ప్రేమతో ఆలింగనం చేసుకొని ముద్దాడింది! అప్పుడు గంగా దేవి వీడు నా కుమారుడని పల్కింది! అగ్నిహోత్రుడు నా కుమారుడనీ, కృత్తికలు వచ్చి 'ఓ పార్వతీ! ఈ బాలుడు మా గర్భవాసాన జనించాడు గనుక మా కుమారుడేనన్నారు!

ఇలా అందరూ పరస్పరం వాదులాడుకొంటూ కైలాసంలోవున్న పరమేశ్వరుని సన్నిధికి చేరుకున్నారు. అప్పుడు పార్వతీమాత ముద్దులు మూటకట్టే ఆ షణ్ముఖుడిని ముందుగా తన చంకనెత్తుకొని కైలాసంలోకి ప్రవేశించింది. అప్పుడా పరమశివుడు ఆ బాలుడిని తన తొడపై కూర్చుండచేసుకుని మంత్రపూర్వకంగా ఆతడి తలను ఆఘ్రాణించి

పరమసంతోషాన్ని పొందాడు. అప్పుడు అగ్ని, కృత్తికలు, గంగ, శంకరునికి భక్తితో ప్రణమిల్లి తమతమ లోకాలకు వెళ్ళిపోయారు.

అప్పుడు శివుడు పరమేష్టిని, దేవగురువైన బృహస్పతినీ రావించి ఆ బాలకునికి నామకరణం చేయవలసిందని ఆజ్ఞాపించాడు. వారిరువురూ యిలా అన్నారు.

"ఓ శంకరా! ఈ బాలకుడు కార్తీకమాసంలో జన్మించాడు గనుక కార్తికేయుడన్న నామం యితడికి సార్థకమైనది! పార్వతీనందనుడనీ, శరద్వీపమున (రెల్లుదుబ్బుల మొదట్లో) జన్మించాడు గనుక శరజన్ముడనీ, కృత్తికలవలన జన్మించాడు గనుక **కార్తికేయుడనీ** ఆర్గురు తల్లుల బిడ్డ డవటంచేత షాణ్మాతురుడనీ పిలుబడతాడు. అంతేకాదు ఈతనివల్లనే తారకాసురుడు వధించబడతాడు. ఓశంకరా! అందుచేత **'తారకజిత్'** అనీ ఆరుముఖాలుండటంచేత **షడాననుడనీ**, దేవసేనలకు అధ్యక్షుడు కాగలడు గనుక సేనానియనీ, నీ రేతస్సు మూడుసార్లు స్కన్నమవటం (మార్పు చెందటం స్థానాంతరంచెందటం) చేత స్కందుడనీ పిలువ బడతాడు!"

ఇలా వారు ముప్వురూ సంభాషించుకుంటూండగా ఇంద్రాది దేవతలు అక్కడికివచ్చి ఆ దివ్యబాలకుడిని చూసి పరమానంద భరితులై అతడిని పూజించి స్తుతించారు! దివ్యపరిమళాలు సర్వత్రా వ్యాపించాయి. దేవదుందుభులు మారుమ్రోగాయి. ఆ దేవతాసైన్యాలు ఆ శివసుతునికి నమస్కరించి "ఓ దేవా! నీవల్లనే ఆ త్రైలోక్యకంటకుడైన తారకునివధ జరగాల్సివున్నది! కాబట్టి నీవు దేవసేనాధిపత్యము నంగీకరించి లోక కళ్యాణం చేకూర్చవలసింది!" అంటూ అతడిని వైదికమంత్రాలతో అభిషే

కించి అనేక విధములైన సంభారములతో ఆతడికి దేవతల సేనానిగా పట్టాభిషేకం జరిపించారు.

ఆ తరువాత దేవతలు అనుజ్ఞను గైకొని తమతమ నెలవులకు వెళ్ళిపోయారు. అప్పుడు ఋషులు యధాపూర్వకముగా తమ తపశ్చర్యను కొనసాగించారు. "సేనాధ్యక్షుడు సమర్థుడైవుండగా మనకేమి కొదవ?" అనుకుని నిర్భయంగా తమ కార్యములు నెరవేర్చుకోసాగారు.

ఆ షణ్ముఖుడు కూడా శుక్లపక్ష చంద్రునిలా దినదిన ప్రవర్ధమానుడవసాగాడు. ఒకనాడు తన బాల్యచాపల్యంతో చంద్రుణ్ణి పట్టుకుందామని అంతరిక్షంలోకి ఎగిరాడు. అప్పుడు బ్రహ్మ "నాయనా! ఇటువంటి సాహసకృత్యాలు ఎన్నడూ చేయకు" అంటూ వారించాడు. ఇలా ఆ గాంగేయుడు బుద్ధివిషయంలో బృహస్పతినీ, శక్తి విషయంలో ఇంద్రుణ్ణీ మించిపోయాడు.

ఇలాఉండగా ఒకనాడు ఆ స్కందుడు పార్వతీసమేతుడైవున్న పరమేశ్వరుని సన్నిధికి వెళ్ళి సర్వకార్యసిద్ధికోరి వారికి వినయంగా నమస్కరించాడు. ఆతరువాత శంకరునితో యిలా తన అభీష్టాన్ని తెలిపాడు.

"ఓ తండ్రీ! ఇంతవరకూ మీనుండి అనేక కథలను విన్నాను. త్రైలోక్య గురువైన మీవలన ఎన్నివిన్నా తృప్తి కలుగటంలేదు. కనుక నాకు సర్వ కార్యసిద్ధినిచ్చేటటువంటి పుత్ర, ధన, సంపదలను వృద్ధిగలుగ చేసేటటువంటి, సర్వపాపహరమైన, త్రివర్గప్రదమైన, మోక్షార్థులకు మోక్షప్రదమైన, శత్రువులపై జయాన్ని ప్రసాదించేటటువంటి ఉత్తమమైన వ్రతాన్నొకదానిని ఉపదేశించవలసింది!"

ఈ మాటలకు శంకరుడు ఎంతో సంతోషించి

"కుమారా! నీవడిగిన ప్రశ్న ఎంతో సమంజసమైనదీ లోకోపకరమైనట్టిదీ! నీవు అడిగిన ఈ వ్రతము మానవులకు సర్వసిద్ధులనూ అనుగ్రహించగలట్టిది! అంతేకాదు సమస్త సంకటములను హరింపగలది, అలక్ష్మీ నాశకరము, పాపక్షయకరమూ, పుత్రపౌత్రాద్యభివృద్ధికరమూ! ఇది గణనాధునికి పరమ సంతోషకరమైనట్టిది! ఎవరైతే ఈ వ్రతాన్ని శ్రద్ధాభక్తులతో అనుష్టిస్తారో అట్టివారు త్రైలోక్యపూజ్యులవుతారు! వారికి త్రిమూర్తులకు ఉన్నట్టి సృష్టి స్థితి లయములు చేయగల కార్యసామర్థ్యం లభిస్తుంది. అట్టివారు అమితమైన పరాక్రమోపేతులై శత్రువుల గుండెల్లో నిద్రిస్తారు! అంతేకాదు! అట్టివారిని దర్శించినంతమాత్రాన్నే సమస్త పాపాలూ నశిస్తాయి! ఓ స్కందా! దీనికి "వరదగణపతీవ్రత"మని పేరు! దీనికి సాటియైన వ్రతం మరొకటిలేదు!" అన్నాడు.

అప్పుడు ఆ కుమారస్వామి తిరిగి "ఓ దేవా! ఇంతటి అమోఘమైన ఈ వ్రతమహాత్మ్యమును గురించి విస్తరించి తెలుపవలసింది! అంతేకాదు. ఈ వ్రతాన్ని ఏరోజున ప్రారంభించాలి? దీని విధివిధానమేమిటి? దీనివలన కలిగే ఫలమెలాంటిది? ఇంతకుముందెవరు దీనిని ఆచరించారు? వారెలాంటి ఫలం పొందారు? ఈ వివరమంతటినీ నాపై నీకు అనుగ్రహమున్నచో విస్తారంగా చెప్పవలసింది! సర్వలోకములకూ ఉపకారం జరిగేలా, ఈ వ్రతప్రసిద్ధికోసం విధానమంతా చక్కగా వివరించగోర్తాను!" అంటూ శంకరుణ్ణి ప్రార్థించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'స్కందోపాఖ్యానం' అనే 86-వ అధ్యాయం.

87

# తారక వధోపాఖ్యానం

(మూలం)

## సప్తశీతితమో అధ్యాయః

**శంకర ఉవాచ :**

అహంతే కథ యిష్యామి వ్రతస్యాస్య విధిం పరం ।
శ్రావణేతు సితే పక్షే చతుర్థ్యా మారభేద్వ్రతం ॥ 1

తిలామలక కల్కేన ప్రాతః స్నానం విధాయ చ ।
నిత్య నైమిత్తికం సర్వం సమాప్య క్రోధవర్జితః ॥ 2

శుచౌ మండపికాం కృత్వా కదలీస్తంభ మండితః ।
ఇక్షు చామర పుష్పాఢ్యా మాదర్శ్యావ విశోభితాం ॥ 3

తన్మధ్యే కలశం స్థాప్య వస్త్రయుగ్మేన వేష్టితం ।
తత్ర చాష్టదళం పద్మం కారయే చ్చందనేన తు ॥ 4

గురోరాజ్ఞాం గృహిత్వాచ పూజా ద్రవ్యాణి ప్రోక్షయేత్ ।
ఉపచారైః షోడశభిః పూజయే ద్గణనాయకం ॥ 5

కాంచనం రాజతం వాపి స్వస్వశక్త్యా వినిర్మితం ।
ఏకవింశతి పక్వాన్నై రేకవింశతి సంఖ్యకైః ॥ 6

గజాననాయ దేవాయ నైవేద్యం పరికల్పయేత్ ।
ఏకవింశతి ముద్రాస్తు దక్షిణార్థం నివేదయేత్ ॥ 7

సౌవర్ణీ రాజతీర్వాపి విత్తశాఠ్య వివర్జితః ।
ఏకవింశతి దూర్వాశ్చ శ్వేతావా హరితా అపి ॥ 8

అర్పయే ద్దేవదేవాయ మంత్ర పుష్పాంజలిం తథా ।
బ్రాహ్మణాన్ వేదవిదుషః పూజయే దేకవింశతిం ॥ 9

భోజయే త్తాదృశానేన తావద్దానాని దాపయేత్ ।
నమేత్తు మాపయేత్పశ్చాదచ్ఛిద్ర మతి వాచయేత్ ॥ 10

పార్థివస్య గణేశస్య విధానం కథితం పురా ।
పూజాప్రకారః సోప్యత్ర సర్వఏవ ఉదాహృతః ॥ 11

కథంతామేవ శృణుయా త్పశ్చాద్బంధుయుత స్స్వయం ।
ధ్యాయన్గణేశం భుంజీత మౌనే నోపవసేత వా ॥ 12

ఏవం మాసవ్రతం కుర్యా ద్యావద్భాద్ర చతుర్థికా ।
తస్యాం మహోత్సవః కార్యో యధావిభవ మాదరాత్ ॥ 13

పూర్వోక్తేన విధానేన పూజయే ద్గణనాయకం ॥
రాత్రౌ జాగరణం కార్యం గీతవాదిత్ర నిస్స్వనైః ॥ 14

పురాణ శ్రవణైరన్యైః నానాఖ్యాన వరైరపి ।
సహస్రనామ మంత్రేణ స్తువీత ద్విరదాననః ॥
ప్రభాతే విమలే స్నాత్వా పూజయే ద్ద్విరదాననం ॥ 15

బ్రాహ్మణా న్పూజయేద్భక్త్యా శతంచైవ ఏకవింశతిం ।
గో భూకాంచన వస్త్రాణి భూషణాని ధనానిచ ॥ 16

తేభ్యోదద్యా దధాశక్తి దీనాంధ కృపణేషు చ ।
అశక్తౌ భోజయేక వింశత్యేకంతు వాడబాన్ ॥ 17

బ్రాహ్మణాయ ప్రదాతవ్యా మూర్తి శ్చేద్ధాతు నిర్మితా ।
అన్యదా పరమోత్సాహై ర్జలమధ్యే విసర్జయేత్ ॥ 18

దివ్యవాదిత్ర నిర్ఘోషై ర్నరయాన స్థితాంచితాం ॥
ఛత్ర ధ్వజపతాకాభి ర్వేద గీతాదినిస్స్వనైః ॥ 19

బాలానాం దండ యుద్దైశ్చ తాం విసృజ్య గృహంవ్రజేత్ ।
వ్రతమేతం తుయః కుర్యాదేకవారం షడానన ॥ 20

సర్వా న్కామానవాప్యైవ గణేశం పదమాప్నుయాత్ ।
బ్రహ్మణాకారి సృష్ట్యర్థం ఏకార్ణంజపతా మనుం ॥
ప్రత్యక్షో వికటస్తస్య సామర్థ్యం వివిధం దధౌ । 21

విష్ణునా ప్రాపి శక్తిశ్చ పాలనే కుర్వతా వ్రతం ।
షడక్షరం మహామంత్రం జపతా పరమాద్భుతం ॥ 22

స్వేచ్ఛావతార సామర్థ్యం తతః ప్రాప్తంషడానన
మయాప్యకారి పుత్రైత జ్జపతాష్టాక్షరంమనుం 23

నానాసామర్థ్యవానస్మి సంహరామి జగత్త్రయం ।
యక్ష గంధర్వమునిభిః కిన్నరోరగ రాక్షసైః ॥
అకారి స్వేష్టసిద్ధ్యర్థం సిద్ధచారణ మానవైః ॥ 24

ఏతత్త్వం స్కంద వరద చతుర్థీవ్రత మాచర ।
భవిష్యసి రణేఽజేయో విఖ్యాతో భువనత్రయే ॥ 25

షడక్షరంచ మంత్రం తే దదామిద్విరదానన ।
వృత్రంచ శంబరం దైత్యం శక్రేణ మదనేనచ
జిఘాంసతాకారి వ్రతం తౌతౌజేతుంచశేకతు 26

**బ్రహ్మోవాచ :**

సుముహూర్తే దదౌ తస్మై శివో దీక్షాం షడక్షరీం ॥ 27

తదైవ స యయౌస్కంద స్తపస్తప్తుం ద్విజోత్తమ ।
సునిర్మల తరే దేశేవృక్ష వల్లీసమాకులే ॥ 28

బహుమూల ఫలేరమ్యే సరోవాపీ సుశోభితే ।
ఏకపాదః స్థితస్కంద స్తపస్తేపే సుదారుణం ॥ 29

వ్రతంచ కా విధివద్యథోక్తం శంభునా పురా ।
అనుష్ఠానాచ్చ మంత్రస్య వ్రతస్యాస్య ప్రభావతః ॥ 30

ప్రసన్నోభూ త్తదైవాస్య పరమాత్మా గజాననః ।
దర్శయామాస సేనాన్యే యోగి ధ్యేయమనుత్తమం ॥ 31

నిజం రూపం మహాతేజా శ్చతుర్భుజ విరాజితం ।
మహాముకుట సంశోభి కుండలాంగద శోభితం ॥ 32

ఏకదంతం ఫాలచంద్రం శుండా దండవిరాజితం ।
పాశాంకుశ కరంమాలా దంత హస్తం సుశోభనం ॥ 33

ముక్తామణి గణోపేతం సర్పరాజ యుతోదరం ।
దివ్యవస్త్ర పరీధానం దివ్యగంధాను లేపనం ॥ 34

అనేక సూర్యసంకాశ తేజోజ్వాలా సుదీపితం ।
దదర్శ షణ్ముఖస్తత్ర విస్మయోత్ఫుల్ల లోచనః॥ 35

వ్యాకులీ భూతచిత్తోసౌ కిమే తదిత్య చింతయత్ ।
మయాయచ్చింత్యతే న్యద్వా తద్వావింద్యాం నచాప్యహం ॥ 36

తతః పప్రచ్ఛ తూష్ణీంస కో భవాన్ కించనామ తే ।

**గజానన ఉవాచ :**

చింత్యతే యోదివారాత్రౌ త్వయైకాగ్రేణ చేతసా ॥ 37

సోహం ప్రాప్తోవరందాతుం వదతే హృది వాంఛితం ।
దదామి తుష్టస్తపసా షడానన గజాననః ॥ 38

**స్కంద ఉవాచ :**

విదుర్నదేవా నచశాస్త్రకారా బ్రహ్మాదయః శేషముఖాశ్చ నాగాః ।
తవ స్వరూపం జగదీశ సమ్యగదర్శి తన్మే ద్విరదాననాద్య ॥ 39

తేనైవ జాతః పరిపూర్ణకామ స్తథాపి యాచేతే దేవవాక్యాత్ ।
పరాజయోమే నకదాపి భూయాత్ప్రత్యక్షతా మేహి విచింత్యమానః॥40

అవిస్మృతిస్యాత్త వపాదపద్మే ।
సర్వేషు దేవేషు వరిష్ఠతా చ ॥ 41

అలక్ష్యే లక్ష్యతాం యాతస్తతో లక్షవినాయకః ।
నామ్నాఖ్యాతో భవాత్రత్వం భక్తకామ సురద్రుమః ॥

**లక్ష ఉవాచ :**

సర్వం తద్భవితాస్కంద యద్యత్ప్రార్థిత మద్యమే ॥ 42

అవిస్మృతిశ్చ సాన్నిధ్యం చింత్యమానస్య మేభవేత్ ।
పరాజయా రిపూణాంతే దేవశ్రైష్ఠ్యం భవిష్యతి ॥ 43

బ్రహ్మోవాచ :

ఏవం వరాన్ దదౌ దేవో మాయూరం నిజవాహనం ।
దదౌ స్కందాయ సుప్రీతో వినయాచ్ఛ తపోబలాత్ ॥ 44

మయూరధ్వజ ఇత్యేవం నామఖ్యాతం తతోభవత్ ।

గజానన ఉవాచ :

మృతిం యాస్యంతి హస్తాత్తే తారకాద్యా మహాసురాః ॥ 45

లక్షవినాయక ఇతి నామ్నాహం భక్తవత్సలః ।
భవిష్యామి చిరాదత్ర క్షేత్రే త్వద్వాక్యతో నఘ ॥ 46

బ్రహ్మోవాచ :

ఏవముక్త్వాతు వికటస్తత్రైవాంతర్దధే విభుః ।
తతః స్కందో మహామూర్తిం కృత్వాస్థాప్య ద్విజైస్సహ ॥ 47

లక్షవినాయక ఇతి నామ చక్రేశుభం తదా ।
మోదకై ర్లక్షసంఖ్యాకైః పుష్పై ర్దూర్వాంకురైరపి ॥ 48

పూజయామానస తాం మూర్తిం అన్యైర్ద్రవ్యై స్తథావిధైః ।
బ్రాహ్మణాన్ భోజయామాస తావ త్సంఖ్యాయుతాన్ ద్విజాన్ ॥ 49

స్తుత్వా నత్వా యయౌస్కందః శంకరం లోకశంకరం ।
మయూర మారుహ్యా తతః సర్వంచా కథయచ్ఛ తం ॥ 50

మయూరధ్వజ ఇతి చ నామ దేవకృతం జగౌ।
తారకాసుర నాశాయ యయౌ స్కంధః శివాజ్ఞయా ॥ 51

స్మృత్వా గజాననం దేవం పరిగృహ్యా శివాశిషః ।
దేవసేనాపతిత్వేసా వభిషిక్తః సురర్షిభిః ॥ 52

సేనానీ స్తారకం దృష్ట్వాయుద్ధంచక్రే మహాబలః ।
లక్షవర్షాంతరే తం సమరయామాస శక్తితః ॥ 53

యుద్ధం తద్వర్ణితుం శక్తిః శేషస్యాపి నవైభవేత్ ॥
తారకే నిహతే దైత్యే ననందుః సర్వదేవతాః ॥ 54

మునయో లోకపాలాశ్చ నాగాచ్చ మానవాస్తథా ।
ముముచుః పుష్పవర్షాణి స్కందస్యోపరి నిర్వృతాః ॥ 55

సర్వదేవాచ్చ లోకాశ్చ స్వం స్వం స్థానం యయుస్తదా ।
స్వాహా స్వధావషట్కారాన్ యథాపూర్వం చ చక్రిరే ॥ 56

బ్రహ్మోవాచ :

ఏవం ప్రభావో దేవో సౌకథితస్తే గజాననః ।
వ్రత ప్రభావోపి మయా యథావత్తే నిరూపితః ॥ 57

త్రయస్త్రిం శత్కోటి సురైరవధ్యో సౌ మహాసురః ।
స్కందేన నిహతః సంఖ్యే దేవవ్రతప్రభావతః ॥ 58

ఇంద్రాది దేవతాబృందైః పూజనీయో భవచ్చసః ।

**వ్యాస ఉవాచ :**

అనుష్ఠానం కృతం తేన కస్మిం స్థానే సమాధినా ॥ 59
పరమేణ విశాఖేన తన్మే బ్రూహి ప్రజాపతే ।

**బ్రహ్మోవాచ :**

అనుష్ఠానం కృతం తేన యత్రాస్తేమ సృణేశ్వరః ।
ప్రసిద్ధో వర్తతే నామ్నా ఆసీత్ లక్ష వినాయకః ॥ 60

ఏలోభూత్తత్ర నగరే పశ్చాద్రాజాభి విశృతః ।
తన్నామ్నా నగరం ఖ్యాతం తత స్తద భవన్మునే ॥ 61

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే తారక వధోపాఖ్యానం**
**నామ అష్టసప్తతితమో అధ్యాయః**



# 87-వ అధ్యాయము

# తారకవధోపాఖ్యానం

## వరదగణపతి పూజావిధానం :

అప్పుడు శివుడిలా అన్నాడు : "ఓ కుమారా! నీవు కోరినట్టుగా సకల పాపక్షయకరము, సర్వసిద్ధికరమైన 'వరదగణపతివ్రతం' గురించి నీకు తెలియజేస్తాను! ఈ వ్రతాన్ని శ్రావణమాసములోని శుక్లచతుర్థి నాడు ఆరంభించాలి! ఆ వ్రతవిధాన మెలాంటిదంటే — ఆనాడు ఉదయాన్నే నువ్వులపిండితో నలుగుపెట్టుకొని అభ్యంజనస్నానం చేయాలి. ఆ తరువాత నిత్యనైమిత్తికకర్మలను నెరవేర్చి, కోపాన్ని దరిజేరనీయకుండా సంయమనం పాటించాలి.

ఒక నలుచదరమైన ప్రదేశాన్ని గోమయంతో అలికి పరిశుద్ధంచేసి అక్కడ ఒక మంటపాన్ని నిర్మించి, దానికి నాలుగువైపులా అరటిస్థంభాలను అమర్చి ఆ మంటపాన్ని పుష్పమాలలతోనూ, మామిడి ఆకుల

తోరణాలతోనూ, అద్దములనూ, చామరములనూ సమకూర్చి అలంక రించాలి.

ఆ మంటపం మధ్యగా శ్రీగంధంతో ఒక అష్టదళపద్మాన్ని గీసి దానిపై ధాన్యాన్ని పోయాలి! దానిపైన వస్త్రద్వయాలపై అమర్చినట్టి ఒక కలశాన్ని స్థాపించాలి! ఆచార్యుని అనుజ్ఞ తీసుకొని, పూజాద్రవ్యాలను శుద్ధిచేసుకొని ఆ తరువాత గజాననుని మూర్తికి ప్రాణప్రతిష్టచేసి, షోడశోప చారములతో పూజించాలి! ఆ గజాననుని ప్రతిమ వెండితోగాని బంగారుదిగాని వినియోగించాలి!

నైవేద్యానికై ఇరవైఒక్క రకాల పిండివంటల్ని తయారుచేయాలి. ఆ తరువాత అరవైఒక్క ముద్రల్ని (బంగారువికాని లేదా వెండివికాని) దక్షిణగా యివ్వాలి! తెలుపువి లేదా పచ్చటివి ఇరవైఒక్క దూర్వాంకురా లను సమర్పించాలి! ఇలా సమంత్రకంగా పూజావిధి యావత్తూ ముగిసిన తరువాత మంత్రపుష్పాన్ని సమర్పించి, ఇరవైఒక్కమంది బ్రాహ్మణులను పూజించి వారికి అన్నసమారాధనం చేయాలి! ఇరవైఒక్క విధములైన దానాలనూ చేయాలి! ఆ తరువాత గజాననునికి అపరాధ క్షమాపణ చెప్పి సాష్టాంగ నమస్కారంచేసి "వ్రతం సంపూర్ణ ఫలప్రదమౌనుగాక" అంటూ వేడుకొని, పార్థివగణేశపూజను యథావిధిగా ఈ గణేశుని మూర్తికి సమర్పించి, ఆ కథాశ్రవణం చేయాలి! విఘ్నహరుడైనట్టి గజవదనుని హృదయంలో ధ్యానిస్తూ మౌనంగా భుజించాలి. ఈ విధంగా ఒక మాసం రోజులు అంటే శ్రావణశుక్ల చతుర్థినుండి భాద్రపద శుక్లచతుర్థివరకూ చేయాలి! చివరినాడైన భాద్రపద శుక్లచతుర్థినాడు పూర్వం చెప్పినమాదిరి గానే విఘ్నేశ్వరుని పూజించి, వినాయకచవితి ఉత్సవాన్ని గావించాలి!

ఆ రాత్రి జాగరణచేసి నృత్యగీతాది నాట్యయుత మైన సపర్యలను వినాయకునికి సమర్పించాలి! గణేశపురాణాన్ని, అందుగల ఉపాఖ్యానము లను శ్రద్ధగా ఆలకించి గజాననుని సహస్రనామాలతో పూజించాలి!

ఆ మర్నాడైన ఋషిపంచమినాడు ప్రాతఃకాలాన్నే సంధ్యావందనాది కములు ముగించుకొని గజాననుని యధావిధిగా పూజించాలి! ఆ తరువాత వందమంది లేదా కనీసం ఇరవైఒక్కమంది బ్రాహ్మణులకు తృప్తిగా భోజనాదికములు ఏర్పాటుచేసి వారిని గౌరవించాలి!

అర్చనసల్పినట్టి బంగారు లేదా రజతమైన మూర్తిని బ్రాహ్మణు నకు దానంచేయాలి. మృత్తికతో చేసినట్టి మూర్తినిమాత్రం మంగళ వాయిద్యాలతో ఊరేగింపచేసి తటాకంలోగాని, నదిలోగాని నిమజ్జనం చేయాలి!

ఓ షడాననా! ఈ వరదగణపతీవ్రతాన్ని ఒకపర్యాయం శ్రద్ధాభక్తు లతో ఆచరించితే తమయొక్క సకలాభీష్టాలనూ సిద్ధింపచేసుకున్నవారై అంత్యమున గణేశధామాన్ని పొందగలరు.

ఓ స్కందా! ఇదివరలో సృష్టి ఆరంభంలో చతుర్ముఖుడీ వ్రతాన్ని సల్పి సృష్టిరచనా సామర్ధ్యాన్ని అనుగ్రహంగా పొందాడు - అలాగే లోకపాలకుడైనట్టి విష్ణువు ఈ వ్రత అనుష్టానంవల్లనే పాలనశక్తిని పొందాడు. అంతేకాదు స్వేచ్ఛగా అవతారాలెత్తే శక్తిని ఈ గణేశషడక్షరీ మంత్రానుష్టానంవల్ల పొందగలిగాడు. అంతెందుకు నిత్యం అష్టాక్షరీ మహామంత్రాన్ని అనుష్టించే నేనుకూడా ఈ గణేశ షడక్షరీమంత్రం వలననే జగత్రయాన్ని లయం చెందించగల్గుతున్నాను.

అంతేకాదు సర్వసిద్ధిప్రదమైనట్టి ఈ వ్రతాన్ని యక్ష గంధర్వ కిన్నర కింపురుషులూ, రాక్షసులూ కూడా తమతమ అభీష్టప్రాప్తికై అనుష్ఠించారు. నాయనా! నీవుకూడా ఇట్టి విశేషఫలప్రదమైనట్టి వ్రతాన్ని ఆచరించి యుద్ధములో జయప్రాప్తినీ ముల్లోకాలలోనూ అంతులేని ఖ్యాతినీ పొందు!" అంటూ ఓ వ్యాసమునీంద్రా! ఒకానొక శుభముహూర్తంలో శంకరుడు తన కుమారునికి గణేశమంత్రదీక్షను అనుగ్రహించాడు.

## స్కందుడు వరదుడిని ఆరాధించుట :

అనంతరం ప్రశాంతమైనట్టి తపోవనికి తరలిపోయి అక్కడ ఒంటి కాలిమీద నిలబడి స్కందుడు ఘోరమైన తపస్సును ఆచరించి, శివుడు చెప్పిన విధానంలో వరదగణేశ వ్రతాన్నికూడా చేశాడు.

అప్పుడు ఆ వ్రతప్రభావంవల్లా, మంత్రానుష్ఠానంచేతా సంతుష్టుడైన గజాననుడు - యోగిజనులకుసైతం దుర్లభమైన తన దివ్యరూపంతో స్కందునికి సాక్షాత్కరించాడు.

చతుర్భుజుడై, నుదుట చంద్రకళతో, దివ్యమైన రత్నఖచిత కిరీటాన్ని ధరించి, కుండలముల శోభతో చెక్కిళ్ళు కాంతులీనుతుండగా పరశువు, అంకుశము, పాశము, దంతములను తన నాల్గుహస్తాలలోనూ ధరించి కంఠమున ముత్యాలహారాలతో ఒప్పుతూ, నాగయజ్ఞోపవీతాన్ని ధరించి, దివ్యాలంకారములనూ దేవతావస్త్రాలతోనూ భూషితుడై, దివ్యగంధానులేపనం గావించుకుని, కోటిసూర్యసమాన తేజుడై ఆ గజాననుడు భాసించాడు. ఆ దివ్యదర్శనానికి చకితుడైన స్కందుడు 'ఇదియేమి విపరీతమా?' అనుకొని తను నిత్యం భక్తితో ఆరాధించే దేవతాస్వరూపి

యేనా ఇతడు? అనుకొని ధైర్యం కూడగట్టుకొని 'ఓయీ! నీవెవరవు? నీపేరేమి?' అంటూ ప్రశ్నించాడు.

అప్పుడా గజాననుడు చిరునవ్వు తళుక్కుమని మెరవగా యిలా అన్నాడు. "ఓ స్కందా! అహర్నిశలూ నీవు ఎవరి అనుగ్రహాన్ని ఆపేక్షించి అత్యంత నిష్ఠతో ఏకాగ్రచిత్తుడవై ధ్యానిస్తున్నావో ఆ మంత్రమూర్తిని నేనే! నీ తపస్సుకు చాలా సంతుష్టుడైనాను. నీకభీష్టప్రదానం చేయడానికి స్వయంగా యిలా అనుగ్రహించాను! నీ అభీష్టాలను వేడుకో! వాటి నన్నిటినీ తప్పక తీర్చగలను!" అంటూ ఉరుము ఉరిమినట్లుగా పలికాడు భక్తానుగ్రహ మూర్తియైన గజాననుడు!

"ఓ దేవదేవా! నీ ఈ దివ్యస్వరూపాన్ని హరిహరబ్రహ్మాదులుగాని, ఇంద్రాదిదేవతలుగాని, వేయినాల్కలుగల ఆదిశేషుడుగాని కనుగొనలేరు. అట్టి నీ దివ్యమంగళరూపాన్ని అనుగ్రహంతో నాకు దర్శనమిచ్చావు. నీ దర్శనమాత్రంచేతనే నా సకలాభీష్టసిద్ధి అయింది. ఐనా మీ ఆజ్ఞానుసారం వరమును అర్థిస్తాను. అదేమంటే - యుద్ధంలో నాకెన్నడూ పరాజయ మన్నది లేకుండా అనుగ్రహించు! ఎన్నటికీ నీ పాదపద్మములపై విస్మృతి కలుగకుండుగాక! నేను స్మరించినంతనే నాకు సాక్షాత్కరించు!

దేవతలలోకెల్లా శ్రేష్ఠత్వాన్ని ప్రసాదించు! లక్ష్యరూపంతో నాకిక్కడ సాక్షాత్కరించావుగనుక "లక్ష్య వినాయకుడన్న" పేరిట యిట వెలసి భక్తుల పాలిట కల్పవృక్షమువై అనుగ్రహించు!"

ఆ మాటలకు విఘ్నేశుడు "తథాస్తు" (అట్లే అగుగాక) అంటూ ఆ దేవసేనాని కోరిన సకలవరాలనూ ప్రసాదించి, వాటితోపాటూ తన

వాహనమైనట్టి మయూరాన్ని అతడికి బహూకరించాడు. అది మొదలుగా స్కందుడికి మయూరధ్వజుడన్న ఖ్యాతి గలిగింది! ఇంకా ఆ వినాయ కుడిలా అన్నాడు.

"ఓ స్కందా! తారకాది రాక్షసులు నీచే వధింపబడతారు! నీ వాక్యానుసారమే నేను ఈ క్షేత్రములో లక్ష్య వినాయకుడన్న పేరుతో భక్తవరదుడనై వెలసియుంటాను!" అంటూ అంతర్ధానం చెందాడు.

అప్పుడు స్కందుడు బ్రాహ్మణ ఆశీర్వచనాలతోనూ వేదమంత్ర పురస్సరంగానూ మహామూర్తిని స్థాపించి ఆ మూర్తికి లక్షవినాయకుడని నామకరణం చేశాడు. లక్షసంఖ్యలో మోదుకము (ఉండ్రాళ్ళనూ) దూర్వాంకురములనూ సమర్పించి పుష్పాలతో ఆ మూర్తిని అర్చించాడు. లక్షమంది విప్రులకు భోజనం ఏర్పాటుచేసి ఆ తరువాత గణేశునికి స్తుతులను ప్రణామాలను సమర్పించి మయూరవాహనారూఢుడై కైలాసం లోని శివుని సన్నిధికి వెళ్ళి ఆతడికి జరిగిన యావద్వృత్తాంతమునూ వివరించాడు.

అప్పుడు దేవర్షులంతా స్కందుడిని దేవసైన్యాధ్యక్షునిగా పట్టాభి షిక్తుని గావించారు. గజాననుని స్మరించుకొని, శివుని ఆశీస్సులను పొంది, తారకాసురునిపై యుద్ధానికి వెళ్ళి అతడిపై లక్షసంవత్సరాలు ఘోరమైన పోరుసల్పి ఆతడిని వధించాడు.

ఈ మహత్తర విజయానికి అతడిని మహర్షులు, దేవతలు సిద్ధ సాధ్య యక్షకిన్నర కింపురుషాది గంధర్వగణాలు అతడిని వేనోళ్ళ కీర్తించారు. సమస్త లోకాలలోనూ యధాపూర్వకంగా దేవతాపితృకార్యాలు

జరుగసాగాయి. "ఓ వ్యాసమునీంద్రా! గజాననునియొక్క మహాప్రభావ మంతటిది! వ్రతప్రభావాన్ని కూడా నీకు నిరూపించి చెప్పాను. ముప్పైమూడుకోట్ల దేవతలచేతా వధింపబడని ఆ తారకుడు, ఆ గజానను వ్రతప్రభావంచేత స్కందునిచే సంహరించబడ్డాడు. అందువల్లనే ఇంద్రాది దేవతలకు కూడా పూజ్యుడైనాడు షణ్ముఖుడు!" అన్న చతుర్ముఖునితో వ్యాసుడిలా ప్రశ్నించాడు.

"ఓ చతురాననా! స్కందుడు సమాధినిష్ఠుడై ఏస్థానంలో తపస్సును ఆచరించాడు? ఆ వివరం నాకు చెప్పవలసింది!" అనగానే బ్రహ్మ యిలా అన్నాడు.

"ఓ వ్యాసమునీంద్రా! స్కందుడు ఘృష్ణేశ్వరుడు వెలిసిన ప్రదేశం లో అనుష్ఠానం చేశాడు! అక్కడే లక్షవినాయకుడు ప్రసిద్ధమై వెలిశాడు. ఘృస్ణృణేశ్వరుడు అనేరాజు పాలించిన నగరం అక్కడికి పశ్చిమానఉంది. అందుకనే ఆ నగరానికి ఘృష్ణేశ్వరనగరమన్న పేరు కల్గింది."

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'తారకవధ'** అనే 87-వ అధ్యాయం.



88

# అనంగోపాఖ్యానం

(మూలం)

## అష్టాశీతితమో అధ్యాయః

**మునిరువాచ :**

శృత మాఖ్యానకం బ్రహ్మన్ గజానన వ్రతాస్వయం ।
దగ్ధశ్చే న్మదనస్తేన శంకరేణ ఋషాగ్నినా ॥ 1

దృశ్యతే సర్వలోకేషు మదనోద్యాపి తత్కథం ।
ఏతత్కథయ మే సర్వం విస్తరా చ్చతురానన ॥ 2

**బ్రహ్మోవాచ :**

తృతీయం తు యదా నేత్రం రుషోద్ఘాటితవాన్ హరః ।
అపరాధం తు విజ్ఞాయ మదనస్య రతిస్తదా ॥ 3

ఆక్రందత్ మృతం కామం హరాంతిక ముపాగమత్ ।
సాష్టాంగం ప్రణిపత్యేనం తుష్టావ చ యథావిధి ॥ 4

**రతిరువాచ :**

నమామి దేవం గిరిజా సహాయం వృషధ్వజం ఫాలవిలోచనం చ ।
యఃపాతి లోకాన్ఖిలు సత్వయుక్తో నిర్మాతి లోకాన్ రజసా గుణేన॥ 5

యస్స్వేచ్ఛయా సంహరతే ఖిలేశో జగత్తమో విష్టతనుర్మహేశః
యోనుః కపాలం వహతే జనానాం భిక్షాటనః పూరయతే ఖిలార్థాన్॥ 6

దీనానుకంపీ భగవాన్మహేశో గతప్రియాయాః శరణం మమాస్తాం ।
కర్తుం తథా కర్తుమదీన సత్వః శక్తో అన్యథా కర్తుమపీహ దేవః ॥ 7

సమే విధత్తాం శరణంగతాయాః సౌభాగ్యముచ్చై ర్మృతజీవనేన ।
నోచే దహం ప్రాణవిసర్జనేన యశఃకరిష్యే విపరీతమీశ ॥ 8

**బ్రహ్మోవాచ :**

ఏవం తయాస్తుతః శంభుః ప్రసన్నస్తామథాబ్రవీత్ ।

**శంభురువాచ :**

వరం వృణు మహాభాగే కామపత్ని శుభాననే । 9

దదామి తుష్టస్తోత్రేణ సర్వాన్కామాన్ హృదిస్థితాన్ ।
ఇత్థం శివవచశ్రుత్వా రతి ర్హృష్టా ప్రణమ్యతం ॥ 10

సౌభాగ్యకామా తం దేవం నిజగాద భృశాతురా ।

**రతిరువాచ :**

స్వామిన్యది ప్రసన్నశ్చే చ్ఛృణుమే పరమం వచః ॥ 11

రసాయాం దివి భూమౌవా కాంతాస్స్యుః కామినీ గుణాః ।
మమ లావణ్యలేశేన తేషు కాపి త్రిలోచన ॥ 12

మాం దృష్ట్వా ముముచుః శక్రముఖ్యా వీర్య మపత్రపాః ।
తతో మేమహతీలజ్జా జాతామే తామపాకురు । 13

లావణ్యంచ వృథాజాతం వినా కామేన శంకర ।
అయశో దహతేమహ్యం రతిఃస్సా విధవేతిచ ॥ 14

భర్తృదానేన దేవేశ మాం జీవయ దయానిధే ।
ఏవం తయా ప్రార్థితో సౌ శంకరో లోకశంకరః ॥ 15

ఉవాచ శ్లక్ష్ణయా వాచా హర్షయన్ కామయోషితం ।

**శివ ఉవాచ :**

చింతాం మాకురు కల్యాణి నలజ్జాం కర్తుమర్హసి ॥ 16

స్మృతమాత్ర స్త్వయాబాలే కామః స్యాద్దృష్టిగోచరః ।
మనసా చింతితోవాపి మనోభూ రితిసంజ్ఞితః ॥ 17

పూరయిష్యతి తేకామాన్ మాన్యా త్వంచ భవిష్యసి ।
విష్ణో స్సకాశాదుత్పత్తిం రమాయాం ప్రాప్స్యతే యదా ॥ 18

భర్తాతవ జనేఖ్యాతో నామ్నా ప్రద్యుమ్న సంజ్ఞితః ।
భవిష్యతి మహాభాగే గచ్ఛేదానీం నిజాజాలయం । 19

సాగతా శివవాక్యేన మందిరం భ్రుశ సుందరం
సస్మార తంపతింపాతు పురోనంగః సమాయయౌ । 20

ఈశ్వరే చ్ఛావశాత్తస్యాః ప్రతక్ష్యంసమజాయత ।
రతిశ్చార్యయుక్తా సాజహృషే పతినాసహ । 21
తతోనంగో యయౌ శంభుం ప్రణమ్యాభిదధే వచః ।

**అనంగ ఉవాచ :**

వినాపరాధం దేవేశ గమితో నంగతాం కథం ॥ 22

ఇంద్రాది దేవతాబృందై స్తారకాసురపీడితైః ।
మునిభిశ్చ విశాఖస్య త్వత్తఉత్పత్తి వేదిభిః ॥ 23

ప్రార్థితస్తవ నిష్ఠాయా భంగం కర్తు మహం విభో ।
ఉపకారాయ సర్వేషా మకార్షం కర్మ తాదృశం ॥ 24

ఉపకారసమం పుణ్యం నచాస్తి భువనత్రయే ।
విపరీతంతు తజ్ఞాతం మమదైవాత్సురేశ్వర ॥ 25

త్రయస్త్రింశత్కోటి దేవేష్వహం చారుతరః పురా ।
ఉపమా చారుపురుషే మమైవ దీయతేఽఖిలైః ॥ 26

కథం తిష్ఠామి దేవేశ స్వాంగహీనః పరేత వత్ ।
అతోమయి మహాదేవ కృపయా నుగ్రహం కురు ॥ 27

బ్రహ్మోవాచ :

తదేకాక్షరంమంత్రం గణేశస్య దదౌశివః ।
అనంగాయ ప్రణమతే నుష్ఠానం చాదిశచ్చతం ॥ 28

తతో నంగోయయౌ రమ్యం జనస్థానం సుసిద్ధిదం ।
తత్రానుష్ఠాన మకరో దనంగః శంకరాజ్ఞయా ॥ 29

సంవత్సరశతం పూర్ణం తతాప సతపో మహత్ ।
ఏకాక్షరం జపన్మంత్రం గణేశ ధ్యానతత్పరః ॥ 30

వాయుమాత్రాశనో నిత్యం సదా రతిసహాయవాన్ ।
తతః ప్రసన్నో భగవాన్ దేవదేవో గజాననః ॥ 31

ఆవిరాసీ ద్దశభుజో మహాముకుట శోభితః ।
జ్వలద్రత్న ప్రభాచారు కుండలాంగద మండితః । 32

కోటిసూర్య ప్రతీకాశో ముక్తామాలా విభూషితః ।
దివ్యమాల్యాంబర ధరో దివ్యగంధాను లేపనః ॥ 33

సిందూరారుణ శుండాశ్యో దశాయుధ లసత్కరః ।
శేషాలంకృత నాభిశ్చ నానాలంకార విరాజితః ॥ 34

సింహస్కంధో మహాశ్రీమాం శ్చీత్కార త్రాసితాఖిలః ।
ఇంద్రాదయోపి మునయ ఆవిర్భూతే గజాననే ॥ 35

ఆయయు రప్సరోభిశ్చ యక్ష గంధర్వ కిన్నరైః ।
దివ్య వాదిత్ర నిర్ఘోషైః పుపూజుస్తే గజాననం ॥ 36

ఉపచారై ష్షోడశభి ర్భక్త్యా దేవం పృథక్ పృథక్ ।
కామోపి తత ఉద్థాయ ప్రణిపత్యా ఖిలాన్ సురాన్ ॥ 37

వవందే దేవచరణౌ పూర్వం నత్వా మునీనపి ।
ప్రశశంస తదాదేవం వికటం కరుణాకరం ॥ 38

**కామ ఉవాచ :**

ధన్యస్త్వమసి దేవేష పరబ్రహ్మ స్వరూపవాన్ ।
నిరాకారోపి సాకారో జాతోసి భక్తవత్సలః ॥ 39

అద్య ధన్యం మమ జనుస్తపో ధన్యతరం చమే ।
య త్తవాంఘ్రియుగం దృష్టం సర్వదుఃఖ విమోచనం ॥ 40

కారణం సర్వసిద్ధీనాం ధర్మార్థకామ మోక్షదం ।
ధన్యే నేత్రయుగే మే ద్వయాభ్యాం దృష్టః పరః పుమాన్ ॥ 41

యం న జానంతి వేదాంతాః సాంఖ్యాపాతం జలాదయః ।
నేతి నేత్యభవం స్తూష్ణీం వేదోపి యత్రకుంఠితః ॥ 42

అనంతకోటి బ్రహ్మాండ రోమకూపో అఖిలేశ్వరః ।
యేన మంత్రేణ సోదర్శి మంత్రో ధన్యతరోపిసః ॥ 43

**గణేశ ఉవాచ :**

సమ్యగుక్తం రతిపతే నమాం బ్రహ్మాదయో విదుః ।
యదా సాకార తాంయామి తేపి జానంతి మాం తదా । 44

మమైవానుగ్రహా త్కామ దృష్టవానసి మాం తథా ।
యతోహం పరితుష్టస్తే తపసా మనునా తథా ॥ 45
వృణు మత్తోఖిలాన్కామాన్ కామే కామం దదామి తే ।

**బ్రహ్మోవాచ :**

ఇతి దేవ వచశ్శృత్వా పునరూచే మనోభవః । 46

అనుపూర్వ్యేణ సకలం వృత్తాంతం శివకారితం ।
తస్మై చాకథయత్కామః ప్రసన్నార్థ ప్రదాయినే ॥ 47

అనంగతాం స్వస్యరతే రాక్రందం మనుమేవచ ।
అనుష్ఠానం చిరకృతం శివదత్తం వరం తథా ॥ 48

వృణోతిస్మ వరం తస్మా త్సుప్రసన్నా ద్గజాననాత్ ।

**కామ ఉవాచ :**

యది ప్రసన్నో భగవాంస్తన్మే దేహి స దేహితాం ॥ 49

మాన్యతాం సర్వదేవేషు ప్రాగ్వల్లావణ్యమేవచ ।
భక్తిం ధృఢాం త్వచ్చరణే త్రైలోక్యవిజయం తథా ॥ 50

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే అనంగోపాఖ్యానం నామ అష్టాశీతితమో అధ్యాయః**



# 88-వ అధ్యాయము

# అనంగోపాఖ్యానం-I

అనంతరం వ్యాసమునీంద్రుడిలా అన్నాడు. "ఓ చతురాననా! సకలార్థప్రదములైన గజాననుని వ్రతమునూ - దాని సంబంధిత యితర గాధలను వినిపించి నాకు పరమ సంతోషాన్ని కల్గించావు. ఐనా నాకో సందేహం మిగిలివున్నది. అదేమిటంటే - మన్మధుడు శంకరునియొక్క క్రోధాగ్నిచే దగ్ధుడైనాడుకదా - మరలా లోకములో ఎలాగున గోచరుడౌతున్నాడు? అతనివల్లనే ఈ సృష్టివిలాసం కొనసాగుతున్నదికదా? దయతో నా ఈ సందేహాన్ని నివారించు!"

అప్పుడు చతురాననుడిలా బదులుపలికాడు :

"శంకరుడు రోషంతో అగ్రహపరవశుడై తన మూడవకన్ను తెరవగానే అతడి క్రోధాగ్నికి భస్మీపటలమైన మదనుడి విషయాన్ని తెలుసుకుని

ఆతడి పత్నియైన రతి తన భర్త అపరాధాన్ని తెలుసుకొని ఆ మదనారి శివుని పాదాలనంటి సాష్టాంగ దండప్రణామాలు ఆచరించి ఈవిధంగా స్తుతించింది.

"ఓ మహాదేవా! నీవే త్రిగుణాలకాధారభూతుడవూ, అతీతుడవూ! సత్త్వగుణంచేత లోకపాలననూ, రజోగుణంచేత సృష్టికార్య నిర్వహణనూ, చివరకు తమోగుణం ఆధారంగా సకల లోకాలనూ హరిస్తున్న నీకిదే నా శరణాగతి! ముక్కంటివీ, వృషభవాహనుడవూ గిరిజా సహాయుడవైన నీకివే నా నమస్కృతులు!

చేతిలో కపాలధారివై నిత్యభిక్షువువైనా భక్తుల మనోరధాలనన్నిటినీ నెరవేర్చుతూ, దీనులయెడ అపారమైన దయను వర్షించే దీనజనార్తి హరణా! నా పతివియోగాన్ని నేను సైపలేకున్నాను! నీవుతప్ప మరినాకు వేరేదిక్కు లేదు! నీ క్రోధాగ్నిచే దగ్ధుడైన నాభర్తకు ప్రాణాలను దానంచేసి నాకు సౌభాగ్యభిక్షను ప్రసాదించు! అలాకాకపోతే నేను ప్రాణత్యాగంచేసి ఆతడిని చేరుకుంటాను. అది నీకు అపకీర్తికాదా ప్రభూ! నీ కరుణయే నాకిక ఆధారం!" అంటూ దీనంగా ప్రార్ధించిన రతీదేవి స్తుతికి శంకరుడు ప్రసన్నుడై ఆమెతో యిలా అన్నాడు.

"ఓ రతీ! నీ స్తుతికి నేను సంతసించాను! నీకేం వరం కావాలో కోరుకో!" అప్పుడు ఆ మదనుని పత్ని సంతోషభరితురాలై యిలా కోరుకున్నది.

"ఓ పరమేశ్వరా! ముల్లోకాలలోనూ కాంతలకు పతితోడిదే జీవితం కదా! భర్తృరహితమైన మగువ జీవితం వ్యర్థం! శక్రాదులను సైతం

మోహింపచేయగల సౌందర్యం, నా శరీర లావణ్యం యివన్నీ నిరర్థకము లైనవి! కనుక ఓ దయానిధీ! నాకు భర్తృదానంచేసి నన్ను బ్రతికించు! రతి విధవ అనే అపకీర్తిని తొలగించు!'' అంటూ దీనయై రతిచేసిన ప్రార్థనకు శంకరుడు ఆమెను ఊరడిస్తూ, తన మృదుమధుర వాక్యాలతో అనునయంగా యిలా అన్నాడు.

"ఓ మంగళప్రదురాలా! దుఃఖించకు! లజ్జనొందకు! నీవు స్మరించి నంతనే నీభర్త నీకు కనబడగలడు! నీ కోరికలను తీర్చగలడు. నీవు మాననీయురాలవవుతావు! మనసారా స్మరించటంతో సంప్రాప్త మౌతాడు గనుక నీభర్త మనోభవుడన్న పేరుతో విఖ్యాతుడౌతాడు.

మళ్ళా ఈతడు శ్రీకృష్ణునకు పుత్రుడై రుక్మిణీదేవి గర్భాన ప్రద్యుమ్నుడన్న పేరుతో జన్మించినప్పుడు తిరిగి నీకు భర్తవుతాడు. నీవు దిగులుచెందకు!" అన్న శివుని ఆజ్ఞానుసారియై ఆమె తన యింటికి వెళ్ళి తన భర్తను స్మరించగానే అనంగుడామె ఎదుట సాక్షాత్కరించాడు. ఆమె ఆశ్చర్యానందాలకు అవధేలేకపోయింది. ఆ తరువాత అనంగుడు శంకరుని సన్నిధికి వెళ్ళి నమస్కరించి యిలాపలికాడు.

"ఓ దేవా! అపరాధము లేకుండానే నాకు శరీరం లేకుండా చేశావే! తారకాసురుని బాధలకు తట్టుకోలేక ఇంద్రాదిదేవతలు వేడుకొనగా విశాఖుడైన కుమారస్వామి జననం నీవలన జరగవలసినందున నీ నిష్ఠను భంగపరచటానికి కేవలం లోకోపకారం నిమిత్తమే పూనుకున్నాను. ఎవరైనా తమకు అయాచితంగా ఉపకారంచేస్తే ఎంతో ఆనందిస్తారు. కానీ అది నా విషయంలో విపరీత ఫలితాన్నిచ్చింది. గతంలో

ముప్పైమూడుకోట్ల దేవతలందరిలోనూ అత్యంత సుందరుడనై ఒప్పాను. ఇంద్రుడు, జయంతుడు, వసంతుడు, నలకూబరుడు వీరంతా నన్ను చూసి సిగ్గుతో తమ తలదించుకునేవారు! ఇప్పుడు అంగహీనుడనై ప్రేతలా ఎలా వుండగలను? కనుక ఓ మహాదేవా! దయచేసి నన్నునుగ్ర హించు!" అంటూ వేడుకొనగా 'ఓ వ్యాసమునీంద్రా! శంకరుడు **ఏకాక్షర గణపతీ మహామంత్రాన్ని** అనంగుడికి ఉపదేశించాడు. అప్పుడా మన్మథుడు కడు సుందరమైనట్టి జనస్థానానికి వెళ్ళి సుప్రసిద్ధమైన ఆ ఏకాంత ప్రదేశంలో శివుని అనుజ్ఞమేరకు అనుష్టానం చేయసాగాడు.

## గజానన సాక్షాత్కారం

కేవలం వాయువునే ఆహారంగా భక్షిస్తూ రతీసమేతుడై అనంగుడు నూరుసంవత్సరాలు మహత్తరమైన తపస్సును గణేశ ఏకాక్షరిమంత్రాన్ని జపిస్తూ నిష్ఠగా చేశాడు.

ఆ కఠోర తపస్సుకు ప్రసన్నుడైన గజాననుడు పదిబాహువులతో దివ్యకిరీటాన్ని దాల్చి, ప్రకాశిస్తూన్న రత్నకుండలాలను దాల్చి, కోటిసూర్యు లను ధిక్కరించే తేజస్సుతో, మెడలో ముత్యాలహారములు ధరించి, దివ్యమైన పుష్పమాలలను అలంకరించుకుని, సింధూరముతో అలదబడి నట్టి ఎఱ్ఱటి దేహఛాయతో, పదిబాహువులలోనూ దివ్యమైన దశాయుధా లనూ ధరించి శేషునిచేత కట్టపడిన నాభిస్థానం కలవాడై తన ఘీంకార ధ్వనితో లోకములనెల్ల భయకంపితులను చేస్తూ అనంగుడికి గణేశుడు సాక్షాత్కరించాడు.

ఈ విధంగా అవిర్భవించిన గజాననుని ఆరాధించేందుకుగాను ఇంద్రాది సమస్త దేవతలూ, అప్సర, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష

గణాలూ అక్కడికి విచ్చేశారు. షోడశోపచారములతో భక్తియుతులై ఆతడికి దివ్యంగా పూజలను సలిపారు.

అప్పుడా రతీపతి దేవతలకూ, మునులకు నమస్కరించి, దయా మయుడైన గణపతిని యిలా స్తుతించాడు.

"ఓ దేవా! దేవతలందరిలోకీ ధన్యుడవైనప్పటికీ నీవు కేవల పరబ్రహ్మ స్వరూపుడవే! నిరాకారుడవైనప్పటికి భక్తజనులయందలి వాత్సల్యంచేత సాకారమూర్తివిగా సాక్షాత్కరించావు. నీ దివ్యసందర్శనంచేత నాజన్మా తపస్సూ ధన్యమైనాయి! నీ దివ్యచరణారవింద దర్శనం సమస్త సిద్ధులకూ ఆలవాలం! చతుర్విధ పురుషార్థప్రదమైనట్టి, సర్వదుఃఖ విమోచకమైనట్టి నీ పాదయుగళం దర్శించిన నా నేత్రములు పావనమై, పునీతము లైనాయి!

ఓ కరుణాంతరంగా! వేదాలచేత, శాస్త్రప్రమాణాదులచేత యిట్టిదని నిర్వచించరానట్టి అనిర్వచనీయ స్వరూపంగల్గిన మహామహిమాన్వితుడవు! నిన్ను వర్ణింపశక్యంకాక వేదాలే మౌనంవహించినాయి! నీలోని ప్రత్యణువు అనేకకోట్ల బ్రహ్మాండాలకు నెలవైన - నీవు అఖిలేశ్వరుడవు! భక్తుల మనోహరుడవూ, కల్పవృక్షమువంటివాడవు! నీ దర్శనాన్ని నాకు ప్రసా దించిన ఆ మంత్రముసహితం అత్యంత ప్రభావవంతమైనది! నాపై నీ దయను ప్రసరించు!"

**గజాననుడిలా అన్నాడు :**

"ఓ మన్మథా! నీవు పలికినదంతా అక్షరసత్యం! బ్రహ్మరుద్రాదులు సైతం నా నిజతత్వాన్ని తెలుసుకునేందుకు సమర్థులుకారు! వారైనా

నా సాకార రూపాన్ని మాత్రమే ఎరుగగలరు! కేవలం నీయందలి అనుగ్రహవిశేషంచేత నీకు నా నిజస్వరూపదర్శనాన్ని ప్రసాదించాను!

నీ తపమునకు నేను కడుసంతుష్టుడనైనాను! ఓ రతీపతీ! నీ మనో భీష్టములన్నీ తప్పక అనుగ్రహిస్తాను! కోరుకో!"

అప్పుడా మదనుడు ఆ గజాననుని అనుగ్రహవచనాలను విని శివుని ఆగ్రహానికి తను దగ్ధుడవటమూ, తన భార్యయైన రతీవిలాపమూ, ఏకాక్షర మంత్రోపదేశము మొదలైన వివరాలను ఆ గజాననునికి విన్నవించి "ఓ దేవా! నీకు నాయందు అనుగ్రహం కలిగినట్లయితే - నాకు సదేహత్వాన్ని ఒసంగుము! సర్వదేవతా మాన్యత్వమునూ, పూర్వంలో వలే శరీరలావణ్యాన్నీ, నీ చరణారవిందాలపై చెదరని ధృఢభక్తినీ మూడు లోకాలపైనా విజయాన్నీ కలుగచేయి!" అంటూ ప్రార్థించాడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'**అనంగోపాఖ్యానం**' అనే 88-వ అధ్యాయం.



89

# అనంగో పాఖ్యానం

(మూలం)

## ఏకోననవతితమో అధ్యాయః

**గణేశ ఉవాచ :**

యద్యత్తే ప్రార్థితం కామ తత్తత్తే భవితాఖిలం
రమోదరా జ్జనింప్రాప్య సాంగస్త్వం సర్వసుందరః ॥ 1

భవితా సర్వమాన్యశ్చ త్రైలోక్య విజయీతథా ॥
పుష్పం ఫలం కిసలయం కామిన్యవయవా మరుత్ ॥ 2

ఉద్బోధకానితే సంతు జ్యోత్స్నాచందన నీరజే ॥
మరాలాండజ శబ్దశ్చ తేజాస్యైతై ర్ఘరాదికాన్ । 3

దర్శనా త్స్మరణాదేషాం మనిస్యపి భవిష్యసి ॥
మనోభూఃస్మృతిభూరేవం నామాపి స్యాజ్జనేమతే ॥ 4

అవిస్మృతి ర్మచ్చరణే దృఢాభక్తిశ్చ తే భవేత్ ।
స్మృతో హం పురతః స్యాంతే మహత్కార్య ఉపస్థితే ॥ 5

బహ్మోవాచ :

ఏవం తస్మై వరాన్దత్వా కామాయాథ గజాననః ।
అంతర్దధే మహాభాగ పశ్యత్సుచ సురర్షిషు ॥ 6

తత్రకామో మహామూర్తిం గణేశస్య తథావిధాం ।
సంపాద్య స్థాపయామాస పూజయామాస తం తదా । 7

రతినిర్మిత పక్వాన్నైః మోదకై ర్లడ్డుకాదిభిః ।
మహోత్కటేతి నామాస్య తేజస్వీత్వా త్తథాకరోత్ ॥ 8

ప్రాసాదం నిర్మమే కాంతం రత్నస్తంభ విరాజితం ॥
రుక్మిణ్యా ఉదరాజ్జాత స్త్యక్తోదైత్యేన వారిధౌ ॥ 9

మత్స్యేన గళితస్త త్రసమత్స్యోధీవరై స్తతః ।
శంబరా యార్పితేనాపి మాయావత్యై నివేదితః ॥ 10

విభిన్నేస్మిం స్తమదరాన్నిర్గతో వర్ధితస్తయా ।
నారదో కథయత్తస్యై కామోయం వర్ధిత స్తయా । 11

ఉపదిష్టేనే కమాయాః శంబరం స తతోవధేత్ ॥
గణేశస్య ప్రసాదేన బహూనేకో వ్యజిగ్యత ॥ 12

మాయావత్యా శిర్షితాభి ర్మాయచాభి ర్బహుభిశ్చసః ।
ప్రద్యుమ్న ఇతి విఖ్యాతః సరస్వత్యాః పురం యయౌః ॥ 13

సర్వదేవేషు మాన్యశ్చ త్రైలోక్య జయకారకః ।
గజానన ప్రసాదేన బభూవానంద నిర్వృతః ॥ 14

రుక్మిణీ ప్రభృతి స్త్రీభిర్దృష్ట కృష్ణ ఇవాపరః ।
తత ఉద్ధాయ యాతాభి ర్లజ్జితాభిస్సమంతతః ॥ 15

బుద్ధ్వా పుత్రంనారదస్య వాక్యేన ముముదుశ్చతాః ।
ఆలిలింగు స్తమభ్యేత్య ప్రణనామ రతిశ్చతాః ॥ 16

సర్వాపురీ హర్షయుతా తస్మిం జ్ఞాతే బభూవసా ।

**క ఉవాచ :**

ఏవం జనస్థానగత గణేశస్య మహామునే ॥ 17

మహిమా కథితోయత్ర రామేణాచ్ఛేది నాసికా ।
శూర్పణఖ్యా స్తతస్తత్తు నామ్నా ఖ్యాతం తు నాసికం ॥ 18

తత్రాహ్యాపి హి దృశ్యంతే ఉపలా మోదకా ఇవ ।
ఏవ మారాధితస్తేన కామో నాసౌ గజాననః ॥ 19

షడక్షరేణ మంత్రేణ శేషేణారాధితో యథా ।
రతిశ్చ మదనశ్చాపి ననందతు రుభౌయథా ॥ 20

**వ్యాస ఉవాచ :**

కథమారాధితో బ్రహ్మన్ శేషేణాసౌ గజాననః ।
కిమర్థం కించతే నాప్తం సుప్రసన్నా ద్గజాననాత్ ॥ 21

ఏతత్సవిస్తరం బ్రూహి పృచ్ఛత శ్చతురానన ।
ప్రష్టుః శ్రోతుశ్చ వక్తుశ్చ యతః పుణ్యం వివర్ధతే ॥ 22

బ్రహ్మోవాచ :

సమ్యక్ పృష్టం త్వయాబ్రహ్మన్ కథయామి కథామృతం ।
శృణుష్వా వహితోభూత్వా సర్వం సత్యవతీసుత ॥ 23

కస్మింశ్చ సమయే శంభుః పార్వత్యా సహితోమునే ।
సుఖాసీనో గిరివరే రమ్యసాను శిలోచ్చయే ॥ 24

నానా ద్రుమలతాకీర్ణే నిర్ఝరా రావశబ్దితే ।
గుంజంతి భ్రమరాయత్ర రుక్మపంకజ వాసినః ॥ 25

చంపకాశోక వకుళ మాలతీ కుసుమానిలః ।
ఆనందయతి చిత్తాని వసతాం యస్యశేఖరే ॥ 26

అయయు స్తత్రగంధర్వాః అప్సరో యక్షకిన్నరాః ।
దేవాశ్చ మునయో నాగాః తంద్రష్టుం గిరిజాపతిం । 27

కేచిత్తం ప్రణిపాతేన సాష్టాంగే నాభ్యవాదయన్ ।
ఉచ్చైర్జగుశ్చ గంధర్వాః సన్నృతుశ్చాప్సరో గణాః ॥ 28

పుపూజుస్తం దశభుజం వ్యాఘ్రాజినధరం హరం ।
నంది భృంగి గణాకీర్ణం ఫాలచంద్రం త్రిశూలినం ॥ 29

భస్మాంగం శేషశిరసం శంకరం వృషభధ్వజం ।
అపరై రర్చితం దేవముపచారై ర్మనోమయైః ॥ 30

నిమీల్య నయనే తస్థుః కేచిధ్యాన పరాయణాః ।
వశిష్ఠో వామదేవశ్చ జమదగ్ని స్త్రితోద్విజ ః ॥ 31

అత్రిః కణ్వో భరద్వాజో గౌతమాద్యా మునీశ్వరాః ।
తుష్టువు ర్వివిధైస్తోత్రై స్తత్రతం పార్వతీపతిం ॥ 32

స్తువత్సు తేషమునిషు శేషో గర్వం పరం యయౌ ।
అహమేవ శ్రేష్ఠతరో లోకేషు త్రిషునాపరః ॥ 33

యతః శ్రేష్ఠతరః శంభు స్తస్యాహంశిరసి స్థితః ।
ధరాధారణ సామర్థ్యం మయినాన్యత్ర కుత్రచిత్ ॥ 34

వాసుకే రజ్జుభూతాన్మ త్కులీనా దమృతం సురైః ।
ప్రాప్తం తతోऽమరత్వంచ తస్మాన్నాన్యోస్తి మత్పరః ॥ 35

తత్ హృదిస్థం తదా గర్వం జ్ఞాత్వా శంభు స్త్రిలోకకృత్ ।
విజ్ఞాయాఖిలదృక్ తూష్ణీముత్తస్థౌ సహసా శివః ॥ 36

ఆస్ఫాల యద్ధరాపృష్ఠే శేషం తాదృశ గర్వితం ।
ఏకైకో మస్తకస్తస్య దశసా దశధా భవత్ ॥ 37

మూర్ఛితః ప్రహరార్థం స గతప్రాణ ఇవాభవత్ ।
తతః ప్రభ్రుత్యసౌ జాతః సహస్రఫణి మండితః । 38

జీవశేషః శుశోచాధా శేషో శేషాహిభూషణః ॥
అలంకరణ భూతోహం త్రైలోక్యేశ హరస్యహ । 39

ఇమామస్థా వంసంప్రాప్తో నజానే కేనకర్మణా ॥
చలితుం నైవశక్నోమి పక్షహీన ఇవాండజః ॥ 40

కింకరోమి క్వగచ్ఛామి కోమేత్రాతా ధునాభవేత్ ।
కోమే నిజపదప్రాప్తా వుపాయం కథయేచ్ఛుభం ॥ 41

కోవా మేపనయే దుఃఖ మితి చింతాపరస్తు సః స ।
దదర్శ తేనమార్గేణ గచ్ఛంతం నారదంమునిం ॥ 42

జహర్ష కించిన్నాగేంద్రః స్వప్నంనిధింప్రాప్యేవ భిక్షుకః ।
అతికష్టా మవస్థాంతాం నారదో లోకయత్సురః ॥ 43

నిశ్చేష్టం నిరనుశ్వాసం ధ్యాననిష్టం యధామునిం ।
అశేష విషయజ్ఞోపి శేషంచ ప్రచ్ఛనారదః ॥ 44

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే అనంగో పాఖ్యానం నామ**
**ఏకోన నవతితమో అధ్యాయః**



## 89-వ అధ్యాయము

# అనంగోపాఖ్యానం-II

### అనంగునికి గజానన వరప్రదానం

అప్పుడా వరదుడైన గణేశుడు మన్మధునితో యిలా అన్నాడు :

"ఓ మన్మధా! నీవు కోరిన కోరికలన్నీ ఈడేరగలవు! నీవు రమాదేవి గర్భావాసాన జన్మించి సశరీరుడవవుతావు! సౌందర్యంతో అందరిచేత కొనియాడబడ తగినవాడవు, త్రైలోక్యవిజేతవూ కాగలవు! ఇక నీకు నీ కార్యసాధనలో సహకరించేందుకుగాను పుష్పములు, ఫలములు, చిగుళ్ళూ, కామినుల అవయవాలు, మలయమారుతములూ, వెన్నెలా, చందనమూ, పద్మములు, హంసధ్వనులు సహకరిస్తాయి! ఈ సామగ్రితో నీవు ఈశ్వరాదులనైనాసరే జయించగలవు! వీటి దర్శనస్పర్శనాదికముల చేత మనస్సులో జనిస్తావు!

నీకు లోకంలో మనోభవుడని, స్మృతిభవుడని ప్రసిద్ధనామములు కల్గుతాయి! నా చరణారవిందస్మృతీ, దృఢభక్తీ నీకు కలుగగలవు! మహత్కార్యము సంభవించినప్పుడు నన్ను స్మరించినంతనే నీకు దర్శన మిస్తాను!" అంటూ వరాలను గుప్పించి ఆ అనుగ్రహమూర్తి అంతర్ధానం చెందాడు!

"ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా అభీష్టసిద్ధిని పొందిన కాముడు అక్కడనే మహాగణపతియొక్క మూర్తిని స్థాపించి ఎనలేని భక్తితో పూజించాడు! అప్పుడాతని పత్నియైన రతీదేవి లడ్లు, మోదకములు మొదలైన నానావిధ పక్వాన్నములను ఆ గణేశునకు మహానైవేద్యంగా భక్తితో సమర్పించింది. తేజోసంపన్నుడైనట్టి ఆ గజాననునికి "మహో **త్కటుడు"** అన్న నామకరణంచేసి రత్నస్తంభ విరాజితమైన ఆలయ ప్రాసాదాన్ని నిర్మించాడు.

ఆ తరువాత అనతికాలానికే అనంగుడు శ్రీకృష్ణపత్నియైన రుక్మిణీ దేవియొక్క గర్భవాసాన జన్మించి సముద్రంలో శంబరాసురునిచే పార వేయబడ్డాడు. అప్పుడతడు చేపతో మ్రింగబడినాడు. ఆ చేపనే జాలరులు శంబరాసురునికి సమర్పించగా అతని భార్యయైన మాయాదేవి దగ్గర పెరిగి పెద్దవాడైనాడు. నారదునిచేత ప్రేరేపితురాలైన ఆ మాయాదేవి మన్మథునికి మాయలన్నీ చక్కగా ఉపదేశించింది.

ఆ మాయాబలంతోనే ఆ ప్రద్యుమ్నుడు శంబరాసురుని వధిం చాడు! గణేశుని అనుగ్రహవిశేషంచేత ఒక్కడైనప్పటికీ ఆ బాలుడు అనేకమంది శత్రువులను నిర్జించి, ప్రద్యుమ్నుడన్న నామధేయం ధరించి

సారస్వతపురానికి వెళ్ళాడు. అప్పటినుండీ సర్వదేవతామాన్యుడై, త్రైలోక్య విజేతయై, గజానన అనుగ్రహంచేత మహదానందాన్ని పొందాడు!

రుక్మిణి మొదలైన వారందరూ అతణ్ణిచూసి కృష్ణుడేమోనని పొర బడినా నారదునిద్వారా ఆతడు తమ కుమారుడేనని ఎరిగి పరమానంద భరితులైనారు. అప్పుడు రతీదేవికూడా ఆతని చెంతచేరి భక్తితో ప్రణమిల్లింది!

"ఓ వ్యాసమునీంద్రా! ఈ రీతిగా అనంగుడిచేత ప్రతిష్ఠితమైన జనస్థానగతుడైనట్టి గణేశమహాత్యం యావత్తూ నీకు తెలిపాను! ఇక్కడనే పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు శూర్పణఖను తిరస్కరించగా - లక్ష్మణుడామె నాసికను, చెవులను కోయడంచేత 'నాసిక' అను పేరుతో ప్రసిద్ధి చెందింది.

ఈ ప్రదేశంలో ఈనాటికీ రాళ్ళుసైతం మోదకములలా కనబడ తాయి! ఈ రకంగా కామునిచేత ఆరాధింపబడిన గణేశుడు అతడిని కృతకృత్యుడిని గావించాడు. ఇక్కడనే రతీమన్మధులు తిరిగి సాంగముగా కలిసి ఆనందించారు. షడక్షరమంత్రంతో శేషుడు ఆరాధించినట్లుగానే మదనుడైన మన్మధుడుకూడా మంత్రానుష్టానంచేసి గణేశానుగ్రహాన్ని పొందాడు!" అంటూ చెప్పాడు చతురాస్యుడు!

అప్పుడు వ్యాసమునీంద్రుడు తిరిగి బ్రహ్మనిలా ప్రశ్నించాడు :

"ఓ చతురాననా! శేషుడెలాగ గజాననుని ఆరాధించాడు? ఎందు కని ఆరాధించాడు? ఏయే వరాలను పొందాడు? ఈ యావద్వృత్తాంతాన్నీ విస్తారంగా వినిపించి నన్ను ధన్యుడిని గావించు!"

## శేషుడు గజాననుని ఆరాధించి వరాలను పొందుట :

"ఓ వ్యాసమునీంద్రా! నీవడిగిన ప్రశ్న చాలా సమంజసమైంది! సావధానమనస్కుడవై విను!"

ఒకానొకప్పుడు శంకరుడు పార్వతీసమేతుడై, కైలాసశిఖరంపై కొలువుతీరి వుండగా సమస్త దేవతాగణాలు వారి సందర్శనార్థమై విచ్చేశారు. సాష్టాంగ దండప్రణామాలను ఆచరించి, అద్భుతమైన తమ గానకళా కౌశలంతో శంకరునికి ప్రీతిగావించారు గంధర్వులు! అప్సరసలు లయబద్ధంగా నాట్యంచేశారు. కొందరుమునులు నేత్రములు మూసుకుని ధ్యానించసాగారు. కొందరా గౌరీవల్లభుడిని మానసికోపచారములతో పూజించారు. వశిష్ఠ, వామదేవ, జమదగ్ని, అత్రి, కణ్వ, భరద్వాజ, గౌతమాది మునీశ్వరులంతా వివిధ స్తోత్రాలతో స్తుతించసాగారు! శేషునకు "మూడులోకాలలోనూ నేనే శ్రేష్ఠుడిని! అందువల్లనే శంభుని శిరస్సుపైన ఉన్నాను. భూధారణ సామర్థ్యం నాకుకాక యితరులెవ్వరికీ లేదు కదా! నా కులానికే చెందిన వాసుకిని కవ్వపుత్రాటిగా చేసుకొనే దేవతలు అమృతాన్ని సిద్ధింపచేసుకొని అమరులైనారు! గనుక నాకంటే ఉత్కృష్ఠమైన వారెవరూలేరు" అన్న తలంపు కలిగింది.

శివుడాతని మనోగర్వమును తెలుసుకుని అందుకు ఆగ్రహావేశుడై తలపైనున్న శేషుని నేలపైకి విసిరికొట్టాడు! శేషునియొక్క ఒక్కొక్క శిరస్సూ పదేసి భాగాలై మూర్ఛిల్లి మరణించినవానివలే పడియున్నాడు.

ఇలా ప్రాణమాత్రావశిష్టుడైన శేషుడు దుఃఖిస్తూ తనలో తానిలా అనుకున్నాడు.

'ఆహా! త్రైలోక్యేశ్వరుడైనట్టి శివునికే శిరోలంకారాన్నైనప్పటికీ ఇటు వంటి దురవస్థను ఏ దుష్కర్మ కారణంచేత పొందానోకదా! ఇప్పుడు రెక్కలు విరిగిన పక్షిలా ఎటూ కదలలేకుండా వున్నాను.

ఇప్పుడు నేనేమి చేయను? ఎటుపోను? నన్ను రక్షించి సేదతీర్చే వారెవ్వరు? తిరిగి నా స్వస్థానమును పొందగల ఉపాయం చెప్పే వారెవ్వరు? అనుకుంటూ విచారిస్తూండగా ఆతడికి మార్గమధ్యంలో వస్తూన్న నారదుడు దైవవశాన కనిపించాడు.

నిర్ధనుడికి స్వప్నంలో నిధి లభించినంత ఆనందాన్ని పొందాడు శేషుడు.

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
**'అనంగోపాఖ్యానం'** అనే 89-వ అధ్యాయం.



**90**

# శేషోపాఖ్యానం

(మూలం)

## నవతతితమో అధ్యాయః

**నారద ఉవాచ :**

కిమర్థమేవం జాతోసి నిస్తేజాః దుఃఖితో భృశం ।
కథం భగ్నశిరాః స్యా చరోఽప్రియవరం మునేః ॥ 1

కిం వాక్షుబ్ధో గిరిశస్తే కారి గర్వస్త్వయాథ కిం ।
వదయత్కారణం శేష ప్రతీకారం పురావదే ॥ 2

త్వాం వినాధారయేత్కోను చరాచరయుతాం ధరాం ।
అనుక్తవతి తస్మింస్తు స్వయమేవా బ్రవీన్మునిః ॥ 3

ఉపాయం నాగరాజస్య స్వస్థాన ప్రాపకం శుభం ।

**నారద ఉవాచ :**

అవధారయ మేవాక్యం శేషాశేష కలానిధే ॥ 4

సుపర్వాణశ్చ కేశాద్యా యేనస్యుః కింకరా ఇవ ।
ధరిష్యసే ధరాం మూర్ధ్ని పుష్పమాలా మివార్భకః ॥ 5

**శేష ఉవాచ :**

కించిత్పురాతనం పుణ్య మాసీచ్చేద్దర్శనం తవ ।
అజన్య కస్మాదగ్రేపి సమ్యజ్మేస్యాన్నసంశయః ॥ 6

అన్యథా కృతపుణ్యానాం దర్శనంతు కథం భవేత్ ।
అతివిహ్వల గాత్రత్వా దశక్తో భూమిధారణే ॥ 7

తం ప్రయత్నం వదమునే యేనాహం స్యాం యథాపురా ।

**నారద ఉవాచ :**

భణేమహా మనుం తేద్య తస్యదేవస్య నాగరాట్ ॥ 8

యస్య ప్రసాదాదింద్రాద్యా స్తత్తత్పద మవాప్నువన్ ।
కేశాయదాజ్ఞయా శేష సృష్టి స్థిత్యంతకారిణః ॥ 9

యస్మిన్ప్రసన్నే సర్వేవే పూర్వావస్థా మవాప్స్యసి ।
కారుణ్యం తవదృష్ట్వైవ క్లిన్నంమే సర్పమానసం ॥ 10

అతః షడక్షరం మంత్రం గణేశస్య దదామితే ।
అస్యానుష్ఠాన మాత్రేణ ప్రత్యక్షస్తే గజాననః ॥ 11

సర్వాన్విథాస్యతే కామా న్యాన్యాం స్త్వం వృణుషే తతః ॥ 12

శ్రీ ఉవాచ :

కృత్వోపదేశం శేషాయ నారదో అంతర్హితో భవత్ ।

శేషోపి తపసే కృత్వా నిశ్చయం పరమం శుభం ।
నిరుద్ధాశేష కరణో ధ్యాత్వా దేవం గజాననం । 13

జజాప పరమం మంత్రం సహస్ర పరివత్సరం ।
తదంతే పురతో అపశ్యత్ దేవదేవం గజాననం । 14

సింహారూఢం త్రినేత్రం దశభుజ మురగం కుండలేచాంగ ॥
దే చ ముక్తామాలాం వహంతం సులలిత ముకుటం రత్నము ద్రాక్ష
సూత్రం ।
నానా దేవర్షి బృందైరనుగత మనిశం వక్రతుండం గజాస్యం ।
భక్తేచ్ఛోపాత్త దేహం సురనరవరదం చింతయే దేకదంతం ॥ 15

ఏవం గజానన స్తస్య దర్శనార్థం సమాయయౌ ।
సిద్ధి బుద్ధియుత సాధ్య గ్యాదృగ్ ధ్యాతో హి నాపరా ॥ 16

సహస్రసూర్యసదృశో దీప్త్యా క్రాంత దిగంతరః ।
తేజసా తస్యశేషోపి దర్శితో అంధ ఇవాభవత్ ॥ 17

చకంపే భయసంవిగ్నో వ్యగ్రచిత్తోతి విహ్వలః ।
స్వస్థో ముహూర్తమాత్రేణ చింతయామాస చేతసి ॥ 18

కిమిదం తేజ ఆయాతం ప్రళయానల సన్నిభం ।
తచ్చేద్దహే త్సర్వలోకా నిదం మామేవ ధక్ష్యతి ॥ 19

కల్యాణే కర్మణి కథం క్రియమాణే శుభం భవేత్ ।
అథవా నారదేనోక్తం ద్రక్ష్యామి గణనాయకం ॥ 20

ఏవం చింతాతురే తస్మిన్నువాచ ద్విరదాననః ।
మాభైః కుతర్క కుశల వరదోహం సమాగతః ॥ 21

యం ధ్యాయసి దివారాత్రా దృణుయత్తే హృదిస్థితం ।
అహమేవ జగత్కర్తా పాతా హర్తాఖిలేశ్వరః ॥ 22

మత్తేజసా భాతి చంద్రోవహ్నిః సూర్యశ్చ భానిచ ।
పరబ్రహ్మ స్వరూపోపి తపసా తవతోషితః ॥ 23

ఆవిర్భూతో వరందాతుం లోకోపకృతయే పి చ ।
త్వంతు మత్తోవరాన్ బ్రూహి యాన్యాన్ కామయసే ఖిలాన్ ॥ 24

శేష ఉవాచ :

తేజసా ధర్షితోదేవ ద్రష్టుం వక్తుంచ నోత్సహే ।
అనుగ్రహశ్చ పూర్ణస్తే మయిసౌమ్యో భవానఘ ॥ 25

క ఉవాచ :

ఏవం సంప్రార్థితస్తేన కరుణాబ్ధిర్గజాననః ।
అభవత్కోటి చంద్రాభః సౌమ్యతేజాః సురేశ్వరః ॥ 26

తతో వవ్రేవరాన్ శేషో సత్వాస్తు త్వాఖిలేశ్వరః ।
అనాది నిధనందేవం వందేహం గణనాయకం ॥ 27

సర్వవ్యాపిన మీశానం జగత్కారణ కారణం ।
సర్వ స్వరూపం విశ్వేశం విశ్వవంద్యం నమామ్యహం ॥ 28

గజాననం గణాధ్యక్షం గరుడేశస్తుతం విభుం ।
గుణాధీశం గుణాతీతం గణాధీశం నమామ్యహం ॥ 29

విద్యానా మధిపందేవం దేవదేవం సురప్రియం ।
సిద్ధిబుద్ధి ప్రియం సర్వం సిద్ధిదం భుక్తిముక్తిదం ॥ 30

సర్వవిఘ్నహరం దేవం నమామి గణనాయకం ।

క ఉవాచ :

ఏవంస్తుత్వా తు దేవేశం వరదం ద్విరదాననం ॥ 31

వరయామాస యాన్ కామాం స్తాంశ్రుణుష్వ మహామునే ।

**శేష ఉవాచ :**

అద్యధన్యం తపోజ్ఞానం పితా మాతా జనుర్మమ ॥ 32

దేహనేత్రాణి భూరీణి మస్తకాని బహూనిచ ।
త్వాంస్తోతుం సంప్రవృత్తాయా ధన్యాస్తా రసనామమ ॥ 33

కులం శీలంచ ధన్యంమే త్వదంఘ్రియుగ దర్శనాత్ ।
అఖండితం తే భజనం దేహిమే ఖండవిక్రమ ॥ 34

దుఃఖంకింకిన్ను వక్తవ్యం సర్వజ్ఞే త్వయివిఘ్నరాట్ ।
అఖర్వ గర్వకరణాత్ స్ఫుటితా మస్తకా మమ ॥ 35

మహారుషా మహేశేనా స్ఫాలితస్య మహీతతే ।
నారదస్యప్రసాదేన దృష్టంతే చరణాంబుజం ।
ఇదానీం దేవ మేదేహి శ్రేష్ఠతాం భువనత్రయే ॥ 36

పాటవం సర్వశిరసి సామర్థ్యం ధారణేభువః ।
అచలం దేహిమేస్థానం దర్శనం తే నిరంతరం ॥ 37

సాన్నిధ్యం శంకరస్యాపి కులశ్రైష్ట్యం శివేరతిం ।

**గణపతిరువాచ :**

యది తే దశధా జాతో మస్తకో భుజగాధిప ॥ 38

*1007*

తదా సహస్రవదనః సహస్ర ఫణిమండితః ।
భవిష్యసి జనే ఖ్యాతో యావచ్చంద్రార్కతారకాః ॥ 39

ధరాధరణ సామర్థ్యం దృఢం తవ భవిష్యతి ।
పంచాస్య పంచశిరసి మత్ ప్రసాదాత్ స్థితిం స్థిరాం ॥ 40

లప్స్యసే భుజగశ్రేష్ఠ మత్సాన్నిధ్యం నిరంతరం ।
అన్యత్తే వాంఛితం శేష తదశేషం భవిష్యతి ॥ 41

క ఉవాచ :

ఏవం వరాన్దదౌ తస్మై స్వోదరేతం బబంధహ ।
వ్యాలబద్ధోదర ఇతి నామప్రాప్య గజాననః ॥ 42

శేషస్య మస్తకేహస్త మభయార్థం దదౌవిభుః ।
స్వయం విరాట్స్వరూపం స్వం శేషాయా దర్శయన్ముదా ॥ 43

శబ్దేనా పూరయద్వ్యోమ భూతలం విదిశోదిశః ।
యస్య పాదతలే భూమి ర్దిశశ్శ్రోత్రేక్షిణీరవిః ॥ 44

ఓషధ్యో యస్యరోమాణి నఖాయస్య ధరాధరాః ।
మేఘాః స్వేదోదకం యస్య ప్రజన శ్చతురాననః ॥ 45

కుక్షౌయస్య జగత్సర్వం చత్వారశ్చైవ సాగరా ః ।
అనంతానన ఏకోయోప్యనంత నయనస్స్వరాట్ ॥ 46

అనంతరూపీ చానంత శక్తి రత్యంతదీప్తిమాన్ ।
యద్రోమకూపే భాంతిస్మ బ్రహ్మాండాని సహస్రశః ॥ 47

దృష్ట్వా తం తాదృశం శేషో భీత్యా భ్రాంతినాభవత్ ।
ప్రార్థయామాస విఘ్నేశం పునః సౌమ్యోభవేతిచ ॥ 48

తతో దశభుజోదేవః సింహారూఢో భవచ్ఛసః ।
ఉవాచ వరదో దేవో నేదృగ్దృష్టః సురైరపి ॥ 49

మదనుగ్రహతోదర్శి త్వయా శేషాద్యభాగ్యతః ॥
అచలం మయితేస్థానం పాతాలేపి శివేపిచ । 50

మయా దత్తంప్రసన్నేన ధరపుష్ప మివాద్యగాం ॥ 51

**శేష ఉవాచ :**

ధరే ధరాం స్వశిరసి ధరణీ ధరఇత్యపి ।
మమాపి తేపివిఖ్యాతం నామలోకేతి విశ్రుతం ॥ 52

అస్మిన్క్షేత్రే స్థిరోభూత్వా భక్తకామాన్ ప్రపూరయ ।

**బ్రహ్మోవాచ :**

ఓమితి తథోక్త్వాసౌ విఘ్నేశోం తర్ధధేస్వయం ॥ 53

శేషోపివా దృశీంమూర్తిం కృత్వాస్థాపయ దాదరాత్ ।
అకరోద్భహూరత్నాఢ్యం ప్రాసాదం కాంచనం శుభం ॥ 54

దరణీధర ఇత్యేతన్నా మాస్యపరికల్పయత్ ।
హరేఃశయనతాంప్రాయ దవహిత్పుష్పవద్ధరాం ॥ 55

స్థిరోభూ న్నాభిపద్మేపి విఘ్నరాజస్యభూషణం ।
ఏవంతేకధితోవ్యాస విఘ్నేశమహిమాద్భుతః ॥ 56

ప్రవాలనగరేఖ్యాతో గణేశోధరణీధరః
ఏతదర్థం హిశేషేణ కృతమారాధనంవిభో ॥ 57

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే శేషో పాఖ్యానం నామ నవతితమో అధ్యాయః**



# 90-వ అధ్యాయము

# శేషోపాఖ్యానము-I

## శేషుని గర్వభంగము

సర్వజ్ఞుడైవుండీ, దేవర్షియైన నారదమహర్షి శేషుని యిలా ప్రశ్నించాడు : "ఓ నాగరాజా! నీవిలా నీ తేజస్సును కోల్పోయి ఎందుకని దుఃఖిస్తున్నావు? నీ శిరస్సులిలా భగ్నములైనవి ఎందువల్ల? నీవే మునికైనా అపచారంచేసి వారి ఆగ్రహానికి గురైనావా? లేక వళ్ళు మరచిన గర్వంతో శంకరునికేమైనా అపచారం చేసావా? ఓ శేషా! ఆ కారణము నాకు వివరించి చెప్పు! ఆ తరువాత నీ దుఃఖనివారణకు తగిన ఉపాయాన్ని చెబుతాను! నీవు అత్యంతశక్తిమంతుడవూ గనుకనే ఈ ధరణీభారాన్ని నీవు నీ ఫణములపై సునాయాసంగా మోయగలుగుతున్నావు!"

ఈ మాటలకు బదులు పలుకకుండా భారంగా నిట్టూర్చి మౌనందాల్చి వున్న శేషుని చూచి దయార్ద్రహృదయుడైన ఆ దేవర్షి నారదుడు కరిగిపోయి తనంతట తానే ఆ నాగరాజుకు శ్రేయఃప్రదమూ, తిరిగి ఆతడిని స్వస్థానం పొందేలా సహకరించే మంగళకరమైన ఉపాయాన్నిలా ఉపదేశించాడు.

"ఓ అశేష శక్తిసామర్ధ్యాలు కలిగిన శేషా! నీకు శ్రేయాన్నిచ్చే నా వాక్యాన్ని శ్రద్ధగా ఆలకించు! ఏ ఉపాయంవల్ల సమస్త దేవతాగణములూ నీకింకరులౌతారో, ఏ ఉపాయంచేత నీవు ఈ సమస్త భూమండలాన్నీ బాలుడు శిరస్సున ఒక పూమాల ధరించినట్లుగా ధరించగలుగుతావో, ఆ ఉపాయాన్నిప్పుడు చెబుతాను."

అప్పుడు శేషుడిలా వినమ్రుడై పలికాడు.

"ఓ మునిపుంగవా! తీవ్రంగా గాయపడిన వాడినవటంచేత మును పటిలా భూమండలాన్ని నా శిరస్సులపై మోయగల సామర్ధ్యం కొరవడి అందుకశక్తుడనై వున్నాను. ఓ మహానుభావా! తిరిగి నా పూర్వపు స్థితి నాకెలాగున సిద్ధిస్తుందో ఆ ఉపాయాన్ని దయతో తెలుపు! నన్ను కృతార్థుణ్ణి ఒనరించు!" అంటూ వేడిన శేషునితో నారదుడిలా హితవు పలికాడు.

"ఓ నాగరాజా! నీకు ఆ దేవదేవుడైన గజాననునియొక్క అనుగ్ర హం కలిగించే మహామంత్రోపదేశం గావిస్తాను! ఎవరియొక్క దివ్యాను గ్రహ ప్రభావంచేత ఇంద్రాదిదేవతలు తమతమ పదవులను పొందారో, త్రిమూర్తులెవరి అజ్ఞానువర్తులై సృష్టి, స్థితి, లయములను నెరవేర్చ

తున్నారో, అటువంటి దేవదేవుడు ప్రసన్నుడైతే నీవు తిరిగి నీ పూర్వపు వైభవాన్ని సంతరించుకో గలవు! ఓ శేషా! నిన్ను చూడటంతోనే నా మనస్సు జాలిచెంది ద్రవిస్తోంది! అందుచేత నీకు పూర్ణస్వస్థత చేకూర్చే టటువంటి "గణేశషడక్షరీమంత్రా" న్నుపదేశిస్తాను. దీన్ని నీవుగనుక శ్రద్ధతో జపించినట్లైతే నీకు గజాననుడు తప్పక సాక్షాత్కరించగలడు."

అంటూ 'ఓ వ్యాసమునీంద్రా! నారదమహర్షి శేషునకు మంత్రోప దేశం గావించి అంతర్హితుడైనాడు.' అప్పుడు శేషుడు తపస్సు చేయటానికి కృతనిశ్చయుడై, తన సర్వేంద్రియాలను నియమించి, గజాననుని ధ్యానించి అచంచలభక్తితో ఆ పరమమంత్రాన్ని తదేకదీక్షతో జపించసాగాడు. ఇలా వేయి దివ్యవత్సరాలు గడిచిన తరువాత దేవదేవుడైన గజాననుడా శేషునకు సాక్షాత్క రించాడు. ఆ దివ్యసాక్ష్కాత్కార వైభవమెలాంటి దంటే -

సింహవాహనారూఢుడై, త్రినేత్రుడై, దశబాహువులతో బాహుపురులు, కుండలములూ ధరించి, మెడలో మెరిసే ముత్యాలహారాలతో రత్న కిరీటాన్నీ రత్న ముద్రాక్ష సూత్రములను దాల్చి సురలకు, నరులకు నానావిధ వరాలనొసగే ఏకదంతుడై దర్శనమిచ్చాడు. సిద్ధిబుద్ధులతో కూడినవాడై శేషుడు ఏ విధంగా ధ్యానించాడో అట్టి మంత్రమూర్తిగానే సాక్షాత్కరించాడు. కోటిసూర్యులను ధిక్కరించే దివ్యప్రకాశంతో, నాల్గు దిక్కులూ ఆ కాంతితో ప్రకాశిస్తూండగా దిగ్భ్రాంతిచెందిన శేషుడు ఆ తేజస్సుకు వెరచి కళ్ళు మిరుమిట్లుగొలుపగా చూడజాలక భయంతో కన్నులు మూసుకున్నాడు.

తిరిగి కొంతసేపటికి ధైర్యంతెచ్చుకొని, తనలో తానిలా అను కున్నాడు. 'ప్రళయకాలాగ్నిని బోలిన ఈ తేజస్సేమిటి? ఇది సకల లోకాలతోపాటూ నన్నూ తనలో దహించివేయదుకదా? నేను శుభఫలాన్ని ఆపేక్షించి సత్కర్మను ఆచరిస్తూంటే ఈ విపరీతమేమిటి? లేదా ఈతడు నారదునిచే ఉపదేశితమైనట్టి మంత్రమూర్తియైన గజాననుడా?' అను కుంటూ చింతాక్రాంతుడవగా గజాననుడిలా ఆతడికి అభయమిచ్చి ఆశ్వాసించాడు.

'ఓ నాగరాజా! భయపడకు! దివారాత్రములు ఏకమనస్కుడవై నీవెవరినైతే ధ్యానించావో ఆ మంత్రమూర్తియైనట్టి గజాననుడిని నేనే! నీ భక్తికిమెచ్చి నీకు కోరిన సకల వరాలనీయదలచి యిలా నీ ఎదుట సాక్షాత్కరించాను! సృష్టి స్థితి లయాలకు కారణమైన పరబ్రహ్మతత్త్వాన్ని నేనే! నా యొక్క తేజస్సువల్లనే సూర్యచంద్రాది నక్షత్రాలు ప్రకాశిస్తు న్నాయి! పరబ్రహ్మ స్వరూపుడనైనప్పటికీ లోకోపకారార్థమై, నీకు వరముల నివ్వడానికే యిలా సగుణరూపంలో ఆవిర్భవించాను! కనుక నీకు కావలసిన వరాలన్నింటినీ కోరుకో!" అని గంభీరధ్వనితో ఉరిమినట్లుగా పలుకగానే శేషుడిలా భక్తిప్రపత్తులతో వేడుకున్నాడు.

'ఓ దేవా! నీయొక్క ప్రచండ తేజస్సుచేత దిగ్భ్రాంతుడనై నీవంక చూడలేక, నీతో మాట్లాడేందుకు సాహసం చేయలేకపోతున్నాను. నా యందు దయదాల్చి సౌమ్యమైన రూపాన్ని ధరించి అనుగ్రహించ వలసింది.'

"ఓ వ్యాసమునీంద్రా! ఇలా భక్తుడైన శేషుని అభ్యర్థనమేరకు

కరుణాంతరంగుడైన ఆ గజాననుడు కోటిచంద్రులతో సమమైనట్టి శీతలమైన ప్రశాంత సౌమ్యరూపాన్ని దాల్చాడు. అప్పుడా శేషుడు అఖిలేశ్వరుడైనట్టి ఆ గజాననుని యిలా స్తుతించి వరములను కోరి ధ్యానించాడు.

"అనాదినిధనుడవైన ఓదేవా! నీకు నమస్కారము! సర్వ వ్యాపకుడవూ, సకల జగత్తూ నీ స్వరూపమే అయినవాడవూ, విశ్వేశ్వరుడవూ సకల జగాలచేత కొనియాడబడే నీకు నా నమస్కారము! త్రిగుణాలకూ అతీతుడవైన వాటికి అధీశుడవైన ఓ ప్రభూ! నీకిదే నా శరణాగతి! గణములకు అధ్యక్షుడవూ, విద్యలకెల్ల ఒజ్జవు! దేవదేవుడవైన ఓ గణాధిపా! నీకు నా ప్రణతి! సురలెల్లరు భక్తిశ్రద్ధలతో కొలిచే గణనాయకా నీకు నమస్సుమాంజలి! అష్టసిద్ధులను అనుగ్రహించే నీకు, విఘ్నహర్తకు, సర్వసిద్ధిప్రదునకు నా శతసహస్ర వందనములు!

సిద్ధి బుద్ధులకు నాథుడవై, సమస్త శుభఫలాలనూ అనుగ్రహించే ఓ వరదగణేశా! ఓ గణనాయకా! నీకు నమస్కారము!'

అంటూ "ఓ మునీంద్రా! ఆ శేషుడేయే వరాలను అర్థించాడో ఆ దేవవంద్యుడు ఏయే వరాలను అనుగ్రహించాడో విను!' అంటూ చతు ర్ముఖుడు కొనసాగించాడు తన కథనాన్ని!

"ఓ దేవదేవా! నీయొక్క ఈ దివ్యసందర్శనంచేత నాజన్మ, తపస్సూ జ్ఞానములు సార్థకమైనాయి! నా మాతాపితరులు ధన్యులైనారు. నా నేత్రాలు, దేహము, శిరస్సులూ అన్నీ ధన్యములైయ్యాయి! నిన్ను స్తుతించుటచేత నా జిహ్వాకూడా చాలా ధన్యమైంది. నీ సందర్శనభాగ్యం చేత నా నాగకులము, శీలమూ యావత్తూ ధన్యమైనాయి! ఓ దేవా!

నీ అఖండ భజనను సదా నా కనుగ్రహించు! నీవు సకలమూ ఎరిగిన సర్వజ్ఞుడవు! అనర్థకారియైన గర్వంకారణంచేత నా శిరస్సులు ఊరకంగా వ్రక్కలైనాయి! మహేశ్వరుని ఆగ్రహానికీ గురైనాను! నాకు దైవికంగా కలిగిన నారదానుగ్రహంచేత నీ సందర్శనభాగ్యం కలిగింది! ఓ దేవా! మూడులోకాలలోనూ శ్రేష్టత్వాన్నీ, ధరాధారణ సామర్థ్యాన్నీ నాకివ్వు! స్థిరమైన స్థానాన్ని నాకు ప్రసాదించు! నిత్యమూ నీ సందర్శనభాగ్యాన్ని నాకు అనుగ్రహించు! శంకరుని సాన్నిధ్యమూ, స్థిరభక్తీ నాకు అనుగ్ర హించు!" అంటూ ప్రార్థించగా ఆ కరివదనుడిలా పలికాడు.

"ఓ శేషా! నీ శిరస్సులు పదిగా వ్రక్కలైనాయి గనుక వేయి పడగలతో సహస్రవదనుడవనీ ప్రఖ్యాతిగాంచగలవు! అతి దుర్లభమైన ధరాధారణ సామర్థ్యం నీకు కలుగుతుంది! ఇకపై నీవు స్థిరముగా శంకరుని శిరస్సును అలంకరించగలవు! అంతేకాదు, నీ కోరికమేరకు నా సాన్నిధ్యాన్నికూడా సతతమూ పొందగలవు! నీ సకలమనోభీష్టములూ అవశ్యం నెరవేరుగాక!" అంటూ వరములను గుప్పించి ఆతడిని అనుగ్రహ పురస్సరంగా తన ఉదరమున బంధించుకున్నాడు. ఆనాటినుండి వినాయకునకు వ్యాలబద్ధుడన్న పేరుకల్గింది. అనంతరం శేషుని శిరస్సుపై అభయహస్తాన్నుంచి అతనికి తన విరాట్‌రూపాన్ని కనబరిచాడు. ఆ విశ్వరూపం ఎలావున్నదంటే —

"ఈ భూమియే పాదములుగా, దిక్కులు శ్రోత్రములై, సూర్య చంద్రులు నేత్రములై, ఓషధులు రోమస్థానములుగానూ, పర్వతములు గోళ్ళు (నఖములు) గానూ, మేఘములు చెమటగానూ, చతుస్సాగర పర్యంతమైన సర్వజగత్తూ, బ్రహ్మ, ప్రజాపతులూ, వారిసృష్టి. ఆయన

యొక్క కుక్షిగానూ, అనంతముఖాలతో, బాహువులతో, అనంత పాదములూ, అనంతమైన శక్తీ కల్గి తిరిగి వెనుకటి గజాననుని విశ్వ రూపాన్ని దర్శించిన శేషుడు భయభ్రాంతుడై సౌమ్యరూపాన్ని దాల్చ మంటూ ప్రార్థించాడు.

అప్పుడా విశ్వరూపాన్ని ఉపసంహరించి తిరిగి దశభుజములు దాల్చిన సింహారూఢునిగా సాక్షాత్కరించి యిలాఅన్నాడు.

"ఓ శేషా! దివ్యమైనట్టి ఈ రూపవిజృంభణను సురలు, మునులు, తపోధనులుసైతం కనుగొనజాలరు. కేవలం నీయందుగల అనుగ్రహ విశేషంచేతనే నీకు అది లభించింది. నీకు పాతాళంలోనూ, శివుని శిరమందూ స్థిరమైన స్థానం లభిస్తుంది. నా అనుగ్రహవిశేషంచేత ఈ భూమినిసహితం నీవొక పూలమాలలా ధరించగలుగుతావు!"

అప్పుడు ఆ శేషుడు భక్తితో ఆనందబాష్పాలు కన్నులలో జాలువారగా గద్గదకంఠుడై యిలాఅన్నాడు.

"ఓదేవా! నీ ఆజ్ఞమేరకు ధరణిని ధరించగలను. నేటినుండీ నీకునూ నాకునూ ధరణీధరుడనే పేరుప్రఖ్యాతమౌతుంది! నీవుకూడా భక్తజనుల మనోరథము లీడేర్చుతూ ఈ పవిత్రక్షేత్రంలో వెలసి ఈ క్షేత్రదర్శనం చేసినవారిని అనుగ్రహించు!" అంటూ వేడగా "తథాస్తు" అంటూ అంతర్ధానం చెందాడు గణేశుడు!

"ఓ వ్యాసమునీంద్రా! ఆ తరువాత శేషుడా ప్రాంతంలో అట్టి అనుగ్రహప్రదుడైన విఘ్నేశుని మూర్తిని స్థాపనచేసి రత్నస్తంభాలతో కూడిన బంగారుప్రాకారాన్ని నిర్మించాడు. ఆ దేవునికి 'ధరణీధర' మూర్తియన్న నామకరణం చేశాడు.

తాను శ్రీహరిపానుపై, భూదేవిని పుష్పమాలవలె ధరించాడు! గజాననునియొక్క నాభిపద్మమునకూడా శేషుడు స్థిరవాసమేర్పరుచుకున్నాడు. ఓ వ్యాసమునీంద్రా! ఈవిధంగా గజాననుని అనంత మహిమనంతా వివరించి చెప్పాను. ప్రవాళనగరం ఈ ధరణీధరుడు ఖ్యాతిగా వెలసిన పుణ్యక్షేత్రం. **శేషుడు గజాననుని ఆరాధించి అనుగ్రహాన్ని బడసినదీచోటనే!**

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని

**'శేషో**పాఖ్యాన'మనే 90-వ అధ్యాయం.



91

# శేషోపాఖ్యానం

(మూలం)

## ఏకనవతితమో అధ్యాయః

**వ్యాస ఉవాచ :**

అన్యత్కథయ మే దేవ గణేశస్య కథాంతరం ।
శృణ్వతో మేమనోత్యవం ఉత్సుకం భవతిప్రభో ॥ 1

**బ్రహ్మోవాచ :**

ఏకదా ప్రళయే వృత్తే జ్ఞాపయన్ మాం గజాననః ।
సృష్టిం నానావిధాం బ్రహ్మన్ కురుత్వం హిమమాజ్ఞయాం ॥ 2

అహం ప్రకల్పయామాస పుత్రాన్సప్తహృదాతదా ।
తేషాం నామాని తేవచ్మి కశ్యపో గౌతమోపిచ ॥ 3

జమదగ్ని ర్వశిష్ఠశ్చ భరద్వాజోఽత్రిరేవచ ।
విశ్వామిత్రశ్చ సప్తైతే సర్వవిద్యా విశారదాః ॥ 4

సర్వే మా మబ్రువన్ బ్రహ్మన్ అజ్ఞాపయ సురేశ్వర ।
మయాతు కశ్యపో అజ్ఞాపి బుద్ధిమాం స్తేషుచాధికః ॥ 5

మత్కార్యం వివిధాం సృష్టిం కుర్విత్యాజ్ఞాపితస్తదా ।
అసావోమితామా ముక్త్వా జగామ తవసేవనం ॥ 6

జజాపైకా క్షరం మంత్రం దివ్యవర్ష సహస్రకం ।
తతః ప్రసన్నో భగవాన్ ద్విరదానన ఈశ్వరః ॥ 7

చతుర్భుజో అరవిందాక్షో మహామకుట మండితః ।

పాశాంకుశధరో మాలా దంతహస్తః శుభాంగద ।
సువర్ణ మణిరత్నాఢ్య ముక్తామాలా లసద్గలః ॥ 8

సర్పోదరః కోటిసూర్య విలసద్దీప్తి మండలః ।
వికసన్నేత్ర విభ్రాజి చ్చారుశుండాల సన్ముఖః ॥ 9

ఆవిరాసీ త్కస్యపస్య పురేవం గజాననః ।
క్షుద్రఘంటా నూపురాణాం రవాన్ముఖరి తాంఘ్రి యుక్ ॥ 10

దృష్ట్వైన నర్తతం దేవం కశ్యపో హర్షనిర్భరః ।
నత్వా సంపూజయామాస నానామంగళవస్తుభిః ॥ 11

బద్ధాంజలి రువాచేదం సుప్రసన్నో గజాననః ।
ధన్యోమే జనకో మాతా తపో జ్ఞానం వపుశ్చ దృక్ ॥ 12

ధన్యేయం ధరణీ తాత వీరుద్ర్వుక్షఫలానిచ ।
ధన్య ఏకాక్షరో మంత్రో యేన దృష్టో ఖిలేశ్వరః ॥ 13

గజాననః ప్రసన్నాత్మా పరమాత్మా పరాత్పరః ।
యత్రకుంతాశ్చతుర్వేదా వేదాంతా మూకతాం గతాః ॥ 14

అగోచరో మనస్తర్కైః సోయందేవో మయేక్షితః ।
యస్మాదావిర్భవంతీ మేహరేశా గ్నిముఖాః స్సురాః ॥ 15

పాతాలా విచస్త్రవైవ భువనాని చతుర్దశ ।
యత్ర తానిలయం యాంతి సోయం దేవోమయేక్షితః 16

యోనిర్గుణో నిరాధీశో గురుగమ్యో నిరాకృతిః ॥
బ్రహ్మేతియం విదుః కేచిత్ సోయందేవో మయేక్షితః ॥ 17

**క ఉవాచ :**

ఏవం వాక్యామృత రసైః పరితుష్టో గజాననః
ఉవాచ కశ్యపం నమ్రం స్తువంతం వివిధైస్తవైః ॥ 18

**గణేశ ఉవాచ :**

భక్తేః స్త్వదనుష్ఠానాత్ ప్రీతస్తేహం మునేధునా ।
వరం వరయ మత్తస్త్వం యం యం సమనసేచ్ఛసి ॥ 19

**కశ్యప ఉవాచ :**

సృష్టిం నానావిధాం కర్తుం సామర్థ్యం దేహి మే విభో ।
త్వదంఘ్రికమలే భక్తిమవిస్మరణ మేవచ ॥ 20

యాయాః ప్రత్యక్షతాం తత్ర స్మరేత్వాం యత్ర చాప్యహం ।
త్వాదృశం దేహిమే పుత్రం నామ్నా కశ్యపనందనం ॥ 21

**గణేశ ఉవాచ :**

సర్వం తేవాంఛితం మత్తో భవితాశు మహామునే ।
భక్తిర్మే విస్మృతిస్త్వాత్తే సంకటే అచాంతికం వ్రజే ॥ 22
కరిష్యసి విచిత్రా త్వం సృష్టిం మమ ప్రసాదతః ।

**క ఉవాచ :**

ఏవముక్త్వా మునిం దేవః స్తత్రైవాంత రధీయత ।
కశ్యపోపి ముదాయుక్తో నిజస్థానం తదా యయౌ । 23

కదాచి త్కశ్యపోఽకస్మా దశరీరప్ర పీడితః ।
నచాల భక్త్యాపిశర్మ గృహమధ్యం తతో గమత్ ॥ 24

నిత్యం నైమిత్తికం కామ్యం కర్మధ్యానంచ నాస్మరత్ ।
తం తథావిహ్వలం దృష్ట్వా యోషితోస్య చతుర్దశ ॥ 25

దిత్యదితిర్దనుకద్రు ద్వినతాద్యాః పుర్వస్థితాః ।
ఋభుజే క్రమశస్తాస్తు నానా కారేషు కశ్యపః ॥ 26

కాలే యథోక్తేసుషువే దితిర్దైత్యావనేకశః ।
అదితి ర్దేవగంధర్వాన్ దనుశ్చ దానవానథ ॥ 27

క్రమేణ కిన్నరాయాక్షాః సిద్ధచారణ గుహ్యకాః ।
పశవశ్చ తథారణ్యా గ్రామ్యాశ్చాసన్న నేకశః ॥ 28

పృథివీ పర్వతావృక్షాః సముద్రాః సరితో లతాః ।
ధాన్యాని ధాతవోతత్నాః ముక్తాః కృమి పిపీలికాః ॥ 29

సర్పాః పక్షి గణాస్సాఖ్యః సర్వమాసీ చ్చరాచరం ।
ఏవం దృష్ట్వా ససంతానం జాతం నానావిధం తదా ॥ 30

జుహర్ష కశ్యపోధీమాన్ నానామంత్రాన్ సమాదిశత్ ।
శోధయిత్వా ఋణధనం సిద్ధారి చక్రమీక్ష్యచ ॥ 31

షోడశార్ణంచ కస్మై చిత్తథాష్టా దశవర్ణకం ।
ఏకాక్షరంచ కస్మై చిదన్యస్మైచ షడక్షరం ॥ 32

పంచార్ణ మష్టాక్షరంచ ద్వాదశాక్షర మేవచ ।
కస్మైచిచ్చ మహామంత్రం దదౌ స మునిపుంగవః ॥ 33

కుర్వంత్య ను ష్ఠితం తాపద్యాపద్దేవో నిరీక్ష్యతే ॥
గజాననోఽఖిలాధారః సర్వసిద్ధి ప్రదాయకః ॥ 34

ఏవ మాజ్ఞాపయత్తాంశ్చ తేచ జగ్ముస్తదైవహి ।
తపసే బహుశో దేశాన్ జేపుః స్వంస్వం మనుందదౌ ॥ 35

ఆసనే భోజనే దేవం నిద్రాయాం జాగరేపిచ ।
అనన్యభక్త్యా దేవేశం సస్మరుస్తే గజాననం ॥ 36

దివ్యవర్ష సహస్రాంతే పరితుష్టో గజాననః ॥
ఆవిరాసీ దనేకాత్మా తత్పురః కరుణానిధిః ॥ 37

యో యథాధ్యాతవాన్దేవం తాదృశః స్తత్పురోభవత్ ।
కస్య చిత్పురత శ్చాసీత్ మేఘాభో అష్ట మహాభుజః ॥ 38

కస్యచి త్పురతశ్చాసీ చ్చశి వర్ణశ్చతుర్భుజః ।
అగ్రే కస్యచిగారక్తః షడ్భుజో సౌ గణేశ్వరః । 39

సహస్ర నయనస్త్రావ ద్భుజో సౌనపికస్యచిత్ ।
భాతి బాలస్వరూపోపి యువా వృద్ధోపి భాసతే ॥ 40

దశద్వాదశ దోర్దండో హైమ్రవర్ణో భవన్మహః ।
అష్టాదశ భుజోప్యాసీత్కోటి సూర్యసమప్రభ ః 41

తేజోరూపీ మహాకాయ అఖువాహన పృష్ఠగః ।
సింహగో బర్హిగోవాపి గజాస్యో అనేకవక్త్రవాన్ ॥ 42

దృష్ట్వా దేవం తు తేసర్వే నేకధా తుష్టువుర్ముదా ।
బద్ధాంజలి పుటానమ్రాః భక్త్యాదేవం గజాననం ॥ 43

ర్వ ఊచుః :

యతోనంతశక్తే రనేకాశ్చజీవా యతోనిర్గుణా దప్రమేయా ద్గుణాస్తే
యతోభాతి సర్వం త్రిధా భేదభిన్నం సదా తంగణేశం
నమామో భజామః । 44

యతశ్చా విరాసీజ్జగత్సర్వవేత్తు స్తథాబ్జాసనో విశ్వకో విశ్వగోప్తా ।
తథేంద్రాదయో దైత్యసంఘా మనుష్యా సదాతం గణేశం నమామో
భజామః ॥ 45

యతోవహ్నిభానో భవో భూర్జలంచ యతస్సాగరా శ్చంద్రమా
వ్యోమవాయుః ।
యతస్థావరాజంగమా వృక్షసంఘాః సదా తంగణేశం నమామో
భజామః ॥ 46

యతోదానవాః కిన్నరా యక్షసంఘాః యతశ్చారణా వారణాశ్వాపదాశ్చ
యతఃపక్షికీటా యతో వీరుదశ్చ సదా తంగణేశం నమామో
భజామః ॥ 47

యతో బుద్ధిరజ్ఞాననాశో ముముక్షోర్యతః సంపదో భక్తసంతోష కాస్యుః।
యతో విఘ్ననాశో యతః కార్యసిద్ధిః సదాతం గణేశం నమా మో
భజామః ॥ 48

యతః పుత్ర సంపద్యతో వాంఛితార్థో యతో భక్తివిద్యాస్తథా
నేకరూపాః ॥
యతశ్శోక మోహౌ యతః కామఏష సదాతంగణేశం నమామో
భజామః ॥ 49

యతో నంతశక్తిః సశేషో బభూవ ధరాధారణానేకరూపేచ శక్తః ।
యతోనేకధా స్వర్గలోకాహి నానా సదాతం గణేశం నమామో
భజామః ॥ 50

యతో వేదవాచో వికుంఠామనోభిః సదా నేతి నేతీతి తాయం గృణంతి ।
పరబ్రహ్మరూపం చిదానందభూతం సదాతం గణేశం నమామో
భజామః ॥ 51

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే కశ్యపోపాఖ్యానం**
**నామ ఏక నవతితమో అధ్యాయః**



## 91-వ అధ్యాయము

# శేషోపాఖ్యానము-II

వ్యాసమహర్షి యిలా ప్రశ్నించాడు :

"దేవా! గణేశభగవానుని కథామృతం ఎంతవిన్నా అమృతంవలే తృప్తి కలుగుటలేదు! ఇంకనూ వినవలెనన్న ఆసక్తి కలుగుతున్నది. ప్రభూ! ఇంకనూ గణేశకథామృతమును ప్రసాదించు!" అనగా

బ్రహ్మదేవుడు చెబుతున్నాడు :

"ఒకానొకప్పుడు పూర్వకాలము ప్రళయం సంభవించింది! అప్పుడు గజాననుడు నాకు కర్తవ్యం జ్ఞాపకంచేస్తూ "ఓ బ్రహ్మదేవుడా! నానావిధ మైన సమస్త సృష్టినీ నా ఆజ్ఞతో నీవు వెంటనే ప్రారంభించి యథా ప్రకారం సమస్తమూ సృష్టించు!" అనగా ఆ ప్రకారమే నేను సంకల్పంచేసి ఏడుగురు మహర్షులను మానవపుత్రులుగా సృష్టించితిని. వారిపేర్లు చెబుతున్నాను

1) కశ్యపుడు 2) గౌతముడు 3) జమదగ్ని 4) వశిష్టమహర్షి
5) భరద్వాజుడు 6) అత్రిమహర్షి 7) విశ్వామిత్రుడు.

ఈ ఏడుగురినీ సర్వవిద్యావిశారదులైన సప్తఋషులుగా మనసా కల్పించాను. వారందరూ నాకు ప్రణమిల్లి

"బ్రహ్మన్! ఆజ్ఞాపించు! మేమేం చేయాలో! ఆ విధంగా చేస్తాము!" అన్నారు. వారందరిలోకి విశేష బుద్ధిమంతుడైన కశ్యపుని ఆజ్ఞాపించగా "నా సమస్త సృష్టికార్యములూ నేను చెప్పిన విధంగా ప్రారంభించుము!" అనగా "అలాగే చేసెదను" అని నాతోచెప్పి వనముల కేగి ఘోరతపస్సు చేశాడు. అలా దివ్యసహస్రవర్షముల కాలం ఏకాక్షర గణపతి మహామంత్రమును తీవ్రనిష్ఠతో జపించగా పరమేశ్వరుడగు గజాననుడు సాక్షాత్కరించాడు.

చతుర్భుజుడు, పద్మసుందరనేత్రుడు మహోజ్వల కిరీటధారి, పాశాంకుశములను ధరించి, ఏకదంతమును, చేతిలో అక్షమాలను ధరించి, కంకణకేయూరాది సువర్ణ మణిరత్నములతో విరాజిల్లే ఆభరణములతో, సర్పము చుట్టిన ఉదరముతో, కోటిసూర్యుల తేజస్సు తో బ్రహ్మాండమును ప్రజ్వలింపచేస్తూ, అందమైన తొండముతో సుందర ముఖుడై సాక్షాత్కరించాడు. ఆ విధంగా కశ్యపమహాముని ఎదుట ప్రత్యక్షమైన గజాననుడు చిరుగంటల సుందరశబ్దంతో, అందెల సుందర రవళితో నాట్యంచేస్తూ తన ముద్దుపాదముల ధ్వనితో ఆనందతాండవం చేయగా చూసి, కశ్యప మహర్షి ఆనందం భరించరాక నిర్భరహృదయంతో పులకించాడు. భక్తివినమ్రుడై నానామంగళవస్తువులను తెచ్చి పూజించాడు.

తనముందు సాక్షాత్కరించిన ప్రసన్నుడైన గజాననుని అంజలి ఘటించి యిలా ప్రార్థించాడు :

"ధన్యుడు నాతండ్రి! ధన్యురాలు నాతండ్రి! నీదయతో యింతటి సుందరరూపాన్ని దర్శనమిచ్చావు! నా అదృష్టమేమని వర్ణించను? ఆహా! ఈ భూమి చరితార్థురాలు! ధన్యురాలు! భూమిపై తరు, వృక్ష, ఫలములు సార్థకవంతములు! ఆహా! నేడుకదా ఏకాక్షరగణపతి మంత్రముతో సిద్ధించిన ప్రత్యక్షంతో సర్వేశ్వరుడైన గణపతి దర్శనంతో ధన్యుడనైతిని! పరమాత్మావతారుడైన శ్రీ గణేశభగవానుడు ఎదుట సాక్షాత్కరించగా సాక్షాత్తూ ఆ చతుర్వేదములే వాక్కు పెగలక మూగపోగా ఇక నేనా? ఆహా! మనస్సుకు అగోచరుడు, తర్కంచేత అందనివాడు సాక్షాత్పరమేశ్వరుడైన గణేశుడు నాముందు స్వయంగా సాక్షాత్కరించి ఈశ్వర, విష్ణు ప్రభృతులైన దేవతలను, సృష్టికర్తను అనుగ్రహించినాడు. పాతాళం ఆదిగా, ఏడు అధోలోకములు పైని ఏడు ఊర్ధ్వలోకములు కలిసి చతుర్దశ భువనాలూ ప్రళయంచెందినా సనాతనుడూ, శాశ్వతుడైన పర మాత్ముడైన గణేశుడు ఈనాడు నాకు దర్శనమిచ్చినాడు!

ఎవరు నిర్గుణుడో, గురువువలే శరణుపొందతగిన పరమగురువో ఎవరు పరబ్రహ్మ స్వరూపియో అట్టి లోకగురువు భగవంతుడైన గణేశుడు ఈనాడుకదా! నాకు దర్శనమిచ్చినాడు!"

## 'క' చెబుతున్నాడు :

ఈవిధంగా అమృతమును కురిసే వాక్కులతో ప్రసన్నుడైన గజా ననుడు - ప్రణమిల్లిన కశ్యపమహర్షియొక్క స్తోత్రముతో ఆనందించి ఈ విధంగా అనుగ్రహించాడు.

**గణేశుడు ఉవాచ :**

"నీయొక్క పరమప్రేమకూ గాఢమైన భక్తికీ మిక్కిలి సంతోషించి తిని! — ఓ మునీశ్వరా! నీవేమి వరం కోరుకున్నా అది నేను మనోభీష్ట ప్రకారమే అనుగ్రహిస్తాను! నీ సంకల్పము తప్పక నెరవేర్చెదను! వరము కోరుకొనుము.

**కశ్యపుడు ఉవాచ**

"ఓ ప్రభూ! గణేశదేవా! సమస్త సృష్టినీ నానావిధ రూపములతో యధాప్రకారం సృష్టించే శక్తిని నాకనుగ్రహించు! అంతేకాదు నీపాద పద్మములయందు అచంచల భక్తివిశ్వాసములను, ఎన్నడూ నీ పాదము లను మరువకుండు జ్ఞప్తినీ ప్రసాదించు. నేను ఎప్పుడెప్పుడు భక్తితో నీ దర్శనంకోరి ప్రార్థిస్తానో అప్పుడు నీవు తప్పక నాకు అనుగ్రహించవలెను. అంతేకాదు! సాక్షాత్తూ నీవంటి సత్పుత్రునే కశ్యపనందనునిగా నాకనుగ్ర హించు!" అంటూ కోరగా

**గణేశుడు ఉవాచ :**

"ఓ మహామునీ! నీవు కోరిన వరాన్ని సంతోషంతో అనుగ్రహిస్తు న్నాను! నాయందు అచంచలమైన మరపులేని భక్తినీ, నీకెపుడెపుడు అవసరములు సంకటములు కలిగితే అప్పుడే నీకు సన్నిధిలో ప్రత్యక్షం అవగలను. నా అనుగ్రహంతో ప్రసాదించిన సిద్ధివల్ల చిత్రవిచిత్రములైన సృష్టి చేయగలవు. ఇదే నా ఆశీస్సులు!

**క ఉవాచ :**

ఈ విధంగా గణపతిదేవుడు కశ్యపమహామునికి వరమిచ్చి మెరపు మెఱసినట్లు అక్కడే మాయమైనాడు. కశ్యపమహాముని పరమానంద

హృదయుడై తన స్వస్థానమునకు వెళ్ళెను.

ఇలావుండగా ఇంకొకసారి అకస్మాత్తుగా కశ్యపునకు శరీరంలో పీడ సంభవించింది. కొంచెంకూడా శరీరాన్ని కదపలేని అశక్తుడై గృహం లోనే కూలబడిపోయాడు. తాను చేయవలసిన నిత్య నైమిత్తికములైన వేదకర్మలు, కామ్యకర్మలు, సమస్త కర్మలూ చేయలేక అశక్తుడై భయ కంపితుడై తన పధ్నాలుగురు భార్యలైన (1) దితి (2) అదితి (3) వినత (4) కద్రువ మొదలైన 14గురు భార్యలూ భర్తయొక్క దురవస్థను చూసి దుఃఖములో కశ్యపునివద్దకు వచ్చి నిలిచారు.

అప్పుడు కశ్యపుడు వారలతో ఇష్టసుఖములను అనుభవించి వారి సంకల్పములను తీర్చగా వారు గర్భములను ధరించి సకాలములో సంతానములు కనిరి! అట్లు వారు కన్న సంతానమే —

అదితికి — దేవతలు, గంధర్వులూ,

దితికి — దైత్యులూ, దానవులూ

అలానే క్రమంగా గంధర్వ, యక్ష, రాక్షస, కిన్నర, సిద్ధ, చారణ, కింపురుషగణాలు సృష్టించబడ్డారు. పృధివి, పర్వతములు, వృక్షములు, సముద్రములు, నదులు, లతలు, ఓషధులు, గామ్య, అరణ్య, పశువులు, సమస్త ధాతువులు, రత్నములు, ముత్యములు, సర్పములు, పక్షిగణములు, క్రిమికీటకాది, పిపీలికాది జీవగణము సమస్తమూ — ఈ సమస్త చరాచర సృష్టి అంతా జన్మించింది.

ఈ విధంగా కశ్యపుడు నానావిధ రూపములతో వర్ధిల్లిన సమస్త సృష్టినీ చూచి ఆనందించి విధివత్తుగా వారికి మంత్రోపదేశాన్ని సిద్ధ-

సాధ్య ఋణ-ధన అర్పణములు పరీక్షించి వారివారి అర్హతల ప్రకారం కొందరికి షోడశాక్షరీ మంత్రమును, మరికొందరకు అష్టాక్షరీ మంత్ర మును, ఒకర్తెకు ఏకాక్షరీ మంత్రమును, మరొకర్తెకు షడక్షరీ మంత్రము, ఇంకొందరకు ద్వాదశాక్షరీ యిలాక్రమంగా యధార్హము అధికార అర్హత లనుబట్టి వారివారికి మంత్రములను ఉపదేశించాడు.

అలా ఉపదేశించిన కశ్యపమహాముని వారితో : "పుత్రులారా! నేనిచ్చిన ఈ మంత్రములను శ్రద్ధాభక్తులతో జపించుడు! మీకు అఖిలా ధారుడగు పరమాత్మయైన గజాననుడు సాక్షాత్కరించగలడు!" అని వారికి అజ్ఞాపించాడు. ఆప్రకారమే వారందరూ తమతమ ఉపదేశములనుబట్టి వారికిచ్చిన మంత్రములను అనన్యభక్తితో జపించారు. అలా వేయి సంవత్సరాలు గడచినవి.

అంతట వారికి అనుగ్రహమూర్తియైన గజాననుడు సాక్షాత్కరించి వారందరికీ ప్రత్యక్షముగా ఎవరెవరు తనను ఏయే ధ్యానమూర్తిరూపంలో భావించి ధ్యానించారో ఏ మంత్రపురస్సరంగా జపించారో, సరిగ్గా అదే ప్రకారంగా వివిధ గణపతుల రూపంలో వారందరికీ నానారూపములతో సాక్షాత్కరించి అనుగ్రహించాడు.

కొందరిముందర రక్తవర్ణముతో షడ్భుజములతో ప్రత్యక్షముకాగా కొందరికి శశివర్ణముతో చతుర్భుజుడై విఘ్నహరుడుగా ప్రకాశించాడు. మరికొందరిముందు నీలమేఘఛాయతో ఎనిమిది మహాభుజములు దివ్యాయుధములూ ధరించి సాక్షాత్కరించగా మరికొందరు సహస్ర నేత్రములతో సహస్రసూర్యతేజస్సును మించిన ప్రకాశంతోనూ, మరి కొందరికి బాలగణపతిగా శిశురూపంలో, ఇంకొందరు యువకునిగా

యవ్వనరూపంలోనూ, మరికొందరకు వృద్ధుడై జ్ఞానస్వరూపునిగానూ, మరికొందరికి పన్నెండు భుజములు కలిగి, ధూమ్రవర్ణంతో బ్రహ్మతేజస్సుతో ప్రకాశించాడు. ఇంకొందరి ముందర పద్దెనిమిది భుజాలలో అష్టాదశ ఆయుధాలు ధరించి కోటిసూర్య సమప్రభతో వెలిగాడు. మరికొందరికి సింహ వాహనారూఢుడై అనేక గజవక్త్రములతో మహాకాయుడై తేజోరూపిగా దర్శనమిస్తే - ఇంకొందరికి మూషికవాహనుడై అనేక శిరస్సులతో సాక్షాత్కరించాడు.

ఈ విధంగా వారందరికీ నానావిధ రూపములలో అనేకధా వారి వారి సంకల్పం ప్రకారం మంత్రస్వరూప అనుసారంగా విధివత్తుగా సాక్షాత్కరించాన గణపతిదేవునికి భక్తితో గద్గదకంఠులై మిక్కిలి ప్రేమతో యిలా స్తుతించారు.

## సర్వేలూ ఉవాచ :

ఈ విధంగా అనేక రూపాలలో సాక్షాత్కరించిన గణపతిని నానా విధములుగా స్తుతించారు వారు.

**"ఓ నిర్గుణ పరమాత్మా! అనంతశక్తి స్వరూపుడా! అనేక జీవ ఆత్మస్వరూపుడా! అప్రమేయ గుణస్వరూపుడా! నీకివే మా నమోవాకములు! అనంతమూ నిర్గుణమూ అపరిమితమూ అయి భేదరహితమైన అనాద్యంతమౌ నీ పరబ్రహ్మ స్వరూపమునకు, సదా గణేశదేవునకు నమోనమో భజింతము గాక!"**

**"ఎవరినుంచి ఈ సమస్త విశ్వమూ సమస్త చరాచర జీవస్వరూపములు సృష్టికర్తయగు పద్మసంభవుడూ, విశ్వదేవతలూ, అష్టదిక్పాలకులూ**

ఉద్భవించారో అట్టి విశ్వరక్షకుడు సమస్త సృష్టికర్తయైన నీకిదే నమో వాకములు."

"సమస్త సృష్టిరూపమగు ఇంద్రాది సర్వదేవతలు, దైత్యసంఘములు మనుష్య కీటక పశుగణములు ఇలా సమస్త రూపములూ ధరించిన గణేశభగవానుడా! నీకిదే నమస్కారము."

"ఓ అంతరాత్మస్వరూపుడా! అంతర్యామీ! ఎవరినుండి ఈ అగ్ని హోత్రము, ఆకాశమూ, భూమీ, జలమూ, సప్తసముద్రాలూ, చంద్రాది గ్రహనక్షత్రములు, వాయువూ, ఆకాశమూ, స్వర్గమూ, సమస్త స్థావర జంగమాత్మకమైన వృక్షసంఘములూ ఈ సృష్టిస్వరూపం ధరించి ఆవిర్భ వించాయో అట్టి భగవంతుడైన గణేశునకు నమోనమో నమస్కారం!"

"ఎవరినుండి యక్ష, దానవ, కిన్నర, సిద్ధ, చారణ, వారణ, అశ్వ, మృగ, పక్షిసంఘములు జన్మించాయో అట్టి సృష్టికర్త, అంతరాత్మ స్వరూపుడూ, పరమాత్ముడైన గణేశదేవునికి నమోనమో నమస్కారములు సమర్పించి భజింతుముగాక!"

"ఎవరివల్ల మాకీ బుద్ధి, అజ్ఞానమును నశింపచేసే ఈ జ్ఞానమూ మోక్షమును కోరవలెననే ఈ వివేకమూ కల్గినవో అట్టి ఆత్మప్రచోదకునకు పరబ్రహ్మమూర్తి విఘ్నవినాశకునకు గణేశునకు సమస్త కార్యసిద్ధి ప్రదాతయైన గణపతికి నమస్కారం! హెచ్చుగా మా నమస్కారం!"

"భక్తులకు సంపదలను, సంతోషములను, కోరిన కోరికలను తీర్చే వరప్రదునకు, విఘ్ననివారణకు, సమస్త కార్యసిద్ధీ అనుగ్రహించే దేవదేవేశా! గణేశా! నీకిదే శరణు శరణు!"

"ఎవరినుండి పుత్రకళత్ర సంపద, భోగము, సమస్త సౌఖ్యములు కోరిన కోరికలన్నీ అనుగ్రహించబడుతున్నాయో అట్టి ఏకమూర్తియగు అనేక

స్వరూపుడు, భక్తివిద్యాప్రదునకు సర్వేశ్వరునకు ఇవే మా నమస్సులు!"

"మాలోని శోకమోహములు, కోరికలు ఎక్కడనుండి కలుగుతున్నాయో వాటిని నివారించే జ్ఞానము, ముముక్షుత్వము, వివేకమును తిరిగి మాకు ఎవరు ప్రసాదిస్తున్నారో అట్టి గణేశదేవునకు నమోనమో నమస్కారము!"

"ఏ పరమాత్ముని అనంతశక్తిచేత ఆదిశేషుడు భూమిని మోయగల శక్తిమంతుడయ్యాడో, అనేక రూపములు ధరించి అనేక విధములుగా స్వర్గ, పాతాళ, బ్రహ్మలోకాలలో సాక్షాత్కరించిన నానారూపధరుడగు గణేశస్వామికి నమోనమో నమస్కారము."

"ఏ భగవంతుని స్తుతించలేక వేదములే మాటపెగలక, మూగ పోయినవో మనస్సుకు సహితం అందని పరబ్రహ్మరూపియగు బ్రహ్మ తత్త్వముగా "నేతినేతి" అని వర్ణించలేకపోయాయో, చిత్, సత్, ఆనంద స్వరూపమునకు, పరబ్రహ్మ స్వరూపునకు, సదా గణేశస్వరూపునకు నమస్కారము! నమోనమోనమః"

ఈ విధంగా సమస్త గణములూ సమస్త స్వరూపుడగు గణేశ భగవానునకు నానా రూపములైన వాక్కులతో స్తుతించి, భక్తిభావంతో పులకించి తరించారు!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని
'కశ్యపోపాఖ్యానం' అనే 91-వ అధ్యాయం.



92

# మహిమా నిరూపణం

(మూలం)

## ద్వినవతితమో అధ్యాయః

త ఉవాచ :

ఏవం నత్వాచ స్తుత్వాచ సర్వే తేతు గజాననం ।
పునరూచు ర్గణాధ్యక్ష మద్య ధన్యతమా వయం ॥ 1

ధన్యం తపోనోదానంచ జ్ఞానంయజ్ఞశ్చ పూర్వజాః ।
అద్యనోదృష్టయో ధన్యా యాభిర్ద్రుష్టో గజాననః ॥ 2

ఏవం వాక్యామృతై స్తేషాం స్తుతిభిః పరితోషితః ।
ఉవాచ శృణ్వతాంతేషాం గాంభీర్యాద్ద్విరదాననః ॥ 3

నైతాదృశం మయాదర్శి బ్రహ్మ విష్ణుశివాదిషు ।
యత్సాక్షా ద్దృశ్యతే సర్వై రూపంమే నిర్గుణస్యయత్ ॥ 4

అతి తుష్టోననయాస్తుత్యా వరాన్దాతు మిహాగతః ।
యద్యద్యో వాంఛితం తత్ర ద్వృణుధ్య మఖిలంతు యత్ ॥ 5

ఏవముక్తా స్తదాతేన వికటేన మునీశ్వర ।
యస్యయద్వాంచింతం తత్ర ద్వవృస్తస్మా ద్గజాననాత్ ॥ 6

అసంఖ్య త్వాత్తద్వరాణాం నాస్తి శక్తిశ్చతుర్ముఖైః ।
గదితుం సర్వథాతస్మాదుక్తం సంక్షేమతో మయా ॥ 7

తాస్తాన్దదౌ వరాన్ యాన్ యాన్ సర్వే వవృర్గజాననం ।
పునరస్య వదత్సర్వానిదం స్తోత్రం మమప్రియం ॥ 8

త్రిసంధ్యం యః పఠేదేతత్ విద్యావాన్ పుత్రవాన్భవేత్ ।
ఆయురారోగ్య మైశ్వర్యం యశోవృద్ధిం జయోదయం ॥ 9

ప్రాప్నుయా ద్వాంఛితా నర్థా నంతే చపరమం పదం ।
పునరూచే గణాధీశః స్తోత్రమేత జ్జపేన్నరః ॥ 10

త్రిసంధ్యం త్రిదినంతస్య సర్వకార్యం భవిష్యతి ।
యోజపే దష్టదివసం శ్లోకాష్టక మిదం శుభం ॥ 11

అష్టవారం చతుర్థ్యాంతు సోష్టసిద్ధీ రవాప్నుయాత్ ।
యఃపఠే న్మాసమాత్రంతు దశవారం దినేదినే ॥ 12

సమోచయే ద్బంధనా త్తం రాజబద్ధం నసంశయః ।

విద్యాకామో లభేద్విద్యాం పుత్రార్థీ పుత్రమాప్నుయాత్ ।
వాంఛితం లభతేసర్వ మేకవింశతి వారతః ॥ 13

యో జపే త్వరయాభక్త్యా గజాననపరో నరః ।
ఏవముక్త్వా తతోదేవః సర్వేషా మేవపశ్యతాం ॥ 14

అంతర్దధే ఖిలాదారః సుముఖో సౌగజాననః ।
తేచ చక్రుస్తదా మూర్తిం గణేశస్య శుభాననాం ॥ 15

ప్రతిష్ఠాప్య చ తాంస్థూలే ప్రాసాదే రత్ననిర్మితే ।
సుముఖేతి చతస్యాస్తే నామచక్రుః సువిశ్రుతం ॥ 16

సంపూజ్యచ నమస్కృత్వా స్వం స్వం స్థానం యయుస్సురాః ।
సర్వేతే మునయోలోకాః సర్వకార్యరతా స్తదా ॥ 17

కేచిత్తస్య నామచక్రు రేకదంతితిస్ఫుటం ।
గంధర్వైః కిన్నరైరన్యా స్థాపితా మూర్తిరుత్తమాః । 18

ప్రాసాదే కాంచనే శ్రేష్ఠేఽనేకధా పరిపూజ్యచ ।
కపిలేతి చనామాస్యాః స్థాపయామాసు రుత్తమం ॥ 19

గుహ్యకా శ్చారణాస్సిద్ధాః మూర్తిమన్యాం ప్రచక్రిరే ।
మహాలయే ప్రతిష్ఠాప్య నేముశ్చ పుపుజుశ్చ తాం ॥ 20

గజకర్ణేతి నామాస్య చక్రుస్తేతు స్ఫుటార్థకం ।
తత్ప్రభావా ద్విమానస్థాః సర్వేతేది వమాక్రమన్ః ॥ 21

లంబోదరేతి నామ్నాచ స్థాపితా సర్వమానవైః ।
శ్వాపదై రఖిలైరన్యాస్థా పితా మూర్తిరుత్తమా ॥ 22

వికటేతి చతన్నామ్నా పుపూజుస్తే యయుర్వనం ।
గిరియశ్చద్రుమాశ్చాన్యాం మూర్తిం స్థాప్య ప్రపూజ్యచ ॥ 23

విఘ్ననాశన ఇత్యేవం నామకృత్యా స్థితాస్తుత్ ।
తత్ప్రసాదాశ్చ తేఖ్యాతా సర్వతాశ్చ ద్రుమంస్తథా ॥ 24

సర్వైః పక్షిగణైర్మూర్తిః స్థాపితా రత్నకాంచనీ ।
గణాధిపేతి నామ్నాతైః పూజితాచ నమస్కృతా ॥ 25

సర్వైర్విషధరైరేకా స్థాపితా గణనాయకీ ।
యస్యాహూతిః కృతా తైస్తుధూమకేతు రితిస్ఫుటా ॥ 26

సర్వై ర్జలాశయైరేకా ప్రతిమా స్థాపితాశుభా ।
గణాధ్యక్షేతి నామ్నా సాపూజితా పరమోత్సవైః । 27

క్రిమి కీటాది నిచయైః వనస్పత్యోషధీ గణైః ।
స్థాపితా పరమామూర్తిః ఫాలచంద్రేతి విశ్రుతా ॥ 28

అన్యై స్వచేతనైరన్యా రత్నప్రాసాద మధ్యగా ।
వైనాయకీ మహామూర్తిః పూజితా భక్తిభావతః ॥ 29

గజాననాఖ్యయా ఖ్యాతా సర్వేషాం సర్వకామదా ।
తేతే జగత్రయేఖ్యాతా స్తత్తజ్ఞాత్వా బభూవిరే ॥ 30

సుఖినః స్వస్వకార్యేషు దక్షా దేవప్రసాదతః ।
ప్రత్యేక నామకథనే నశక్తిర్మమ వర్తనే ॥ 31

సారం సారం ప్రగృహ్యేవ కృతంనామ్నాం సహస్రకం ॥
తతోపి సారభూతాని ప్రోక్తాని ద్వాదశైవతు । 32

సముద్ర మథనాద్యద్వ ద్రత్నానీవ చతుర్ధశ ।
ఏవం సంక్షేమతో బ్రహ్మన్మహిమా తేభివర్ణితః ॥ 33

విస్తరాత్కథితుం శేషో నేశో నేశోప్యహం హరిః ।
ఇంద్రాది మశకానాంచ జీవానాం యక్షరక్షసాం ॥ 34

తత్ర కాగణనాకార్యా మయాసత్యవతీ సుత ।
తస్మా త్సర్వేషు కార్యేషు పూజనీయో గజాననః ॥ 35

యేన పూజయతే దేవ దేవం విఘ్నవినాశనం ।
స దురాత్మాపరిత్యాజ్యో ఛాండాల ఇవదూరతః ॥ 36

మునిరువాచ :

అనుక్రమేణ ధయాని నామాని ద్వాదశైవమే ।
శ్రవణా త్పఠనోదేషాం సర్వం నిర్విఘ్నతా మియాత్ ॥ 37

బ్రహ్మోవాచ :

సుముఖ శ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః ।
లంబోదరశ్చ వికటో విఘ్ననాశో గణాధిపః ॥ 38

ధూమ్రకేతు ర్గణాధ్యక్షో ఫాలచంద్రో గజాననః ।
ద్వాదశైతాని నామాని యఃపఠే చ్ఛృణుయాదపి ॥ 39

విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా ।
సంగ్రామే సంకటేచైవ విఘ్నస్తస్య నజాయతే ॥ 40

శుక్లాంబరధరం దేవం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే ॥ 41

కోటికన్యా ప్రదానాని కోటి యజ్ఞవ్రతానిచ ।
తపాంసి యానిసర్వాణి తీర్థాన్యాయతనాని చ ॥ 42

స్వర్ణభార సహస్రాణి కోటిదానాని యాన్యపి ।

శతాంశ మేషాం పుణ్యస్య తాని నామ్నాం నయాంతిచ ।
ఇమాని ప్రాతరుద్ధాయ శుచిర్భూత్వా సమాహితః ॥ 43

యఃపఠే న్నానవేళక్త్యా విఘ్నానేయాంతి తం నరం ।
సిధ్యంతి సర్వకార్యాణి మోక్షమంతే వ్రజత్యసౌ ।

తస్య దర్శనతోలోకాః దేవాః పూతా భవంతిహి । 44

అతఏవ మునేసౌరాః శాక్తా శైవాశ్చవైష్ణవాః ।
ఉక్త్వా ద్వాదశనామాని సర్వకార్యాణి కుర్వతే ॥ 45

న సిధ్యంతి హికార్యాణి ద్వాదశాన్యతమస్యహ ।
ఉచ్చారణం వినా బ్రహ్మం స్తస్మాదేకం సముచ్చరేత్ ॥ 46

ఏవం తేమహిమా సర్వః కథితో లేశతోమునే ।
ఉపాసనా ఫలంనానా యథామతి నిరూపితం ॥ 47

విష్ణునా కథితం యావ త్తావత్తేవ నిరూపితం ।
సోపి నాంతం జగామాస్య గణేశో పాసనస్యహ । 48

గణేశ నామ మహిమా పూర్ణోజ్ఞాతో నతేనచ ।

**భృగు రువాచ :**

ఏవం తేకథితో రాజన్నద్భుతో మహిమా తయా ॥ 49

బ్రహ్మణా సుప్రసన్నేనయో వ్యాసాయ నిరూపితః ।
ఉపాసనా ఖండమిదం నృపతే మయా ॥ 50

యది తేశ్రవణే శ్రద్ధా తదాన్యదపి వర్ణయే ।
చరితం గణనాథస్య సోమకాంతాఘ నాశనం ॥ 51

**సూత ఉవాచ :**

ఇతి వఃకథితం నానా కథాంతర సమన్వితం ।
ఉపాసనం గణేశస్య శౌనకాద్యామహర్షయః ॥ 52

వేదవ్యాసాయ మునయే బ్రహ్మణా యత్సమీరితం ।
శృణుయా ద్యోగణేశస్య పురాణ మిదముత్తమం ॥ 53

స సర్వామాపదం గమిత్వా భుక్త్వా భోగాననేకశః ।
పుత్ర పౌత్రసమాయుక్తో జ్ఞాన విజ్ఞాన సంయుతః ॥ 54

లభతే పరమాం ముక్తిం గణేశస్య ప్రసాదతః ।
న తస్యపునరావృత్తిః కల్పకోటిశతైరపి । 55

యశ్శ్రావయే న్మహా భక్త్యా యథోక్త ఫలభాగ్భవేత్ ॥
యథోక్తం సోమకాంతేన శృణ్వతా పరమాదరాత్ । 56

**ఇతి శ్రీగణేశ పురాణే ఉపాసనాఖండే బ్రహ్మ వ్యాస**
**భృగు సోమకాంత సంవాదే గణానన మహిమా**
**నిరూపణంనామ ద్విపంచాశత్తమో అధ్యాయః ॥**
**ఏతత్ సర్వం శ్రీమద్ గణాననార్పణం**



## 92-వ అధ్యాయము

# గజానన మహిమా నిరూపణం

అనంతరం బ్రహ్మ యిలా అన్నాడు : "ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా సృష్టించబడిన చరాచర జగత్తులోని వారందరూ దేవదేవుడైనట్టి గజాననునికి స్తోత్రంచేసి తిరిగి ఆ గణాధ్యక్షునితో యిలాఅన్నారు : ఓ దేవా! మేమిప్పుడు ధన్యులమైనాము. మీ సందర్శనభాగ్యంచేత మా నేత్రములు పావనమైనాయి!"

ఇట్టి వినయాన్వితములైన వారి వాక్కులను విని సంతసించిన గజాననుడిలా అన్నారు.

'ఓ జీవులారా! నా ఈ రూపాన్ని బ్రహ్మరుద్రాదులు సహితం దర్శించజాలరు. నిర్గుణస్వరూపుడనైన నేను మీయందుగల వాత్సల్యం చేతనే నా ఈ సగుణమూర్తిని దర్శింపజేసాను. మీ ఈ స్తుతికి సంతసించి వరములీయవచ్చాను! మీరు మీ ఇచ్ఛానుసారం వరాలను కోరుకోండి!'

అప్పుడు "ఓ వ్యాసమునీంద్రా! వారంతా తమకు కావలసిన వరాలను కోరుకున్నారు. అసంఖ్యాకములైన ఆ వరాలను వర్ణించటం నా తరముకాదు! ఆ వరాలన్నీ అనుగ్రహించి, గజాననుడిలా అన్నాడు :

"నాకు అత్యంత ప్రీతిపాత్రమైన ఈ స్తోత్రాన్ని త్రిసంధ్యలలోనూ పఠించినవాడు పుత్రవంతుడు, ఆయురారోగ్య ఐశ్వర్యవంతుడూ కాగలడు! కీర్తి జయము రెండూ సంప్రాప్తమవుతాయి! వాంఛితార్థములన్నీ పొంది అంత్యమున మోక్షాన్నికూడా పొందగలడు!

త్రిసంధ్యలలోనూ ఈ స్తోత్రాన్ని ముమ్మారు భక్తితో పఠిస్తే సర్వ కార్యాలూ సిద్ధిస్తాయి! ఎనిమిదిరోజులపాటు రోజూ ఎనిమిదిసార్లు పఠించి, చతుర్థీతిథియందు కూడా ఎనిమిదిసార్లు పఠిస్తే అష్టసిద్ధులూ కలుగుతాయి!

రోజూ పదిసార్లు చొప్పున ఈ స్తోత్రాన్ని మాసముదినాలు పఠిస్తే రాజుయొక్క బంధనములనుండి విముక్తుడౌతాడు!

ఇరవైఒక్కసార్లు జపించితే విద్యాకాముడికి విద్య, ధనంకోరినట్టి వానికి ధనమూ, పుత్రులను కోరినవానికి పుత్రులూ ఇలా ఎవరేమికోరితే వారికి అది లభిస్తుంది!" అంటూ గజాననుడు అంతర్ధానం చెందాడు!

అప్పుడా సమస్త పరివారమూ ఎవరికివారు తమకు వేరువేరుగా ప్రత్యేకమైన గణేశుని వివిధ మూర్తులను స్థాపించి పూజించారు.

దేవతలు తమ మూర్తిని "సుముఖుడ"నీ, మునులు తాము స్థాపించిన మూర్తికి "ఏకదంతుడ"నీ కీర్తించారు. గంధర్వులూ, కిన్నరులూ "కపిలుడన్న" నామంతో అర్చించారు. గుహ్యకులూ, చారణులూ, సిద్ధులూ మహాప్రాసాదాన్ని నిర్మించి అందులోని మూర్తికి "గజకర్ణుడని" నామముంచి పూజించారు.

ఆ పూజాప్రభావంచేత వారంతా దివ్యవిమానాలను అధిరోహించి స్వర్గారోహణం చేశారు. ఆ తరువాత మానవులంతా "లంబోదరు"డన్న నామధేయంతో మూర్తిని స్థాపించి పూజించారు! పక్షులన్నీ తమ గణేశ మూర్తిని వికటుడన్న పేరుతో పూజించి వనాలలోకి ఎగిరిపోయాయి.

పర్వతాలు, వృక్షాలు తాము స్థాపించిన మూర్తికి విఘ్ననాశనుడన్న పేరుతో పూజించాయి. ఆ ప్రభావంచేత పర్వతాలు, వనాలూ వృద్ధి చెందాయి.

పక్షిగణాలు ఒకమూర్తిని స్థాపించి గణాధిపుడన్న నామముంచాయి. విషధరజీవులన్నీ "ధూమకేతు" వన్న పేరుతోనూ జలాశయాలన్నీ "గణాధ్యక్షుడ"న్న పేరుతోనూ పూజించాయి.

క్రిమికీటకాదులన్నీ ఓషధీగణాలతోకూడినవై తాము స్థాపించిన గణేశమూర్తికి "ఫాలచంద్రు"డన్న నామంతో పూజించాయి. ఇంకా యితర చేతనములన్నీ అనేక గణేశమూర్తులను స్థాపించి భక్తిభావంతో పూజించాయి.

"గజానను"డనే పేరుగల మూర్తి అందరకూ సకల కోరికలనూ ప్రసాదించునటువంటిది! ఇలా సమస్త లోకాలలోనివారూ గజాననుని అనుగ్రహవిశేషంచేతనే తమతమ కార్యాలను నెరవేర్చుకోవటంలో దక్షులై విలసిల్లారు. ఆ దేవదేవునికి గల అనంతనామములయొక్క ఫలమింతని చెప్పటానికి శక్యముకాదు. వాటిలోని సారమునే గ్రహించి సహస్ర నామములను చెప్పాను. అట్టివాటిలోకెల్లా సారభూతమైనట్టివి పన్నెండు నామములు! సముద్రమథనంచేత పధ్నాలుగురత్నాలు లభించినట్లుగా, సహస్రనామములనూ మథించుటచేత గణేశ ద్వాదశనామాలు లభిం

చాయి!

ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా సంక్షేపంగా గజాననుని మహిమను నీకు వర్ణించాను! విస్తారంగా చెప్పటానికి త్రిమూర్తులకుగాని ఆదిశేషునికిగాని తరంకాదు! ఇక ఇతరులెంతటివారు? అందుచేత సర్వకార్యములయందూ గజాననుడు తప్పక పూజించితగినట్టి మహనీయుడు! ఎవరు ఆ దేవదేవుని పూజించక అలక్ష్యం చేస్తారో అట్టి దురాత్ముల కెన్నడూ కార్యసిద్ధి కలుగనేరదు!

అప్పుడు వ్యాసమునీంద్రుడిలా ప్రార్థించాడు. "ఓ చతురాననా! ఆ ప్రసిద్ధమైనట్టి, అనంతఫలప్రదములైనట్టి ద్వాదశనామాలను చెప్పు! వేటిని పఠించటంవల్ల, వినటంవల్లా నిర్విఘ్నతను సులభంగా పొందగలరో? అనగానే బ్రహ్మ యిలాఅన్నాడు :

**(1) సుముఖుడు (2) ఏకదంతుడు (3) కపిలుడు**

**(4) గజకర్ణుడు (5) లంబోదరుడు (6) వికటుడు**

**(7) విఘ్ననాశనుడు (8) గణాధిపుడు (9) ధూమ్రకేతుడు**

**(10) గణాధ్యక్షుడు (11) ఫాలచంద్రుడు (12) గజాననుడు**

ఈ పన్నెండూ విశేషప్రభావంగల గణేశుని **ద్వాదశనామాలు!** ఈ నామాలనూ విన్నా, పఠించినా, విద్యారంభములోనూ, కార్యప్రవేశములోనూ, ప్రయాణ సమయంలోనూ, సంగ్రామ సమయంలోనూ, ఆపత్సమయాలలోనూ దీనిని విన్నా, పఠించినా విఘ్నములన్నీ సమూలంగా నశిస్తాయి!

తెల్లని వస్త్రమును ధరించి, చంద్రుని వర్ణముతోకూడినట్టివాడూ నాల్గుచేతులు కల్గిన అనుగ్రహమూర్తిగా ఆ దేవదేవుని ధ్యానిస్తే సకల

విఘ్నములనూ హరిస్తాడు!

కోటియజ్ఞముల ఫలంకానీ, కోటివ్రతాచరణవల్ల కల్గిన ఫలంగాని, తపస్సుగాని యిందులో నూరోవంతు ఫలాన్నికూడా యివ్వలేవు!

ఉదయాన్నే ఈ నామములను ఎవరు శ్రద్ధతో పఠిస్తారో అట్టివారి కెన్నడూ కార్యవిఘ్నములు కలుగవు! అట్టివారియొక్క సకల కార్యములూ సిద్ధిస్తాయి! అట్టివారిని దర్శించినంతనే లోకాలన్నీ పవిత్రమౌతాయి. అందుచేతనే ఓ వ్యాసమునీంద్రా! సౌర, శైవ, శాక్త, వైష్ణవ సాంప్రదాయికు లంతా ఈ గణేశ ద్వాదశనామాలను ఉచ్ఛరించి, ఆ తరువాతనే తమ స్వకర్మలను నిర్వర్తిస్తున్నారు. ఈ పవిత్ర నామోచ్ఛరణవలన కార్యసిద్ధి తప్పక కలుగుతుంది!

"ఓ వ్యాసమునీంద్రా! ఈ విధంగా ద్వాదశనామముల మహిమనూ నీకు పూర్తిగా వివరించాను. పావనుడైన గణేశుని ఉపాసించుటవల్ల కలిగే ఫలితాన్ని నాకు వీలైనంతమేర వర్ణించాను. ఈ గణేశోపాసనయొక్క అంత్యముగురించి సాక్షాత్తూ శ్రీమహావిష్ణువుగూడా ఎరుగజాలడు!" అంటూ ముగించాడు.

అప్పుడు భృగుమహర్షి సోమకాంతమహారాజుతో యిలాఅన్నాడు. "ఓ సోమకాంతమహారాజా! ఈ విధంగా గజాననునియొక్క అద్భుతమైన అనంతమహిమలనన్నిటినీ నీకు సోదాహరణపూర్వకంగా వివరించాను! దీన్ని గతంలో చతురాస్యుడైన బ్రహ్మ వ్యాసమునీంద్రునికి ఉపదే శించాడు!"

అలా ఈ గణేశపురాణాన్ని శ్రద్ధతో ఆలకించినట్టి సోమకాంత మహారాజుయొక్క పూర్వజన్మ తాలూకు దుష్కర్మయావత్తూ నశించి

ఆతడికి శరీర స్వస్థతను చేకూర్చింది!

అప్పుడు సూతమహర్షి శౌనకాది మహర్షులతో యిలాఅన్నాడు :

"ఓ మహర్షులారా! గణేశుని ఉపాసనాఖండమును యావత్తూ నానావిధ ఆఖ్యానాలతో వర్ణించిచెప్పాను! నా గురుదేవుడైన వేదవ్యాసునికి బ్రహ్మ ఏవిధంగా ఉపదేశించాడో, అలాగే యావత్ వృత్తాంతాన్నీ మీకు వివరించాను.

ఈ గణేశపురాణాన్ని ఎవరైతే శ్రద్ధగా పఠిస్తారో, వింటారో, అట్టివారు తమ సర్వసంకటములనుండీ ఆపదలనుండీ విముక్తులై ఇహలోకంలో పుత్రపౌత్రాద్యభివృద్ధినీ (వంశవృద్ధినీ) ఆయురారోగ్యైశ్వర్యాలనూ బడసి, జ్ఞానవంతులై పునరావృత్తిరహితమైనట్టి మోక్షాన్ని పొందుతారు!

ఈ కథను పరమఆదరంతో విన్నట్టి సోమకాంత మహారాజెట్టి శుభములు పొందాడో, అట్టి శుభఫలితాలనూ గణేశుని పరమానుగ్రహాన్నీ పొందగలరు!

స్వస్తి! శుభం!

ఇది శ్రీగణేశపురాణం ఉపాసనాఖండములోని బ్రహ్మ, వ్యాస, భృగు, సోమకాంతసంవాదరూపమైన **'గజాననమహిమా నిరూపణం'** అనే 92-వ అధ్యాయం సంపూర్ణం!!!

ఉపాసనాఖండం - సమాప్తం!

**గజాననార్పణమస్తు!!!**





# మంగళాచరణం

స జయతి సింధూరవదనో దేవో యత్పాదపంకజ స్మరణం
వాసరమణిరివ తమసాంరాశిం నాశయతి విఘ్నానాం ॥1॥

సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో. విఘ్ననాశో గణాధిపః ॥2॥

ధూమ్రకేతుర్గణాధ్యక్షో ఫాలచంద్రో గజాననః
ద్వాదశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి ॥3॥

విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సంకటే చైవ విఘ్నస్తస్య నజాయతే

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే



# శ్రీగణపతి - అధర్వ శీర్షం

## శ్రీగణేశాయ నమః

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః । భద్రం పశ్యేమాక్షిభిర్యజత్రాః ।
స్థిరైరంగై స్తుష్టాం సస్తనూభిః । వ్యశేమ దేవహితం యదాయుః ।

ఓం స్వస్తిః న ఇంద్రో వృద్ధశ్రవాః । స్వస్తినః పూషా విశ్వవేదాః ।
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తినో బృహస్పతిర్దధాతు ॥

ఓం తన్మా అవతు । తద్వక్తార మవతు । అవతుమాం । అవతు
వక్తారం । ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

## అధశ్రీ గణపత్యథర్వశీర్షోపనిషత్

ఓం - లం. నమస్తే గణపతయే ।
త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి ।
త్వమేవ కేవలం కర్తాసి ।

త్వమేవ కేవలం ధర్తాసి ।
త్వమేవ కేవలం హర్తాసి ।
త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి ।
త్వం సాక్షాదాత్మాసి నిత్యం । ॥1॥

ఋతం వచ్మి సత్యం వచ్మి ॥
ఋతం వచ్మి సత్యం వచ్మి ॥ ॥2॥

అవ త్వం మాం

అవ వక్తారం । అవ శ్రోతారం । అవ దాతారం ।
అవ ధాతారం । అవానూచాన మవ శిష్యం ।
అవ పశ్చాత్తాత్ । అవ పురస్తాత్
అవోత్తరాత్తాత్ । అవ దక్షిణాత్తాత్
అవచోర్ధ్వాత్తాత్ । అవాధరాత్తాత్
సర్వతో మాం పాహి పాహి సమంతాత్ ॥3॥

త్వం వాఙ్మయస్త్వం చిన్మయః ।
త్వమానందమయస్త్వం బ్రహ్మమయః ।
త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి ।
త్వం జ్ఞానమయో విజ్ఞాన మయోసి । ॥4॥

సర్వం జగదిదం త్వత్తో జాయతే ।
సర్వం జగదిదం త్వత్తస్తిష్ఠతి ।
సర్వం జగదిదం త్వయి లయమేష్యసి ।
సర్వం జగదిదం త్వయి ప్రత్యేతి ।

త్వం భూమి రాపోఽనలోఽనిలో నభః
త్వం చత్వారి వాక్పదాని ॥5॥

త్వం గుణత్రయాతీతః । త్వం దేహత్రయాతీతః ।
త్వమవస్థత్రయాతీతః । త్వం కాలత్రయాతీతః ।
త్వం మూలాధారస్థితోసి నిత్యం ।
త్వం శక్తిత్రయాత్మకః । త్వాం యోగినో ధ్యాయంతి నిత్యం ।
త్వం బహ్మ త్వంవిష్ణుస్త్వం రుద్రస్త్వ మింద్రస్త్వమగ్నిస్త్వం
వాయుస్త్వం సూర్యస్త్వం చంద్రమాస్త్వం
బ్రహ్మ భూర్భువస్సువరోం ॥6॥

గణాదీన్ పూర్వముచ్చార్య వర్ణాదిం తదనంతరం ।
అనుస్వారః పరతరః అర్ధేందు లసితం తారేణ ఋద్ధం ।
ఏతత్తవ మనుస్వరూపం । గకారః పూర్వరూపం ।
అకారో మధ్యమ రూపం । అనుస్వార శ్చాంత్యరూపం ।
బిందురుత్తరరూపం । నాదః సంధానం । సంహితా సంధిః ।
సైషాగణేశవిద్యా । గణకఋషిః । నిచృద్ గాయత్రీ ఛందః ।
గణపతిర్దేవతా । ఓం గం గణపతయే నమః ॥7॥

ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి ।
తన్నోదంతిః ప్రచోదయాత్ ॥8॥

ఏకదంతం చతుర్హస్తం పాశమంకుశ ధారిణం
రదంచ వరదం హస్తైర్బిభ్రాణం మూషక ధ్వజం
రక్తం లంబోదరం శూర్పకర్ణకం రక్తవాససం

రక్తగంధానులిప్తాంగం రక్తపుష్పైః సుపూజితం
భక్తానుకంపినం దేవం జగత్కారణ మచ్యుతం
ఆవిర్భూతంచ సృష్ట్యాదౌ ప్రకృతేః పురుషాత్పరం
ఏవం ధ్యాయతి యో నిత్యం స యోగీ యోగినాం వరః ॥9॥

నమో వ్రాతపతయే । నమో గణపతయే ।
నమః ప్రమథపతయే । నమస్తేస్తు లంబోదరాయైక ।
దంతాయ విఘ్ననాశినే శివసుతాయ
వరదమూర్తయే నమో నమః ॥10॥

## ఫలశ్రుతి

ఏతదథర్వశీర్షా యోఽధీతే ।
స బ్రహ్మ భూయాయ కల్పతే
స సర్వవిఘ్నైర్నబాధ్యతే
స సర్వతః సుఖమేధ్యతే
స పంచమహా పాపాత్ ప్రముచ్యతే
సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి ।
ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి ।
సాయం ప్రాతః ప్రయుంజానోఽపాపోభవతి ।
సర్వత్రాధీయానోఽప విఘ్నో భవతి ।
ధర్మార్థకామ మోక్షం చ విందతి ।

ఇదమథర్వశీర్ష మశిష్యాయ న దేయం
యో యది మోహాద్ దాస్యతి

స పాపీయాన్ భవతి । సహస్రావర్తనాత్ ।
యం యం కామమధీతే తం తమనేన సాధయేత్ ॥11॥

అనేన గణపతి మభిషించతి స వాగ్మీభవతి ।
చతుర్థ్యా మనశనంచ జపతి సవిద్యావాన్ భవతి ।
ఇత్యథర్వణ వాక్యం బ్రహ్మాద్యావరణం విద్యాత్ ।
న విభేతి కదాచనేతి । ॥12॥

యో దూర్వాంకురై ర్యజతి స వైశ్రవణోపమో భవతి ।
యో లాజైర్యజతి స యశోవాన్ భవతి । స మేధావాన్ భవతి ।
యో మోదక సహస్రేణ యజతి స వాంఛిత ఫలమవాప్నోతి
యః సాజ్య సమిద్భిర్యజతి స సర్వం లభతే ససర్వం లభతే ॥
అష్టౌ బ్రాహ్మణాన్ సమ్యగ్ గ్రాహయిత్వా సూర్యవర్చస్వీ భవతి ।
సూర్యగ్రహే మహానద్యాం ప్రతిమా సన్నిధౌ వా జప్త్వా
సిద్ధమంత్రౌ భవతి ।

మహావిఘ్నాత్ ప్రముచ్యతే । మహాదోషాత్ ప్రముచ్యతే ।
మహా పాపాత్ప్రముచ్యతే । స సర్వవిద్భవతి । స సర్వవిద్భవతి
య ఏవం వేద । ఇత్యుపనిషద్ ।

ఓం సహనావవతు । సహ నౌ భునక్తు ।
సహవీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు
మావిద్విషా వహై ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః



iii

# శ్రీగణేశ కవచం

శ్రీగణేశాయ నమః

## గౌర్యువాచ :

ఏషోతిచపలో దైత్యాన్బాల్యేఽపి నాశయత్యహో
అగ్రేకిం కర్మకర్తేతి నజానే మునిసత్తమ ॥ 1

దైత్యా నానావిధా దుష్టాః సాధుదేవద్రుహః ఖలాః
అతోఽస్య కంఠే కించిత్వం రక్షార్థం బద్ధుమర్హసి ॥ 2

## మునిరువాచ :

ధ్యాయేత్సింహగతం వినాయకమముం దిగ్బాహుమాద్యే యుగే ।
త్రేతాయాం తు మయూరవాహనమముం షడ్బాహుకం సిద్ధిదం
ద్వాపరే తు గజాననం యుగభుజం రక్తాంగరాగం విభుం.
తుర్యేతు ద్విభుజం సితాగరుచిరం సర్వార్థదం సర్వదా 3

వినాయకః శిఖాం పాతు పరమాత్మాః పరాత్పరః ।
అతిసుందర కాయస్తు మస్తకం సుమహోత్కటః 4

లలాటం కశ్యపః పాతు భ్రూయుగం తు మహోదరః ।
నయనే భాలచంద్రస్తు గజాస్య స్త్వోష్ఠపల్లవౌ 5

జిహ్వాం పాతు గణక్రీడ శ్చిబుకం గిరిజాసుతః ।
వాచం వినాయకః పాతు దంతాత్ రక్షాతు విఘ్నహా 6

శ్రవణౌ పాశపాణిస్తు నాసికాం చింతితార్థదః ।
గణేశస్తు ముఖంపాతు కంఠం దేవో గణంజయః 7

స్కంధౌ పాతు గజస్కంధః స్తనౌవిఘ్న వినాశనః ।
హృదయం గణనాథస్తు హేరంబో జఠరం మహాన్ ॥ 8

ధరాధరః పాతుపార్శ్వౌ పృష్ఠం విఘ్నహర శుభః ।
లింగంగుహ్యం సదాపాతు వక్రతుండో మహాబలః ॥ 9

గణక్రీడో జానుజంఘే ఊరూ మంగళమూర్తిమాన్ ।
ఏకదంతో మహాబుద్ధిః పాదౌ గుల్ఫౌ సదావతు ॥ 10

క్షిప్రప్రసాదనో బాహూ పాణీ ఆశాప్రపూరకః ।
అంగులీశ్చ నఖాన్పాతు పద్మహస్తోఽరినాశనః ॥ 11

సర్వాంగాని మయూరేశో విశ్వవ్యాపీ సదాఽవతు ।
అనుక్తమపి యస్థానం ధూమ్రకేతుః సదాఽవతు ॥ 12

ఆమోదస్త్వాగ్రతః పాతు ప్రమోదః పృష్ఠతోవతు ।
ప్రాచ్యాం రక్షతు బుద్ధీశ ఆగ్నేయం సిద్ధిదాయకః ॥ 13

దక్షిణస్యాముమాపుత్రౌ నైఋత్యాం తు గణేశ్వరః ।
ప్రతీచ్యాం విఘ్నహర్తాఽ వాయవ్యాం గజకర్ణకః ॥ 14

కౌబర్యాం నిధిపః పాయా దీశానామీశనందనః ।
దివాఽవ్యాదేకదంతస్తు రాత్రౌ సంధ్యాసు విఘ్నహృత్ ॥ 15

రాక్షసాసుర – వేతాలగ్రహ భూతపిశాచతః ।
పాశాంకుశధరఃపాతు రజః సత్త్వతమః స్మృతిః ॥ 16

జ్ఞానం ధర్మంచ లక్ష్మీంచ లజ్జాం కీర్తి తధాకులం ।
వపుర్ధనం చ ధాన్యంచ గృహాన్ దారాన్ సుతాన్ సఖీన్ ॥ 17

సర్వాయుధధరః పౌత్రాన్ మయూరేశోఽవతాత్సదా ।
కపిలోఽజావికంపాతు గజాశ్వా న్వికటోఽవతు ॥ 18

భూర్జపత్రే లిఖిత్వేదం యఃకంఠే ధారయేత్సుధీః ।
న భయం జాయతే తస్య యక్షరక్షపిశాచతః ॥ 19

త్రిసంధ్యం జపతే యస్తు వజ్రసార తనుర్భవేత్ ।
యాత్రాకాలే పఠేద్యస్తు నిర్విఘ్నేన ఫలం లభేత్ ॥ 20

యుద్ధకాలే పఠేద్యస్తు విజయం చాప్నుయాత్ ధృతం ।
మారణోచ్చాటనాకర్ష స్థంభమోహన కర్మణి ॥ 21

సప్తవారం జపేదేతద్దినానామేక వింశతిం ।
తత్తత్ఫల మవాప్నోతి సాధకోనాత్ర సంశయః ॥ 22

ఏకవింశతి వారంచ పఠేత్తావద్దినానియః ।
కారాగృహగతం సాధ్యో రాజ్ఞావధ్యంచ మోచయేత్ ॥ 23

రాజదర్శనవేళాయాం పఠేదేతత్త్రివారతః ।
స రాజానం వశం నీత్వా ప్రకృతీశ్చ సభాంజయేత్ ॥ 24

ఇదం గణేశకవచం కశ్యపేన సమీరితం ।
ముద్గలాయ చతేనాథ మాండవ్యాయ మహర్షయే ॥ 25

మహ్యం స ప్రాహ కృపయా కవచం సర్వసిద్ధిదం ।
న దేయం భక్తిహీనాయ దేయం శ్రద్ధావతే శుభం ॥ 26

యస్యానేనకృతా రక్షా న బాధాఽస్య భవేత్క్వచిత్ ।
రాక్షసాసురవేతాళ దైత్యద్దా సంభవా ॥ 27

ఇతి శ్రీగణేశపురాణగతం శ్రీగణేశకవచం సంపూర్ణం.



iv

# శ్రీ గణేశ స్తుతి

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనాముపమశ్రవస్తమం
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనః
శృణ్వన్నూతిభిః సీదసాదనం ॥ ఋగ్వేదం ॥

ఓం గణానాం త్వా గణపతిం హవామహే
ప్రియాణాం త్వా ప్రియపతిం హవామహే
నిధీనాం త్వా నిధిపతిం హవామహే
అహమజాని గర్భధమాత్వమజాసి గర్భధం ॥ శుక్లయజుర్వేదం ॥

ఓం నమో గణేభ్యో గణపతిభ్యశ్చవో
నమో నమో వ్రాతేభ్యో వ్రాతపతి భ్యశ్చవో
నమో నమో విరూపేభ్యో విరూపేభ్యశ్చవో నమః ॥ యజుర్వేదం ॥

గుణాతీతమానం చిదానందరూపం ।
చిదాభాసకం సర్వగం జ్ఞానగమ్యం ।
మునిశ్రేష్ఠమాకాశరూపం పరేశం ।
పరబ్రహ్మరూపం గణేశం భజేమ ॥ ॥ 1 ॥

ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం
పాశాంకుశధరం దేవం ధ్యాయేత్ సిద్ధివినాయకం ॥ 2 ॥

గజవదనమచింత్యం తీక్ష్ణదంష్ట్రం త్రినేత్రం
బృహదుదరమశేషం భూతరాజం పురాణం ।
అమరవరసుపూజ్యం రక్తవర్ణం సురేశం
పశుపతి సుతమీశం విఘ్నరాజం నమామి ॥ ॥ 3 ॥





# శ్రీ మయూరేశ్వర స్తోత్రం

పరబ్రహ్మరూపం చిదానందరూపం పరేశం సురేశం గుణాబ్ధిం గణేశం ।
గుణాతీతమీశం మయూరేశవంద్యం గణేశం నతాః స్మో నతాః స్మో నతా స్మః ॥1॥

జగద్వంద్యమేకం పరాకారమేకం గుణానాం పరం కారణం నిర్వికల్పం
జగత్పాలకం హారకం తారకం తం మయూరేశవంద్యం నతాస్మోనతాఃస్మ ॥2॥

మహాదేవసూనం మహాదైత్యనాశం మహాపురుషం సర్వదా విఘ్ననాశం ।
సదాభక్తపోషం పరం జ్ఞానకోశం మయూరేశ వంద్యం నతాఃస్మో నతాఃస్మః ॥3॥

అనాదిం గుణాదిం సురాదిం శివాయా మహాతోషదం సర్వదా సర్వవంద్యం ।
సురార్యంతకం భుక్తిముక్తిప్రదానం మయూరేశవంద్యం నతాఃస్మో నతాఃస్మః ॥4॥

పరం మాయినం మాయినామప్యగమ్యం మునిర్ధ్యేయమాకాశకల్పం జనేశం ।
అసంఖ్యావతారం నిజాజ్ఞాననాశం మయూరేశ వంద్యంనతాఃస్మో నతాస్మః ॥5॥

అనేక క్రియాకారకం శ్రుత్యగమ్యం త్రయీబోధితానేక కర్మాది బీజం
క్రియాసిద్ధిహేతుం సురేంద్రాదిసేవ్యం మయూరేశవంద్యం నతాఃస్మో నతాస్మః ॥6॥



vi

# భల్లాలకృత గణేశ స్తోత్రం

భల్లాల ఉవాచ :

గణేశాయ ధామ్నే పరేశాయ తుభ్యం సదానందరూపాయ సర్వార్తిగాయ ।
అపారస్వరూపాయ దేవాధిదేవ నమస్తే ప్రభో భక్తసంరక్షకాయ ॥ 1

హేరంబాయ నమస్తుభ్యం విఘ్నేశాయ పరాత్మనే ।
బ్రహ్మేశాయ మహాయోగదాత్రే శాంతిమయాయ తే ॥ 2

స్వానందవాసినే తుభ్యం స్వానందే ఖేలకాయ తే ।
యోగేశాయ మహోదారస్వరూపధారిన్నమోనమః ॥ 3

సదసన్మయకాయాయ వ్యక్తశీర్ష్ణే నమోనమః ।
యోగరూపేణ సర్వత్ర సంస్థితాయ నమోనమః ॥ 4

సిద్ధిబుద్ధి ప్రదాత్రే తే సిద్ధిబుద్ధిమయాయ చ ।
సిద్ధిబుద్ధిపతే తుభ్యం నమస్తే గజవక్త్రిణే ॥ 5

లంబోదరాయ దేవాయ చతుర్బాహుధరాయతే
మూషకధ్వజినే తుభ్యం పాశాంకుశప్రధారిణే ॥ 6

ద్విజరూప ధరాయైవ భక్తవత్సలభావతః
రక్షితుం భక్తవాక్యంతు సమాగతాయ తే నమః ॥ 7

త్వం మాతా త్వం పితా నాథస్త్వం సుహృత్కులదైవతం
ద్రవ్యం విద్యాదికం మే త్వం సర్వం తే వై నమోనమః ॥ 8

దేహేన వాచా మనసా కృతాన్మే సంసర్గికాన్ జాగృతి స్వప్నజాతాన్
సంసుప్తిహేయాన్ సకలాపరాధా క్షమస్వ హేరంబ దయానిధే త్వం ॥ 9

ఏవముక్త్వా ననతాంసౌ భల్లాలో భక్తియంత్రితః
సాశ్రునేత్రః సరోమాంచే బ్రాహ్మణాగ్రే మహామునే ॥ 10

తమువాచ గణాధీశస్త్యక్త్వా బ్రాహ్మణరూపకం ।
గజనాన స్వరూపేణ సంయుక్తో భక్తముత్తమం ॥ 11

గజానన ఉవాచ :

వరాన్బ్రూహి మహాయోనిన్ యాంస్తే చిత్తగతాన్ పరాన్ ।
దాస్యామి భక్తితుష్టోహం నియమేన మహామతే ॥ 12

త్వయాకృతమిదం స్తోత్రం సర్వసిద్ధిప్రదాయకం ।
భవిష్యతి నరాయైవ పఠతే శృణ్వతే సదా ॥ 13

యం యమిచ్ఛతి తం తంతు దాస్యామ్యనేన సంస్తుతః ।
అంతే సాయుజ్యపదంమే భవిస్తోత్రం విశేషతః ॥ 14

ఇతి భల్లాలకృత గణేశస్తోత్రం

vii

# సంకటనాశక గణేశస్తోత్రం

ప్రణమ్య శిరసా దేవం గౌరీపుత్రం వినాయకం
భక్తావాసం స్మరేన్నిత్యమాయుః కామార్థసిద్ధయే ।   1

ప్రథమం వక్రతుండం చ ఏకదంతం ద్వితీయకం
తృతీయం కృష్ణపింగాక్షం గజవక్త్రం చతుర్థకం ॥   2

లంబోదరం పంచమం చ షష్ఠం వికటమేవచ ।
సప్తమం విఘ్నరాజం చ ధూమ్రవర్ణం తథాష్టమం ॥   3

నవమం ఫాలచంద్రం చ దశమంతు వినాయకం ।
ఏకాదశం గణపతిం ద్వాదశంతు గజాననం ॥   4

ద్వాదశైతాని నామాని త్రిసంధ్యం యః పఠేన్నరః ॥
నచ విఘ్నభయం తస్య సర్వసిద్ధికరం ప్రభో ॥   5

విద్యార్థీ లభతే విద్యాం ధనార్థీలభతే ధనం ।
పుత్రార్థీ లభతే పుత్రాన్ మోక్షార్థీ లభతే గతిం ॥ 6

జపేత్ గణపతిస్తోత్రం షడ్భిర్మాసైః ఫలంలభేత్ ।
సంవత్సరేణ సిద్ధించ లభతే నాత్ర సంశయః ॥ 7

అష్టేభ్యో బ్రాహ్మణేభ్యశ్చ లిఖిత్వా యః సమర్పయేత్ ।
తస్యవిద్యా భవేత్సర్వా గణేశస్య ప్రసాదతః ॥ 8



# వినాయక వ్రతకల్పము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే ॥

సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః । లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః ॥ ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః । వక్రతుండశ్శూర్ప కర్ణో హేరంబస్కందపూర్వజః ॥ షోడశైతానినామాని యః పఠేచ్ఛృణుయాదపి । విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా । సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే ।

## సంకల్పము :

ఆచమ్యః - ప్రాణానాయమ్య । ఓమ్ భూః..... మమో పాత్త దురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, శుభేశోభనే ముహూర్తే, శ్రీమహావిష్ణోర్వరాజ్ఞేయ ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే । శ్రీశైలస్య.... ప్రదేశే. కృష్ణా, గోదావర్యోః మధ్యప్రదేశే, మమగృహే సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ప్రభవాది షష్టిసంవత్స రాణాంమధ్యే......నామసంవత్సరే దక్షిణాయనే వర్షఋతౌ, భాద్రపదమాసే

శుక్లపక్షే చతుర్థ్యాం.......వాసరే, శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, వినాయకచతుర్థి శుభతిథౌ మమఉపాత్త....... ప్రీత్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థ్యం, సర్వాభీష్ట సిద్ధ్యర్థ్యం, సిద్ధివినాయక ప్రీత్యర్థ్యం ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాంకరిష్యే । కలశపూజాంచ కుర్యాత్ ॥

భవసంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణం । విఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజమహంభజే ॥ ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం పాశాంకుశధరం దేవం ధ్యాయేత్ సిద్ధి వినాయకం । ఉత్తమం గణనాధస్య వ్రతం సంపత్కరం శుభం । భక్తాభీష్టప్రదం తస్మాత్ ధ్యాయేత్తం విఘ్ననాయకం ॥

## షోడశోపచారపూజ :

ధ్యాయేద్గజాననందేవం తప్తకాంచనసన్నిభం । చతుర్భుజం మహాకాయం సర్వాభరణ భూషితం ॥ శ్రీ గణాధిపతయేనమః । ధ్యాయామి ॥

అత్రాగచ్ఛ జగద్వంద్య. సురరాజార్చితేశ్వర అనాధనాథ సర్వజ్ఞ గౌరీగర్భ సముద్భవ ॥ ఆవాహయామి । మౌక్తికైః పుష్యరాగైశ్చ నానారత్నైర్విరాజితం రత్నసింహాసనం చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥ ఆసనం సమర్పయామి ॥ గౌరీపుత్ర నమస్తేస్తు శంకర ప్రియనందన । గృహాణార్ఘ్యం మయాదత్తం గంధపుష్పాక్షతైర్యుతం ॥ అర్ఘ్యం సమర్పయామి ॥ గజవక్త్ర నమస్తేస్తు సర్వాభీష్ట ప్రదాయక భక్త్యాపాద్యం మయాదత్తం గృహాణద్విరదానన ॥ పాద్యం సమర్పయామి । అనాధనాధ సర్వజ్ఞ గీర్వాణ పరిపూజిత । గృహాణాచమనందేవ తుభ్యందత్తమయా ప్రభో ॥ ఆచమనీయం సమర్పయామి । దధిక్షీర సమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితం మధుపర్కం గృహాణేదం గజవక్త్ర నమోస్తుతే ॥ మధుపర్కం సమర్పయామి । స్నానం పంచామృతైర్దేవ గృహాణగణనాయక । అనాధనాధ సర్వజ్ఞ గీర్వాణ గణపూజిత ॥ పంచామృత స్నానం సమర్పయామి । గంగాది సర్వతీర్థేభ్యః ఆహృతైరమలైర్జలైః స్నానం కరిష్య భగవాన్ ఉమాపుత్ర నమోస్తుతే ॥ శుద్ధోదక స్నానం సమర్పయామి ॥ రక్తవస్త్రద్వయంచారు దేవయోగ్యంచ మంగళం । శుభప్రదం గృహాణత్వం లంబోదర హరాత్మజ । వస్త్రయుగ్మం సమర్పయామి । రాజితం

బ్రహ్మసూత్రంచ కాంచనంచోత్తరీయకం । గృహాణ సర్వధర్మజ్ఞ భక్తానాభీష్టదాయక ఉపవీతం సమర్పయామి ॥ చందనాగరు కర్పూర కస్తూరి కుంకుమాన్వితం । విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥ గంధం సమర్పయామి ॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాన్ తండులాన్ శుభాన్ । గృహాణ పరమానంద ఈశపుత్ర నమోస్తుతే ॥ అక్షతాన్ సమర్పయామి ॥ సుగంధాని పుష్పాణి జాజీకుంద ముఖానిచ ఏకవింశతి పత్రాణి సంగ్రహాణి నమోస్తుతే ॥

## అథాంగపూజా

గణేశాయనమః పాదౌపూజాయామి । ఏకదంతాయనమః గుల్ఫౌ పూజయామి । శూర్పకర్ణాయనమః జానునీ పూజయామి । విఘ్నరాజాయనమః జంఘే పూజయామి । ఆఖువాహనాయనమః ఊరూం పూజయామి । హేరంబాయనమః కటిం పూజయామి ॥ లంబోదరాయనమః ఉదరం పూజయామి ॥ గణనాథాయనమః నాభిం పూజయామి ॥ గణేశాయ నమః హృదయం పూజయామి ॥ స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి స్కంధాగ్రజాయనమః స్కందౌపూజయామి । పాశహస్తాయ నమః హస్తౌ పూజయామి । గజవక్త్రాయనమః వక్త్రంపూజయామి ॥ విఘ్నహంత్రేనమః నేత్రౌపూజయామి, శూర్పకర్ణాయనమః కర్ణౌపూజయామి ॥ ఫాలచంద్రాయనమః లలాటంపూజయామి । సర్వేశ్వరాయ నమః శిరః పూజయామి । విఘ్నరాజాయ నమః సర్వాణ్యంగాని పూజయామి.

## ఏకవింశతి పత్రపూజ :

సుముఖాయనమః మాచీపత్రం సమర్పయామి । గణాధిపాయనమః బృహతీ పత్రం । ఉమాపుత్రాయనమః బిల్వపత్రం । గజాననాయనమః దుర్వార యుగ్మం । హరసూనవేనమః దుత్తూరపత్రం । లంబోదరాయనమః బదరీపత్రం । గుహాగ్రజాయనమః అపామార్గపత్రం । గజకర్ణాయనమః తులసీపత్రం । ఏకదంతాయ నమః చూతపత్రం । వికటాయనమః కరవీరపత్రం । భిన్నదంతాయనమః విష్ణుక్రాంత పత్రం । వటవేనమః దాడిమీపత్రం । సర్వేశ్వరాయనమః దేవదారుపత్రం । ఫాలచంద్రాయనమః మరువకపత్రం । హేరంబాయనమః సింధువారపత్రం ।

శూర్పకర్ణాయనమః జాజీపత్రం । సూరపూజాయనమః గండకీపత్రం । ఇభవక్త్రాయ నమః శమీపత్రం । వినాయకాయనమః అశ్వత్థపత్రం । సురసేవితాయనమః అర్జునపత్రం । కపిలాయనమః అర్కపత్రం । శ్రీగణేశ్వరాయనమః ఏకవింశతి పత్రాణి పూజయామి.

# శ్రీవినాయక అష్టోత్తరశతనామ పూజ

(ప్రతి నామమునకు ముందుగా "ఓం శ్రీం గ్లాం గం" అనియూ నామం - చివర "నమః' ' అనియు చదువవలెను.)

| | |
|---|---|
| ఓం శ్రీం గ్లాం గం గణాధ్యక్షాయ నమః | ఓం శ్రీం గ్లాం గం విశ్వనేత్రే |
| " విఘ్నరాజాయ | " విరాట్పతయే |
| " వినాయకాయ | " శ్రీపతయే |
| " ద్వైమాతురాయ | " మంత్రకృతే |
| " ద్విముఖాయ | " చామీకరప్రభాయ |
| " ప్రముఖాయ | " సర్వాయ |
| " సుముఖాయ నమః | " సర్వోపన్యాసాయ |
| " కృత్తినే | " సర్వకర్త్రే |
| " మంగళస్వరూపాయ | " సర్వనేత్రే |
| " ప్రమదాయ | " సర్వసిద్ధిప్రదాయ |
| " ప్రథమాయ నమః | " సర్వసిద్ధయే |
| " ప్రాజ్ఞాయ | " పంచహస్తాయ |
| " విఘ్నకర్త్రే నమః | " సుప్రదీపాయ |
| " విఘ్నహంత్రే | " సుఖనిధయే నమః |
| " ఐశ్వర్యకారణాయ | " సురాధ్యక్షాయ |
| " జయినేనమః | " అగ్రపూజ్యాయ |
| " యక్షకిన్నర సేవితాయ | " అగ్రగామినే |
| " గంగాసుతాయ | " భక్తనిధయే |
| " గంభీర నినదాయ | " భావగమ్యాయ నమః |

ఓం శ్రీం గ్లాం గం మంగళప్రదాయ
,, సురారిఘ్నాయ
,, మహాగణపతయే
,, మాన్యాయ
,, మహాకాలాయ
,, మహాబలాయ
,, హేరంబాయ
,, లంబజఠరాయ
,, హ్రస్వగ్రీవాయ
,, మహోదరాయ
,, మదోత్కటాయ
,, మహావీరాయ
,, మంత్రిణే
,, విష్ణుప్రియాయ
,, భక్తజీవితాయ
,, జితమన్మథాయ
,, మోదకప్రియాయ
,, కాంతిభృతే
,, ధృతిమతే
,, కామినే నమః
,, కపిత్థపనసప్రియాయ
,, గణాధ్యక్షాయ
,, వరదాయ
,, అభీష్టవరదాయ
,, జ్యోతిషే నమః

ఓం శ్రీం గ్లాం గం వాక్పతయే
,, శృంగారిణే
,, ఆశ్రితవత్సలాయ
,, ప్రియాయ
,, శీఘ్రకారిణె
,, శాశ్వతాయ
,, భావాయ
,, ఫలోద్ధితాయ
,, భవాత్మజాయ
,, పురాణపురుషాయ
,, పూష్ణే
,, పుష్కరోక్షిప్తవదనాయ
,, అగ్రగణ్యాయ
,, అవ్యక్తాయ నమః
,, అప్రాకృతపరాక్రమాయ
,, సత్యధర్మిణే
,, సఖ్యై
,, సరసాంబునిధయే
,, మహేశాయ
,, దివ్యాంగాయ
,, మణికింకిణీమేఖలాయ
,, సమస్త దేవతాయ
,, స్తవమూర్తయే
,, పార్వతీనందనాయ నమః
,, ప్రభవే

ఓం శ్రీం గ్లాం గం కుమారగురవే
„ అక్షోభ్యాయ
„ కుంజరాసురభంజనాయ
„ ప్రమోదాయ
„ బ్రహ్మచారిణే
„ బ్రహ్మరూపిణే
„ బ్రహ్మవిద్యా ప్రథాయకాయ
„ జిష్ణవే
„ సహిష్ణవే
„ సతతోత్థితాయ

ఓం శ్రీం గ్లాం గం విఘాతకారిణే
„ విష్వగ్దృశే
„ విశ్వరక్షాకృతయే
„ కళ్యాణగురవే
„ ఉన్మత్తవేషాయ
„ అపరాజితే
„ సమస్తజగదాధారాయ
„ సర్వైశ్వర్యప్రదాయ
„ అక్రాంతచిదచిత్ప్రకాశాయ
„ శ్రీవిఘ్నేశ్వరాయనమః

దశాంగం గుగ్గలోపేతం సుగంధం సుమనోహరం । ఉమాసుత నమస్తుభ్యం గృహాణ వరదోభవ । దూపమాఘ్రాపయామి ॥ సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా ద్యోతితం మయా । గృహాణ మంగళం దీపం ఈశపుత్ర నమోస్తుతే । దీపందర్శయామి ॥ సుగంధాన్సుకృతాంశ్చైవ మోదకాన్ ఘృతపాలితాన్ । నైవేద్యంగృహ్యతాం చణముద్గైః ప్రకల్పితాన్ । భక్ష్యం భోజ్యం చ లేహ్యంచ చోష్యం పానీయమేవచ ఇదం గృహాణ నైవేద్యం మయాదత్తం వినాయక । నైవేద్యం సమర్పయామి ॥ సదానందంచ విఘ్నేశ పుష్కరాణి ధనానిచ । భూమ్యాంస్థితాని భగవాన్ స్వీకరుష్యవినాయక । సువర్ణపుష్పం సమర్పయామి । పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం । కర్పూరచూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం । తాంబూలం సమర్పయామి ॥ ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూర శకలైస్తధా । నీరాజనం మయాదత్త గృహాణవరదోభవ । నీరాజనం సమర్పయామి ॥

## అథ దూర్వారయుగ్మ పూజా :

గణాధిపాయనమః దూర్వారయుగ్మం పూజయామి । ఉమాపుత్రాయ నమః దూర్వారయుగ్మం పూజయామి ॥ ఆఖువాహనాయనమః దూర్వారయుగ్మం

పూజయామి ॥ వినాయకాయనమః దూర్వారయుగ్మం పూజయామి ॥ ఈశపుత్రాయనమః దూర్వారయుగ్మం పూజయామి ॥ సర్వసిద్ధి ప్రదాయకాయనమః దూర్వారయుగ్మం పూజయామి ॥ ఏకదంతాయనమః దూర్వారయుగ్మం పూజయామి । ఇభవక్త్రాయనమః దూర్వారయుగ్మం పూజయామి ॥ మూషిక వాహనాయనమః ద్వుర్వారయుగ్మం పూజయామి కుమారగురవే నమః దూర్వార యుగ్మం పూజయామి ।

గణాధిపనమస్తేస్తు ఉమాపుత్రగజానన । వినాయకేశతనయ సర్వసిద్ధి ప్రదాయక । ఏకదంతై కవడన తధా మూషికవాహన । కుమారగురవే తుభ్యం సుమాంజలిం సమర్పయామి ॥ మంత్రపుష్పం సమర్పయామి ।

ప్రదక్షిణం కరిష్యామి సతతం మోదకప్రియ । నమస్తే విఘ్నరాజాయ సమస్త విఘ్ననాశన । ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ॥

అర్ఘ్యం గృహాణ హేరంబ సర్వభద్రప్రదాయక గంధపుష్పాక్షతైర్యుక్తం పాత్రస్థం పాపనాశన । పునరర్ఘ్యం సమర్పయామి ॥

వినాయక నమస్తుభ్యం గణేశాయ నమోస్తుతే విఘ్ననాశన । ఈప్సితంమే వరందేహి పరత్రచ పరాంగతిమ్ ॥ వినాయక నమస్తుభ్యం సతతం మోదకప్రియ నిర్విఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా । వాయనదానం సమర్పయామి ॥

గణేశ ప్రతిగృహ్ణాతు గణేశో వైదదాతిచ । గణేశస్తారకో ద్వాభ్యాం గణేశాయ నమోనమః ॥ ప్రతిగ్రహ మంత్ర

వినాయకస్య ప్రతిమాం వస్త్రయుగ్మ సమన్వితాం । తుభ్యం దాస్యామి విపేంద్ర యధోక్తఫలదో భవ । ప్రతిమాదానం ॥

ప్రసీద దేవ దేవేశ ప్రసిద్ధ గణనాయక । ప్రదక్షిణం కరోమిత్వాం ఈశపుత్ర నమోస్తుతే । యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ । తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే - ప్రదక్షిణ నమస్కారాని సమర్పయామి ॥

యస్యస్మృత్యాచనామోక్త్యాతపః పూజా క్రియాదిషు । న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతం - వరదో భవంతు ॥

# విఘ్నేశ్వరుని దండకము

శ్రీపార్వతీపుత్ర, లోకత్రయీస్తోత్ర, సత్పుణ్యచారిత్ర, భద్రేభవక్త్రా మహాకాయ, కాత్యాయనీ నాథ సంజాత స్వామీ, శివాసిద్ధి విఘ్నేశ, నీ పాదపద్మంబులన్, నీదు కంఠంబు నీ బొజ్జ నీమోము నీ మౌళి బాలేందు ఖండంబు నీనాల్గు హస్తంబులు న్నీకరాళంబు నీపెద్ద వక్త్రంబు దంతంబు నీపాద హస్తంబు లంబోదరంబుఁ సదా మూషకాశ్వంబు నీమందహాసంబు నీచిన్న తొండంబు నీగుజ్జు రూపంబు, నీ శూర్ప కర్ణంబు నీ నాగయజ్ఞోపవీతంబు నీ భవ్య రూపంబు దర్శించి హర్షించి సంప్రీతి మ్రొక్కంగ శ్రీగంధముఁ గుంకుమంబక్షతల్జాజులున్ చంపకంబుల్ తగన్ మల్లెలున్మొల్ల లున్మంచి చేమంతులుఁ దెల్లగన్నేరులన్ మంకెనల్ పొన్నలఁ పువ్వుల న్మంచి దూర్వంబులన్దెంచి శాస్త్రోక్తరీతిన్ సమర్పించి సాష్టాంగముంజేసి విఘ్నేశ్వరా నీకు టెంకాయ పొన్నంటి పండ్లున్ మణిన్మంచివౌనిక్షుఖండంబులున్ రేగుబండ్లప్పడాల్ వడల్వేయి బూరెల్మరిన్ గోధుమప్పంబులున్వడల్ పునుగులు న్బూరెలున్ గారెలున్ చొక్కమౌ చల్మిడిన్ బెల్లమున్ దేనెయుంజున్న బాలాజ్యమున్నాను బియ్యంబు నామ్రంబు బిల్వంబు మేల్ బంగారున్ బళ్ళెమందుంచి నైవేద్యముంబంచ నీరాజనంబున్ నమస్కారముల్ చేసి విఘ్నేశ్వరా నిన్ను బూజింపకేయన్య దైవంబులం బ్రార్థనల్చేయటల్ కాంచనం బొల్లకే యిను దాగోరు చందంబుగాదే మహాదేవ యోభక్తమందారయోసుందరాకార యోభాగ్య గంభీర యోదేవ చూడామణీ లోక రక్షామణీ బంధుచింతామణీ స్వామీ నిన్నెంచ, నేనెంత నీదాస దాసాది దాసుండ శ్రీదొంత రాజన్వయుండ రామాభి దాసుండ నన్నిపుడు చేపట్టి సుశ్రేయునింజేసి శ్రీమంతుగన్చూచి హృత్పద్మ సింహాసనారూఢత న్నిల్పి కాపాడుటే కాదు నిన్గొల్చి ప్రార్థించు భక్తాళికిన్ కొంగు బంగారమై కంటికిన్ రెప్పవై బుద్ధియు న్విద్యయు న్పొడియుఁ బుత్రపౌత్రాభివృద్ధిన్ దగన్గల్గ రాజేసి పోషించు మంటిన్ గృపన్ గావు మంటిన్ మహాత్మాయినే వందనంబుల్ శ్రీగణేశా నమస్తే నమస్తే నమస్తే నమః ॥

# విఘ్నేశ్వరుని కథా ప్రారంభము

సూతమహాముని శౌనకాది మునులకు విఘ్నేశ్వరోత్పత్తియు చంద్రదర్శన దోష కారణంబున తన్ని వారణమును చెప్పదొడంగెను.

పూర్వము గజరూపముగల రాక్షసేశ్వరుండు శివునిగూర్చి ఘోరతపం బొనర్చెను. అతని తపమునకు మెచ్చి, పరమేశ్వరుండు ప్రత్యక్షమై వరంబు కోరుమనెను. అంత గజాసురుండు పరమేశ్వరుని స్తుతించి స్వామీ! నీవు ఎల్లప్పుడు నా యుదర మందే వసించి యుండుమని కోరెను. భక్తసులభుండగు నా మహేశ్వ రుండాతని కోర్కెదీర్ప గజాసురుని యుదరమందు ప్రవేశించి సుఖంబుననుండె.

కైలాసమును పార్వతీదేవి భర్తజాడ తెలియక పలుతెఱంగుల నన్వేషించుచు కొంతకాలమునకు గజాసుర గర్భస్థుండగుటఁ తెలిసి రప్పించుకొను మార్గంబు గానక పరితపించుచు విష్ణుమూర్తిని ప్రార్థించి తన పతి వృత్తాంతము దెలిపి యో మహానుభావా! పూర్వము భస్మాసురుని బారినుండి నా పతిని రక్షించి నా కొసంగితివి. ఇప్పుడు గూడ నుపాయాంతరముచే రక్షింపుమని విలపింప శ్రీహరి యా పార్వతి నూరడించి పంపె. అంత నా హరి బ్రహ్మాది దేవతలను పిలిపించి గజాసుర సంహారమునకు గంగిరెద్దుల మేలమే యుక్తమని నిశ్చయించి నందిని గంగిరెద్దుగ నలంకరించి బ్రహ్మాది దేవతలందరిచే తలకొక వాద్యమును ధరింపజేసి తానును చిరుగంటలు, సన్నాయి దాల్చి గజాసుర పురంబు జొచ్చి, జగన్మోహనంబుగా నాడించుచుండ, గజాసురుండు విని, వారల పిలిపించి తన భవనము నెదుట నాడించ నియమించె, బ్రహ్మాది దేవతలు వాద్యవిశేషంబులు భోరుసలుప జగన్నాటక సూత్రధారియగు నా హరి చిత్రవిచిత్రంబుగ గంగిరెద్దు నాడించగ గజాసురుడు పరమానందభరితుడై మీకేమి కావలయునో కోరుకొండొసంగెద నన, హరి సమీపించి ఇది. శివుని వాహనమగు నంది. శివుని కనుగొనుటకు వచ్చెగాన, శివునొసంగు మని పల్కె. ఆ మాటలకు గజాసురుడు నివ్వెరపడి అతనిని రాక్షసాంతకుండగు శ్రీహరిగా నెఱింగి తనకు మరణమే నిశ్చయమను కొనుచు తన గర్భస్థుండగు పరమేశ్వరుని నా శిరస్సు త్రిలోకపూజ్యముగచేసి, నా చర్మము నీవు ధరింపవేయని ప్రార్థించి విష్ణుమూర్తికి అంగీకారము దెలుప, నాతండు నందిని ప్రేరేపించె, నందియు తన శృంగములచే గజాసురుని జీల్చి సంహరించె, అంత మహేశ్వరుండు గజాసుర

గర్భమునుండి బహిర్గతుండై విష్ణుమూర్తిని స్తుతించె. అంత నాహరి దుష్టాత్ముల కిట్టి వరంబు లీయరాదు. ఇచ్చినచో పామునకు పాలుపోసినట్లయగునని యుపదే శించి బ్రహ్మాది దేవతలను వీడ్కొలిపి తానును వైకుంఠమునకేగి, శివుండు నందినెక్కి కైలాసంబున కతివేగంబుగ జనియె.

## వినాయకోత్పత్తి

కైలాసంబున పార్వతీదేవి భర్తరాకను దేవాదుల వలన విని ముదమంది అభ్యంగన స్నానమాచరించుచు నలుగుబిండినొక బాలునిజేసి ప్రాణంబొసంగి సింహద్వారమున కాపుంచి, స్నానానంతరము పార్వతి సర్వాభరణముల నలంకరించు కొనుచు భర్తాగమనమును నిరీక్షించుచుండెను. అంత పరమేశ్వరుడు వచ్చి నంది నారోహించి లోపలికి పోబోవ సింహద్వారమందున్న బాలకుడడ్డగింప, కోపావేశుండై త్రిశూలముచే బాలుని కంఠంబు దునిమి లోనికేగెను.

అంత పార్వతీదేవి భర్తంగాంచి ఎదురేగి అర్ఘ్యపాద్యాదుల పూజించె. వారి రువురు పరమానందమున ప్రియ భాషణములు ముచ్చటించుచుండ ద్వారమందలి బాలుని ప్రసంగము వచ్చె. అంత మహేశ్వరుడు తానొనరించిన అకార్యమునకు చింతించి తాను తెచ్చిన గజాసుర శిరంబు నా బాలుని కతికించి బ్రాణం బొసంగి గజాననుండని నామం బొసంగె. అతనిని పుత్రప్రేమంబున ఉమామహేశ్వరులు పెంచుకొనుచుండిరి. గజాననుండును తల్లిదండ్రులను పరమభక్తితో సేవించుచుండె, ఇతఁడు సులభముగా ఎక్కి తిరుగుటకు అనింద్యుడనునొక ఎలుకను వాహనముగా చేసికొనియె.

కొంతకాలమునకు పార్వతీ పరమేశ్వరులకు కుమారస్వామి జనియించె. ఇతడు మహాబలశాలి. అతని వాహనము నెమలి. ఇతఁడు దేవతల సేనానాయకుండై ప్రఖ్యాతిగాంచియుండె.

## విఘ్నేశాధిపత్యము

ఒకనాడు దేవతలు, మునులు, మానవులు, పరమేశ్వరుని సేవించి విఘ్నములకొక్కని అధిపతిగా తమ కొసంగుమని కోరిరి. గజాననుడు తాను

జ్యేష్ఠుడను గనుక ఆ యాధిపత్యము తన కొసంగుమనియు, గజాననుడు మరుగుజ్జు వాడు, అనర్హుడు, అసమర్థుడు గాన ఈ యాధిపత్యము తనకొసంగుమని కుమార స్వామియు తండ్రిని వేడికొనిరి.

అంత నక్కుమారుల జూచి 'మీలో నెవ్వరు ముల్లోకమందలి పుణ్యనదులలో స్నానమాడి ముందుగా నాయొద్దకు వచ్చెదరో, వారికి యాధిపత్యం బొసంగుదు' నని మహేశ్వరుండు పలుక వల్లెయని సమ్మతించి కుమారస్వామి నెమలి వాహన మెక్కి వాయువేగంబునేగె. అంత గజాననుండు ఖిన్నుఁడై తండ్రిని సమీపించి ప్రణమిల్లి అయ్యా! నా అసమర్థత తామెఱింగియు నిట్లానతీయదగునే! మీపాద సేవకుండను నాయందు కటాక్షముంచి తగు నుపాయంబులు తెల్పి రక్షించవే యని ప్రార్థింప మహేశ్వరుండు దయాళుఁడయి సకృత్ నారాయణే త్యుక్త్వాపుమాన్ కల్ప శతత్రయం! గంగాది సర్వతీర్థేషుస్నాతో భవతి పుత్రక! కుమారా! ఒకసారి నారాయణ మంత్రమును జపించిన మాత్రమున మూడు వందల కల్పంబులు పుణ్యనదులలో స్నానమొనర్చిన వాడగునని సక్రమంబుగా నారాయణమంత్రం బుపదేశింప గజాననుడు నత్యంత భక్తితో నమ్మంత్రంబు జపించుచు కైలాసంబున నుండెను.

అమ్మంత్ర ప్రభావంబున అంతకుపూర్వము గంగానది స్నానమాడనేగిన కుమారస్వామికి గజాననుండానదిలో స్నానమాడి తన కెదురుగా వచ్చుచున్నట్లు గాన్పింప నతండు మూడుకోట్ల ఏబది లక్షల నదులలో గూడ నిటులనే చూచి ఆశ్చర్యపడుచు, కైలాసంబునకేగి తండ్రి సమీపమందున్న గజాననుని గాంచి నమస్క రించి, తన బలము నిందించుకొని తండ్రి అన్నగారి మహిమ తెలియక నట్లంటిని క్షమింపుము ఈ యాధిపత్యంబు అన్నగారికే యొసంగుమని ప్రార్థించె.

అంతనప్పరమేశ్వరునిచే భాద్రపదశుద్ధ చతుర్థినాడు గజాననునికి విఘ్నాధి పత్యంబొసంగబడియె. ఆనాడు సర్వదేశస్థులు విఘ్నేశ్వరునికి తమ విభవము కొలది కుడుములు, అపూపములు మున్నగు పిండివంటలు, టెంకాయలు, పాలు, తేనె, అరటిపండ్లు, పానకము, వడపప్పు మొదలగునవి సమర్పించి పూజింప విఘ్నేశ్వరుడు సంతుష్టుడయి కుడుములు మున్నగునవి భుజించియు, కొన్ని

వాహనమున కొసంగియు, కొన్ని చేత ధరించియు, మందగమనంబున సూర్యాస్త మయ వేళకు కైలాసంబున కరిగి తల్లిదండ్రులను ప్రణామంబు సేవబోవ ఉదరము భూమికానిన చేతులు భూమి కందవయ్యె బలవంతముగ చేతులానింప చరణంబు లాకాశంబుజూచె, ఇట్లు దండప్రణామంబు సేవగడు శ్రమనొందుచుండ శివుని శిరంబున వెలయు చంద్రుడు జూచి వికటంబుగ నవ్వె, అంతరాజదృష్టి సోకిన రాలుగూడ నుగ్గగునను సామెత నిజమగునట్లు విఘ్నదేవుని గర్భంబు పగిలి, అందున్న కుడుములు తత్రుప్పదేశంబెల్లెడల దొర్లెను. అతండును మృతుండయ్యె.

అంత పార్వతి శోకించుచు చంద్రుని జూచి, పాపాత్ముడా! నీదృష్టి తగిలి కుమారుడు మరణించెను గాన, నిన్ను జూచినవారు పాపాత్ములై నీలాపనిందల నొందుదురుగాక యని శపించె.

## ఋషిపత్నులకు నీలాపనింద కలుగుట

ఆ సమయంబున సప్తమహర్షులు యజ్ఞంబుచేయుచు తమ భార్యలతో అగ్నిప్రదక్షిణము చేయుచుండిరి. అగ్నిదేవుడు ఋషిపత్నులను మోహించి, శాప భయంబున అశక్తుడై క్షీణించుచుండ, నయ్యది అగ్ని భార్యయగు స్వాహాదేవి గ్రహించి అరుంధతీ రూపము దక్క తక్కిన ఋషిపత్నుల రూపంబుతానే దాల్చి పతికి ప్రియంబుసేయ, ఋషులద్దానింగనుగొని అగ్నిదేవునితో నున్నవారు తమ భార్యలే యని శంకించి ఋషులు తమ భార్యలను విడనాడిరి. పార్వతీ శాపానంతరము ఋషిపత్నుల చంద్రుని చూచుటచే వీరికిట్టి నీలాపనింద కలిగినది.

దేవతలును మునులును ఋషిపత్నులు యాపద పరమేష్టికిందెల్ప నాతండు సర్వజ్ఞుడగుటచే అగ్నిహోత్రుని భార్యయే ఋషిపత్నుల రూపందాల్చి వచ్చుటం దెల్పి సప్తఋషులను సమాధానపరచి, వారితోగూడ బ్రహ్మ కైలాసంబున కేతెంచి ఉమామహేశ్వరుల సేవించి మృతుండై పడియున్న విఘ్నేశ్వరుని బ్రతికించి, ముందబుగూర్చె, అంత దేవాదులు ఓదేవీ! పార్వతీ! నీవొసంగిన శాపంబున లోకంబులకెల్ల కీడువాటిల్లెగాన దాని నుపసంహరింపుమని ప్రార్థింప, పార్వతి సంతుష్టాంతరంగయై కుమారుని జేరదీసి, ఏ దినంబున విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వెనో ఆ దినంబున చంద్రునింజూడరాదు అని శాపావసానం బొసంగె.

అంత బ్రహ్మాదులు సంతసింపుచు తమ గృహంబులకేగి భాద్రపద శుద్ధ చతుర్థి యందు మాత్రము చంద్రునిజూడక జాగరూకులై సుఖంబుగ నుండిరి. ఇట్లు కొంతకాలంబు గడచె.

## శమంతకోపాఖ్యానము

ద్వాపరయుగంబున ద్వారకావాసియగు శ్రీకృష్ణుని నారదుడు దర్శించి, స్తుతించి ప్రియసంభాషణంబుల జరుపుచు స్వామీ! సాయం సమయమయ్యె, ఈనాడు వినాయక చతుర్థిగాన పార్వతీదేవి శాపంబుచే చంద్రునింజూడరాదు. గాన నిజ గృహంబున కేగెద శలవిండు అని పూర్వవృత్తాంతమంతయు శ్రీకృష్ణునికి దెల్పి నారదుడు స్వర్గలోకమునకేగెను. అంతట కృష్ణుడు ఆనాటి రాత్రి శ్రీకృష్ణుడు క్షీర ప్రియండగుటచే తాను మింటివంక చూడక గోష్ఠమునకు బోయి పాలు పిదుకుచు పాలలో చంద్రుని ప్రతిబింబమును జూచి ఆహా! ఇక నాకెట్టి యపనింద రానున్నదో యని సంశయమున నుండెను. కొన్నాళ్ళకు సత్రాజిత్తు సూర్యవరముచే శమంతక మణిని సంపాదించి ద్వారకా పట్టణమునకు శ్రీకృష్ణదర్శనార్థమై పోవ శ్రీకృష్ణుడు మర్యాదచేసి ఆ మణిని తన రాజునకిమ్మని అడిగిన, అతడిది "ఎనిమిది బారువుల బంగారము దినంబున కొసంగునట్టిదే యాప్తున కేమందమతియైన నివ్వ"డనిన పొమ్మని యూరకుండె. అంత నొకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుండా శమంతకమును కంఠమును ధరించి వేటాడ నడవికి జన, నొకసింహమా మణిని మాంసఖండమని భ్రమించి వానిని జంపి యా మణిని గొనిపోవుచుండ, నొక భల్లూక మా సింగమును దునిమి మణింగొని తన కొండబిలమున తొట్టిలో బవళించి యున్న తన కుమార్తెయగు జాంబవతికి ఆటవస్తువుగ నొసంగెను. మఱునాడు సత్రాజిత్తు తమ్ముని మృతివిని కృష్ణుండు మణి యివ్వలేదని నా సోదరుని జంపి రత్నమపహరించెనని పట్టణమున చాటె. అది కృష్ణుండు విని, నాడు క్షీరమున చంద్ర బింబమును జూచిన దోషఫలంబని ఎంచి దానిని బాపుకొన బంధుసమేతుడై యరణ్యమునకుంబోయి వెదకగా నొక్కచో ప్రసేను కళేబరంబును సింగపు కాలి జాడలును పిదప భల్లూకచరణ విన్యాసంబును గాన్పించెను. ఆ దారింబట్టి బోవు చుండ నొక పర్వత గుహ ద్వారంబు డాసి పరివారము నచట విడిచి కృష్ణుండు

గుహలోపలికేగి అచట బాలిక ఉయ్యాలపై కట్టబడియున్న మణింజూచి అచ్చటికి బోయి ఆ మణిని చేత పుచ్చుకొని వచ్చుచున్నంత ఉయ్యాలలోని బాలికయేడ్వ దొడంగెను. అంత దాదియును వింత మానిసి వచ్చుననుచు కేకలు వేసె.

అంత జాంబవంతుడు రోషావేశుండై చనుదెంచి శ్రీకృష్ణుని పైబడి అరచుచు నఖంబుల గ్రుచ్చుచు కోరలం గొఱకుచు ఘోరముగ యుద్ధముచేయ కృష్ణుడను వానింబడద్రోసి వృక్షములచేతను, రాళ్ళచేతను, తుదకు ముష్టిఘాతములచేతను రాత్రింబగళ్ళు ఎడతెగక యిరువదెనిమిది దినంబులు యుద్ధమొనర్ప జాంబవంతుడు క్షీణబలుండై దేహంబెల్ల నొచ్చి భీతిజెందుచు తన బలంబు హరింపజేసిన పురుషుండు రావణ సంహారియగు శ్రీరామచంద్రునిగా తలంచి అంజలిఘటించి, దేవాదిదేవా! అర్తజన పోషా! భక్తజన రక్షా! నిన్ను పాలించిన శ్రీరామచంద్రునిగా నెఱింగితి ఆకాలంబున నాయందలి వాత్సల్యముచే వరంబు కోరుమని అజ్ఞ యొసంగ నాబుద్ధి మాంద్యమున మీతో ద్వంద్వయుద్ధంబు జేయవలెనని కోరుకొంటిని. కాలాంతరమున నది జరుగగలదని సెలవిచ్చిరి. అది మొదలు మీ నామస్మరణము చేయుచు అనేక యుగములు గడుపుచు నిచట నుండ నిపుడు తాము నా నివాసమునకు దయచేసి నా కోరిక నెరవేర్చితిరి. నా శరీరంబంతయు శిథిలమయ్యే ప్రాణములు కడబట్టె జీవితేచ్ఛ నశించె. నా అపరాధమును క్షమించి కాపాడుము. నీకన్న వేఱు దిక్కులేదు. అనుచు భీతిచే పరిపరివిధముల ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై జాంబవంతుని శరీరమంతయు తన హస్తంబున నిమిరి భయంబుబాపె భల్లూకేశ్వరా! శమంతకమణి నపహరించినట్లు నాపై నారోపించిన అపనింద బాపుకొని నిటు వచ్చితినిగాన, మణి నొసంగుము. నేనేగెద నని జాంబవంతునకు దెల్ప నతడు శ్రీకృష్ణునికి మణి సహితముగా తన కుమార్తెయగు జాంబవతిని కానుకగా నొసంగె. అంత తన యాలస్యమునకు పరితపించు బంధుమిత్ర సైన్యంబుల కానందంబు కలిగించి కన్యారత్నముతోను, మణితోను శ్రీకృష్ణుడు పురంబుచేరి సత్రాజిత్తును రావించి పిన్న పెద్దలనుజేర్చి యావద్వృత్తాంతమును జెప్పి శమంతకమణి నొసంగిన, నా సత్రాజిత్తు అయ్యో! లేనిపోని నిందమోపి దోషంబునకు పాల్పడితి నని విచారించి మణి సహితముగా తన కూతురగు సత్యభామను భార్యగా సమర్పించి తప్పు క్షమింపుమని వేడుకొనెను.

శ్రీకృష్ణుడు సత్యభామను గైకొని మణివలదని నొసంగెను. శ్రీకృష్ణుడు శుభముహూర్తమున జాంబవతీ సత్యభామలను పరిణయంబాడ నచటికి వచ్చిన దేవాదులు, మునులు స్తుతించి, మీరు సమర్థులు గనుక నీలాపనింద బాపుకొంటిరి. మాకేమిగతి యని ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుడై భాద్రపదశుద్ధ చతుర్థిని ప్రమాదవశంబున చంద్రదర్శన మయ్యేనేని ఆనాడు గణపతిని యధావిధి పూజించి యీ శమంతకమణి కథను విని అక్షతలు శిరంబున దాల్చువారు నీలాపనింద నొందకుండెదరుగాక అని ఆనతీయ దేవాదులు సంతసించి తమ నివాసంబుల కరిగి ప్రతి సంవత్సరమున భాద్రపద శుద్ధ చతుర్థియందు దేవతలు, మహర్షులు, మానవులు మున్నగువారందరు తమతమ విభవముకొలది గణపతిని పూజించి అభీష్టసిద్ధిగాంచుచు సుఖంబుగ నుండిరని పాపమోక్ష ప్రకారంబు శౌనకాది మునులకు వినిపించి సూతమహాముని వారిని వీడ్కొని నిజాశ్రమంబున కరిగె.

## ప్రార్థన

ఉ॥ తొండమునేక దంతమును దోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమును కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ యోయి గణాధిప నీకు మ్రొక్కెదన్.

చ। తొలుతన విఘ్న మస్తనుచు దూర్జటి నందన నీకు మ్రొక్కెదన్
ఫలితము సేయుమయ్య నిను ప్రార్థన చేసెద నేకదంత నా
వలపటి చేతి ఘంటమున వాక్కున నెప్పుడు బాయకుండుమీ
తలపున నిన్ను వేడెదను దైవగణాధిప । లోకనాయకా ॥

క॥ తలచితినే గణనాధుని । తలచితినే విఘ్నపతిని దలచిన పనిగా
దలచితినే హేరంబుని । దలచిన నా విఘ్నములను తొలగుట కొఱకున్

క॥ అటుకులు కొబ్బరి పలుకులు । చిటికెబెల్లము నానుబ్రాలు చెఱకు రసంబున్
నిటలాక్షు నగ్రసుతునకు । పటుతరముగా విందుజేతు ప్రార్థింతు మదిన్.

# విఘ్నేశ్వరుని మంగళహారతులు

శ్రీశంభు తనయునకు సిద్ధిగణనాథునకు వాసిగల దేవతా వంద్యునకును ।
అ సరసవిద్యలకు ఆదిగురువైనట్టి భూసురోత్తమ లోకపూజ్యునకు ॥జయ॥

నేరేడు మారేడు నెలవంక మామిడి దూర్వార చెంగల్వ ఉత్తరేణు ।
వేఱు వేఱుగదెచ్చి వేడ్కతో పూజింతు పర్వముగ దేవగణపతికి నిపుడు ॥జయ॥

సుస్థిరముగ భాద్రపద శుద్ధ చవితియందు పొసగ సజ్జనులచే పూజగొల్తు ।
శశిచూడరాదన్న జేకొంటి నొక వ్రతము పర్వముగ దేవగణపతికి నిపుడు ॥జయ॥

పానకము వడపప్పు పనసమామిడిపండ్లు దాణిమ్మ, ఖర్జూర, ద్రాక్షపండ్లు
తేనెతో మాగిన తియ్యమామిడిపండ్లు మాకు బుద్ధినిచ్చు గణపతికి నిపుడు ॥జయ॥

ఓబొజ్జగణపయ్య నీబంటు నేనయ్య ఉండ్రాళ్ళమీదికి దండుపంపు ।
కమ్మని నెయ్యయ్య కడుమద్దపప్పును బొజ్జ విరుగగ దినుచును పొరలుచును
॥జయ॥

వెండి పళ్ళెములోన వేయివేల ముత్యాలు కొండలుగ నీలములు కలయబోసి ।
మెండుగను హారములు మెడనిండ వేసిగొని దండిగానీకిత్తు ధవళారతి ॥జయ॥

పువ్వుల నినుగొల్తు పుష్పాల నినుగొల్తు గంధాల నినుగొల్తు కస్తూరినీ ।
ఎప్పుడూ నినుగొల్తు ఏకచిత్తమ్మున పర్వమున దేవగణపతికి నిపుడు ॥జయ॥

ఏకదంతంబును ఎల్ల గజవదనంబు బాగయిన తొండంబు వలపుకడుపు ।
జోకయిన మూషికము పరకనెక్కాడుచు భవ్యుడగు దేవగణపతికినిపుడు ॥జయ॥

మంగళము మంగళము మార్తాండతేజునకు మంగళము సర్వజ్ఞ వందితునకు ।
మంగళము ముల్లోక మహిత సంచారునకు । మంగళము దేవగణపతికి నిపుడు
।జయ॥

సిద్ధివిఘ్నేశ్వర ప్రసిద్ధిగా పూజింతు ఒనరంగ నిరువదియొక్క పత్రి ।
దానిమ్మ మరువమ్మ దర్భవిష్ణుక్రాంత యుమ్మెత్త దూర్వార యుత్తరేణి ।జయ॥

కలువలు మారేడు గన్నేరు జిల్లేడు దేవకాంచన రేగు దేవదారు ।
జాజి బలురక్కసి జమ్మిదాసానిపువ్వు గరిక మాచీపత్రి మంచిమొలక ।జయ॥

అగరు గంధాక్షత ధూప దీప నైవేద్య తాంబూలా పుష్పోపహారములును ।
భాద్రపద శుద్ధచవితిని కుడుములు నానుబాలు ఉండ్రాళ్ళు పప్పు ॥జయ॥

పాయసము జున్ను తేనెయు భక్తిమీర ।
కోరి పూజింతు నిన్నెపుడు కోర్కెలలర ॥జయ॥

బంగారుచెంబుతో గంగోదకముదెచ్చి సంగతిగ శిశువునకు జలకమార్చి ।
మల్లెపువ్వులు దెచ్చి మురహరిని పూజింతు రంగైన నా ప్రాణలింగమునకు ॥జయ॥

పట్టుచీరలు మంచి పాడిపంటలు గల్గి ఘనముగా కనకములు కరులు హరులు
యిష్టసంపదలిచ్చి యేలినస్వామికి పట్టభద్రుని దేవగణపతికి నిపుడు ॥జయ॥

ముక్కంటి తనయుడని ముదముతో నేనును చక్కనైన వస్తుసమితి గూర్చి ।
నిక్కముగ మనమును నీయందె నేనిల్పి ఎక్కుడగు పూజలాలింపజేతు ॥జయ॥

మల్లెలా మొల్లలా మంచి సంపెంగలా చల్లనైనా గంధసారములను ।
ఉల్లమలరగ మంచి ఉత్తమపు పూజలు కొల్లలుగ నేజేతు కోరి విఘ్నేశ ॥జయ॥

దేవాదిదేవునకు దేవతారాధ్యునకు దేవేంద్రవంద్యునకు దేవునకును ।
దేవతలు మిముగొల్చి తెలిసిపూజింతురు భవ్యుడగు దేవగణపతికినిపుడు ॥జయ॥

చెంగల్వ చేమంతి చెలరేగి గన్నేరు తామరలు తంగేడు తరచుగాను ।
పుష్పజాతులు తెచ్చి పూజింతు నేనిపుడు బహుబుద్ధి గణపతికి బాగుగాను ॥జయ॥

మారేడు మామిడి మాదీఫలంబులు ఖర్జూర పనసలును కదళికములు ।
నేరేడు నెలవంది టెంకాయ తేనెయు చాలగా నిచ్చెదరు చనువుతోడ జయ।

ఓ బొజ్జగణపతి ఓర్పుతో రక్షించి కాచినన్నేలుమీ కరుణతోడ ।
మాపాల గలవని మహిమీద నెల్లపుడు కొనియాడుచుందును కోర్కెదీర ।జయ॥

సర్వేజనా స్సుఖినోభవంతు